శ్రీ రాఘవేంద్ర గురుభ్యో నమః

# సపరిహార జ్యోతిస్సారము.

## ప్రథమ - ద్వితీయ తరంగములు



: రచయిత :

వంశపరంపరానుభవవైద్య, జ్యోతిషరత్న, వాస్తు స్వయంవహ

శ్రీమాన్ తిరుమలనల్లాన్ చక్రవర్తుల

**వేంకట వరదాచార్యులు,**

కొండబదిన్నె (పోష్టు) తాడిపత్రి తాలూకా

తాడిపత్రి బ్రాంచి **1973** అనంతపురం జిల్లా

ప్రథమ ముద్రణము 500 ప్రతులు.

 [ వెల రు **15-00**

శ్రీ లింగరామానుజ ప్రింటింగ్ ప్రెస్, తాడిపత్రి.

శ్రీ రాఘవేంద్ర గురుభ్యోనమః

# విజ్ఞప్తి

దైవజ్ఞ మహాశయులారా ఈ గ్రంధమునకు ప్రమాణమెక్కడ అనువారు లేకపోలేదు. ప్రకృతమున్న గ్రంధములు సప్రమాణములా? అప్రమాణములా? అన్న విషయము మాత్రము ఎట్లు తెలుసుకొననగునో వారికే తెలియవలయును. ముద్రితమైన గ్రంధములన్నీ సప్రమాణములు అముద్రితములన్నీ అప్రమాణములని వారిభావమై యుండవచ్చును. ప్రమాణములని నమ్మిన గ్రంధముల పరికించగా మానవులకు ఉపకరించునవి విద్యార్ధులు సులభోపాయముగ గ్రహింపగలట్టివి ప్రశ్నలకు తగునైన ప్రత్యుత్తరము ఇయ్యగలట్టివి. సందేహాస్పదము గానట్టివి గానరాక పోవుటచేత శోధింపవలసివచ్చి శోధించితిని ఉదా— గురు శుక్ర చంద్ర బుధులు శుభులుగా శేషించిన శని కుజ రవి రాహు కేతువులు పాపులుగా నిర్ణయించిరి. నవగ్రహములలో పాపులుగలరాయను సందియము గలుగకమానదు గ్రహరాట్ అన్న సూర్యునిపాపియనుట చూడ కంచయే చేనుమేసిన గలదెదిక్కు అన్నట్లున్నది- ఇతరులకు శుభత్వమిచ్చి తానుపాపత్వము తీసుకొన్నాడన్నమాట-

లగ్నాత్ 2, 3, 6, 7, 8, 11, 12 గృహములేర్పడి ఆ లగ్నములకు పాపఫలమిచ్చు వారైరిగాని శుద్ధపాపత్వముగల గ్రహములుండునా? పాపులు పాపస్థానములందుండిన మరింత పాపఫలమియ్యక శుభఫలము ఎట్లిత్తురు అనుసందేహము ఏర్పడకపోదు

ప్రమాణ గ్రంధములలో ఈవిధముగా వీరుశుభులైరి. ఈరీతిగ వీరుపాపులైరి. అన్నవచనములు ఎక్కడ గానబడదు. కారకత్వ శుభుల శుభులన్నారనిన రాజగ్రహములగు రవికుజులకు కారకత్వములు శుభఫల మిచ్చునవిలేవా ఎందుకు గురు శుక్ర చంద్ర బుధుల

శుభులనిరో వారికే తెలియును. ఇందువల్ల శుభులైరన్నమాట, విన, బడదు కనబడదు. వీరు వేసిన పునాది భద్రములేకపోవుటచేత దానిపై ఎందరెన్ని విధములుగా గోడలుకట్టిన నిలువలేదనకతప్పదు.

ఉ- శుభులన్నవారు నలుగురు ద్వాదశరాసులకు 2, 3 6, 7, 8, 11, 12 రాసుల వారుగారా? వీరికి పాపస్థానములులేవా.

ఉ- మీనలగ్నమునకు తృతీయాష్టమాధిపతి శుక్రుడుకాడా? సింహమునకు వ్యయాధిపతి చంద్రుడుకాడా? మేషమునకు తృతీయ షష్టాధిపతి బుధుడుకాడా? తులకు తృతీయ షట్స్థానాధిపతి గురువు కాదా? వీరుమాత్రము ఎట్లుశుభులైరి. కొందుమవారు అశుభులెట్లయిరి. అన్నదానికి ఉత్తర మెక్కడగానము- త్రిషడష్టాయ రిప్పేశ విపరీత ఫలప్రదాః అన్నవాక్యము అన్నిలగ్నములకు ఉండవలయునుగదా- చంద్రునకు శత్రువులు లేరనుట మరింతవింత కటకమునకు 3, 6, 8, 12, 7 స్థానములులేవా. వారు శత్రువులుగారా. లగ్నమునకైన లగ్నాధిపతికికారా- ఇట్టిప్రశ్నలు వేనవేలు పుట్టును. ప్రత్యుత్తరము మాత్రము గానము- సర్వే త్రికోణనేతారో గ్రహాశుభ ఫలప్రదాః అన్నవాక్య ప్రకారము లగ్న పంచమ నవమాధిపతులు శుభులుగదా. ఈమూడు స్థానములకు ఎదురిండ్లు అశుభస్థానములుగదా వెరసి ఆరు గ్రహములుకాగా ఒక్కగృహము గ్రహము మిగులును. ఆ వక్కడు చంద్రుడుగానో సూర్యుడుగానో నుండి స్థానాధిపత్యమువల్ల ఏకగృహస్థులు గాబట్టి శుభులపరమో అశుభులపరమో చేరక తప్ప లేదు- చూడుము ఉ- ధనస్సుకు అష్టమ స్థానాధిపత్యమువల్ల చంద్రుడు పాపులతోకలసి పనిచేయవలసి వచ్చెను. మీనమునకు పంచమాధిపత్యమువల్ల శుభులతో చేరవలసివచ్చెను. సూర్యుడు ఇట్లే మీనమునకు శత్రువుగను ధనస్సుకు మిత్రుడుగను కావలసివచ్చెను. వృషభమునకు చతుర్థాధి పత్యమువల్ల సూర్యుడు శత్రువులతో చేర వలసివచ్చెను. తులాలగ్నమునకు దశమాధిపత్యమువల్ల చంద్రుడు

శత్రువులతోచేరి మిత్రులపై దండెత్తవలసి వచ్చెను ఇట్లే గురుకుజుల పరముగా శని శుక్ర బుధులపరముగా సూర్య చంద్రులు తిరుగుచు 7 గ్రహములుగా నుండిరని తేలుచున్నది. అనుభవమున సరిపోవు చున్నది- గురు కుజులకు సూర్య చంద్రులకు కోణాధిపతులుగా శని శుక్ర బుధులు ఎక్కడలేరు. శని శుక్ర బుధులకు కోణాధిపతులుగా గురు కుజ సూర్యచంద్రులు ఎక్కడలేరు- కోణములే శాస్త్రమునకు మూలము గాన గురుపాలితములని శనిపాలితములని లగ్నముల విభజింప వలసివచ్చెను. మకర కుంభ వృషభ మిధున కన్యతులలు శనిపాలితములనియు మీన మేష కటక సింహ వృశ్చిక ధనస్సులు గురుపాలితములనియు రెండు భాగలుగా ద్వాదశ లగ్నములు విడదీయవలసివచ్చెను- ఈవిభజనవల్ల శాస్త్రమంతయు మార్పుజనించెను.

లగ్నము బేటరీయనియు నక్షత్రములు శల్సులనియు గ్రహములుబల్పులనియు గోచరించెను. గ్రహములేక లగ్నము నక్షత్రము సుఖ దుఃఖముల ప్రసరింపజాలదని తెలియనయ్యెను. ఇట్లే గ్రహించినవి అనుభవమునకు తీసుకొనగ సరిపోయెను. దానిని వ్రాయగలిగితిని చెప్పగలిగితిని.

ప్రమాణ గ్రంధముల లక్ష్యము చేయడనువారు వారికన్నా పెద్దవాడా అనువారు శాస్త్రమునకు విరుద్ధముగా నడచువాడను వారు విరుద్ధముగా మాట్లాడుతారనువారు ఎదురౌచువచ్చిరి. బాగ చెప్పినాడని పృచ్ఛకులనిన ఆయనకు శాస్త్రమెక్కడిదయ్యా కర్ణ పిశాచి స్వాధీనమయ్యా లేకున్న అన్నివిషయములు చెప్పగలడా. అంటూవచ్చిరి.

మిత్రులుకూడానమ్మినాలోచేరక అప్పుడప్పుడుఎదిరించుచునే వచ్చిరి. ఈదారిన రాకపోయిరి. గురు శుక్ర బుధ చంద్రులు శుభులు శేషించినవారు పాపులుగా చెప్పుచునే వచ్చిరి. ఉన్నప్రమాణ గ్రంధములన్నియు వాస్తుశాస్త్ర మంతయు కృత్రిమములన్నప్పుడంతయు

విసుగుచెందుచు వచ్చిరేగాని అడిగినదానికి ప్రత్యుత్తర మియ్యలేక ప్రక్కకుపోయి ముందొచ్చిన చెవులకన్నా వెనుకవచ్చిన కొమ్ములు వాడిలేరా అనుచూ అసూయపడిరి. అసూయపరులై ఇతరులకు చెప్పిరి. దుష్ప్రచారములచేసిరి. గాని నేనాలోచించునది మానలేదు ఎట్లయిన చక్కని మార్గము కనిపెట్టవలెనను పట్టుదలను విడువలేదు స్థూలములో సూక్ష్మాతి సూక్ష్మములకు పోలేకపోయినను స్థూలము గానైన చక్కని మార్గము ఏర్పరుపవలెనను ఆశను వదలలేదు. శారదామతల్లి కరుణాకటాక్షము గలదనియు నేనునమ్మి ధ్యానించు దైవములువృథాచేయరనినమ్మి సద్గురురాఘవేంద్రునిపై భారమువేసి గ్రహించినది గురుశిష్య సంభాషణతో వ్రాసితిని. సద్గురువరేణ్యులు మంత్రాలయము శ్రీశ్రీ రాఘవేంద్రస్వామి వారు చెప్పినట్లు నా గోత్రము శ్రీవత్ససగాన శ్రీవత్సుడు అడుగునట్లు చేసితిని. శ్రీవత్సా అని వత్సా అని సంబోధించుటకు కారణమిది నేను శ్రీవైష్ణవుడ నయ్యు శ్రీవారు కరుణించి ద్వాదశ ఊర్ధ్వ పుండ్రములతో స్వప్న మున దరిశనమిచ్చి కొన్ని దృకుక్కలుచూపి తన శిష్యకోటిలో నన్నొ కనిగా చేర్చుకొనుటచేత ఈగ్రంథరచనకు కారకులుగా వారినే నియ మించితిని. వారి కరుణాకటాక్షము వల్లనే వ్రాయగలిగితిని.

అన్ని ముహూర్తములు ప్రథమ భాగమునందే వ్రాయుటకు గ్రంథవిస్తర భీతిచే వివాహ ఉపనయనములనే వ్రాసితిని- జ్యోతి షము చక్కగా తెలియక పోయిన ముహూర్తభాగములో చొరువ గలుగక పోవునని స్థూలముగా జ్యోతిష ఫలభాగము వ్రాసితిని. జ్యోతిషము చక్కగా తెలిసిన సర్వముహూర్తములు పెట్టగలుగు శక్తిగలుగుననితలంచి ప్రథమతరంగమంతయుఫలభాగముగా-వ్రాసి తిని-తృతీయతరంగమున సర్వముహూర్తములు- గోచరించిన సర్వ విషయములు వాస్తుభాగము స్థూలముగా- వ్రాయనుద్దేసించితిని

వాస్తుమానవునుండి పట్టినదా ప్రత్యేకముగా నుండెనా అన్న

సందేహము కలుగకమానదు. ఎట్లన లగ్నచతుర్థమును గృహముగా జ్యోతిషము చెప్పుచున్నది గదా. గృహస్థానమున పాపగ్రహమున్న మానవునికి గృహమేలేక బాధపడుచున్నాడు. ధనికుడైయుండిన గృహమున్న చాలనిది వసతులులేనిది చిక్కులతో నుండినది గలిగి దుఃఖించు చున్నాడు. చతుర్థమున శుభగ్రహముగలవారు రాజభవనములందు భవనములందు వసతిగృహములందు నివసించుచున్నారు. ఏవిధగృహ మందుండునో అట్టికోణములతో చేరిన గృహమతనికి లభ్యమగుచున్నది జన్మతహ తెచ్చుకొన్న గృహభాగమును మానవుడు మార్చజాలడని జ్యోతిషము నిరూపించును వాస్తు గ్రంధకర్తలు గలదనిన జ్యోతిష్యము శూన్యమగును. జ్యోతిషుడు వ్యర్థుడగును. జాతకుని గృహమెట్టిదో జ్యోతిషమే నిర్ణయింప వలయును. గాని వాస్తు గ్రంధములు నిర్ణయింప జాలవు- ప్రకృతము వాస్తు గ్రంధములు లోకుల భయభ్రాంతుల చేసినవి చేయుచున్నవి. జ్యోతిలేని వాస్తు భాగమంతయు గాఢాంధకార మనియే భావింప వలయును. మునుల వాక్యములని కాళిదాసాదుల ప్రణీతములని తెలిపిరిగాని ఇవి నమ్మ తగిన మాటలుగావు- వారు భూత భవిష్యత్ వర్తమానముల నెరింగిన మహనీయులు- ఇట్టి గ్రంధముల లిఖించిరనుట సందేహాస్పదము- వారి రచనయనిన వారి వాక్యములనిన మహనీయుల రచ్చకీడ్చినట్లగును. వారి వాక్యములు మరుగైనవనుట శ్రేయోదాయకము- జోస్యము వంశ పరంపరగా వచ్చి వంశము లంతరించుట చేత ఆగిపోయి కృత్రిమ జోస్యము బయలుదేరినదని తెలియుచున్నది.

వరాహమిహిరాదుల కాలమునకు ముందెప్పుడో ప్రక్కదారిని సృష్టించినట్లు తెలియుచున్నది. లగ్నములకు శుభగ్రహముల నేర్పరచినవారు గురుశనుల విభజన చేసినవారు గన్పించిరిగాని వారు తిరిగి గ్రంధములందు పూర్వపద్ధతులనే అనుసరించిరి- గ్రహముల విడచి నక్షత్రములతో ఆట్లాడిరి- సంధికాలములతో కాలహరణము

చేసిరి- కాలగతుల నడిపించునవి మానవ జీవిత రక్షణోపాదుల నడి
పించునవి చావుపుట్టుకల గలిగించునవి, వధూవరుల అన్యోన్యతను,
వధూవరుల సౌఖ్యాసౌఖ్యములను, ఆయుర్దాయమును గలిగించునవి
నడిపించునవి గ్రహములని తెలుపరైరి-నక్షత్రముల సంధికాలము
చూపివిధవయగునని మృత్యుప్రదమని భయపెట్టిరి-గ్రహముల బలా
బలములతెలుపరైరి-అందుచే ఒకటనేల సర్వముహూర్తములుమాన
వులకుపకరింపక చెడిపోయెను- గ్రంధములు మాత్రము ప్రమాణము
లుగానిలచెను- శాస్త్రము శాసించినవి మాత్రము చల్లాచెదురయ్యెను-

బృహజ్జాతకమున- మేషము లగ్నమై లగ్నమున రవి చతు
ర్థమున గురువు సప్తమమగుతులలో శనియుండిన రాజయోగ
మన్నాడు- ఏకాదశ స్థానాధిపతియై గురు రవులకు పరమశత్రువై
యున్నశని ఉచ్చస్థితినొంది రవిగురువుల చూచుటవల్ల ఇరువుర
ఫలము నాశనమైపోగా, రాజయోగ మెటులగలుగును- ముంతయిచ్చి
చెంబు ఎత్తుకపోవును. శని మేషమునకు పంచమభాగ్య స్థానాధిపతు
లగు రవి గురువుల శని చూచుటచే యోగభ్రష్టత గలుగుక యోగ
మెటుల జరుగును- రవి-శనిని చూచుటచేత శనిలోగల నీచపదార్ధ
ములతో యోగము గల్పించును- నీచజీవనమగును- రవిశనుల సమ
సప్తకము లోకభయంకరము- దినగండము నూరేడులాయువన్న
ట్లుండును- ఇట్లే- వరాహమిహిరాదులు- అనేక రాజయోగముల
చెప్పిరిగాని విద్యార్థులుగాని సామాన్య జోస్యులుగాని నేర్చుకొను
టకు అలవిగావు- అనుభవరీత్యా పరికింతమని గొప్పవారి జాతక
ములలోచూచిన వీరుచెప్పిన యోగము వెచ్చుట గానరావు- చెప్పి
నవి కంఠస్థము చేయవలయుననిన అలవిగావు- వీరుకూడ త్రికోణా
ధిపతుల రాజగ్రహములగు సూర్యచంద్రకుజుల గమనించి శాస్త్రము
యోగములు వ్రాయలేదని వారి శాస్త్రమే చెప్పుచున్నది- బృహ
జ్జాతకము సారావళి వృద్ధపరాశరము చంద్రికలు మొదలగు గ్రంధ
ములన్నియు వారివారి యిష్టమొచ్చినట్లు ఇదినామతము ఇదినామత
మని వ్రాసినారు. శాసించినవి మాత్రము ఫలించలేదు- గురు శని

పాలితముల విడదీసి లగ్నములకు శుభాశుభులనెరింగి గ్రహకార త్వముల గమనించి స్థానకారకత్వముల తెలుసుకొని ముందుకు నడచిన గమ్యస్థానము చేరుకొనును. వీరు శాసించిన శాస్త్ర ఫల మంతయు శూన్యమగును. ఏనాటికైనా శాస్త్రమునకు జీవము కోణాధి పతులనియు రాజయోగములకు సూర్యచంద్రకుజులనక తప్పదు. వీటిని గమనించక వ్రాసిన గ్రంథములన్నియు వ్యర్థములనకతప్పదు.

దైవజ్ఞ మహాశయులారా! నా ఈ గ్రంథమునకు ప్రమాణము శ్లో॥ త్రికోణనేతారో గ్రహాశుభఫలప్రదాః అన్నశ్లోకమే ప్రమాణము; ఈశ్లోకాధారము చేసుకొని అనుభవరీత్యా శ్రీసద్గురు రాఘవేంద్రుని అనుగ్రహముతో సాధింప గలిగితిని పృచ్ఛకులనుండి జాతకముల నుండి అనుభవము గడించిన దీనిని ఈర్ష్యాసూయలతో చూడక శాంతముతో సాంతముగా పఠించి అనుభవములో గమనించి తెలుసు కొన్నవారు తెలియనివారికి తెలిపి ప్రజోపయుక్తముగాచేసి కళా శాలలందు ప్రవేశమగునట్లు చేయుదురని ప్రార్థన.

శాసించినది జరుగవలయును. శపించినది తగులవలయును. శాసించినది జరుగక శపించినది తగులకపోయిన శాసించినది శాస్త్ర ముగాదు. శపించినది వాక్కుగాదు. అనువిషయము ఎల్లరు ఎరింగిన విషయమే. శాసించినది జరుగుచూ వచ్చిన ఇంక కొంతకాలమున కైనా ఈ శాస్త్రము కళాశాలలందు నెలకొని పాపపుణ్యములు ఇట్లు పుట్టుచున్నవి. పుణ్యమువల్ల మానవుడు పురోగమించి సుఖపడును. పాపమువల్ల తరోగమించి దుఃఖపడునని యెల్లరు తెలుసుకొనుటకీ శాస్త్రము అద్దము వంటిదనిలోకము బాగుపడునని తలంతును.

ఇట్లు

గ్రంధకర్త.

# విషయ సూచిక
## ప్రథమ తరంగము

# ద్వితీయ తరంగము

—o—

శ్రీ రాఘవేంద్ర గురుభ్యో నమః

## — శ్రీ రాఘవేంద్ర గురు ప్రార్థన —

తే॥ రాఘవేంద్ర గురూత్తమ రాగరహిత
నిన్ను కనుదోయిగానెంచి యున్నవాడ
దారియెటుచూపెదో నీదెభారమయ్య
అవ్యయానందయతిరాజ దివ్యతేజ
కర్మభూమిది కన్నులుగల్గి గ్రుడ్డి
చేయిసాచితి సద్గతి చేర్చుమంచు
చేర్తువో చేర్చవో శరణార్తుడయితి
రమ్యగుణసాంద్ర మద్గురు రాఘవేంద్ర
కర్మచీకటులలమిన కారణమున
కన్నులుండియు దారిని గానకుంటి
వెలుగు చూపించి చేర్చుమావలను నన్ను
పరమ గుణగణ్య సన్మాన్య గురువరేణ్య.

## శ్రీ రాఘవేంద్రస్వామిని మంత్రాలయమున.



శ్లో॥ పూజ్యాయ రాఘవేంద్రాయ సత్యధర్మ రతాయచ
భజతాం కల్పవృక్షాయ నమతాం కామధేనవే.

కం॥ వెలయిడినఫలము గలదన
కలవెల్లను కలుగునట్టి గ్రంథంబనగా
పొలియొక్కటి పోసియక
తెలిపెద జోస్యంబు తేట తెనుగునవత్సా.

కం॥ యోగంబులు పూర్వులనుడి
యోగంబులుగావు మిగుల యోచించిగనన్
యోగంబులనగ నానుకి
యోగంబులె యోగమౌను యోగాభ్యాసీ.

కం॥ కల్లనుమీ జోస్యంబని
యెల్లరు వచియింప వ్రాసిరెందరొ యిపుడా
కల్లలె నిజమన మువ్వురి
తల్లులకృపతో వచింతు తథ్యమువత్సా.

శ్రీ రాఘవేంద్ర గురుభ్యోనమః

# పండితాభిప్రాయము.

అనంతపురం

10-2-73

మహాశయా,

తమ పరిశోధనా గ్రంధరాజమగు సప్రమాణ జ్యోతిస్సారమును స్థాలీపులాకన్యాయముగా పరికించితిని అందలి విచారములమూల్యములని కనుగొంటిని వానిలోని కొన్ని యనుభవరీతులకు, బల్లను గుద్ది చెప్పినట్లు విశదీకరించిన, సిద్ధాంతములకు, దలపంకించితిని వరాహమిహిరాది మహామహుల అభిప్రాయ సరణులను దిరస్కరించిన మీ ధైర్యమునకు పులకించితిని. ముఖ్యముగా శనిపాలిత గురుపాలిత వర్గవిభజన నింతవరకు, ఎవరూ చేయలేదు. అట్లు క్రొంగొత్త తెన్ను ద్రొక్కినదేగాక, యనుభూతులను క్రోడీకరించి సిద్ధాంతము చేసినవారు లేనేలేరు. గ్రహమండలము పూజాభాగమున నెట్లు లేర్పరచు కొనవలెనో తాము సూచించినది చాలా బాగున్నది. అంతేగాక గ్రహదృక్కులు ఏ విధముగా ఆయా రాసులకు ప్రత్యేకించి సుదుష్ఫల ప్రసారము చేయునదియు తేటతెల్లముగ నిరూపించితిరి ముహూర్త నిర్ణయమునకును జాతక భాగమునకును గల యనుల్లంఘనీయ సంబంధమును ఇదివరకెవరు విమర్శచేయని దానిని స్పష్టముగ నవీన బద్ధతితో వివరించితిరి. మీ పరిశోధనా వైదుష్యము సుశ్లాఘనీయమని నొక్కి చెప్పుటకే జ్యోతిష విద్వాంసుడును వెనుదీయడని నా విశ్వాసము

ఇట్లు సత్యసాధువిధేయుడు.

కల్లూరి వేంకట నారాయణరావు, యం. ఏ.

( రిటైర్డు డి. ఇ. ఓ. )

శ్రీ రాఘవేంద్ర గురుభ్యోనమః

11-2-73

తాడిపత్రి

శ్రీమాన్ ఆచార్యుల వారిచే రచియింపబడిన సప్రమాణ జ్యోతిస్సారమును ఆద్యంతము చదివి అర్ధము చేసుకొని ఆదర్శ యోగ్యమైన శాస్త్రమని వీరొనరించిన కృషి జగజ్జేగీయ మానమై ప్రకాసింప గలదని ఎరింగితిని. పోతనాది మహాకవులు కుగ్రామ నివాసులై అష్టదారిద్ర్యములలో పొరలుతు అమూల్యములైన గ్రంథ ముల ఆంధ్రావనికి అందిచ్చినట్లు వీరొక కుగ్రామ నివాసులై. వారి కన్నా మిన్నగ అనేక శ్రమలకు లోనగుచు ఇట్టి ఉత్కృష్ట గ్రంథ ముల ఆంధ్రావని కందిచ్చుట ఆంధ్రుల మహాభాగ్యము- అందులో గ్రంథ రచనగాదు అవకతవకలై నానా మతములై నానారీతులై, అధో ముఖము చూచుచు కూర్చుచున్న జ్యోతినుద్దరించి వెలుగు చూపించిరి. వీరికృషి ఆచంద్రస్థాయిగా మానవులకు మార్గదర్శకమై నిలుచుచనుటకు యేలాటి సందేహములేదు వీరి రచనలు మానవ మార్గదర్శకములు వీరు భక్తపోతన, వేమనార్యుడు మొదలగు మహా నీయుల కోవకు చెందిన వారనుట నిస్సందేహము- గ్రహములకు పరస్పర మిత్ర శత్రుత్వములను విభజన చేయుటలో దైవజ్ఞులు పలు వురు చేసిన విభజనలు కృత్రిమములై ఎదురు ప్రశ్నలకు అనుభవ మునకు నిలువలేక పోయినవి. కొన్ని నిర్ణయములు ఫలించి మరి కొన్ని పూర్ణవిఫలత్వము చెందుటచే అనుమాన జరాసంధుడు ఈ శాస్త్రములో కాలిడినాడు- ఎల్లవేళల ఎల్లరికి విభేదములు లేక

నిర్దిష్ట పరిస్థితులలో నిర్దిష్ట ఫలములను కల్గించునదే శాస్త్రము (సైన్సు) అని అనబడుచున్నది "Science is the Systematized body of knowledge" సక్రమ వ్యవస్థా పూర్వకమగు జ్ఞానమునే శాస్త్ర మనుచున్నారు అటనాడు సర్వజ్ఞుడగు శ్రీ కృష్ణ భగవానుని ప్రేరణచే జరాసంధుని, విభాజ్యము చేయుటలో చూపవలసిన విన్యాసములను భీమసేనునకు చూపించి, ఆతనిచేతను శాశ్వతముగా తొలగించినట్లుగా లోకకల్యాణార్థమై యతీంద్రులగు శ్రీ రాఘవేంద్ర స్వాములవారి ప్రేరణచే శ్రీ స్వామిగారు ఈ జ్యోతిశ్శాస్త్రమును అద్వితీయము అపూర్వము అకళంకమునగు గురుపాలిత శనిపాలిత లను రెండువిభజనలను కావించినారు జ్యోతిషనావకిదియే చుక్కాని ఇక ఎన్ని తరంగములనైన ఎదిరించి దాటిపోగలదు ఎమరు ప్రశ్న లను తరంగముల నెగురజిమ్మి గమ్యస్థాన మీనావ చేరగలదు.

సర్వే త్రికోణనేతారో గ్రహాః శుభఫల ప్రదాః అనుపరాశర మహర్షుల ప్రథమ వాక్యమే ఈ సౌధమునకు పునాది తద్విరుద్ధ మెల్లను శాస్త్రసౌధమునే భిన్నపరచును- అప్రాణిచయములగు పదా ర్థములపైననే అద్భుత ప్రభావముగల గ్రహముల విద్యుదయ స్కాంతకిరణ తరంగములు. పదార్థముతోపాటు చైతన్య స్వరూపి యగు ప్రాణిపై ఎట్టిప్రభావము క్షణక్షణము కలిగించునో చెప్పనవ సరములేదు జీవితముపై గ్రహముల ప్రభావమును తూష్ణీకరించుట హాస్యాస్పదము- అశాస్త్రీయము — జీవుల యోగమునకు గతజన్మ ఆధారముగా నుండుటచే రాబోవుజన్మ ఫలించవలయునన్న నేడు సుకర్మలు చేయుమనియే సర్వధర్మశాస్త్రములు ఆదేశించుచున్నవి. లోకక్షేమమున కిదియే రాచబాట. అట్టిసత్యమును దృక్కుకు

తెచ్చి చూపించి సర్వులను ధర్మకార్యనిరతులుగా చేయు పరమార్థముచే శ్రీ స్వామిగారు ఈ గ్రంథరచనను కావించినారు వీరికృషి మన పూర్వఋషులకు ఏమాత్రము తీసిపోదు. శాస్త్రమునకు కావలసిన అన్నిహంగులను వీరు యేర్పరుచుటచే అచిరకాలములోనే జ్యోతిశ్శాస్త్రము మాన్యతచెంది విశ్వవిద్యాలయములలో బోధనాంశముగ రూపొందగలదు- గ్రంథము నాద్యంతము చదివి తమతమ జాతకచక్రములను నిష్పాక్షికముగ పరిశీలించుకొన్నచో యీ నమ్మకము సర్వులకు కలుగగలదు అపూర్వమగు జ్ఞానము నందించిన శ్రీ స్వామివారికి లోకమెంతయో ఋణపడియున్నది

ఇట్లు,

చెన్నా రామగోవిందప్ప, బి. ఏ.,



సమయమునకు తగినట్లు చక్కగా ముద్రణచేసియిచ్చిన శ్రీ రంగరామానుజ ప్రెస్ ప్రొప్రయిటరు శ్రీరంగయ్య గారికి వీరి పుత్రులకు ముద్రణాలయపనివారికి ఆయురారోగ్య భాగ్యములు భగవంతుడొసంగుగాక.

ఇట్లు బుధజనవిధేయుడు,

శ్రీ శారదాంబాయైనమః ఓమ్. శ్రీ లక్ష్మీనృసింహాయనమః

శ్రీ రాఘవేంద్ర గురుభ్యో నమః

# సప్తమహా జ్యోతిస్సారము.

## ప్రథమ - తరంగము

శ్లో॥ శివం హరిం విధాతారం తత్పత్నీస్తత్సుతాన్ గురూన్.
నత్వా సమస్త ప్రత్యూహశాంతయే మంగళాయచ.

దేవా భాస్కరా - లోకబాంధవ - నవగ్రహములలో అధినాయకుడవై, ప్రపంచమునకు పితృరూపమై వందనార్చనలకు ప్రథముడవై కర్మసాక్షివైయున్న నిన్ను క్రూరుడని వ్రాసిరి. ప్రాజ్ఞులు. జ్యోతిశ్శాస్త్రజ్ఞులు. ఇదివింత — నీకు అండదండయై మిత్రుడై భూభాగమున కధిపతియై - ఖగోళమున, భూగోళమున ముఖ్యమగు గ్రహమై యౌవనకారకుడైయున్న అంగారకుని క్రూరుడనిరి — ఉమామహేశ్వర కరుణా కటాక్ష వీక్షణ లబ్ధుడై ఈశ్వరాంశ సంభూతుడగు శనేశ్వరుని - నవగ్రహములలో భాగస్వాములగు రాహుకేతువులను క్రూరులని పేరిడిరి. ఎక్కడా శుభకార్యములలో చోటివ్వక పోయినదిగాక, శనిదశవచ్చునని, రాహుదశ వచ్చునని విన్నంతనే ప్రతిమానవుడు యిలయిలతన్నుకొని చచ్చునట్లోనర్చిరి. వారి నామోచ్చరణమే భయంకరముగా వ్రాసిరి. శనిముండాకొడుకాయని ఇతరులను దూషింప శనిపదము వాడుకొనిరి. ఇది సరియగు మార్గముకాదు. ధర్మముకాదు. శాస్త్రము కాదు. వీరికి ధర్మమున పుణ్యమున హక్కుకలదు. క్రూరులకు, పాపులకు ఊర్ధ్వలోకముల నివాసములేదు నవగ్రహము లందురు.

నమానులే. ఇందులో ప్రా ౘ లెవ్వరులేరని నీవొసంగిన జ్ఞానదృష్టి నుపయోగించి వప్పించిన - ప్రాజ్ఞులు శాస్త్రజ్ఞులు రచించిన గ్రంథ వచనములు వమ్ములగును వారు సంస్కృత విద్యానిధులు మహ నీయులు. వారి రచన వచనముల పోద్రోసి ముందుకాలిడిన పాపముకాదా రాదా ఆపాపము హరించుటకు నీదేవంతు. వారు రచించిన గ్రంథములనే చదివి వారిమార్గముల ఖడించి రచన చేసిన పాపము నన్నంటకుండచేయు భారమునీదే, నాబుద్ధి పెడ మార్గమున నడువకుండ తప్పుడుదారులు పడకుండ ఈరచన ఆ చంద్ర తారార్కముగ నుండునట్లు చేయుటకు నీదేబారము ఇం దున రాబోవు పాపపుణ్యముల రెండింటిని నీకే అర్పించి ప్రజోప యుక్తముగ ప్రశ్నోత్తరములతో సప్రమాణ జ్యోతి యనుపేరిడి ప్రాథమిక విద్యాబోధన, వివాహ ఉపనయన ముహూర్తముల సర్వము తెలుపుదును, ఇందున కొందరు మేలుపొందుదురు. మరి కొందరు దుఃఖింతురు. కొందరు సంతోషింతురు. ఇందున గలుగు పాపపుణ్యముల రెండింటిని నీవే భరించ ప్రార్థింతును.

దయామయ యధార్థము పాపమందురు. యధార్థము గాకున్న శాస్త్రము దెబ్బతినును. లోకుల కుపయుక్తముగాదు పాప పుణ్య విమర్శ గలుగదు. యధార్ధమే యుండవలయునని కొందరందురు యధార్థముచెప్పిన గుండె నిబ్బరముండదు దుఃఖ మున కాలపట్టుగా నుండును వలదని మరికొందరందురు. యధా ర్థములేకున్న శాస్త్రము దెబ్బతినునని నామతము చేతనైనంతవరకు నీదయతో నీవొసంగిన జ్ఞానదృష్టితో స్థూలముగా గ్రహించ వీలు గలిగింతును. నీదయతో సద్గురుని అనుగ్రహముతో తాకికముగా వంచరింతును. పాప పుణ్యములవల్ల మానవుని జీవిత రథుణో పాదులు గలుగుచున్నవనియు పాపపుణ్యమిశ్రితుడు మానవుడనియు

పాపపుణ్యఫలములు నవగ్రహ మండలముల నుండి ఆయాసమయ ములకు ప్రసారమగు చుండుననియు నిరూపింతును.

భాస్కరా కారుణ్యనిలయ ఆదిశూరత్వము, అంత్యబ్రష్ట త్వము గాకుండునట్లు ఆశీర్వదింపుము. ఈహాపగములకు సహ కరింపుము. —

శ్రీవత్సుడు:- స్వామి కలికాలమనెదరు కలియుగమనెదరు కలి ఈ యుగమునకధిపతియైన కృతయుగత్రేతాయుగ ద్వాపరముల కెవరధి పతులనెదరు వికటప్రశ్నలడుగుచుంటిననక దయయుంచి తెలుపుడు.

గు:— వత్సా అడుగవలసిన ప్రశ్ననే అడిగినావు. చెప్పవల సినదేగదా — విను — నవగ్రహముల యుగమున కిద్దరివంతున భాగములు పంచినారు. కృతయుగమునకు - సుక్షత్రియుడు. ధర్మ పరాయణుడు త్రిమూర్తి స్వరూపుడునగు సూర్యుడు రాజుగను శాపాను గ్రహశక్తి గలుగు. బృహస్పతి మంత్రియై కృతయుగ మును నడిపి ఏకొరంత లేకుండ చేసినారు, వీరిర్వురు మిత్రులు పరమ పవిత్రులు,

ఆనాడు వీధి దుమ్ముకడిగితే నూటికి పదిభాగల బంగారు రజము గలిగి యుండినది బంగారుకు అధిపతి గురువు గాబట్టి ఎక్కడ చూచిన బంగారు మయముగా నుండినది.

ఏఏపనివారు ఆయాపనుల చక్కగా చేసుకొన్నారు. ప్రభు వులకు ప్రజలకు ఏలాటి విరోధములేక అన్యోన్యులై నాల్గు హం గుల ప్రపంచమును నడిపించినారు నడిచినది — సుక్షత్రియులు సద్బ్రాహ్మణులు ప్రబలి వారిపాలన చక్కగా నడచినది. ఎవ్వరే మనినను వాగ్వాదు జరిగిన వీడు రాక్షసుడురా రాక్షసుడై పుట్టేటం దుకే ఇట్టి యన్యాయప్రవర్తన ఇట్టిమాటలు. అవి శాపాను గ్రహ శక్తిగల బ్రాహ్మణు లనుటచే ఆవాక్కులు ఫలించి త్రేతాయుగ

మున రాక్షస వంశమధికమై యజ్ఞయాగాదులను సాగనియ్యక వారినే బాధింపజొచ్చిరి. ప్రజలెల్లరు బాధనీయులైరి కృతయుగము నాటి మాటలు త్రేతాయుగమును నడిపించెను. దైవబలము నార్జించిరేగానికోపమాపలేక పలికిన పలుకులై త్రేతలోక్రూరులు రాక్షస స్వభావులు రాక్షసులు కలహోత్సాహులు అధికముగుటకుకారణము

వత్సా యిక త్రేతాయుగమున కుజ శుక్రుల పాలనయ్యెను. కుజుడు యుద్ధప్రియుడు. సత్యవాది పరాక్రమశాలి. సుక్షత్రియుడు రాజుగను వామాచారుడు రాక్షసగురుడు మాయా మంత్రవాది స్త్రీలకు కారకుడు కుజునికి, నిరంతర శత్రువునైన శుక్రుడు మంత్రిగను నియమితులై పాలనజరుపుటచే మంత్రిమాట రాజుకు, రాజు మాట మంత్రికి సరిపోకపోవుటచే మంత్రులు క్రూరస్వభావులై రాజ్యపాలన చెరచి స్త్రీలోలులై కలహములబెంచి, స్వయంవరముల సృష్టించి, ప్రజలపీడించి రూపవతులగుస్త్రీలచే, యువకులకు ప్రాణహానిని గల్పించి, నాల్గుహంగులలో ప్రథమాంగబలము మంత్రము యజ్ఞయాగాదులు మొదలగు దేవకార్యములు. వాటికై నియమితులగు బ్రాహ్మణవంశముల క్షీణింపజేసెను. దైవబలము తగ్గెను — రాక్షసులతో దుర్మార్గులగు మంత్రిసామంతులతో త్రేతాయుగము నాల్గింట ఒకభాగము దెబ్బతినెను

శ్రీ:— స్వామీ కుజశుక్రులకు బద్ధద్వేషమందురా.

గు;— ఔను కుజునికి శుక్రుడు సప్తమాధిపతి. శుక్రునికి కుజుడు సప్తమాధిపతి యైనందున, ఒకరికొకరు శత్రువులు. కుజ శుక్ర లోకచోటచేరిన మానవుని యౌవన కాలమంతయు అడవి గాసిన వెన్నెలై అడవిపూసిన పూవులై దారిద్ర్యుని యౌవనమై నిరంతర దుఃఖముతో కాలము పోవును. —

శ్రీవత్సా యిక ద్వాపరయుగమందువా చంద్రుడు రాజుగను

బుధుడు మంత్రిగను నియమితులైరి. వీరిరువురకు తగనివైరము-బుధుడు మాంత్రికుడు. మోసములకు నెలవు. శాంబరీ విద్యా ప్రభావసంపన్నుడు వ్యవహారములకు అధిపతి వీడు ద్వాపరమున అనేకమైన బాధలగల్పించెను. రాక్షసస్వభావులగు రాజులతో శాంబరీ విద్యాప్రభావులగు రాక్షసులతో స్త్రీలతో సప్తవ్యసనాలోలురతో దుర్మదులగు మంత్రిసామంతులతో పీడించెను. దేవతాకార్యములు అర్ధభాగము నశింపచేసెను. రాజులకు, బ్రాహ్మణులకు భావవిభేదముల గల్పించి బ్రాహ్మణుల సేవకులుగా కొంతవరకు మార్చెను. దైవశక్తి తగ్గెను. లౌకికుల శుక్ర నీతిజ్ఞుల పాపభీతిలేని వారల తయారుచేసెను. నాల్గు హంగులలో రెండు హంగులు మాత్రమే నిలిచెను. ఈమాంత్రికుల వామాచారుల మాయావుల నాశనము చేయుటకు స్వయముగా భగవానుడే కృష్ణుడుగాపుట్టి దేవతావర్గమున కొందరిని చేనిడుకొని యుగాంతమున మంత్రయుగమును మటుమాయము చేసెను —

ఇక కలియుగమునకు — శనిరాహుకేతు గ్రహములు పాలకులై పాలింపనయ్యెను —— శని శూద్రుడనియు, రాహువు గుండకగోళకులనియు, కేతువు మహామ్లేచ్ఛులనియు శాస్త్రకారులు వ్రాసిరిగదా? శనిరాజుగను, రాహుకేతువులు మంత్రులుగను పదవుల నియమితులై పాలింపబూనిరి — మంత్రయుగ మంతరించి, యంత్రయుగము ప్రారంభమయ్యెను. ఈయుగములో మంత్రశాస్త్రము అంజనలు ఓషధీప్రభావముల తెలుపు గ్రంధములు జ్యోతిషశ్శాస్త్రముఈ నాలుగు నుండిన ఈకలియుగము నడవదు. శనిపాలన ముందుకు సాగదు మంత్రయుగము యంత్రయుగముగ మారదు.

అడిగెడి ప్రశ్నలకు సదుత్తరము చక్కగానివ్వగల సద్గ్రంధ

ములు మాయమైనవి. అవి నాలుగు. ఎప్పుడు మాయమైనవో అప్పుడు కలియుగప్రభావము ముందుకు నడిచెను. క్రూరము, కుచ్ఛితము. అసత్యము, అప్రమాణము, అధర్మము, అన్యాయము తలలెత్తెను. వరుస వానితప్పెను. వర్ణసంకరములు ప్రబలెను. దొరలే దొంగలైరి దొంగలే దొరలైరి. దైవభక్తి, గురుభక్తి మాతృపితృభక్తి అపరూపమయ్యెను. హింసా సిద్ధాంత మెక్కువయ్యెను. పాపభీతి శూన్యమయ్యెను. పుణ్యకార్యాచరణ కరువయ్యెను. ఎట్లయినా శిరిని, స్త్రీని సంపాదించినవాడే మొనగాడు మొనగాడని చెప్పువారు, చేయువారు మెండైరి. దొంగలకు దాపిచ్చెడి ప్రజలు ప్రభువులు ప్రబలిరి స్త్రీలు దుష్ప్రవర్తనలై పురుషుల దుఃఖింపచేయువారు మితిమీరిరి, ప్రజలు స్వధర్మమునుమాని అన్యధర్మముల కెగబ్రాకిరి. ప్రభువులే పాపభూయిష్టులైరి. మారణాస్త్రముల ప్రబలముగా చేయగలిగిరి. వర్ణద్వేషములు, మతద్వేషములు హెచ్చుపెరిగెను. దురాశపరులు మెండైరి. బుద్ధిమంతులు, ఆచారపరులు, సత్యవాదులు, శీలవంతులు, ధర్మాత్ములు, వారిచే బాధింపపడి దుఃఖింపవలసిన కాలముత్పన్నమయ్యెను - ఈకాలములో ఆనాల్గు వస్తువులున్న యెడల వీరిఆటలు సాగవు. గాన ఈ నాల్గు శాస్త్రములు మరుగుపరచిరి. ఇప్పటిలో నీకు తగిన సమాధాన మిచ్చువారెవరు నాయనా!

శ్రీ:— స్వామి గురు శుక్ర పూర్ణచంద్ర శుద్ధబుధులు శుభులనియు తక్కినవారు పాపులనుటయేగాక సూర్యుని క్రూరుడన్నారు కామేమనెదరు.

గు:— వత్సా సూర్యుడు త్రిమూర్తి స్వరూపుడనియు, గ్రహరాట్టనియు తెలిపినవారువారే, క్రూరుడన్నవారువారే. పాపులకు, క్రూరులకు ఊర్ధ్వలోకనివాసము లేదన్నవారువారే. రవికుజ శని

రాహుకేతు గ్రహములు. క్రూరులు పాపులన్నవారువారే. అట్టి వారికి మండలాధిపత్య మెవ్వడిచ్చెను గ్రహరూపీ జనార్ధన అన్న వారువారే ఆపాపుల రూపమెట్లు శ్రీహరితా ధరియించును - వత్సా గ్రహములలో క్రూరులులేరు, పాపులులేరు. అందరు భగవత్స్వరూపులే. అయితే ఒక్కొక గ్రహమునకు ఒక్కొక అధికారమిచ్చి మంచివస్తువులు కొందరికి చెడువస్తువులు కొందరికిచ్చిరి. హరిహరులు పరిపాలన లయముల తీసుకొన్నట్లు గ్రహములలో వస్తుసమితికి పాలనాధికార మిచ్చిరి. (ఉధాహరణ) ఒకడు బంగారు విక్రయించి లాభము గడించును మరొకడు ఇనుమమ్మి లాభము గడించును. ఇనుమమ్మినవాడు హీనుడెట్లగును. వస్తువు హీనమయినదైన మానవుడు హీనుడుకాడుగదా. చంద్రునిలో అమృతమున్నది. రాహువులో హాలాహలమున్నది. ఉన్నంతమాత్రమున పాపికాడు. కారకత్వములవల్ల పాపులనిరేగాని వారెట్లుపాపు లగుదురు. లగ్నములవల్ల శుభాశుభత్వములు పాపపుణ్యములు ఏర్పడుచుండునేగాని గ్రహములలో పాపులు క్రూరులులేరు. వారికింటికగబడినది బట్టకందినది అంతే తెలియనిది చెప్పగలుగుదెట్లు

శ్రీ:— క్రూరులు, పాపులు నవగ్రహములలో లేరన్న మాటయేనాస్వామి

గు:— ఔను మానవుడొనర్చిన పాపపుణ్యములు ఏ. ఏ కేంద్రములకు పోయి నిలిచియుండునో మరుజన్మములకు ఆయా కేంద్రములనుండి ప్రచారమగును - పాపములెట్టివో, పుణ్యములెట్టివో. పుణ్యస్థానములలో పుణ్యము, పాపస్థానములలో పాపము కూడియుండును-. పాపస్థానాధిపతులు, పుణ్యస్థానాధిపతులు అని రెండుతెగలు. లగ్నము నుండి వచ్చునుగాని గ్రహముల నుండి కలుగదు. ఇది గమనింపకపోవుటచేత జ్యోతి పూర్తి ఆదిపోయినది

శ్రీ:- త్రిషడష్టాయరిప్పేశ విపరీతఫలప్రదాః

అనివారే అన్నారే ఇట్టివిషయములు శాస్త్రజ్ఞులు గమనించలేద.

గు:- నాయనా గమనించినవారు మరుగై గమనించనివారు గ్రంథములు వ్రాయుటచేత శాస్త్రము అప్రమాణమై శీర్షాసనము వేసినది. సాలూమూలలేక దృక్కుకురాక అడిగినదానికి చక్కని ప్రత్యుత్తరము లేకపోయినది. ఇకదీనిని కృశ్లగించి ప్రయోజనము లేదు—

శ్రీ:- స్వామి జ్యోతిష్యము మంత్రము మంత్రాంగములు- ఓషధీప్రభావము అంజనఉండిన కలియుగముజరుగదన్నారే ఎందుచేత

గు:- నాయనా జ్యోతిష్యము సాంగోపాంగముగ నుండిన, దొంగతనములు, రంకుతనములు, దోపిడీలు కూనీలు జరగవు. జరిగినా చెప్పతగినవి, చెప్పతగనివి గ్రహించి చెప్పగలిగెడి వారుండినారు. ఈకాలములో డబ్బుయిచ్చిన అదెట్టిదైనా చెప్పగలిగెడి వారున్నారు. ధర్మాధర్మములు, పాపపుణ్యములు డబ్బునుచూపిస లెక్కించక చేసెడివారున్నారు. అందువల్ల జోస్యము మరుగైనది- దీనితో కష్టము, సుఖము రెండు గలవు. దైవజ్ఞుడు పాపభీతి గలవాడుగాలేకున్న ప్రజల భాధించును. ఉన్నదిలేదని లేనిదిఉన్నదని వాదించును. దొంగజాతకముల సృష్టించును. దొంగలకు దోవలు చూపును. చేయరానివన్నీ డబ్బుకొరకు చేయును గాన జోస్యము స్థూలమార్గమును నుండనిచ్చి సూక్ష్మాతి సూక్ష్మముల మహనీయులు మరుగుపరచిరని యెరుంగము.

ఇక మంత్రము మంత్రాంగము లంటావా. అవి దివ్యశక్తివంతములు. అట్టివి మానవుల కందించిన ధర్మాధర్మ విచక్షణలేక మహిమలచూపి మానవుల పీడింతురు మాయలమరాటీలై లోకుల వేధింతురు. నేనే కృష్ణభగవానుడనని మూఢుల అజ్ఞానుల పీడింతురు. ప్రజలకు మేలుచేయుటమాని కీడుచేయుదురు. గాబట్టి

మంత్రసాధన మాయమయ్యెను. అట్టి మంత్రసాధకులే యిప్పుడు యంత్రసాధకులు (సైంటిష్టులు) వీరు. ఉపాసనా భాగులే అయి యుండిన మంత్రశక్తి నార్జించి యుందురు శని శుక్ర బుధుల కలయిక పంచమ ఏకాదశములలో నవమదశమములలో నుండి చంద్రుడు కటకము శనికి మూడింటపదింట లోపడినయుండి తపస్సుఫలించును. అధిష్టానదేవత ప్రసన్నత జెంది ముందుకు నడిపించును. (సైంటిష్టు ఆయిన కొత్తవస్తువుల కనిపెట్టును. ఉదాహరణ—

కం॥ తను పంచమ భాగ్యాధిపు
లను వందగ నొకటకలయ నమృతప్రదమై
కననివి విననివి తెలిసియు
ఘనుడయి సత్కీర్తి పొందు కలకాలంబుఞ.

అని యున్నది. మంత్రసాధన. యంత్రసాధన కుపయుక్త మౌనట్లు మార్చి మాయముచేసిరి—

ఓషధీప్రభావము నెరింగిన చచ్చెడివారిని బ్రతికింతురు. బ్రతి కెడువానిని చంపుదురు. భూతదయా పశ్చాత్తాపములేక సర్వుల హింసింతురు. బ్రహ్మవ్రాతనే మార్చెదనని గర్వింతురు. పూర్వ యుగముల మహనీయులు సర్వమెరింగి సత్యమునుపాటించి నడచు వారు గాబట్టి వారికి తెలిసియుండినవి. కలికాలములో ఓషధీప్రభా వము తెలిసిన ధర్మరహితులై మారణముల కుపయోగింతురు. హిం సింతురు. పాపమును లెక్కింపని కాలము కలికాలము గాబట్టి మరుగైనవి—

ఇక అంజన-అందమా దీనివల్ల ప్రజల సుఖపెట్టవచ్చు, దుఃఖ పెట్టవచ్చు. దొంగలను అరికట్టవచ్చు, దొంగలకు ధారిచూపింప

వచ్చు, భూగతధనముల తీయవచ్చు, ధర్మము చేయవచ్చు, ధని కులు భూగతము చేసిన సొత్తును దొంగలకు చెప్పవచ్చు. ప్రభుత్వ మునకు ఎరుకపరుపవచ్చు పాపము చేయవచ్చు, పుణ్యము చేయ వచ్చు. ఇది కలికాలము. ధనమునకు లొంగని మానవులరుదు. ఎంతటి పాపమునైన ఒడిగట్టుదురు గాబట్టి ఇదియు మరుగైనది. ధర్మకాలము ప్రవేసించిన అట్టివి తెలుపగల మహాపురుషులు ముం ధుకు వత్తురని యెఱుంగుము.



శ్రీ

నమస్సూర్యాయ సోమాయ మంగళాయ బుధాయచ
గురుశుక్ర శనేభ్యశ్చ రాహవే కేతవేనమః.

శ్రీ:— స్వామి ప్రాథమికవిద్య చక్కగాలేకున్న ఉన్నతవిద్య నభ్యసించుటకు కష్టముగా నుండునుగదా. ముఖ్యముగా గమనింప వలసినవి. కంఠస్థము చేయవలసినవేవో తెలియచేయుడు—

గు:— శ్రీవత్సా ఖగోళమును పండ్రెండు భాగములుగా విభ జించి వాటికి పేర్లమర్చినారు. అవి యేవనగా మేషము, వృష భము, మిథునము, కటకము, సింహము, కన్య, తుల, వృశ్చికము. ధనస్సు, మకరము, కుంభము, మీనము, వీటిని లగ్నములని రాసు లని అందురు.

గమనింపుము.

| | | | |
|---|---|---|---|
| 12 మీనము | 1 మేషము | 2 వృషభము | 3 మిథునము |
| 11 కుంభము | మేషము మొదలు కొని | | 4 కటకము |
| 10 మకరము | | | 5 సింహము |
| 9 ధనస్సు | 8 వృశ్చికము | 7 తుల | 6 కన్య |

ఈరాసులలో 27 నక్షత్రములమర్చినారు. అవి యేవనగా అశ్వని, భరణి, కృత్తిక, రోహిణి, మృగశిర, ఆరుద్ర, పునర్వసు, పుష్యమి, ఆశ్లేష, మఖ, పుబ్బ, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, విశాఖ, అనూరాధ, జ్యేష్ట. మూల పూర్వాషాఢ, ఉత్తరాషాఢ శ్రవణం, ధనిష్ఠ శతభిషం, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి ఇవి. ఇరువదేడు నక్షత్రముల నామములు—

మేషాది క్రమేణ పండ్రెండు లగ్నములలో 27 నక్షత్రములు ఇమురుటకుగాను ఒకనక్షత్రమును నాలుగుభాగాలుచేసి దీనికి పాదమని పేరిడిరి. 27 నక్షత్రములకు పాదములుచేయగ 108 పాదములగును. వీటిని 12 రాసులతో భాగింపగా ఒక్కొక్కరాశికి తొమ్మిది పాదములు వచ్చును. ఎట్లనగా అశ్వని భరణి కృత్తికాపాదం మేషము - కృత్తికా త్రిపాదం, రోహిణి, మృగశిరార్ధం, వృషభం- మృగశిరార్ధం, ఆరుద్ర పునర్వసు త్రయోర్మిధునం,- పునర్వసు ప్పాదంపుష్యమి, ఆశ్లేషాంతం, కర్కాటకము- మఖ పుబ్బ ఉత్తరా ప్పాదం, సింహము-ఉత్తరాత్రిపాదం, హస్తచిత్తార్ధం, కన్య- చిత్తార్ధం స్వాతి విశాఖ త్రయస్తుల- విశాఖపాదం, అనూరాధ జ్యేష్ఠాంతం వృశ్చికం- మూలపూర్వాషాఢ ఉత్తరాషాఢపాదం ధనస్సు- ఉత్తరాషాఢత్రిపాదం, శ్రవణధనిష్ఠార్ధం మకరం-ధనిష్ఠార్ధం, శతభిషపూర్వాభాద్రత్రయ కుంభము- పూర్వాభాద్రప్పాదం, ఉత్తరాభాద్రరేవత్యంతంమీనం.

ఇక్కడికి 12 రాసులలో 27 నక్షత్రము లిమిడినవి. (ఇవి కంఠస్తము చేయవలయును.)

— గమనింపుము —

| | | | |
|---|---|---|---|
| పూ. భా 1<br>ఉ. భా 4<br>రేవతి 4<br>9 | అశ్వని 4<br>భరణి 4<br>కృత్తిక 1<br>పాదములు 9 | కృత్తిక 3<br>రోహిణి 4<br>మృగశిర 2<br>9 | మృగశిర 2<br>ఆరుద్ర 4<br>పునర్వసు 3<br>9 |
| ధనిష్ఠ 2<br>శతభిషం 4<br>పూర్వాభాద్ర 3<br>9 | | | పునర్వసు 1<br>పుష్యమి 4<br>ఆశ్లేష 4<br>9 |
| ఉత్తరాషాఢ 3<br>శ్రవణం 4<br>ధనిష్ఠ 2<br>9 | | | మఖ 4<br>పుబ్బ 4<br>ఉత్తర 1<br>9 |
| మూల 4<br>పూర్వాషాఢ 4<br>ఉత్తరాషాఢ 1<br>9 | విశాఖ 1<br>అనూరాధ 4<br>జ్యేష్ఠ 4<br>9 | చిత్త 2<br>స్వాతి 4<br>విశాఖ 3<br>9 | ఉత్తర 3<br>హస్త 4<br>చిత్త 2<br>9 |

ద్వాదశరాసులలో 27 నక్షత్రములు 108 పాదములతో ఇట్లు ఇమిడియున్నవి.

ఈరాసులలో ఈనక్షత్రములపై నవగ్రహములు తిరుగుచుండును. రాసులు నక్షత్రములు స్థిరములు గ్రహములు చరములై తిరుగుచు స్థావరజంగమములకు జననమరణముల సుఖదుఃఖముల గల్పించుచుండును— గ్రహముల నామము లెవ్వియనగ సూర్యుడు చంద్రుడు, కుజుడు, బుధుడు, గురువు, శుక్రుడు, శని రాహువు, కేతువు వీరిని నవగ్రహము లందురు— వీరి స్వగృహములుగా రాసుల విభజించిరి. చూడుము.

—మేషాది క్రమేణ = భూమి మొదలుకొని—

| | | | |
|---|---|---|---|
| మీనము<br>గురువు | మేషము<br>కుజుడు | వృషభము<br>శుక్రుడు | మిధునము<br>బుధుడు |
| కుంభము<br>శని | స్వగృహములు | | కటకము<br>చంద్రుడు |
| మకరము<br>శని | | | సింహము<br>సూర్యుడు |
| ధనస్సు<br>గురువు | వృశ్చికము<br>కుజుడు | తుల<br>శుక్రుడు | కన్య<br>బుధుడు |

కుజునకు - మేషవృశ్చికములు　　చంద్రునకు - కటకము
శుక్రునకు - వృషభ తులలు　　సూర్యునకు - సింహము
బుధునకు - మిధునకన్యలు　　గురువునకు-ధనుర్ మీనము

శనికి మకర కుంభములు స్వగృహములుగా నియమించి ఇందుల్ ఉచ్ఛ, నీచలని రెండుతెరగుల గల్పించిరి- ఉచ్ఛయనగా ఆగ్రహమునకు ఆస్థానము బలమైనదనుట, నీచయనగా దుర్బలస్థానమనుట గమనింపుము.

రవికి - మేషము　　గురునకు - కటకము
చంద్రునకు - వృషభము　　శుక్రునకు _మీనము
కుజునకు - మకరము　　శనికి - తుల
బుధునకు - కన్య

ఈగ్రహములకు ఈరాసులు బలీయములు. ఈస్థానములందు ఈగ్రహము లున్నప్పుడు వీరి కిరణములు భూమిపై ఎక్కువగా ప్రసారమగును. సుఖదుఃఖము లెక్కువగా గల్పింతురు. ఈస్థానములకు ఏడవస్థానము ప్రతిగ్రహమునకు నీచస్థాన మందురు నీచయనగా బలము తగ్గుట.

— ఉచ్ఛస్థానములు —

| | | | |
|---|---|---|---|
| శుక్ర | రవి | చంద్ర | |
| | బలీయములు | | గురు |
| కుజ | | | |
| | | శని | బుధ |

— నీచస్థానములు —

| | | | |
|---|---|---|---|
| బు | శ | | |
| | దుర్బలములు | | కు |
| గు | | | |
| | చ | ర | శు |

శ్రీ:— స్వామి కోణములని కేంద్రములని చెప్పుచుండెదరే అవి యేవందురు

గు:— నాయనా కేంద్రములనగా చతుర్ధ సప్తమ దశమ ములు 4, 7, 10 స్థానములు మూడును- కోణములనగా లగ్న పంచమ నవమములు 1, 5, 9 స్థానములు కేంద్రములు శుభాశుభస్థానములుగామారునుగాని ఏలగ్నమునకైన కోణములు సంపూర్ణ శుభ స్థానములేయగును. శాస్త్రమునకు మూలము కోణములు కోణాధిపతులనియే యెరుంగుము- రాసులకు నక్షత్రములకు అనేకముగ పేర్లుపెట్టి వారు దారితెలియక అనేకమైనదార్లు గల్పించినారు. నీవందులో ప్రవేసించకుము—

శ్రీ:- స్వామి కోణములే శాస్త్రమున కాధారమన్నారే అదెట్లగునో తెలుపుడు.

గు:- నాయనా ప్రతిజీవికి త్రిశక్తు లావశ్యకము వీటి నెరుంగక తెలియచేయువారులేక శాస్త్రము తికమకలైనది. గమనింపుము. త్రిశక్తులనగా ఒకటిదేహశక్తి రెండుజ్ఞానశక్తి మూడుధనశక్తి. ఈ మూడుశక్తులు మానవునికి ముఖ్యాంగములు. దేహశక్తికి పార్వతియు జ్ఞానశక్తికి భారతియు, ధనశక్తికి లక్ష్మియు అధిపతులు.- లగ్నమును పార్వతియు, పంచమమును భారతియు, నవమమును లక్ష్మియు

పాలింతురు. వీరిముప్వురి కలయికయే యోగములందురు. తెలియక తెలిపిన యోగములు వేనవేలున్నవి. వాటినన్నిటనుచూచి శాస్త్రాభ్యానకులుభయపడి గందరగోళమని నిరాశచెంది విడిచినారు. వీరి కలయిక కలిగినవారే రూపవంతులు, విద్యాధికులు, ధనవంతులు. వీరును వీరిస్థానములు పాపులచే ధ్వంసమయినవారే. కురూపులు నిరక్షరకుక్షులు, నిర్ధనికులు- లగ్నము పార్వతిస్థానమనియు, పంచమము భారతిస్థానమనియు, నవమము లక్ష్మీస్థానమనియు, పిలువబడును. విద్యాస్థానము చతుర్థముగా కొందరు తెలియకచెప్పిరి. చతుర్థమువిద్యాస్థానముకాదు, చతుర్థముఅశాశ్వితము, పంచమము శాశ్వితము, మారునదికాదు. ప్రతిలగ్నమునకు త్రికోణాధిపతులే ముఖ్యులు. త్రికోణములందే పూర్వపుణ్యము నిలవుండును—కోణాధిపతులే దైవములు—త్రికోణాధిపతులు చెడినవారే కాయకష్టములతో జీవించువారు— పూర్వపుణ్యము నిలువలేనివారికి త్రికోణాధిపతుస్థానములు పాపులచే దెబ్బతినియుండును. పుణ్యము నిల్వగలవారికి కోణములు కోణాధిపతులు తగువైన స్థానములందుగాని, వారివారి గృహములందుగాని యుందురు. ముఖ్యముగా గమనింపవలసినవారు గమనింపవలసినస్థానములు త్రికోణములు త్రికోణాధిపతులు లగ్నము లగ్నాదిపతి- చెడిన దేహము, పంచమము, పంచమాధిపతి చెడిన విద్యయు నవమము నవమాధిపతి చెడినధనమును చెడిపోవునని యెరుంగుము.

శ్రీ:- స్వామి చతుర్థము విద్యాస్థానము కాదంటిరే ఏమనవలయును.

గు:- నాయనా చతుర్థము బ్రహ్మయు. సప్తమము, రుద్రుడు దశమము, విష్ణువు పాలింతురు— బ్రహ్మ విష్ణుస్థానములు మారుచుండునుగాని రుద్రస్థానము ఏలగ్నమునకుమారదు- బ్రహ్మస్థాన

మున నుండి విష్ణుస్థానమును-విష్ణుస్థానమునుండి, బ్రహ్మస్థానమును ఒక్కగ్రహమేపాలించును. లగ్నమునుండి సప్తమమును, సప్తమము నుండిలగ్నమును ఒక్కగ్రహామే పాలించును. ఏడింటిచూపు ప్రతి గ్రహామునకు గలదుకాబట్టి రెండుస్థానములు శుభస్కరమగును— లగ్న పంచమ నవమ కోణాధిపతులు కేంద్రములలోలేకున్న మాన వుని జీవితములో సుఖముండదు చతుర్థకేంద్రము బ్రహ్మస్థానము స్థిరాస్థుల నభివృద్ధిచేయునది. ఇక్కడొక కోణాధిపతియుండిన స్థిరా స్తుల నభివృద్ధి చేయనగును. ఏడింటిచూపువల్ల దశమమునుచూచి వృత్తిఉద్యోగ వ్యాపారగౌరవముల సృష్టించును. చతుర్ధదశమముల పూరించును. లేక దశమమునసుండినను రెండుస్థానములు శుభస్క రములగును.

సప్తమకేంద్రము రుద్రస్థానము కళత్రానందము సంసార సుఖముండు గృహము. ఇక్కడొక కోణాధిపతిలేకున్న మానవుని సౌఖ్యములన్నియు బూడిదపాలగును, సంసారము చెడును_

4, 7, 10 కేంద్రములు త్రిమూర్తులగు బ్రహ్మ రుద్ర విష్ణు స్థానములు 1, 5, 9 కోణములు త్రిదేవులగు పార్వతి, భారతి, లక్ష్మి స్థానములు ఈకోణాధిపతుల మండలములందే ముందు తానుచేసిన పుణ్యము (అదృష్టము) ఉండును. 3, 6, 8, 11, 12 స్థానాధిపతుల మండలములందు తానుచేసిన పాపముండునని యెరుంగుము.

శ్రీ:- స్వామి కేంద్రములశాశ్వితములు. కోణములుశాశ్విత మన్నారే కేంద్రములశాశ్వితమెట్లయ్యెనో తెలుపుడు.

గు;- వత్సా శుభస్థితిజెందిన చతుర్ధదశమములు వృషభ తులలుతప్ప మరియేలగ్నమునకులేవు-బ్రహ్మస్థానము శుభస్థానమైన విష్ణుస్థానము శత్రుస్థానమగును పరికింపుము మేషమునకు చతు ర్థము శుభస్థానమైనది. దశమము ఏకాదశస్థానాధిపతి గృహామగుటచే

పాపస్థానమైనది. మరొకటి మీనమునకు బ్రహ్మస్థానము సప్తమ కేంద్రాధిపతి దగుటచే శత్రుగృహమైనది. దశమము లగ్నాధిపతిదగుటచే విష్ణుస్థానమై మిగిలినది. ఇట్లేపరిశీంచిన మేష, మిధున సింహ ధనుర్కుంభములకు చతుర్థము- మీన కటక కన్య వృశ్చిక మకరములకు దశమము శుభస్థానమైనవి. వృషభతులలకుమాత్రము చతుర్థదశమములు శుభస్థానములైనవి అందువల్లనే గొప్పగొప్ప నాయకులు విప్లవకారులు జమీందారులు రాజులు నియంతలు వృష భతులాలగ్నములందు జనించుచుందురు బ్రహ్మస్థానము మిగిలిన విష్ణుస్థానము శత్రుపాలితమగును. విష్ణుస్థానము మిగిలిన బ్రహ్మ స్థానము శత్రుగృహమగును. గాన చతుర్థము అశాశ్వితస్థానమైనది త్రిశక్తిస్థానములు శాశ్వితమైనవి. దేహమునకు-దేహికి జ్ఞానమావశ్య కము దేహికి జ్ఞానమునకు ధనమావశ్యకము- త్రిశక్తులు మూ'' జీవుల కావశ్యకము గాబట్టి విద్యాస్థానము మారకూడదు. మారస.. వంచమముగాన పంచమమే విద్యానిలయమని యెరుంగుము.

శ్రీ:- స్వామి గ్రహములన్నిటకు ఏడింటిచూపు మాత్రమే నందుర

గు:- లేదులేదు రవిచంద్రబుధశుక్రులకు నల్వురకు ఏడింటిచూపు మాత్రమేగలదు. శని కుజ గురువులకు ఎక్కువచూపులు గలవు శని 7, 3, 10 చూచును. కుజుడు 7, 4. 8 చూచును. గురువు 7, 5, 9 చూడగలడు. ఈమూడుగ్రహములు కాలచక్రములో ఎక్కువపని చేయును. ఈఎక్కువచూపులలో అర్ధచూపని ముప్పాతికచూపని అన్నారు. అట్లేమియులేదు. ఏడింటిచూపు కెంతబలమో అంతబలము ప్రక్కచూపులకు గలదని యెరుంగుము.

శ్రీ:- స్వామి కోణాధిపతులే లగ్నములకు శుభులైన వృషభ మిధున కన్య తులలకు పంచమ నవమాధిపతిగ మకరకుంభములకు లగ్నాధిపతిగ శనియగునే. శనిని క్రూరుడు పాపిఅన్నారు. యేల్నాటి

శనిఅన్నారు. శని గ్రహమని దూషింతురు. దరిద్రమునకు శనియే కారకుడన్నారు. తాము కోణాధిపతులే దైవమంటున్నారు శనిని వృషభ మిధున కన్య తులాలగ్నములవారు. మకరకుంభములవారు దైవమని భావింపవలసినదేనందుర.

గు:- ఔను శనియన్నంతమాత్రమున దిగులుపడిచచ్చునట్లు చేసినారు. ఇది గ్రంధకర్తలతప్పని గ్రహించు లగ్నాదిపతికి పంచమ నవమాదిపతులేమిత్రులు శేషించినవారందరు శత్రువులని గ్రహించు ఏట్లన– నీవుచెప్పిన వృషభ మిధున కన్యా తుల మకర కుంభములకు శని శుక్ర బుధులే పంచమ నవమాధిపతులుగా నున్నారుగాని గురు కుజ రవి చంద్ర వెక్కడైన వచ్చినారేమో చూడు లేదు వారుముగ్గురే, ఒకరికొకరు లగ్నపంచమ నవమాధిపతులైయున్నారు– గురుకుజరవిచంద్రులకు పంచమనవమాధిపతులుగా శనిబుధశుక్రులైనారేమో చూడు లేదు. వీరికివీరే లగ్నపంచమ నవమాధిపతులైనారు. పరికించిచూడుము- అందువల్ల గురుపాలితులని, శనిపాలితులని రెండుతెగలవారైనారు గ్రహరూపీ జనార్ధన గ్రహరూపీమహేశ్వరాః అన్నారు. గురుపాలితులగు-గురు రవిచంద్రకుజులు జనార్ధనరూపమును శనిపాలితులగు- శనిశుక్ర బుధులు మహేశ్వర రూపమునువహించి ఖగోళమున భూగోళమున సగభాగస్థులై మంచివస్తువులకు గురువు చెడ్డవస్తువులకు (హీనపదార్ధములు) శనికారకులైనారు పరికించు– తీపునకధిపతి గురువు చేదునకధిపతి శని వాక్కునకధిపతి గురువు గుదస్థానమున కధిపతిశని బ్రతుకున కధిపతిగురువు చావునకు అధిపతిశని బంగారు కధిపతి గురువు ఇనుమునకు అధిపతిశని ఇట్లు. హరిరూపమై గురువెక్కడున్న అక్కడే ఎదురై రుద్రరూపమై శనియున్నాడు శనిలేకలయము లేదు. గురువులేక జీవనములేదు. ఇట్లు ప్రపంచమున సమాన హక్కులు గలిగియున్నారని గ్రహించు. గురువంతటివాడుశని-శని

యంతటివాడుగురువు-సమబలులు సమానులు వీరిలో తక్కువెవరు ఎక్కువెవరు తక్కువని చెప్పగలవారెవరులేరు- బ్రతుకులోవిష్ణువు ఆవశ్యకము చావులో శివుడావశ్యకము - విష్ణువును ద్వేషించిన బ్రతుకుచెడును. శివుని ద్వేషించిన చావుచెడును. అనాయాసముగా చావుసిద్ధింపవలయునన్న శివునాజ్ఞ కావలయును అనాయాసముగా బ్రతుకవలయునన్న విష్ణ్వాజ్ఞకావలయును. శివకేశవుల సమానముగా చూచినవాడే సమానముగా పూజించినవాడే ధన్యుడని తేలుచున్నది గదా ఇట్లుగ్రహములు విభజింపబడినవి- గురుపాలితులకు శనిపాలితులు- శనిపాలితులకు గురుపాలితులు శత్రువులు. వారువీరు కలిసిన యోగభ్రష్టతగలుగును. విప్లవములురేగును. ప్రకృతిపంచతత్త్వములు చెలరేగి ప్రజలహింసించును, గురుశని సమసప్తకములు-కుజశుక్రకలయికలు కుజశని చతుర్దశమములు ప్రపంచమును గగ్గోలుపరచును. అట్టిసమయముల జననమైనవారు ప్రజలగగ్గోలుపరతురు. ఇట్లు వీరురెండుతెగలై జంగమస్థావరములకు చావుపుట్టుకలు కల్పించుచున్నారు- వత్సా లగ్నమునకు కోణాధిపతులే శుభులు పూర్వపుణ్యము ప్రసరింపచేయు గ్రహములవియే- ఇక్కడనేశాస్త్రము తికమకలైనదని యెరుంగుము.

శ్రీ:- స్వామి సృష్ట్యాదిలో ఒకరికొకరు సరిపోనివారినెందుకు భగవానుడు పుట్టించెనందురు.

వ:- వత్సా ప్రపంచమునగల జీవులకు చావుపుట్టుకలుగలవు గదా పుట్టించుటకుబ్రహ్మయని పాలించుటకువిష్ణువని హరించుటకు శివుడని అందరముఅనుకొను విషయమేగదా అహింస పరమోధర్మమను వేదవాక్యమును పాలించుటకు హరియు హింసపరమో ధర్మమను రెండవవాక్యమును పాలించుటకు హరుడై హరిహరులైరి. గ్రహరూపములో గురుశనులైరి. వారివారిని వీరు. వీరివారిని వారు. ఆగంతుకమృత్యు రూపమున జీవితాంతమున చంపుచుందురు.

షోషించుకొనుచుందురు- మానవులు పాపపుణ్య మిశ్రితులు గాబట్టి గ్రహములు- శుభాశుభముల కధిపతులైనిల్చిరి. సృష్ట్యాదినుండి హింసాహింస లున్నవనియే జ్యోతిషము చెప్పును- లగ్నమునకు శుభుల నశుభుల ముందుతెలుసుకున్న అటుపైసర్వము తెలుసుకొనగలవు వినుము ద్వాదశలగ్నములని చెప్పితినిగదా మేషాది శుభాశుభుల తెలిపెదనువినుము

మేషలగ్నము

| | | | |
|---|---|---|---|
| 12 గురువు | లగ్నం కుజ 1 | 2 శుక్ర | బుధ 3 |
| 11 శని | | | 4 చంద్రి |
| 10 శని | | | 5 రవి |
| 9 గురువు | 8 కుజ | 7 శుక్రి | 6 బుధ |

శ్లో॥ సర్వే త్రికోణనే తారో గ్రహా శుభఫల ప్రదాః

అన్నసూత్రప్రకారము త్రికోణాధిపతులు కుజ రవి గురువులైరి గమనింపుము.

మేష వృశ్చికముల కధిపతి కుజుడు లగ్నాధిపతి కే అష్టమస్థానము గలుగుటవల్ల అష్టమస్థానదోషము మేషలగ్నమునకులేదు- పంచమము ఏకగృహముగల సూర్యునిదయ్యెను. నవమాధిపతికి ద్వాదశస్థానాధిపత్యము గలిగెను. మేషలగ్నమునకు ద్వాదశస్థానదోషములేదు. లగ్ననవమాధిపతులవే. అష్టమ ద్వాదశములగుటచేత దోషరహితములని యెరుంగుము.

లగ్న పంచమనవమాధిపతులు కుజరవి గురువులైరి. చతుర్థస్థానము ఏకస్థానమగుటయు స్థానాధిపతియగు చంద్రునకు పంచమనవమాధిపతులుగ కుజ గురువులేయగుటయు–గురుపాలితుడగుటచే తను కుజునకు చంద్రుడు - చంద్రునికి కుజుడు మిత్రులగుటవల్ల చతుర్థస్థానాధిపతికి వేరొకపాపగృహము లేకుండుటవల్ల చతుర్థస్థానము స్థానాధిపతియగు చంద్రుడు మేషమునకు శుభుడయ్యెను. దీనితో మేషమునకు నలువురు శుభులైరి.

శ్లో॥ త్రిషడష్టాయ రిప్పేశ విపరీత ఫలప్రదాః అన్నసూత్రప్రకారము 3, 6 తృతీయషట్ స్థానాధిపతియగుబుధుడు పాపియయ్యెను- యద్రి స్థానమగు సప్తమ కేంద్రాధిపతి లగ్నాధిపతికి ప్రతిలగ్నమునకు శత్రు వగుటచేత శుక్రుడుపాపియయ్యెను లగ్నాధిపతికి ఏకాదశస్థానాధిపతి ప్రతిలగ్నమునకు శత్రువగుటచేతను గ్రహపాలితులలో గురునకు ప్రతిపక్షనాయకుడగుటచేతను శనిపాపియయ్యెను-ఈముగ్గురుపాపులై మేషలగ్నజుల పీడింతురు, మేషమునకు కుజ రవి గురు చంద్రులు శుభులుగా శని బుధ శుక్రులు పాపులుగా నియమితులైరి.

వత్సా లగ్నము (లగ్నాధిపతి) దేహాభివృద్ధిస్థానము సప్త మము దేహక్షీణస్థానము పంచమము జ్ఞానస్థానము పంచమమునకు సప్తమము అజ్ఞానస్థానము- నవమము ధనస్థానము నవమమునకు సప్తమము నిర్ధనస్థానము— త్రికోణములు పుణ్యస్థానములని చెప్పి తినిగదా త్రికోణములకు ఎదురిండ్లు 3 7 11 పాపస్థానములు ప్రతి లగ్నమునకు కోణస్థానముల కెదురిండ్లు పాపస్థానములు ఈ 3, 7, 11 స్థిరపాపస్థానములు 6, 8, 12 స్థానములు అస్థిరపాపస్థాన ములు ఈ 6, 8, 12 స్థానములు శుభాశుభస్థానములుగా మారు చుండునుగాని 3, 7. 11 మారునవిగావు. 1, 5, 9 అదృష్టస్థాన ములనియు పూర్వపుణ్య స్థానములనియు పిలవబడును. 3, 7, 11 దురదృష్టస్థానములనియు పూర్వపాప స్థానములనియు పిలువబడును.

ఉచ్చస్థానమున కెదురిల్లు నీచస్థానమైనట్లు పుణ్యస్థానముల కెదు రిండ్లు పాపస్థానములైనవి- వత్సా కోణాధిపతులకు స్థిరపాపస్థానము లగు 3, 7, 11 స్థానములురావు. 3, 7, 11 స్థానాధిపతులకు శుభ స్థానములురావు. అస్థిరపాపస్థానములగు 6, 8, 12 స్థానములు వచ్చును. అందువల్ల త్రిషడష్టాయరిప్పేశ అన్నసూత్రము మారుచుం డును. గమనించవలయును- సూర్యచంద్రులు ఏకగృహస్థులు గాబట్టి స్థానపాపత్వశుభత్వముల పాలింపకతప్పలేదు. ఉదా- ధనస్సుకు

చంద్రుడు అష్టమాధిపత్యము వహించి గురుపాలితుడనను కొనక పాపులతోచేరి గురుపాలితుల బాదింపజొచ్చెను — మీనమునకు సూర్యుడు షట్‌స్థానాధిపతియై గురుపాలితులకు ఎదురయ్యెను సూర్యచంద్రులు ఏకగృహస్థులు గాబట్టి స్థానాధిపత్యము తప్పక నిష్పక్షపాతబుద్ధితో పాలింపవలసివచ్చెను- కోణాధిపతుల కలయికయే యోగము- యోగముగాని యోగములనంతముగా వ్రాసి వినుగుపుట్టించి శాస్త్రము దూష్యము చేసినారు- కోణాధిపతుల కలయిక చతుర్థపంచమ నవమ దశమములలో గలిగినవారే గొప్ప యోగజాతకులు.

వృషభలగ్నము.

| | | | |
|---|---|---|---|
| గు 11 | కు 12 | ల శు 1 | బు 2 |
| శ 10 | 1-5-9 శు-బు-శ అ—ర | | చ 3 |
| శ 9 | 3-7-11 చ-కు-గు | | ర 4 |
| గు 8 | కు 7 | శు 6 | బు 5 |

వృషభలగ్నమునకు లగ్నాధిపతి శుక్రుడు పంచమాధిపతి బుధుడు నవమాధిపతి శని చతుర్థాధిపతి రవి శుభులు- శుక్ర బుధశనులు త్రికోణాధిపతులు రవి చతుర్థాధిపతి యగుటచే శుభులు శుక్ర బుధ శని రవులు నలువురు. వృషభమునకు శుభులుగా నియమితులైరి.

సప్తమాధిపతి కుజుడు తృతీయాధిపతి చంద్రుడు. ఏకాదశ స్థానాధిపతి గురువు. స్థిరపాపస్థానాధిపతులగుటచే చంద్రకుజ గురువులు స్థిరపాపులుగా నియమితులైరి. వీరికే అష్టమ ద్వాదశస్థానాధిపత్యముగలుగుటచేత 8, 12 పాపస్థానములయ్యెను.

షట్‌స్థానము అస్థిరపాపస్థానమై లగ్నాధిపతిదగుటచే శుభస్థానమయ్యెను.

వత్సా మరొకటి గమనింపుము. కుజగృహముల రెంటికిశుక్ర గృహములు సప్తమములు-శుక్రగృహముల రెంటికి కుజగృహములు

సప్తమములగుటచే ఒకరికొకరుపరమశత్రువులు-బుధగృహముల రెం టికి గురుగృహములు గురుగృహములరెంటికి బుధగృహములు సప్త మములు గాబట్టి బుధగురువులు ఒకరికొకరు పరమశత్రువులైరి. శని సూర్యచంద్రులు ఒకరికొకరు సప్తమాధిపతులు గాబట్టి ఒకరికొకరు పరమశత్రువులైరి.

సృష్ట్యాదనే రెండువర్గములుగా శని బుధ శుక్రులను గురు కుజ రవి చంద్రులను విభజించి వీరికివారు - వారికివీరు శత్రువు లుగా సృష్టించినారు. లగ్నాత్ శుభాశుభులైరిగాని శుద్ధపాపత్వ మొక్కరికిలేదు. అందరు శుభులనియే తెలిసికొనుము—

మిధునలగ్నము.

| | | | |
|---|---|---|---|
| గు 10 | కు 11 | శు 12 | ల<br>బు 1 |
| శ 9 | 1-5-9 బు-శు-శ<br>3-7-11 ర-గు-కు-చ | | చ 2 |
| శ 8 | | | ర 3 |
| గు 7 | కు 6 | శు 5 | బు 4 |

తత్రా మిధునమునకు లగ్నా ధిపతి బుధుడు. పంచమాధి పతిశుక్రుడు నవమాధిపతిశని (త్రికోణాధిపతులు)స్థిరపాపులు గురువు రవికుజుడు ద్వితీయా ధిపతియగుటచేచంద్రుడు పా పులు-అనగా బుదశుక్ర శనులు శుభులుగా గురు కుజ రవి చంద్రులు పాపులుగా నియమితులని యెరుంగుము—

ద్వితియాధిపతి శుభుడైన అష్టమాధిపతి అశుభుడుగా- అష్ట మాధిపతి శుభుడైన ద్వితీయాధిపతి అశుభుడుగానియమితమై యుం డుటచేత చంద్రస్థానమునకు వ్యయతృతీయాధిపతిగ బుధుడుండుట చేత బుధక్షేత్రముల రెంటికి చంద్రుడు పాపియయ్యెనని యెరుం గుము—

కటకలగ్నము.

| | | | |
|---|---|---|---|
| గు 9 | కు 10 | శు 11 | బు 12 |
| శ 8 | 1-5-9 చ-కు-గు<br>3-7-11 బు-శ-శు<br>రవి-2 | | ల<br>చ 1 |
| శ 7 | | | ర 2 |
| గు 6 | కు 5 | శు 4 | బు 3 |

లగ్నాధిపతి చంద్రుడు పంచమాధిపతికుజుడు నవమాధిపతి గురువు. ఈమువ్వురు స్థిరశుభులు— సప్తమాధిపతిశని తృతీయాధిపతి బుధుడు- ఏకాదశస్థానాధిపతి శుక్రుడు. ఈమువ్వురు స్థిరపాపులు ద్వితీయాధిపతియగు రవి. అస్థిరపాపి-రవికి వ్యయస్థానాధిపతి చంద్రుడగుట చేత- చంద్రునకు ద్వితీయాధిపతియగు రవిపాపియయ్యెనని భావింపుము- ద్వితీయాష్టమములు పాపత్వము కటకధనస్సులకేగలదని యెఱుంగుము. షట్స్థానము నవమాధిపతిదగుటచే దోషరహితము- కటకమునకు చంద్రకుజగురువులు శుభులుగా- శనిబుధశుక్రరవులు పాపులుగా నియమితమయ్యెనని యెరుంగుము—

సింహలగ్నము.

| | | | |
|---|---|---|---|
| గు 8 | కు 9 | శు 10 | బు 11 |
| శ 7 | 1-5-9 ర-గు-కు-జ<br>3-7-11 శు-శ-బు<br>అ-చం | | చ 12 |
| శ 6 | | | ల<br>ర 1 |
| గు 5 | కు 4 | శు 3 | బు 2 |

లగ్నాధిపతి రవి పంచమాధిపతిగురుడు నవమాధిపతికుజుడుస్థిరశుభ్యులు - సప్తమాధిపతిశని తృతీయాధిపతి శుక్రుడుఏకాదశస్థానాధిపతి బుధుడుస్థిరపాపులు వ్యయస్థానాధిపత్యముచే చంద్రుడు అస్థిరపాపియయ్యెను- 6, 12 స్థానములు రెండుపాపత్వము సింహమీనములకేగలదు. శేషించినరాసులకు 6 పాపత్వము చెందిన 12 శుభత్వమును- 12 పాపత్వమైన 6 శుభత్వముగలదు గమనింపుము-సింహధనస్సులకు స్త్రీగ్రహములగు శుక్ర

చంద్రశనులుముగ్గురు పాపులగుటచే స్త్రీసుఖము కమ్మీయనవచ్చును ఈలగ్నముల జాతకులు, సన్న్యాసులు ఎక్కువగానుందురని తెలుసుకొనుము— శుభులు- రవిగురుకుజులు. పాపులు- శనిశుక్రబుధచంద్రులు నియమితమని యెరుంగుము—

కన్యాలగ్నము.

| | | | |
|---|---|---|---|
| 7 గురువు | 8 కుజ | 9 శుక్ర | 10 బుధ |
| 6 శని | 1-5-9 బు-శ-శుక్ర<br>3-7-11 కు-గు-చ<br>అ॥ 12-రవి | | 11 చంద్ర |
| 5 శని | | | 12 రవి |
| 4 గురువు | 3 కుజ | 2 శుక్ర | లగ్నం బుధ 1 |

లగ్నాధిపతిబుధుడు. పంచమాధిపతి శని నవమాధిపతి శుక్రుడు స్థిరపుణ్యులు. సప్తమాధిపతిగురుడు తృతీయాధిపతికుజుడు. ఏకాదశ స్థానాధిపతిచంద్రుడు. స్థిరపాపులు ద్వాదశస్థానాధిపతియగురవిపాపి. పంచమాధిపత్యమువల్ల షట్స్థానము దోషరహితము-సప్తమస్థానాధిపత్యమువల్ల చతుర్థముపాపస్థానము. కన్యాలగ్నమునకు-బుధ శని శుక్రులు శుభులు. గురుకుజ చంద్రరవులు పాపులుగనియమితమయ్యెనని యెరుంగుము—

తులాలగ్నము

| | | | |
|---|---|---|---|
| గు 6 | కు 7 | శు 8 | బు 9 |
| శ 5 | 1-5-9 శు-శ-బు<br>3-7-11 గు-కు-ర<br>అ॥ 10-చ | | చ 10 |
| శ 4 | | | ర 11 |
| గు 3 | కు 2 | ల శు 1 | బు 12 |

లగ్నాధిపతిశుక్రుడు. పంచమాధిపతి శని. నవమాధిపతి బుధుడు స్థిరపుణ్యులు దశమాధిపతి యగుటవల్ల చంద్రుడు అస్థిరపుణ్యుడు సప్తమాధిపతికుజుడు తృతీయాధిపతిగురువు ఏకాదశ స్థానాధిపతి రవి స్థిరపాపులు- నవమాధిపత్యమువల్ల ద్వాదశస్థానము. లగ్నాధిపత్యమువల్ల అష్టమస్థానము పంచమాధిపత్యమువల్ల చతుర్థము. దోషరహితము తులకు- శుక్రశని బుధచంద్రులు,

శుభులు- గురుకుజరవులు పాపులుగా నెరుంగుము— ఈలగ్నమునకు స్త్రీగ్రహములు మూడు. శుభగ్రహములై చంద్రుడు దశమాధిపతి యగుటవల్ల సినీమాతారలు నాట్యకర్త్తెలు, కవులు, గాయకులు రాజులు విప్లవకారులు, నియంతలు, ఉగ్రవాదులు అతివాదులు ప్రభుత్వమునకు ప్రతిపక్షనాయకులు. పండితులు దండిగా పుట్టుచుందురు లగ్నోత్తమలగ్నము ఇహసౌఖ్యము లనుభవించుటకు గ్రహాధిక్యత లగ్నోత్తమము తులకేగలదని చెప్పనగును. రాజ్యముద్రాధికారములుగల చంద్రుడు వామాచారులగు శని శుక్రబుధుల పరమగుటచేత ఈరాశికి బలాధిక్యత గలిగినదని తెలుసుకొనుము

వృశ్చికలగ్నము

| | | | |
|---|---|---|---|
| గు 5 | శు 6 | శు 7 | బు 8 |
| శ 4 | 1-5-9 కు-గు-చ-ర | | చ 9 |
| శ 3 | 3-7-11 శ-శు-బు | | ర 10 |
| గు 2 | కు 1 | శు 12 | బు 11 |

లగ్నాధిపతి కుజుడు. పంచమాధిపతి గురువు నవమాధిపతి చంద్రుడు దశమాధిపతిరవి స్థిరపుణ్యులు-సప్తమాధిపతి శుక్రుడు. తృతీయాధిపతి శని ఏకాదశస్థానాధిపతి బుధుడు. స్థిరపాపులు-షట్‌స్థానము లగ్నాధిపతిదగుటచే దోషరహితము- తృతీయాధిపత్యమువల్ల చతుర్థము పాపగృహము. వృశ్చికమునకు కుజ గురు చంద్రరవులు శుభులు-శనిశుక్రబుధులు పాపులుగా నియమితమైనదని యెరుంగుము. ఈలగ్నములో చక్రవర్తులు, సార్వభౌములు, కోటీశ్వరులు ముక్తిసాధకులు. పుణ్యములుచేయు పుణ్యాత్ములు, తీర్థయాత్రలుగా స్థానములుచేయు ధన్యాత్ములు పుట్టుచుందురు. భాగ్యరాజ్యాధిపతులు, చంద్ర సూర్యులగుటచేత ఈలగ్నము లగ్నోత్తమము గ్రహాధిక్యత గలిగియున్న లగ్నము. ఉత్తమము —

### ధనుర్లగ్నము.

| | | | |
|---|---|---|---|
| గు 4 | కు 5 | శు 6 | బు 7 |
| శ 3 | 1-5-9 గు-కు-ర<br>3-7-11-8 శ-బు<br>చ-శు | | చ 8 |
| శ 2 | | | ర 9 |
| ల గు 1 | కు 12 | శు 11 | బు 10 |

లగ్నాధిపతి గురువు పంచమాధిపతి కుజుడు. నవమాధిపతి రవి. స్థిరపుణ్యులు- సప్తమాధిపతిబుధుడు తృతీయాధిపతిశని ఏకాదశ స్థానాధిపతి శుక్రుడు. అష్టమాధిపతి అస్థిరపాపి. చంద్రుడు స్త్రీగ్రహములగు శనిశుక్ర చంద్రులుమువ్వురు పాపులగుటచేత ఈలగ్నజులకు ఇహసౌఖ్యములు కమ్మిగాని స్త్రీలతో కష్టములుగాని తప్పదు- పంచమాధిపతి ద్వాదశస్థానముగుటచే దోషరహితము= గురుకుజ రవులు శుభులు = శని శుక్ర చంద్ర బుధులు పాపులుగ నియమితమయ్యెనని యెరుంగుము.

### మకరలగ్నము.

| | | | |
|---|---|---|---|
| గు 3 | కు 4 | శు 5 | బు 6 |
| శ 2 | 1-5-9 శ-శు-బు<br>3-7-8-11 గు-చ-<br>ర-కు | | చ 7 |
| ల శ 1 | | | ర 8 |
| 12 గు | 11 కు | శు 10 | బు 9 |

లగ్నాధిపతి శని. పంచమాధిపతి శుక్రుడు. నవమాధిపతిబుధుడు. స్థిరపుణ్యులు. సప్తమాధిపతి చంద్రుడు. తృతీయాధిపతి గురువు. ఏకాదశస్థానాధిపతి కుజుడు. అష్టమాధిపతిరవి స్థిరపాపులు నవమాధిపత్యమువల్ల షట్స్థాన దోషరహితము ఏకాదశమమువల్ల చతుర్థము పాపస్థానము- కవులకు గాయకులకు భరతనాట్యసాధకులకు ఉత్తమలగ్నము- శనిశుక్రబుధులు శుభులు గురుకుజ చంద్రరవులు పాపులుగ నియమితమయ్యెనని యెరుంగుము—

లగ్నాధిపతిశని పంచమాధిపతిబుధుడు నవమాధిపతిశుక్రుడు స్థిరపుణ్యులు-సప్తమాధిపతిరవి తృతీయాధిపతికుజుడు ఏకాదశస్థానాధిపతిగురువు షట్స్థానాధిపతి చంద్రుడు. స్థిరపాపులు- పంచమాధి

కుంభలగ్నము

| | | | |
|---|---|---|---|
| గు 2 | శు 3 | శు 4 | బు 5 |
| ల<br>శ 1 | 1-5-9 శ-బు-శు<br>3-7-11 6 కు-ర-<br>గు-చ | | చ 6 |
| శ 12 | | | ర 7 |
| 11 గు | 10 కు | శు 9 | బు 8 |

పత్యము వల్ల అష్టమస్థానము లగ్నాధిపత్యమువల్ల ద్వాదశస్థానము దోషరహితము- లగ్నద్వాదశము శనికి పంచమాష్టమములు బుధునకువచ్చుటచేత కుంబలగ్నము లగ్నములలో మంచిదిగాదని కొందరనిరి. మకరమునకున్నబలము కుంభమునకున్నదని భావింపుము—శనిశుక్రబుధులు- శుభులు-గురుకుజచంద్రరవులు పాపులుగ నియమితమయ్యెనని యెరుంగుము.

మీనలగ్నము

| | | | |
|---|---|---|---|
| ల<br>గు 1 | కు 2 | శు 3 | బు 4 |
| శ 12 | 1-5-9 గు-చ-కు<br>3-7-11-6 శు-బు-<br>శ-ర<br>రవి-అధిపత్యపాపి | | చ 5 |
| శ 11 | | | ర 6 |
| గు 10 | కు 9 | శు 8 | బు 7 |

లగ్నాధిపతి గురువు. పంచమాధిపతి చంద్రుడు నవమాధిపతికుజుడు స్థిరపుణ్యులు— సప్తమాధిపతి బుధుడు తృతీయాధిపతిశుక్రుడు. ఏకాదశస్థానాధిపతి శని స్థిరపాపులు. ఆదిపత్యపాపి రవి- సప్తమాధిపతిదే చతుర్థముగుటచే దోషస్థానము- గురుకుజ చంద్రులు శుభులు- శుక్రబుధ శనిరవులు పాపులుగా నెరుంగుము—

వత్సా ద్వాదశరాసులకు శుభులను పాపులనుతెలిపితినిగదా లగ్నము చూచినతోడనే శుభాశుభుల నెరుంగునట్లు మనస్సులో భద్రపరచు కొనవలయును.

శ్రీ;- రాహుకేతువుల మాటనే చెప్పలేదు. కొందరు లేరన్నారు కొందరున్నారన్నారు. తామెవరిలో చేరుదురు.

గు:— వత్సా రాహుకేతువులు లేరన్నచో నవగ్రహమండల మేమికావలయును. వారి కారకత్వము లెవరికియ్యవలయును. అట్లిచ్చిన నియ్యవచ్చునుగాని దృక్కుకురావే అప్పుడేమి చేయవలయును. ఉదా— చతుర్థమున రాహువు పాపియై

యున్నవాని ఇంటిలో ఎక్కడచూచినా చెదులుండును. (దశమమున నుండినను, కొంపనాశనముచేయును. సర్పదరిశనము అగుచుండును. క్రిమికీటకాదిబాధ అసాధ్యముగానుండును చోరత్వము గలుగును ఈవిషయములు ఏ గ్రహముండిన జరుగు ననవలయును రాహువు అనేకమైనవాటికి కారకుడు కేతువు అంతియేనని తలంచు వీరిని వేరని వప్పించుకొనుట కష్టము. ఎంతటివారికైన పొరపాటుండును. పొరపాటనుకొనుము- ఇప్పటికి కొంచము చెప్పెదను విను. రాహువు శనిపాలితుడనియు కేతువుగురుపాలితుడనియు తెలిసికొనుము మున్ముందు వీరివిషయము ఆమూలాగ్రముగచెప్పెదను

శ్రీ:- స్వామి రాహుకేతువులు స్త్రీగ్రహములా పురుషగ్రహముల

గు:- నాయనాగురుకుజ రవిబుధులు పురుషగ్రహములు శనిశుక్రచంద్రులు స్త్రీగ్రహములు-కారకత్వమువల్ల స్త్రీగ్రహములనిరిగానివీరు పురుషులనే భావింపుము.

శ్రీ:- స్వామి నపుంసక గ్రహములున్నవందురే నిజమా.

గు.- గ్రహములలో నపుంసక గ్రహములులేవు. స్థానముల వల్ల కలయికవల్ల నపుంసకులు (కోర్జ) మానవులలో నుందురుగాని నవగ్రహములలో లేవు- వత్సా రాహువు శనిపాలితులలోచేరి శని శుక్ర బుధగృహములు స్వక్షేత్రములుగ నుండుటచే స్త్రీగ్రహమనియే చెప్పనగునుగాని ఏగృహములో తానుండునో ఆయాకృతి తనకు లభ్యపడును అనగా పురుషగృహములో నున్నపురుషుడుగా స్త్రీగృహములో నున్నస్త్రీగా కష్టసుఖముల గల్పించును- కేతువు గురుపాలితులతోచేరి కుజరవి గురుగృహములు స్వక్షేత్రములుగా నుండుటచే పురుషగ్రహమనియే చెప్పనగును. గాని రాహువువలెనే గృహమునుబట్టి యుండునని యెరుంగుము.

శ్రీ:- స్వామి అష్టదిక్కులలో రాహువునకు స్థానముగలదందురా

**గు:- లేకేమి రాహువుకు నైరుతిదిక్కు నొసంగి కేతువుకు**

గురుస్థానములో నుండచోటొసంగిరి గమనింపుము.

| | | |
|---|---|---|
| నైరుతీమూల | పశ్చిమము | వాయువ్యము |
| రాహువు | శని | చంద్రుడు |
| నైరుతి | వరుణుడు | వాయుదేవుడు |
| దక్షిణము | | ఉత్తరము |
| కుజుడు | | బుధుడు |
| యముడు | | కుబేరుడు |
| అగ్నిమూల | తూర్పు | ఈశాన్యము |
| శుక్రుడు | సూర్యుడు | గురువు కేతువు |
| అగ్నిదేవుడు | ఇంద్రుడు | ఈశాన్యుడు |

ఇట్లు నవగ్రహములు దిశాధిపతులైవారే అష్టదిక్పతులైరని తెలుసుకొనుము. తూర్పునకు పశ్చిమము ఆగ్నేయమునకు వాయువ్యము దక్షిణమునకు ఉత్తరము నైరుతికి ఈశాన్యము ఒకరికొకరు శత్రువులై నిలచిరి చూడుము.

శ్రీ - స్వామి నవగ్రహములు దిశలలో ప్రతిష్టలలో తాము నుడివినదానికి వ్యతిరిక్తముగ నున్నవే ఏమందురు.

గు- గ్రహమండల మట్లున్నదని దిక్కులలో అట్లేమార్చి సూర్యుని మధ్యకు చేర్చుటచేత తూర్పునకు శుక్రునినిలిపి ఆగ్నేయమునకు చంద్రుని చేర్చిరి. వాయువ్యము కేతువుకు నిచ్చిరి. గురువున్నచోటికి బుధుని, బుధుడున్నచోటికి గురువునుమార్చి సరిచేసిరి. ఉత్తరాధిపతి కుబేరుడు ధనాగారములుగలవాడు- గురువు ధనమునకు అధిపతిగదాయని పురాణోక్తముగమార్చిరి. గ్రహములకు స్థలములకు దిశలు మొదలగువాటికి దృక్కుకురావలయునుగదా రాదు. ఈమార్పిడిచేత నవగ్రహప్రతిష్టలు అపసవ్యములని భావింపుము. ఫలము నిష్ఫలమని గ్రహించు.

శ్రీ:- మరి ఏవిధముగా నుండవలయునందురు.

గు:- నాయనా దేవుడు దేవాలయములుండగా ఈనవగ్రహ ప్రతిష్టలెందుకొచ్చెనవిన ఏజాతకునకు ఆజాతకరీత్యాగాని ప్రశ్న లగ్నాత్గాని ఏగ్రహము మిగులబాధించుచుండునో ఆగ్రహమునకు అర్చనచేసి ఆగ్రహప్రీతికర వస్త్రధాన్యాదులు దానమిచ్చి ప్రదక్షణ నమస్కారములు చేసిన కొంత ఉపశమనముగా నుండును గాబట్టి నవగ్రహప్రతిష్ట ఆవశ్యకమన్నారు. దానిని ఒకొకగ్రహమునకు ప్రదక్షణ నమస్కారములు చేయుటకు వీలుగాకుండ పూజించుటకు వసతిలేకుండ కూర్చుండబెట్టినారు. ఇది శాస్త్రోక్తమన్నారు. శాస్త్ర కారులే పొరబడినారను వారెవరు. అందరికి తిరిగిన ఇందులో పాపు లెవరు పుణ్యులెవరు ఇట్లు విచక్షణ విమర్శలేక తిరుగుటకన్న దేవు నికి తిరుగుట క్షేమముగదా. గ్రహరూపి జనార్దన అన్నవచనము బాగులేద —

వత్సా పూర్వము పౌరోహితులు జాతకమునకే గ్రహము బాధించుచున్నదో ఆగ్రహ ప్రీతికరవస్త్రముపరచి దానిపై గ్రహ ప్రీతికర ధాన్యముపోసి దానిలో ఆగ్రహమండలమువ్రాసి దానిపై స్త్రీగ్రహమైన నరియు పురుషగ్రహమైన చేసియు వక్కలుపెట్టి వాటినే గ్రహముగానెంచి మంత్రయుతముగ ఆగ్రహమును ఆవా హనచేసి నారికేళ ఫలపుష్ప తాంబూలాదుల దక్షణలతో అర్చన నైవేద్య మంగళహారతులిచ్చి ప్రదక్షణ నమస్కారములుచేయుమని దానము ను తీసుకొనువారిని ఆగ్రహముగాతలంచి పూజించమని సంకల్పయుతముగ దానమిప్పించుచుండెడివారు.

అదిచూచి కొందరు పెద్దలు నవగ్రహములులేని కార్యములేదు గద. నవగ్రహశాంతి హోమములు చేయుచున్నాముగద, ప్రతి దానికి నవగ్రహములు కావలసివచ్చుచున్నది ఈనవగ్రహముల ప్రతి ష్టించుట క్షేమము అక్కడనే. దానములిచ్చుచుందురు. ప్రదక్షిణనమ స్కారములు జాతకాను గుణ్యముగ చేయుచుందరని ప్రతిష్ఠించిరి

గాని మండలము యంత్రము మంత్రము సమిధవృక్షముల వివ చిరి. ప్రజోపయుక్తము గాకుండునట్లు నియమించిరి. దీనశుభము లేదు. దివ్యకీర్తియు లేదన్నట్లైయినది. కార్యభిన్నమైనది.

శ్రీవత్సా ప్రజోపయుక్తమైన నవగ్రహమండలము చెప్పె దను వినుము—

మంచిస్థలముగాచూచి సమచతుష్కోణముగా ఏర్పరచుకొని దానిని మండలములతో కట్టవలయును. అనగా మధ్యలో త్రిమూర్తులు త్రిదేవులుండవలయును. వీరికి తూర్పున వలయాకారముగ మండలమేర్పరచి (అరుగు) దానిమధ్య చిన్నగుడియు అందులో సూర్యవిగ్రహము వెనుకమండలములోనే తెల్లజిల్లేడుచెట్టు ముందు సూర్యయంత్రము గుడిపైనరాతిలో చెక్కబడినమంత్రము పతాక ముండవలయును. మంత్రము నోటనుచ్చరించుచుగాని లేకగాని ప్రదక్షిణ నమస్కారములుచేసిన సూర్యునిచుట్టు తిరిగినవాడగును. సకలైశ్వర్యములు సిద్ధించును. కార్యసిద్ధిగలుగును ఉద్యోగప్రాప్తి గలుగును. సూర్యగ్రహ పీడగలిగినవారు గోధుమరంగువస్త్రమును యంత్రముపైపరచి గోధుములు పైనపోసి అర్చనచేయించి నైవేద్య మంగళహారతి చేయించి ప్రదక్షిణ నమస్కారములుచేసి మమపీడా పరిహారార్థం ఆయురారోగ్యభాగ్య వృద్ధ్యర్థం వస్త్రసహిత గోధూమ ధాన్యదానంకరిష్యే అనిదానమిచ్చిన పీడాపరిహారమై ఆయురారోగ్య భాగ్యములుగలుగును- వీరందరి ప్రదక్షిణ నమస్కారములుచేసిన భూప్రదక్షిణము చేసిన ఫలముగలుగును సత్యలోక వైకుంఠకైలా సముల ప్రదక్షిణచేసిన వాడగును.

మానవులు ప్రదక్షిణనమస్కారములు చేయుటకు విడివిడిగా గ్రహములుండవలయును. అట్టివసతులు గల్పించవలయును—

2) ఆగ్నేయము. పంచకోణములతో మండలముండి మధ్యలోగుడి అందులో శుక్రవిగ్రహము. గుడికివెనుక మండల

మందే మేడిచెట్టును ముందుయంత్రము గుడిపైనమంత్రముచెక్క బడినరాయి పతాకము సమర్చవలయును. ప్రదక్షిణనమస్కారములు చేయువసతి గలిగియుండవలయును ఇది శుక్రమండలము—

3) దక్షిణము. త్రికోణాకారముతో మండలము మధ్యలో గుడి- కుజవిగ్రహము- వెనుకమండలమందే సండ్రచెట్టును ముందుయంత్రము. గుడిపైనమంత్రము. ఎఱ్ఱటిధ్వజపతాకముండ వలయును ఇది కుజమండలము

4) నైరుతీమూల. సూర్పాకార మండలముండి (చాట) మధ్యలోగుడి రాహువిగ్రహము వెనుకమండలమందే జువ్విచెట్టు గరిక ముందుయంత్రము గుడిపైన మంత్రము పొగరంగుగల ధ్వజ పతాకముండవలయును

5) పశ్చిమము. ధనురాకారముగ మండలము గల్పించి మధ్యలోగుడి గుడిలోశనివిగ్రహము వెనుకమండలమందే జమ్మి చెట్టు ముందుయంత్రము గుడిపైనమూలమంత్రము ధ్వజపతాకము లుండవలయును. ప్రదక్షిణ నమస్కారములకు వసతి యుండవల యును- గురుపాలితజాతకులకు శని ఆరింటికొచ్చినప్పుడు నూగుల నూనెతో దీపముముట్టించి నల్లటిగుడ్డను యంత్రముపైపరచి 1 శేరు నూగులు గుడ్డలోపోసి నారికేళ ఫలపుష్ప తాంబూలదక్షిణాదులతో శనినిపూజించి నూగుపిండిని నైవేద్యముపెట్టి ప్రదక్షిణనమస్కార ములుచేసి సద్బ్రాహ్మణునకు సంకల్పయుతముగ దానముచేసిన శనిగ్రహపీడ పరిహారమగుటయేగాక కైలాసప్రదక్షిణచేసిన పుణ్య ములభించును. దీర్ఘాయురారోగ్య భాగ్యములు గలుగును.

6) వాయువ్యము. సమచతుష్కోణముగా మండలమేర్పరచి మధ్యలోగుడియు గుడిలో చంద్రవిగ్రహము వెనుకమండలములో మోతుకచెట్టు విగ్రహమునకుముందు యంత్రము గుడిపైమంత్రము పతాకముగల్పించి ప్రదక్షిణనమస్కారములు చేసిన చంద్రమండల

మధ్యస్థే, చంద్రునహోరాదరి యన్నిపదము వర్ద్ధముగాక లక్ష్మియే సకలైశ్వర్యముల చేకూర్చును సత్సంతతి గలిగించును లక్ష్మికటాక్షము గలుగును. సకల పుణ్యతీర్థములలో స్నానకిన పుణ్యము లభించును- లక్ష్మిసరస్వతులకు సోమవారము పౌర్ణిమ ముఖ్యము లక్ష్మి వారము సోమవారముగాని శుక్రవారముగాదు- శుక్రశనుల శివ పర్యాయముగాన శుక్రవారము పార్వతికి, శనివారము ఈశ్వరుని; ముఖ్యము లక్ష్మినారాయణ బ్రాహ్మిబ్రహ్మలకు ఆదిసోమ మంగళ గురువారములు శ్రేయోదాయకము. శుక్రశనిబుధవారములు ఉమామహేశ్వరులకు ప్రీతికరమని భావింపుము-

7) ఉత్తరము బాణాకారమండలము గల్పించి మధ్యలో గుడియు గుడిలో బుధునివిగ్రహముంచి వెనుకమట్టిచెట్టును ఉత్తరేణిచెట్లను పెంచుచు విగ్రహముముందు యంత్రమును గుడిపై మూలమంత్రమును ధ్వజపతాకాదుల గల్పించి ప్రదక్షిణనమస్కారములు చేసిన సకలపీడా పిశాచబాధలుతొలగి నిరోగులై ఆయురారోగ్యభాగ్యములుగలిగి సుఖింతురు. వ్యావహారికబాధలు తొలగును—

8) ఈశాన్యము. దీర్ఘచతుష్కోణాకారమండలము మధ్యలో గుడి గుడిలో గురువిగ్రహము వెనుకమండలములో రావిచెట్టు ముందుయంత్రము గుడపైమంత్రము ధ్వజపతాకములు గల్పించి

9) దీనికి ఎడమవైపున ధ్వజాకారముగమండలము గల్పించి మధ్యలోగుడియు గుడిలో కేతువిగ్రహముంచి వెనుక దర్భలను పెంచి ముందుయంత్రము గుడిపై మంత్రము ధ్వజపతాకములు గల్పించి ప్రదక్షిణనమస్కారములుచేసిన వైరాగ్యశక్తి ముక్తినిచ్చును శిరోవాయువులు మూర్ఛవాయువులు పోవును —

గురుగ్రహప్రదక్షిణమువల్ల సత్సంతతిగలుగును. ధనకనక వస్తువము దయసంపదలు విరివిగా గలుగును- శనిపాలితజాతకులకు లగ్నపంచమ నవమములలో గురువుప్రవేశించినప్పుడు పనసపురంగుగుడ్డను

యంత్రముపైపరచి 1 పడిశనిగలుపోసి నారికేళఫలపుష్పతాంబూల దక్షిణాదులతో అర్చనచేసి మంగళహారతియిచ్చి ప్రదక్షిణనమస్కారములుచేసి సంకల్పయుతముగ దానమిచ్చిన గురుగ్రహపీడ వైతొలగి ఆయురారోగ్యభాగ్యములు గలుగును—

త్రిమూర్తులకెదురుగ- విష్ణువుఎదుటతులసి ఈశ్వరునికెదుట మారేడు బ్రహ్మకెదుట తెల్లమోదుగ లేక తెల్లపూలుగల పూలచెట్టుగాని ఉండుట శ్రేయము. ముప్వురికి ఒకేమండపముండవలయును. చుట్టుప్రహరియు ప్రహరికిముందు భావియు పూజార్హతగల పూలచెట్లుండవలయు ప్రహరిలో నవగ్రహములందరికి ప్రదక్షిణచుట్టుటకు వసతి యుండవలయును- బ్రాహ్మిబ్రహ్మలు ఒకపీటమున, లక్ష్మీనారాయణులొకపీటమున— ఉమామహేశ్వరు లొకపీటమున విడివిడిగా నుండవలయును. అభిషేకార్చనలకు వీలుగానుండుట శ్రేయము.

ఇట్టి నవగ్రహప్రతిష్ఠచేసినవారు ఈనిర్మాణమెంతకాలముండునో అంతకాలము తానుండవలెనన్న స్వర్గ, వైకుంఠ, కైలాసములందెచ్చటనైన నివసించి సుఖింపగలరు. దేవాలయప్రతిష్ఠకన్న ఇట్టి నవగ్రహప్రతిష్ఠయే ఉత్తమోత్తమ మనవచ్చును.

విద్యార్థులు బ్రాహ్మిబ్రహ్మలకు ధనము కావలయునన్నవారు ఋణవిముక్తి కావలయునన్నవారు లక్ష్మీనారాయణులకు దేహారోగ్యము కావలయునన్నవారు ఉమామహేశ్వరులకు అర్చనాభిషేకములు చేయించి ప్రదక్షణ నమస్కారములు చేసిన మేరతప్పిన పుణ్యము లభ్యమగుటగాక. తమకోరికలు సఫలమగుటగాక జన్మసాఫల్యమగును- ఇట్టి నవగ్రహప్రదక్షిణ చేసినవారు. భూప్రదక్షిణ చేసిన వారగుదురు పుణ్యలోకనివాసము తప్పకగలుగును

శ్రీ:- స్వామి గ్రహములలో చాతుర్వర్ణములు తెలుపుడు.

గు:- వత్సా మానవులలో ఏదికలుగవలయునన్నను గ్రహ

ములనుండియే కలుగుచున్నది. జాతులుకూడ గ్రహములనుండియే పుట్టినది. ఒక్కొక్క దేశమున ఒక్కొక్కతరహాతో నుండును. గురువు సద్బ్రాహ్మణుడు వేదమునుచ్చరించువాడు. యజ్ఞయాగాదిక్రతువుల చేయువాడు సదాచారుడు- శుక్రుడు వామాచార బ్రాహ్మణుడు. ఆచారమునకు కట్టుబడక సంచరించువాడు నిబంధనకు నిలువక నుండువాడు. కులమర్యాదలను లెక్కించక తిరుగు బ్రాహ్మణుడు. విశ్వబ్రాహ్మణుడు. బలిజ భోగము సాతాని నాట్యకత్తెలు మొదలియారు. లింగబలిజ ఆరాధ్యబాహ్మణ మచ్చభుక్కులు, సర్వవిధ శిల్పాచార్యులు దాసర కూచిపూడిభాగవతులు ఆటదాసర ఈడిగ.

రవి;- సుక్షత్రియుడు ధర్మాచరణగలవాడు పరిపాలనీయుడు వందనీయుడు.

కుజ:- క్షత్రియుడు సమయానుకూలముగ శత్రువులను సంహరించువాడు- కుమ్మర వడ్డె ఉప్పర- గాండ్ల గొల్ల మంగల యానాది ఏకిలి దొమ్మర గంగెద్దుల- ఎరికల చిక్కులు ఘూర్కాలు

చంద్ర:- శుద్ధవైశ్య - సాలె తొగట జాండ్ర చాకలి బెస్త సున్నపువాళ్లు ఇంగ్లీషువారు.

బుధుడు:- వామాచారవైశ్యులు బొందిలి రంగరాజు సేట్లు సుంకులమ్మ బుడబుడకల గొడుగుమల్లయ్య తంబళ్ల ఈరాముట్టి జంగాలు.

శని:- శూద్రుడు- కాప కమ్మ యలమ.

రాహువు:- చండాలజాతీయులు మాదిగ మాల తోటి కాటి పాపడు ఆసాది పంబల బోయ ముత్తరాసు.

కేతువు:- మహమ్మదీయులు దూదేకుల.

| గ్రహములు | దశాసంవత్సరములు | దశానక్షత్రములు |
|---|---|---|
| రవి | 6 | కృత్తిక- ఉత్తర- ఉత్తరాషాఢ |
| చంద్ర | 10 | రోహిణి- హస్త- శ్రవణము |
| కుజ | 7 | మృగశిర- చిత్త- ధనిష్ఠ |
| రాహు | 18 | ఆరుద్ర- స్వాతి- శతభిషము |
| గురు | 16 | పునర్వసు- విశాఖ- పూర్వాభాద్ర |
| శని | 19 | పుష్యమి- అనూరాధ- ఉత్తరాభాద్ర |
| బుధ | 17 | ఆశ్లేష- జ్యేష్ఠ- రేవతి |
| కేతు | 7 | అశ్వని- మఖ- మూల |
| శుక్ర | 20 | భరణి- పుబ్బ- పూర్వాషాఢ |
| 9 | 120 | 27 నక్షత్రములు |

ఈ 120 దశాసంవత్సరములలో నిండువృద్ధాప్యము కష్టమని 20 యేడులుతీసివేసి నూటికవతలబ్రతుకువారు ఈకాలములో అరుదని శతాయువని దీవించినారు-ఈశతాయువులో బాల్యయౌవన కౌమార వృద్ధాప్యములు భాగించిన 25 సంవత్సరములు బాల్య విద్యాకాలములకు 25 నుండి 50 వరకు యౌవనకాలమునియు 50 నుండి 75 వరకు కౌమారమనియు 75 నుండి 100 వరకు వృద్ధాప్యమునియుచేసిరి. కలి కాలానుగుణ్యముగ దేహబలములు క్షీణించి 25 ను 20గా మార్చవలసినకాలము వచ్చుచున్నది. బాల్యము 20- 20నుండి 40 వరకు యౌవనము, 40 నుండి 60 కౌమారము, 60 నుండి 80 వరకు వృద్ధాప్యమని భావింపవలసివచ్చినది- 120 దశా సంవత్సరములలో శని పాలితసంవత్సరములుఅనగా శనిబుధ కేతు శుక్ర దశాసంవత్సరములు కలిసి 63 ను గురుపాలితసంవత్సరములు అనగా రవిచంద్ర కుజరాహు గురువత్సరములు 57 డుగనున్నవి

అందువల్ల అక్కడనుండియే వృద్ధాప్యము సంభవించును లగ్నాధిపతిలగ్నము తనుకారకుడు బలముగానుండి పాపులుదుర్బలులై అష్టమమున బలముగా నొకశుభగ్రహము ఉన్నయెడల నూరేడులు బ్రతుకవచ్చును.

శ్రీ:- స్వామి షష్టిపూర్తి చేసుకొనుచుందురే దాని విషయము తెలుపుడు.

గు.- వత్సా శని ఒక్కొక్క రాశిలో 30 నెలలు గురువు 12 నెలలు రాహుకేతువులు 18 నెలలు కుజుడు 1, 15 దినములు రవి శుక్రబుధులు- 1 మాసము చంద్రుడు రెండుంకాలు దినముంటూ కాలచక్రంలో ముందుకు నడచిపోవుచు మానవులకు సుఖదుఃఖముల గల్పించుచుందురు- శని 30 నెలలువంతున ద్వాదశరాసులు దాటునప్పటికి 30 సంవత్సరములగును. రెండుసార్లు తిరిగునప్పటికి 60 సంత్సరములగునుగద రెండుమార్లు అష్టమములోనుండి చంపకవదలినాడు. మూడవసారి వచ్చునప్పటికి 90 సంవత్సరములగును. సంపూర్ణాయువు పట్టినట్లేననియు భార్యాభర్తలకు వృద్ధదంపతులను గౌరవము దక్కినదనియు పూర్వజన్మసుకృతము చక్కగానుండినదనియు ముందుజన్మలో నొకరికొకరు ద్రోహము చేసుకొన్నవారుగాదనియు అట్లు ఒకరికొకరు ద్రోహముచేసుకొన్నవారికే భర్తకు కళత్రవియోగము, భార్యకు భర్తృవియోగము గలుగుచుండుననియు వీరు 60 యేడులు జీవించినవారు పుణ్యజీవులని నమస్కరింతురు-

బాల్య యౌవన కౌమారములు గడచి వృద్ధత్వములో దిగుచున్నాము. స్వామీ దయామయా ఈవృద్ధాప్యము ఇట్లే చక్కగా కాపాడి కడతేర్చుమని దైవమును అర్చనావిధానములతో సంతృప్తుని చేసి నవగ్రహముల జపహోమ తర్పణాదులతో సంప్రీతులచేసి బంధుమిత్రాదుల ప్రీతికర భోజనాదులతో సంతృప్తులజేసి ఆశీస్సులు పొందెదరు- షష్టిపూర్తియనిన నిదియే.

శ్రీ:- స్వామి భాగ్యరాజ్యాధిపతులకలయిక గొప్పయోగమందురే నిజమేనందురు.

గు:- వత్సా భాగ్యరాజ్యాధిపతులు లగ్నపంచమ నవమాధిపతులైన వారిమాటనిజమేగాని శత్రువులైన ఎట్లు మంచిదగును గమనింపుము- మేషమునకు గురుశనులగుదురు- మిధునమునకు గురుశనులగుదురు- సింహమునకు కుజ శుక్రులగుదురు- ధనస్సురు రవిబుధులగుదురు- కుంభమునకు శుక్రకుజులగుదురు- ఎట్లుయోగించును. యోగమున్నది యోగభంగమగును. శుభాశుభులొకచోట కలిసిన యోగమును నాశముచేయుదురు-ఈయోగము మీనవృషభ కటక కన్యతుల వృశ్చికమకరరాసులకు వర్తించును. భాగ్యరాజ్యాధిపతులు లగ్నపంచమనవమాధిపతులగుదురు-ఎట్లుత్రిప్పిన కోణాధిపతుల కలయికలేక యోగముగాదు. పూర్వపుణ్యము బలముగానున్నవారికే ఇట్లుకలయికలు గలుగుచుండును. ఆయోగమును విభజించనందున ద్వాదశలగ్నములకు ఉపయోగించు కొనుచుండిరని యెరుంగుము.

శ్రీ:- భావోభావ ఫలప్రదాః అన్నారు దీనినేమందురు.

గు:- ఈమాట చాలాతబ్బిబ్బులు చేయగలుగును ఆయుఃకారకుడగుశని అష్టమములోనుండుట కన్యాకారకుడగు శుక్రుడు సప్తమములోనుండుట ధనకారకుడగుగురుడు ధనస్థానమందుండుట ఇట్లే అన్నిగ్రహములకు చెప్పిరిగాని ఆలగ్నమునకు ఈగ్రహము పాపియా లేక శుభుడా అన్నమాటను మరచి చెప్పినమాట శుభుడై భావాధిపతి భావములోనుండిన ఫలప్రదమగునుగాని అశుభుడైయుండిన ఫలము దుష్ఫలమగును. గమనింపుము- శనిపాలితలగ్నములకు శని అష్టమములో శుక్రుడు సప్తమములో నుండుట మంచిదేగాని గురుపాలిత లగ్నములకుండిన సర్వనాశనము చేయుదురు. గురుపాలితలగ్నములకు గురుపాలితులుండుట క్షేమము శని

పాలితులుండిన ఫలము నిష్ఫలమని తెలియుమ: —
ఉదాహ = చతుర్థము స్థిరాస్థి నవమము చరాస్థి యందురు. చతుర్థ శుద్ధిగలిగినవానికి గృహము గృహోపకరణములు భూములు బంధు మిత్రులు జీవనవృత్తులు మొదలగునవి దండిగానుండును. చతుర్థ మున నొకపాపగ్రహముండిన స్థిరాస్థి సంబంధములన్నీ నాశము చెంది నిలువనీడ లేకుండును, గురువు గృహాధిపతిగాన గృహస్థాన మున నుండుట శ్రేయముగాని శని పాలితజాతకులకుండిన అద్దెయి ల్లునుకూడ దొరకనియ్యక బాధించును. శని గురుపాలితులకు అష్ట మందుండిన కారాగారముతప్పకచేర్చును. గ్రహవిభజనలేక పలికిన పలుకని యెరుంగుము —

శ్రీ.- స్వామి యోగములని రాజయోగములని నీచభంగరాజ యోగములని యోగముల వ్రాసినారే వీరు తెలిపిన యోగములు యోగములేనందుర

గు:- వత్సా ద్వాదశలగ్నములను విడదీయకపోవుటచేతను లగ్నములకు శుభాశుభులనెరుగకపోవుటచేతను సూర్యచంద్రుల బలా బలముల తెలియకపోవుటచేతను యోగబలము క్రమబద్ధముగ చెప్ప లేకపోయిరనకతప్పదు. గమనింపుము. బుధార్క యోగమన్నారు ఈ యోగము వృషభలగ్నమునకే చెల్లును. ఎట్లన వృషభమునకు రవి బుధులు చతుర్థపంచమాధిపతులు-రవి రాజగ్రహముగాబట్టి యోగ మైనది యోగమనగా కలిసిన రెండుగ్రహములుగాని మూడుగ్రహ ములుగాని ఒకరికొకరు మిత్రులుగానుండవలయును. శత్రువులు గలి సిన యోగభంగమగును- శేషించినరాసులకు రవిబుధులు ఒకరికొ కరు శత్రువులగుదురు. ఈబుధార్కయోగము పీడించును-పీడించక యోగించవలయునన్న శుభగ్రహము వెనుకై పాపగ్రహముముందై యుండవలయును లేక పాపగ్రహము వెనుకైయుండిన స్థానఫలము ఎదురింటిఫలము నాశనముచేతురు-మేషసింహ వృశ్చికధనస్సులకు

బుధుడుముందై వెనుకసూర్యుడుండిన యోగమనవచ్చును- మిధున కన్యా తుల మకరకుంభములకు రవిముందై బుధుడు వెనుకైయుండిన యోగమగును- మీనకటకములకు బుధాదిత్యులుకలిసిన జాతకునికి మృత్యుప్రదము—

శ్రీ:- స్వామి చంద్రమంగళయోగమన్నారే ద్వాదశలగ్న ములకు వర్తించునందురా

గు:- నాయనా కుజచంద్రులొకరాశిలోకలిసిన చంద్రమం గళయోగమందురు. మీనమేష కటకవృశ్చికములకు ప్రబలముగా యోగించును శేషించిన ఎనిమిదిరాసులకు యోగించక స్థానబలమును ఉన్నదానికిసప్తమస్థానఫలమును నాశనముచేయుదురు

సింహధనస్సులకు చంద్రుడుముందై వెనుకకుజుడుండిన యోగించును.

తులకు కుజుడుముందై వెనుకచంద్రుడున్న యోగించును- వృషభమిధున కన్యమకరకుంభరాసులకు చంద్రమంగళయోగము సర్వనాశనముచేయునని యెరుంగుము.

శ్రీ:- స్వామి గజకేసరియోగము చాలామంచిదన్నారే తామే మందురు—

గు:- వత్సా గురుచంద్రులకలయికనుగజకేసరియోగమందురు ఇయ్యది మీనమేష కటకవృశ్చికములకు అమృతప్రదమై వెలుగొం దును- సింహధనస్సులకు చంద్రుడుముందై గురువువెనుకుండిన యోగించును తులకు గురువుముందై చంద్రుడువెనుకుండిన యోగిం చును- వృషభమిధున కన్యమకర కుంభలగ్నములకు కాలయముడై బాధించునని యెరుంగుము— ఏలగ్నమునకీయోగము యోగించునను విషయమే గమనించక ద్వాదశలగ్నములకుచెప్పి శాస్త్రము దూష్య ముచేసిరని యెరుంగుము-

శ్రీ:- స్వామి కాలసర్పయోగమన్నారే దీనినేమందురు—

గు:- ఇదియోగమే కాదనవలయును ఎట్లనగా గ్రహము లన్ని రాహువుకు ఎదురైనప్పుడుగాని కేతువుకు ఎదురైనప్పుడు గాని అనగా వృషభమునుండి కన్యకులోపల గ్రహములన్నియు నుండి మేషతులలలో రాహుకేతువులున్న కాలసర్పయోగమంచురు- సూర్యకిరణముల కెదురైనట్లయిన రాహుకిరణములుగాని కేతుగ్రహ కిరణములుగాని లయమగును. రాహుకేతువులు ఏమిచేయజాలరు. ఇది యోగముగాదు కేతువశపోయినరాహువు శనిపాలితలగ్నము లకు సింహకటకములందుండిన గురుపాలితులకు కేతువు సింహకట కములందుండినా యోగఫలమిత్తురు-కాలసర్పయోగమనుమాటజాట ఇంకా వేలాదియోగములుచెప్పి మానవుల విసిగించిరేగాని ఉపక రించు యోగమే లేదని చెప్పనగును. వీరుచెప్పిన యోగముల కంఠ స్తముచేసిన అజాగళస్తములగును. గ్రంథప్రమాణము చెప్పవలసి నదేగాని దృక్కుకురాజాలవు.

శ్రీ;- స్వామి మరి యోగమెట్లుండవలయునందురు

గు:- వత్సా ఏలగ్నమునకైనను లగ్నపంచమ నవమాధిప తులు, చతుర్ధదశమములకలియుట ప్రబలయోగము. పంచమనవమ ఏకాదశమములోనుండుట ముప్పాతికయోగము. 1, 2, 3, 6, 7, 8, 12 స్థానములకలసిన అర్ధయోగమనబడును నాల్గవస్థానము బ్రహ్మస్థానముగాన శుభగ్రహములక్కడుండిన సర్వముచేకూడును విష్ణుస్థానమగు దశమములోనుండిన పాలనాశక్తి అపరిమితమై కీర్తి గౌరవములు మెండుగానుండును పంచమములోనుండిన విద్యయు నవమములోనుండిన ధనసంపదయు ఏకాదశమములోనుండిన దుర్లా భములు (ఆస్తులువచ్చుట) గలుగును. ఏస్థానములో లగ్నపంచమనవ మాధిపతులు కలియుదురో ఆస్థానఫలమేదో అది ప్రజ్వలితమైప్రకా శించును. పుణ్యఫలమనిన నియ్యదియేనని తెలుసుకొనుము- వీటికి ప్రభుస్థానములగు కటకసింహస్థానములు సూర్యచంద్రగ్రహముల

సంబంధముగలిగిన రాజయోగమందురు సూర్యచంద్రగ్రహసంబంధములేక లగ్నపంచమ నవమాధిపతులు వీరినిచూడక రాజయోగము లేదని యెరుంగుము

-రాజయోగములకు ఉదాహరణ-

| | | | |
|---|---|---|---|
| | | గు | |
| | మహాత్మాగాంధి | | రా |
| కే | | | చ |
| | శ | ల శుబుకు | ర |

1869-10-2 తేది జననము.
6-10-28 కేతుదశశేషము
ర 163 గు 30 ల 193
చ 120 శ 229
కు 207 బు 193
రా 103 శు 203

రాజయోగముల గమనింపుము. తులాలగ్నమునకు దశమకేంద్రాధిపతిచంద్రుడు. ఆచంద్రుడు ఏకాదశమమున సూర్యక్షేత్రమున నుండ పంచమస్థానాధిపతియగు శనిచూచుటయు బుద్ధిఃకారకుడగు చంద్రుడు బుద్ధిస్థానము విద్యాస్థానమగు పంచమమునుచూచుటచేత స్థిరప్రజ్ఞగలబుద్ధియయ్యెను. బుద్ధికిదోచినదంతయు బంగారమయ్యెను. ఉన్నతవిద్య నభ్యసింప విదేశములకేగెను. నభ్యసించెను- కేతుదశ పోయిన రాహువు దశమకటకముననుండెను. కటకసింహములు రెండు శుభులచే పూరించుకొనెను గాని గురువు అష్టమముననుండి ద్వాదశముననున్న సూర్యునిచూచుటచేత రాజగ్రహమొకటి విడిబడి 27వఏట రవిదశవచ్చెను ఉద్యోగము చేయవలయునను బుద్ధి మార్పుకలిగి-ప్రభుత్వములను మతములను విమర్శించుట. ప్రభుత్వ పాలనావిధాన పిశాచబాధలవైతొలగింపవలె. మతసిద్ధాంత పైశాచికములపారద్రోలవలెనను బుద్ధిపొడముటచే వాటిని ఎదురించుచు అనేకచిక్కులకులోనయ్యెను సత్యాగ్రహములపైఆధారపడెను గురుగ్రహము ప్రభుత్వముచేత మతకర్తలచేత చంపించచూచెనుగాని ఆయుఃకారకుడగుశని ఆయుస్థానముచూచుటచేత రవిదశలో ఆపని

సాగక పోయెను. చంద్రదశలో రాజ్యపాలకులకు మిక్కుటమైనవ్యక్తి యై నిలచెను ప్రజాపలుకుబడి హెచ్చెను- తన మనోరథము పండెను-ముందుకు నడచెను రాజులు, చక్రవర్తులు సకలదేశములు దేశనాయకులు, యోగులు, భోగులు, త్యాగులు సంతసించిరి స్థానమిచ్చిరి- కుజుడు లగ్నములో శుక్రబుధులకు ముందుండుటచే ఏమి చేయజాలక వారియందేకలసిపోయి చతుర్థముననున్న కేతువును గురువునుచూచుటచే మతకర్తల మహమ్మదీయుల కమ్మించెను ప్రభుత్వసహాయముతో ముసల్‌మానులు విజృంభించి అర్ధదేశము మాకు కావలెననిరి గాని బలహీనులై ఒకతోకపకువచ్చిరి- అక్కడ రాహు దశవచ్చెను. సర్వకార్యములు నెరవేర్చుకొనెను గురుదశ గురుభక్తిలో గురువు కేతువునుచూచుటచేత మహమ్మదీయులకు భాగమియ్యక తప్పకపోయెను—చంద్రుడు చంద్రక్షేత్రము సూర్యక్షేత్రము కట్టుబడి సూర్యదశ పోవుటచేత తనఆశయముల చంద్రుడు నెరవేర్చెను. పంచమము చంద్రుడుశుభుడైచూచుటచేత నాయాత్మ చెప్పలేదని చెప్పుచుండెనని వాడుచుండెను. రాజఋషియనిరి మహాత్ముడనిరి. పట్టువల నెగ్గెను. నాయార్జన భారతరాజ్యార్జనేయనిచెప్పి ఆర్జించెను సులభోపాయముగ రాజ్యకాంక్షదీరెను. జగద్విఖ్యాతి వహించెను. భాగ్యలగ్నాధిపతులగు బుధశుక్రులు లగ్నాత్ కుజుని ముందిడుకొని కలియుటచే దైవసమానుడై శిలావిగ్రహమై నెలకొనెను. కుజుడు కుజక్షేత్రములగు వృశ్చికమేషములు శనిబుధులచే కట్టుబడుటచే మిల్టరీలేకనే కార్యసాధనయయ్యెను. అప్పటి ప్రభుత్వము మిల్టరీనిఉపయోగము చేయకపోయెను మూడింటశని చతుర్థమునుచూచుటచే- కుజుడు కుజక్షేత్రములు భూస్థానమగు చతుర్థము కట్టుబడుటచేత భూవలయమే తనకు కట్టుబడెను గగనమునకు సముద్రములకు కారకుడగు చంద్రుడు తనస్వగృహమగు కటకము శుభస్కరమగుటచేత చతుస్సముద్రపర్యంతము కట్టుబడియెను

అష్టదిక్కులలో ఈశాన్యము తూర్పుతప్ప అన్నిదిక్కులు అధిపతులు తనవారైరి. భారతభూవలయమంతాకట్టుటడెను గాని గురువు కేతుగ్రహమును సూర్యునిచూచుటచేత మహమ్మదీయరాజ్యమొకటి నెలకొల్పెను—గమనింపుము. సూర్యచంద్రులకు కటకసింహములకు తెలియక కలయక రాజయోగముపుట్టను.

భావోభావఫలప్రదాః అన్నవచనమిక్కడ ఫలించెనని — పరికింపుము.



దశానుకూలత- గ్రహానుకూలత— గలిగిన జాతకులిట్లుందురని గమనింపుము. గురుశని సమసప్తకములుగల- జాతకులకు- అకాలమరణములు- దుర్మణములు గలుగునని యెరుంగుము.

మరియొక జాతకమును గమనించుము —

## శ్రీ జగదీశ్ చంద్రబోసు

| | | | |
|---|---|---|---|
| | | లగ | |
| రా | | | శ |
| కు | | | కే |
| శుబు | ర | | చ |

జననము 1858-11-30 తేది చంద్ర దశశేషము 0-3-2 ది చెట్లకు ప్రాణమున్నదని నిరూపించినవారు. రేడియోకనిపెట్టినవారు.

గురువు వృషభమునకు అష్టమాధిపతియై లగ్నాత్ దిగ్బలాధిపతియై లగ్న పంచమభాగ్యములగు త్రికోణములను సప్తమకేంద్రమును పంచమమునచంద్రుని సప్తమమున సూర్యుని నవమమున కుజునిచూచి యోగభ్రష్టతగలిగించెను. సప్తమద్వాదశస్థానాధిపతియగు కుజుడు- నవమమున ఉచ్చస్థితినొంది కటకసింహముల బలముగాచూచి— రాజయోగము ధ్వంసముచేసెను. తృతీయాధిపతియగుచంద్రుడు—

పంచమమున విద్యాబుద్ధిస్థానమునుండి విద్యను బుద్ధిని నాశనము చేయచూచెను, నవమాధిపతియగుశని చంద్రునిచూచుటచేతను బాల్యముననే కుజదశపోయి రాహుదశవచ్చుటచేతను విద్యకుగురువు ఆటంకమియ్యలేకపోయెను- విద్య ఆటంకములతో సాగెను- రాజభాష మాతృభాషసాగెనుగాని గురు వీక్షణప్రభావము సోకుచునే యుండెను-

కుజదశ రాహుదశ 25 యేడులకేపోయి గురుదశ గురుభక్తి వచ్చుటచేత 28 యేడులకేశత్రువులగు కుజగురుల వీక్షణతగ్గుటయు శనికటకమునుండి చంద్రునిచూచుటవల్ల బుద్ధివికసించెను- జ్ఞానము పెరిగెను- యోగభంగము యోగమయ్యెను— కటకము కటకాధిపతిచంద్రుడు నవమాధిపతియగుశనికి దొరుకుటచేతను పంచమాధిపతి జయక్షేత్రమగు అష్టమమునకలిసి యుండుటవల్లను లగ్నమును సూర్యుడు పంచమనవమములశనిచూచుటవల్లను కోణములుమూడు కట్టుబడెను-కుజుడు కుజక్షేత్రములు శుభత్వముచెందుటవల్లజంగమములకు ప్రాణమున్నట్లు స్థావరములకుగలదా? సుఖదుఃఖములు గలవా యనుసందేహముపొడమి ఉన్నదని నిరూపించెను. తాను దలచినట్టి గమ్యస్థానమును శనిబలీయుడై తననుచేర్చెను- చతుర్థమున రాహుదశపోయిన కేతువుబలముగానుండుటచేత కొన్నిటికి కొన్ని తానుకనిపెట్టినవి ఇతరులకు లభ్యమైయుండును- తనవల్ల ఇతరులు బాగుపడియుందురు— బుద్ధిస్థానము విద్యాస్థానమగు పంచమమున బుద్ధికారకుడగుచంద్రుడుండనవమాధిపతిశని భల్లూకపట్టుపట్టుట- పంచమాధిపతి గురుక్షేత్రమున లగ్నాధిపతితో కలియుటచే ప్రజ్ఞావంతుడయ్యెను—

సూర్యుడు చంద్రుడు కటకము శుభత్వము నొందుటయు గురువు ఒక్కగురుక్షేత్రము పావనమగుటచేతను ప్రపంచమున అతీతజ్ఞానియై కీర్తిగౌరవములనిలిపెను- ప్రభుత్వము, ప్రజలు ఆదరాభి

మానములచూపెను-జగద్విఖ్యాతి వహించెను-ఈజాతకునికి దశాను కూలతలేకున్న యోగభంగమైయుండును. కుజ గురుదశలు గడచి పోవుటచేత అదృష్టజాతకమైనది- జాతకునకు గ్రహానుకూలత-దశానుకూలతయే ప్రాణవాయువు. అందులో దశానుకూలతయేముఖ్య మని గమనించుము- కోణాధిపతులు కేంద్రములందులేక- దశాను కూలతగలుగక జాతకులు గొప్పవారుగారనియు కోణాధిపతులకు సూర్యచంద్రులు, కటకసింహములు దొరకక ప్రభుత్వాదరణ దొరు కదని తెలుసుకొనుము—

## శ్రీరవీంద్రనాథఠాకూరు

| | | | |
|---|---|---|---|
| ల చ | శు రబు | | కుకే |
| | | | గు |
| | | | శ |
| రా | | | |

జాతకము

18౬1-5-7 తేది జననము

సం " 10-2-21 ది. బుధదశ

నోబుల్ప్రైజును తీసుకొని విశ్వకవి యనిపేరుగడించెను దీర్ఘకాలము జీవించెను- గమనింపుము—

ఆట॥ మూడుకోణములును మూడుకేంద్రంబులు
శుభులుగలుగ చూడ శుభములొదవు
పురుషులందు పుణ్యపురుషుడై వెలుగొంది
గననితోవలెల్ల గనును వత్స॥

లగ్నాధిపతియగుగురువు పంచమకోణమున ఉచ్చస్థితినొంది మూడుకోణములగు లగ్నపంచమనవమములపట్టుకొని పంచమాధి పతియగుచంద్రునిచూచెను- భాగ్యస్థానాధిపతియగుకుజుడు చతుర్థ కేంద్రమునుండి సప్తమదశమకేంద్రములనుచూచెను- పంచమాధి పతిలగ్నమునుండి సప్తమకేంద్రమునుచూచెను- కోణములుమూడు కేంద్రములుమూడు శుభగ్రహములపరమై ప్రకాశించెను- ద్వాదశ

లగ్నములలో బలమైనవి. ఏడుస్థానములు- శుభత్వమొందెను-పాపు లగు శుక్రబుధరవులు- ద్వితీయాష్టమములను శని 6, 8, 12, 3 స్థానములనుచూచిరి- శనిఆరింట దిగ్బలాధిపతియైనందున శత్రు రోగ ఋణవిపత్తులను ప్రాణభయమును కుటుంబచిక్కులను గలిగించెను- కుటుంబసుఖము లేకపోయెను- సూర్యుడు సింహము చెడినందున పెద్దరాజయోగముపట్టక విద్యా విజ్ఞానయోగముపట్టెను- విశ్వకవియనిపించుకొనెను-నోబిల్ప్రైజును గ్రహించెను- చతుర్థకుజుడు శాంతినికేతనమను స్థాపితనిర్మాణముచేయించి పెద్దపెద్దప్రభుత్వోద్యోగుల యోగులపరిచయము గురుకుజవంద్రులుగలిగించిరి-చాలా కాలము గురుదశ గురుభుక్తి గడచినదనుక జీవించెను— శనిశుక్రబుధరవులు నిత్యకృత్యముగ చంపనెంచిరిగాని లగ్నాత్‌చంద్రుడుండ గురువుచూచినయోగము దీర్ఘకాలము బ్రతికించెను- లగ్నాత్ లగ్నసప్తమమునందొక శుభగ్రహమున్న అష్టమమున పాపులున్నను ద్వితీయమునయున్నను చంపజాలరు- విధురునిగా బ్రతకింతురు- స్త్రీయైన విధవగా బ్రతికింతురు. త్రిమూర్తిస్థానములు త్రిదేవిస్థానములు కోణాధిపతులచేచిక్కినందున గలుగుయోగమును గమనింపుము— సూర్యచంద్రులసంబందములేక రాజయోగములుగలుగవని యెరుంగుము— సూర్యుడు సింహము శత్రుపరమైనందున రాజయోగభంగమైనదని తెలుసుకొనుము—

## ఆరవ జార్జి చక్రవర్తి

| | | | |
|---|---|---|---|
| | | | |
| రా | | | గు |
| | | | కే |
| | లరచ కుబు | శశు | |

1895-12-14 జననము 18-1-22 దినములు శనిదశశేషము చక్రవర్తి జాతకమునకు కటకసింహములు రవి చంద్ర కుజగ్రహములు వృశ్చికమేష ములు చతుర్థదశమములు శుభస్థితి నొందవలయును గమనింపుము—

పంచమాధిపతి నవమమున ఉచ్ఛస్థితినొంది లగ్నముననున్న రవిచంద్ర కుజబుధులనుచూచుట నవమాధిపతి దశమ లగ్నాధిపతులతోకలియుట కుజుడు స్వక్షేత్రమునుండి చతుర్థమును చూచుట దశమమునకేతువుండుటచేత చక్రవర్తియోగము పూరించుకొనెనేగాని ద్వాదశమున శనిఉచ్ఛస్థితినొంది నవమముననున్న గురునిచూచుటవల్ల శత్రురోగఋణవిపత్తులు ధనవ్యయముగలిగి చింతించియుండును స్వధనముపై స్త్రీలకధికారముండియుండును- దశానుకూలతకు శని మిగులుటచేత కొన్నిచిక్కులు గలిగియుండును- బాల్యముననే బుధదశపోవుటచేత రవి కుజ చంద్రులకు సంపూర్ణబలముగలిగెను-గురుదశ అంత్యమములో జననమైయుండిన చక్రవర్తియోగము. సంపూర్ణముగా ఫలించియుండెడిది శనివల్లకొరతగలిగెను- గమనించితివా లగ్నపంచమ నవమాధిపతులకలయికలో రాజ్యాధిపతి కలియుటవల్లను నవమదశమాధిపతులు సూర్యచంద్రులై సైన్యనాయకుడు భూకారకుడగు కుజగృహమున సమ్మేళనగలుగుటయు దశానుకూలతవల్ల బుధ కేతు శుక్రదశలుపోయి రవిదశవచ్చుటచేత రాజయోగము నకుమించినదై చక్రవర్తియోగము లభ్యమైనది- సంపూర్ణ చక్రవర్తి యోగము గమనింపుము—

## విక్టోరియారాణి

| | | | |
|---|---|---|---|
| శుకు<br>రా | శ<br>బు | ల<br>రచ | |
| | | | |
| గు | | | |
| | | | కే |

1819-5-24 జననము

7-3-0 చంద్రదశశేషము

దశానుకూలతలేక ఏజాతకము వన్నెగడించదు- పాపగ్రహములు ఒక్కొకటిగాపోవుచువచ్చిన శుభగ్రహములకు బలముదొరుకును- పాపఫలమైపోవుచురాగ పుణ్యము పదిలమగుచువచ్చును- దీనినే దశానుకూల

తందురు. పరికింపుము — ఈవృషభలగ్నమునకు గురుకుజ చంద్ర కేతువులుపాపులుగదా బాల్యమున చంద్రదశవచ్చి వెంటనే కుజదశ వచ్చినది. అప్పటికి 14 వత్సరములైనవి. అటుపై గురుగృహమగు ఏకాదశమమునుండి భాగ్యరాజ్యాదిపతితోకలసిన రాహుదశవచ్చి ప్రబలముగా నడపించినది. రాహుదశగడచిపోవునప్పటికి 32 సంవత్సరములునిండినది అక్కడ గురుదశ గురుభుక్తివచ్చినది. ఈ భుక్తితో పాపగ్రహబలముఅయిపోయి శుభగ్రహబలము హెచ్చినది– ఉన్నచంద్రకేతువుల మూడింటచంద్రుని ఏడింటకేతువునుచూచి శని వారిబలములయింపచేసెను — కుజగురు చంద్రకేతుబలము నశించి శనిశుక్ర బుధరవిగ్రహములబలము పదిలమయ్యెను–దాదాపు 35 యేడులకే స్వతంత్రబలము గలిగెను. 43 యేడులకే గురుదశ పోయి శనిదశప్రారంభమై అనేకరాజ్యములను ధనమును బలమును ఆర్జించి కొన్నిమతసిద్ధాంతములకూలద్రోసి స్వమతములనెలకొల్పి చక్రవర్తినియై తనకెదురులేనిరాజ్యపాలననడపినది సైన్యస్థానములగు మేషవృశ్చికములు కుజుడు కట్టుబడుటచే సైన్యము బాగాపనిచేసినది— ఈజాతకమునకు ద్వాదశలగ్నములు నవగ్రహములు వశీకృతమయ్యెను. చూడుము– ఇట్లు జాతకములకు దశానుకూలత గ్రహానుకూలతుండవలయును– సూర్యచంద్రులు శుభులుగావలయును— చక్రవర్తుల జాతకము లిట్లుండునని యెరుంగుము —

## విద్యారణ్యస్వామి

| | | | |
|---|---|---|---|
| శు బు | ర | రా | శ |
| కు | | | చ |
| | | | |
| ల గు | కే | | |

పునర్వసు నాల్గవపాదము

వీరిజాతకములో పాపగ్రహములొకప్రక్క శుభగ్రహములొకప్రక్క చేరినవి– గురుశని సమసప్తకమైయుండి దశానుకూలతవల్ల శనిదశపోయిగురువుకు బలముగలిగెను– క్రమేణపాప

గ్రహదశలన్నీ గడచుచువచ్చెను— గురురవి కుజకేతుగ్రహములు బలవంతులవుచూవచ్చిరి— నవమాధపతియగురవి పంచమములో ఉచ్ఛస్థితుడైయుండ గురుడు సూర్యుని సింహముచూచెను-సూర్యుడు మరింత బలవంతుడయ్యెను— పంచమాధిపతి తృతీయమునుండి భాగ్యరాజ్యములచూచెను— రాజయోగముకుదిరెనుగాని విఘ్నస్థానమగుదశమము- బ్రహ్మస్థానమగు చతుర్థము కటకము చంద్రుడు పాపత్వముచెందుటవల్ల రాజయోగముచెడి సన్యాసయోగమయ్యెను- అయినను రాజగురువయ్యెను— పంచమశుద్ధివల్ల తాదలచిన దైవము ప్రసన్నుడై కోరినవరమిచ్చెను- బుద్ధిస్థానమున సూర్యుడుండుటవల్ల ధర్మసంస్థాపనములపై బుద్ధిపొడమెను-గురువుసూర్యునిచూచుటవల్ల దేవాలయములనే కట్టింపవలెనను ఆశయముగలిగెను- దైవశక్తితో కనకవర్షముకురిపించి దేవాలయముల కట్టించెను- విజయనగరసామ్రాజ్యస్థాపనచేసెను— చతుర్థశుద్ధిలేనందున కొంతకాలముననే తన స్థాపితములు శిథిలమయ్యెను— సప్తమాష్టమములు రెండు పాపత్వము చెందుటచే సన్యాసయోగము లభ్యమయ్యెను— గురురవులు ధ్యాన యోగకారకులుగాబట్టి భక్తిధ్యానములవల్లనే దైవబలముసాధించెను- విద్యారణ్యులనునామము జగదిఖ్యాతిగాంచెను- తపోబలముతో భగవతినిమెప్పించి కనకవర్షము కురిపించినమహనీయులువీరు— ఈ యుగములో ఇంతటితపోబలము నార్జించినమహాపురుషుడు వీరేయనవచ్చును- ఎందరో మోక్షమునకు వ్యాకులాడినవారు- మహిమలు చూపించినవారు- మతస్థాపనములుచేసినవారుగలరు- వీరట్టిదారుల పోక ధర్మసంస్థాపనములే శ్రేయమనితలంచి కనకవర్షముకురిపించెను భగవద్భక్తివల్ల కానికార్యములేదని నిరూపించెను. ప్రజలభగవద్భక్తిలో పూర్తిప్రవేశింపచేసెను. వీరికీర్తి స్థిరస్థాయిగానిలచెను—

పంచమమున ఉచ్ఛగ్రహములుండులగ్నములు మూడు గలవు గమనింపుము— ధనస్సు మీనము వృషభము ధనస్సుకు రవి

మీనమునకుగురువు వృషభమునకుబుధుడు ఉచ్ఛ గాన ఈమూడు లగ్నములలో పాపగ్రహవీక్షణలేక ఈగ్రహములు పంచమములో నుండ కన్మించినవారు కవులగుటయేగాక ఏదోపక క్రొత్తదారిని వస్తువును కని పెట్టుదురు. కీర్తిగౌరవములనార్జింతురు కనివిననిపెల్ల వారిబుద్ధికందను పూర్వపుణ్యజీవులువీరు—

నాయనా సూర్యచంద్రులసంబంధము కోణాధిపతులకులేక రాజయోగములు- చక్రవర్తియోగములు గలుగనేరవని యెరుంగుము-

ఈయోగములింకాముందుప్రకరణములో ఉదాహరణకైచూపింతును- ఇప్పటికి ఇంతటితోచాలించి భావకారకత్వముల గ్రహకారకత్వములతెలుపుదును కారకత్వములు తెలియకపోయినశాస్త్రము గ్రుడ్డిదగును. శాస్త్రాభ్యాసులకు మార్గదర్శకముండదు. గానవినుము-

లగ్నము తనుస్థానము (భావము) శరీరము = ఇక్కడొకశుభగ్రహమున్న దేహమును చక్కగాపోషించును- గ్రహబలమునుబట్టి గ్రహమునుబట్టి ధారుడ్యముండును- మృదుత్వశరీరము- సౌఖ్యము రంగు- బలము- ఆరోగ్యము- ఆత్మశక్తి- అవయవములసౌష్ఠవము (రూపము) స్వభావము-పుష్టి-దీర్ఘకాలముజీవించు జీవదాతుబలము గలుగును— అక్కడొక పాపగ్రహమున్నను గన్నను ఇందుకు విపరీతఫలమిచ్చును. గ్రహమునుబట్టి గ్రహబలమునుబట్టి దేహముదుర్భలత్వము అంగహీనము కురూపత్వము అనారోగ్యము ఆయుక్షీణము చేయును—

ఆయుస్థానమున నొకశుభగ్రహములేకున్న లగ్నముననున్న పాపగ్రహమే. దశాభక్తులందు చంపును— లగ్నమున శుభగ్రహమున్న అష్టమమున పాపగ్రహమున్నను చంపలేదు-లగ్నమందున్న శుభగ్రహదశపోయిన పాపులుచంపుదురని తెలుసుకొనుము—

—ద్వితీయము ధనభావము—

ఇక్కడొక శుభగ్రహమున్న వాక్పటుత్వము బాగుండును-

ధనచలామణి చేతిలోతిరుగుచుండును గోళ్లు వ్రేళ్లు పాదములు మంచి రంగుతో పొడవుతోనుండును-నోటసత్యవచనములు దైవధ్యానముండును. కుటుంబములో అన్యోన్యము ఆనందము నిరంతరముండును పలుకు చాలామృదువుగానుండును-వాక్చతురతగలుగును. వినయము ముఖాలంకారముండును-నాలుకలోఏలోపములేకుండును-నేత్రములు సోయగముగ దృష్టిబలముతోనుండును ఆయుర్బలమొసంగును. పాపగ్రహమున్న విపరీతఫలమిచ్చును మంచిని చెడ్డగామార్చును. ఆయుర్దాయమునకు లోటుగలిగించి కుటుంబచిక్కు లనేకము గల్పించును.

— సోదరభావము - తృతీయము —

ఇందొక శుభగ్రహమున్న కనిష్ఠసోదరసోదరీలను లేకుండ చేయును- ఉండిన మంచివారిగామార్చును— సోదరబలము గలిగించును- ధైర్యోత్సాహాశక్తి నిచ్చును- కర్ణబలముండును- దాయాదులు తన్ననుసరించి యుండునట్లొనరించును- నీచార్జన నీచధనము నీచ జీవనముతో జీవింపచేయును. నీచముగా ధనము నిల్వచేయించును— దైవభక్తి నిచ్చును— శుభాశుభకార్యములలో పాల్గొనింపచేయును — సేవకావృత్తితో తీర్థయాత్రలుచేయించును- నీచముగా పుణ్యమార్జింపచేయును- స్వల్పముగా పిత్రార్జితమును గల్పించును- పాపగ్రహమున్న ఇందుకు వ్యతిరేకముగాచేయును —

సోదరసోదరీ కలహముల గల్పించును- దాయాదులతో బద్ధవైరము గల్పించును-నిర్ధనికునిగాచేయును-నీచాతినీచముగా జీవింపచేయును- జీవనములచెరచును-పిత్రార్జితము శూన్యముచేయించును- భక్తిశ్రద్ధల నాశనముచేయును. అశుభములతో సేవకావృత్తితో కాలముగడిపించును— ఉత్సాహము నాశముచేయును —

మాతృభావము చతుర్థము

ఇక్కడొక శుభగ్రహముండుట జాతకునిపూర్వపుణ్యమనవల

యును- సకలవస్తువులుండుచోటు. పండుచోటు చతుర్థమును బ్రహ్మస్థానమందును-స్థాపితనిర్మాణస్థానమందును-స్థిరచరాస్తులలో స్థిరాస్తిస్థానము గమనింపుము— శుభగ్రహమునుబట్టి గ్రహబలమునుబట్టి వస్తువులబలముండునని యెరుంగుము-గృహములు గృహోపకరణములు-వస్త్ర భూషణాలంకారములు-బంధుమిత్రాదిపరివారము దాసదాసీజనము ధనకనకవస్తువాహనములు భూములు జలాశయభూములు-బావులు వనములు స్వజాతీయులు -పశువృద్ధి- జనవృద్ధి-ధాన్యవృద్ధి-క్షీరవృద్ధి దండిగాగల్పించును విశ్వాసపాత్రులగు బంధుమిత్రబలముగల్పించును-మాతృప్రీతినికల్పించి తల్లిని చాలాకాలము బ్రతికింపచేయును-మంచికార్యములకు ప్రయాణములు చేయించును సర్వసౌఖ్యముల చేకూర్చును- కీర్తిగౌరవముల బడయచేయును-ప్రతికార్యము జయప్రదముగసాగును- మాతృవర్గమువారిని బెంచును- స్థాపిత నిర్మాణముల చేయించును. క్రిమికీటకాది బాధలుండవు. నిక్షేపములుదొరుకును. గృహప్రవేశముల గల్పించును- వసతిగృహములకట్టించును— ప్రవాహసమీపభూములు లభ్యపడును—పుస్తకభాండాగారముల సృష్టించును- పండితుల గాయకుల విద్యార్థుల గౌరవనీయుల ఉద్యోగుల మిత్రత్వము గల్పించును— గుఱ్ఱములు ఏనుగులు కుక్కలు మొదలగునవి వృద్ధిచేయును శుభకార్యముల వేదహితకార్యముల గృహములోచేయించును శయనగృహము శయనవస్తుసంపద మితిమీరిఉండును-వైభవగృహముల కట్టించును దేవతామందిర నిర్మాణములచేయును— ధర్మసత్రములను చావిళ్లను ధర్మబావులగల్పించి కీర్తిగౌరవములతో వైభవోపేతముగ జీవింపచేయును —

ఇక్కడొకపాపగ్రహమున్న ఇందుకువ్యతిరిక్తమై పండనుమంచము ఉండనిల్లులేకుండును. లగ్నపంచమ భాగ్యాధిపతులలో నొకగ్రహము చతుర్థముననుండినవారే పూర్వపుణ్యులు—

—విద్యాభావము - పంచమము—

ఇందొక శుభగ్రహమున్న యుక్తియుక్తజ్ఞానమునకు సమయస్ఫూర్తికి గ్రాహితజ్ఞాపకశక్తికి కొదువఉండదు- దీనిని విద్యాస్థానమందురు- కొందరు చతుర్థము విద్యాస్థానమని చెప్పిరి. వారి ననుసరింపకుము, కొన్నిలగ్నములకు చతుర్థదశమకేంద్రములు మారుచుండును. కోణములు ఎప్పటికిమారవు స్థిరములు. పరికింపుము- మీనకటకకన్య వృశ్చికమకరములకు చతుర్థములు శత్రుస్థానములగును- దేహము జ్ఞానము ధనము జీవులకుముఖ్యము_ వీటిని త్రిశక్తిస్థానములందురు. 1 5 9 స్థానములుదేహశక్తి జ్ఞానశక్తి ధనశక్తినిచ్చునవి. ఇందులో ఏదిలోపించిన మానవత్వములో పెద్దలోటుగల్పించును- లగ్నాధిపతికి మిత్రగృహములే పంచమనవమములగును- ఏలగ్నమునకు శత్రుగృహములుగావు. గాన విద్యాస్థానము పంచమమేయనితెలుసుకొనుము- పంచమములో నొకశుభగ్రహమున్న ఉత్పన్నమగు భావములు కనుగొనుము —

సత్సంతానము మంత్రిపదవి బంధుమిత్రులకు సలహాదారు సౌశీల్యము నిశ్చయమనస్సు విద్యా-వినయము విధేయత వివేకము ప్రసాదించును- మంచివిషయములు మాట్లాడుట నానావిషయములు తెలిసికొనుట తెలుపుట దూరాలోచనలుచేయుట గలుగును- ఘనత గాంభీర్యము గ్రామాధికారమునొనగును-కవనము కావ్యరచన కార్యప్రవీణత మంత్రోపాసన ప్రసన్నత నొసంగును- దానము ధర్మము చేయుతలంపు గలిగించును- పాపపుణ్య విమర్శనాబలము పాండిత్యము ప్రతిభనిచ్చును- జ్ఞానశక్తి, జ్ఞాపకశక్తి గ్రాహితశక్తి శిల్పనాశక్తినొనంగును- మంత్ర యంత్ర తంత్రబలముగల్పించును. గురుత్వము గురుశక్తి అన్నదానము నిదానము కార్యజయము అధికారము వంశాభివృద్ధి మంత్రాంగములు నీతి నియమము శాంతి ప్రశాంతి గలిగించును (స్త్రీలకు గర్భస్థానమిదియే) కీర్తిగౌరవముల నలుదిక్కుల

వ్యాపింపచేయును— కననివి విననివి కనుగొనుశక్తి నిచ్చును— అధర్మ ములు ఖండించుశక్తి నిచ్చును-ప్రజలచే ప్రభుత్వముచే పారితోషికము లందజేయును. పౌరులకు హితునిగా గురువుగా నొనరించును- ఒరు లడిగినదానికి సూటిగా ప్రత్యుత్తరమియ్యగల శక్తి నిచ్చును—

పాపగ్రహమున్న ఇందుకు వ్యతిరిక్తముగా నడచును- బుద్ధి బలము బొత్తిగానశించును. కాయకష్టముతో జీవింపవలయును. జ్ఞాన శక్తితో విద్యతో జీవించువారి జాతకములకు పంచమముపంచమాధి పతి బలముండునని యెరుంగుము—

—శత్రు భావము — షట్స్థానము—

ఇక్కడొక శుభగ్రహమున్న శత్రురోగ ఋణవిపత్తులుండవు- వడ్డీవ్యాపారముతో వైద్యవృత్తితో ధనార్జన చేయించును— శత్రువు లుండరు- ఋణబాధగలుగదు- శత్రువులుండిన శత్రునాశనమగును- నిరోగిగా జీవించును- కలహభయము- మనశ్చింత- ద్వేషము- అప వాదులు- అపనిందలు- అనుమానములు-ఉపద్రవములు సప్తవ్యస నాలోలురబాధలుండవు- కార్యవిఘ్నములుగలుగవు-ధనము దుర్వ్య యముగాదు- మనోవ్యధగలుగదు-అప్పులు ఇచ్చుట తెచ్చుట ఇప్పిం చుటలో చిక్కులుండవు— ఆరింట పంచమనవమాధిపతులున్నవారే డాక్టర్లు. ఇందులో 6-8 గృహములలో శుభులుండి దశమమును శుభులుచూచుటో నుండుటో గలిగినవారే పెద్దడాక్టర్లు శుభులకు సూర్యచంద్రులకు సంబంధముగలవారే ప్రభుత్వోద్యోగులై ప్రభుత్వ ధనము ప్రజాధనము రెండునుభుజించుడాక్టర్లు కుజగ్రహసంబంధము గలిగినవారే ప్రభుత్వసైన్యమునకు డాక్టర్లు లగ్నపంచమ నవమాధి పతులెచ్చటనుండినను పాపగ్రహవీక్షణ పాపగ్రహసమ్మేళనలేకున్న ఆయాస్థానములనుబట్టి వృత్తియేర్పడి యోగించునని యెరుంగుము_ ఇక్కడొక పాపగ్రహమున్న దీనికివ్యతిరిక్తమౌను. శత్రురోగ ఋణ విపత్తులు వెన్నాడుచు జీవితాంతము బాధించును—

—కళత్రభావము – సప్తమస్థానము—

ఇక్కడొక శుభగ్రహమున్న కళత్రమును సత్కళత్రముగా నొనరించును- కళత్రమూలకధనము లభ్యము చేయును- సంసారము సౌఖ్యముగా ఆనందముగా నడచును- షడ్రసోపేతభోజనము లభించును- వివాహము దానంతటది తలవనితలంపుగాలభ్యమై గొప్ప ఆదాయములతోగూడియుండును- కామ, భోగ, క్రీడలకు ఏయాటంకము లేకుండును. భార్యాభర్తలన్యోన్యులై జీవింతురు. మధురపానీయములు ఫలాహారములు సుగంధద్రవ్యములు పుష్పములు తాంబూలము తలవకనే లభ్యపడును- వారాంగనాలింగ సౌఖ్యమబ్బును- కళత్ర సంతోషముతో కాలమునడచును- శయనమందిరము శయనము చక్కగానుండును- విందులు వినోదములకు ప్రీతిగా బంధుమిత్రులుపిలుతురు- చక్కనినిద్రవచ్చును- సకాలభోజనము, సకాల నిద్రలభించును- దుస్వప్నములురావు-పాకశాల చక్కగానుండును- శ్వశురగృహము ప్రీతిగలదిగా దొరుకును- ఆహారవిహారవ్యవహారములు చక్కగా నడచిపోవును-గ్రహబలమునుబట్టి గ్రహమునుబట్టి స్థానమునుబట్టియోగించును— పాపగ్రహముండిన ఇందుకువ్యతిరిక్తముగానడచును- జీవితసౌఖ్యమే నేలపాలగును- యౌవనకాలము వ్యర్థమగును- సంసారముభారమగును- యౌవనకాలములో వివాహముగాకపోవును-దీనికితోడు అష్టమములో పాపగ్రహమున్న వివాహమేకాదు— కొన్నిశుభగ్రహములబలముతో అయినను నష్టమగుటో విడిపోవుటో నిశ్చయము—

—ఆయుర్భావము - అష్టమస్థానము—

ఇక్కడొక శుభగ్రహమున్న గ్రహబలమునుబట్టి గ్రహమును బట్టి బలమొసగును- దేహపుష్టి వీర్యపుష్టిగలిగి దీర్ఘకాలము జీవించును- కామసౌఖ్యమనుభవించును-కన్యకలే లభ్యమగుదురు- మదన కదనములో మదవతులనోడించు వీర్యస్తంభన బలముగలుగును—

పరాభవములు స్త్రీదుఃఖము అంగహీనత కలహములు పాపము రాకుండకాపాడును-కారాగారప్రాప్తి గలుగదు- ఒరులచేచచ్చుట చంపుట లేక కాలమృత్యువే దాపురించును- శత్రుబీతిగలుగదు-శత్రువులతో మోసపోవుట శత్రువులు విషాన్నములుపెట్టుట ఉండదు-రాజదండనగలుగదు- జంతువధచేయ మనసంగీకరించదు పాపబీతి గలుగును-ప్రతిభ ప్రతిజ్ఞగలుగును-అకాలమృత్యుభయముండదు- కళత్ర సంతోషముండును- అన్యస్త్రీలసంగమము లభించును- ఇచ్చటొక పాపగ్రహమున్న ఇందుకు వ్యతిరిక్తముగానడచును పరాభవములు ప్రాణహానిగలుగును- దీనికితోడు చతుర్ధమున నొకపాపగ్రహమున్న కారాగారప్రాప్తి ఆదశలోభుక్తిలో తప్పకకలుగుటో పరాభవపడుటో తప్పదు-సప్తమాష్టమములురెండు మైధున నిద్రాహారములు గలుగు స్థానములు-ఇందులో ఒకస్థానమైన శుభగ్రహముతో నుండకపోయిన మానవజీవితము వ్యర్థభాజనము—

—పితృభావము — నవమస్థానము—

ఇందొక శుభగ్రహమున్న గ్రహబలమునుబట్టి గ్రహమునుబట్టి యోగించును- పిత్రార్జితముండును-దానము ధర్మము తీర్థసేవలు తపస్సు చిత్తశుద్ధితోచేయును. దైవభక్తి గురుభక్తియుండును- ధ్యానయోగము లభ్యపడును- భాగ్యము నిలువచేయును- మంచిమార్గము మంచికథలు సజ్జనసహవాసము భక్తులమిత్రత్వము లభించును- శుభకార్యములుచేయుట పాల్గొనుటగలుగును- సకలైశ్వర్యములు సమకూరును- వైదికము సదాచారము నియమములు నిష్ఠ వ్రతములు యజ్ఞయాగాదిక్రతువులు ఒనగూడును-పుణ్యార్జనచేయును వివాహములు వైభవముగాజరిపించును- వివాహములలో పాల్గొని గౌరవము పుణ్యము సంపాదించును-ధర్మాదాయములు లభించును- ధర్మకార్యములుచేయును- ధర్మకర్తృత్వము లభించును- ధర్మమార్గమున జీవితమునడచును-సుకృతముఫలించును- పాపగ్రహముండిన ఇందుకువ్యతిరిక్తమై విపరీతఫలమిచ్చును-ఏగ్రహము లేకుండిన నిర్జీవ

ప్రతిమవలె స్థలముండును— ఉదాహరణ ధనమునకు బంరషుగా నకు గురువు అధిపతిగదా—ఆగురువు శుభుడై నవమముననున్న ధనము బంగారము దండిగానిల్వచేయును. పాపియై గురువందున్నచో పది రూపాయలనిల్వ ఒకప్పుడుండదు. గింజయెత్తు బంగారముండదు— భావకారకత్వముల గ్రహకారకత్వముల నెరుగవలయును—

—జీవనభావము — దశమస్థానము—

ఇందొక శుభగ్రహమున్న గ్రహబలమునుబట్టి గ్రహమును బట్టి యోగించును- దశమమును విష్ణుస్థానమందురు. ఇక్కడ నవమాధిపతి ప్రథమపాదమందుండిన దశానుకూలతగలిగినతనకు విష్ణువు సైదోడుగానుండినట్లే తలంపవలయును-పట్టినదంతా బంగారమగును-

వృత్తి ఉద్యోగ వ్యాపార కీర్తి గౌరవప్రతిష్ఠలుకలిగి పెంపొందును- పాలనాశక్తి యుక్తిగలుగును— ప్రజాసన్మానములు రాజసన్మానములు పొందును- నిగ్రహాను గ్రహశక్తిగలుగును— ముద్రార్హత లభించును- సకలసంపదలు దినదినాభివృద్ధి చెందును- వంశవృక్షము పెంపొందును- చావిళ్లు, సత్రములు, దేవతామందిరములు మండపములు కట్టించును- దేవతాకార్యములు చేయించుట, పాల్గొనుట గలుగును- స్వయార్జితము పెరిగి జీవనరక్షణోపాదులు పెంపొంది ప్రఖ్యాతి ప్రజాదరణ లభించును- అష్టభోగములనుభవించును- ఎదురులేనిజీవితము నడచును- సర్వతోముఖముగా కార్యములునడచును- రాజగ్రహముల సఖ్యతగలిగిన ప్రభుత్వోద్యోగియై ప్రజాపాలనచేయును- పాపగ్రహమున్న ఇందుకు వ్యతిరిక్తమై జీవితము భారముగా నడచును- జీవనమునకై నిరంతరాలోచన చేయవలసియుండును —

—లాభభావము — ఏకాదశస్థానము—

ఇక్కడొక శుభగ్రహమున్న గ్రహబలమునుబట్టి గ్రహమును బట్టి యోగమునడచును-ఏకాదశము ప్రవృత్తిస్థానము: ఉపజీవనము

భాగ్యాధిపతియుండిన ఆస్తిలువచ్చును- లంచములిత్తురు- పంచమాధిపతియుండిన విద్యాలాభముగలుగును-లగ్నాధిపతియుండిన నానావిధలంచములతో జీవించును- బలిష్టముగ లగ్నపంచమ భాగ్యస్థానాధిపతులేయుండిన లాటరీలు తప్పకతగులును-దుర్లాభములు దురాదాయములు లభించును- జేష్ఠసోదరసోదరీఆస్తులు లభించును- వారిబలము గలుగును- నానావిధఆదాయములువచ్చును- పాపబుద్ధిగలుగును. లేఖనవృత్తి లౌకికములభ్యపడును- ఉపజీవనములుగలుగును- గ్రాహితశక్తియుండును. శిల్పకళలు లభ్యపడును. ప్రతిభావంతుడను ఖ్యాతిగలుగును- పాపగ్రహమున్న ఇందుకు వ్యతిరిక్తముగా నడచును- విద్యానాశనమగును- తనపిత్రార్జితము ఇతరులకు పంచవలసివచ్చును- దుఃఖజీవితమగును-ప్రవృత్తులవల్ల పదభ్రష్టత గలుగును- సప్తవ్యసనాలోలుడై చెడిపోవును- గ్రహమునుబట్టి సుఖదుఃఖములు ఆదాయవ్యయములు గలుగును—

—వ్యయ భావము – ద్వాదశ స్థానము—

ఇక్కడొక శుభగ్రహమున్న గ్రహబలమునుబట్టి గ్రహమునుబట్టియోగించును— దుర్వ్యయ దుర్వినియోగ దురుపయోగములుగాకుండ సద్వ్యయ సద్వినియోగ సదుపయోగములు చేయించును_ సద్గ్రంధపఠనచేయించును. తత్వముపదేశింపచేయును. దైవభక్తినిచ్చిముక్తికిమార్గము చూపించును- జీవితరక్షణోపాయముల తెలుపును- పాపభీతినొసంగును- నరకలోకముతప్పించి స్వర్గలోకప్రాప్తిగలిగించును- పశుత్వముమాన్పి మానవత్వము గల్పించును- జంతువధను మాన్పును- ముందుజన్మకు తరుణోపాయముల చూపించును- కష్టములేని చావుసిద్ధింపచేయును- పాపగ్రహమున్న దీనికివ్యతిరిక్తమైఅనేకకష్టముల గల్పించును- మానవుడు వ్యయమగు సమయములోఎట్టిసుఖదుఃఖములుగలుగును- రాబోవుజన్మఎట్టిది! పుణ్యలోకప్రాప్తియా? లేక నరకలోకప్రా యా? అన్నవిషయముతెలిపేది స్థాన

ద్వాదశమని యెరుంగుము—

## గ్రహకారకత్వము — సూర్యగ్రహకారకత్వము

ఆత్మ- శౌర్యము- విదేశసంచారము- శక్తి- జ్ఞానోదయం- పరాక్రమము- ఉష్ణము- ప్రతాపము- అధికారము- అగ్ని- రాజ్యము- ధర్మహృదయము- కుక్షి- పాలనాశక్తి- ప్రభుత్వ భూములు- అక్షి- వ్యవహారములు- బంజరు- ధైర్యము- వలయాకారమండలము- శివాయిజము- ప్రభావము- చక్రవర్తిత్వము- గ్రామనేత్రము- కౌమారము- రక్తచందనము- ముద్రాధికారము- మనశ్శుద్ధి- పితృవు- తెల్లజిల్లేడుసమిధ- తూర్పు- రాజవిద్య (ఇంగ్లీషు)- ఆదివారము- మహడీలు- రాజభవనములు-

## చంద్రగ్రహకారకత్వము

బుద్ధి- జలము- స్త్రీ- రజితము- నిద్ర- స్థూలము- గాలి- గమనము (వేగము)- పుష్టి- పుష్పములు- కాంతి- సుగంధములు- నదులు- యాత్రలు- సస్యము- తటాకము- కీర్తి- మాతృప్రీతి- తెలుపు- మాత- శ్వాస- ధావళ్యము- ఘనము- వాపీకూపములు (కోనేర్లు, బావులు)- ముత్యము- ముఖాలంకారము- మనోశక్తి- ఉదరము- శీతలము- మధురము- ఇక్షురసము- మృదుత్వము- క్షీరము- మనోజవము- గర్భము- యశస్సు- బావము- రాత్రిబలము- సౌఖ్యము- భోజనసుఖము- స్త్రీసౌఖ్యము- దూరదేశప్రయాణములు- విమానములు- సోమవారము- నావలు- మహడీలు- చత్రములు- వసతిగృహములు- చామరములు- మాతృస్త్రీ- రాజచిహ్నము- ముద్రాధికారము- వర్షము- రాజసన్మానము- ఝంఝామారుతము- మృదువైనవస్త్రము- పూత- సముద్రస్నానములు- వడ్లు- సముద్రములు- వెన్నెలలోపరుండుట- వీర్యబలము- శయన

గృహము- సంతోషము- సౌందర్యము- అశ్వవాహనము- చెవు లబలము- శిరోబలము- మెదడుబలము- గ్రాహితశక్తి- జ్ఞాపక శక్తి- దూరాలోచన- చిరునవ్వు- ఈతలోనైపుణ్యం- పుణ్యనదీ స్నానములు- నీటిప్రదేశములు- జలచరములు- ఖేచరములు- మాతృరూపము (గర్భము)- మహాడీలు- భవనములు- అలంకా రసౌధములు- కాలువలు- యేటిపొరంబోకు- ఇంగ్లీషు- క్రొత్త వస్తువులు- విలాసవస్తువులు- గౌరవము- కీర్తి- బాల్యకారక త్వము- కౌమారకారకత్వము- వాయువ్యము- మోదుగచెట్టు (సమిధ)- అగడ్తలు- చాకలమాన్యములు- చావిళ్లు- స్నానాల గదులు-

## కుజగ్రహకారకత్వము

భూమి- సైన్యాధిపత్యము- బలము- గాంభీర్యము- శస్త్రము- బాహుబలము- వీర్యము- నిర్భయము- యుద్ధప్రీతి- గంభీరమైన పలుకు- యుద్ధములు- దేహబలము- వనములు- అంగరక్ష- వృక్షములు- రిపుజయము- మృగములు- పరాక్రమము- పట్టుదల- ప్రభుభక్తి- కోపము- శీఘ్రము- శౌర్యము- లక్ష్యము (సూటిగాగొట్టుట) జయము- రక్తవర్ణము- విదేశము- దక్షిణ దిక్కు- వాగ్వాదము- అస్త్రబలము- ప్రతిజ్ఞ- దుష్టమృగ ములు- అగ్ని- అరణ్యము- ఉష్ణము- కొండలు- రాజసేవన- కోనలు- ఖ్యాతి- అరణ్యసంచారము- ఖడ్గము- సండ్రసమిత (చెట్టు)- వేట- కొయ్యలు- యువరాజు- కట్టెలు- సాహసము- త్రికోణాకారమండలము- ప్రవాళము- కుక్కలు- దండనీతి- ఎద్దులు (కోడెలు)- తర్కము- కుడిభాగము- శస్త్రవిద్య- సత్య వాదన- స్ఫోటకము- ఎరుపురంగుభూములు- కొండభూములు- రాళ్లభూములు- బండలు- అధర్వణవేదము- రాళ్లు- యువక మిత్రత్వము- రాళ్లగనులు- యువకస్త్రీసంభోగము- మెట్టభూమి-

కోటలు- వంకలు- బురుజులు- కనిష్ఠసోదర- వెంట్రుకలు- సోదరీలు- మీనము- పలుకుబడి- దీర్ఘబాహువులు- యువకత్వము- భయంకరమైనముఖము- అంగరక్షకులు- చెదరనిగుండెబలము- ప్రజారక్షకులు (పోలీస్)- ధాన్యము- దేశరక్షకులు- (మిల్టరీ)- కందులు- సన్మానములు- సోదరబలము- ఎఱుపురంగు- సైన్యబలము- మంగళవారం- గుహలు- రచ్చటరుగులు- మంగలకుమ్మరమాన్యములు- కుమ్మరగుంటలు- కుమ్మరాములు- వ్రణవైద్యము- కాయలు- పిందెలు-

## బుధగ్రహకారకత్వము

గణితశాస్త్రము- వామాచారము- జ్ఞానము- పైత్యము- లిపి- దృష్టిబలము- ఆకుపచ్చ- జంతుబలి- శిల్పనైపుణ్యము- చిత్రలేఖనము- జోతిష్యము- శివభక్తి- వ్యాపారం- దాసదాసీజనవృద్ధి- వేదాంతము- పరిహాసము- మాతులన్యాయము- సంధిచేయు- చాకచక్యము- పొట్టి- మాతామహులు- స్ఫురద్రూపి- విచిత్రరచన- యుక్తాయుక్తజ్ఞానము- వైద్యము- సమయస్ఫూర్తి- చమత్కారము- మాంత్రికము- హాస్యము- శాంబరీవిద్య- సైంటిష్టు (కొత్తది కనుగొనుట)- యక్షిణీవిద్య- ఉత్తరము- బుధవారము- మంత్రము- భూతనాధత్వము- యంత్రము- భూతబలము- తంత్రము- స్మశానభూములు- గోరీలు- ఈశ్వరమాన్యములు- దిబ్బలు- దింపుడుకల్లములు- దయ్యాలయిండ్లు- బలిపెట్టెడుచోట్లు- పాడుబడినస్థలములు-, వ్యాపారస్థానములు- అంగళ్లు- శూన్యములు- ప్రయోగములు- తంతులు- భూతవైద్యము- ఉత్తరేణి (సమిధ)- పెసలు (ధాన్యము)- సంధిచేయుట-

## గురుగ్రహకారకత్వము

వదబ్రాహ్మణ-- రాజసన్మానము- గురుపు- ధాన్యము- సత్కర్మ-

నిక్షేపము- ధనము- వేదము- విద్య- పౌరాణికత్వము- పురాణములు- పుత్రపౌత్రవృద్ధి- సత్సంతతి- సంపద- అష్టభోగములు- వేదాంతము- వందనీయత- పూజనీయత- గృహము- గృహోపకరణములు- జ్యేష్ఠసోదరసోదరీ- అధికారగౌరవములు- గ్రామాదికారము- దానము- ధర్మము- పరోపకారచింత- దీర్ఘచతుష్కోణమండలము- పనసపురంగు- పల్లకీ- గజము- వాగ్ధోరణి- మేదావి- గృహోదాయము- వృద్ధత్వము- వేదమంత్రపఠన- బంగారము- సౌఖ్యము- తీర్థయాత్ర- దేవతాదర్శనములు- బుద్ధిబలము- కావ్యపఠన- సభాసన్మానములు- మంత్రిత్వము- అగ్రస్థానము- సంస్థాపనలు- హోమములు- మధురాహారము- పరేంగితజ్ఞానము- పుష్యరాగము- ఉష్ణము- ఆచారము- అహింసాసిద్ధాంతము- సంస్కృతము- వైష్ణవభక్తి- పాండిత్యప్రతిభ- దేవాగారసంస్థాపన- ధర్మహృదయము- బాంధవ్యబలము- కావ్యరచన- శాంతము- దయ- దాక్షిణ్యము- సత్యవాక్కు- ముక్తి- ముక్తిసాధన- పౌరోహిత్యము- యజుర్వేదము- మాతృభాష- సమయస్ఫూర్తి- సంధిచేయుట- కార్యసాధన- గురుత్వము- ధర్మసంస్థాపన- మతసిద్ధాంతము- దైవప్రసన్నత- శిథిలదేవాలయనిర్మాణము- శిష్యవృద్ధి- భటవర్తిఇనాములు- దేవతామాన్యములు- బ్రాహ్మణగృహములు- చవటభూములు- కల్యాణమందిరములు- భజనమందిరములు-

## శుక్రగ్రహకారకత్వము

వివాహము- కన్యాత్వము- కళత్రము- శ్వేతవస్త్రం- శ్వేతవర్ణము- కామకేళి- సుగంధము- కీర్తి- యౌవనము- ఆగ్నేయదిక్కు- సౌందర్యము- సరససల్లాపము- జలక్రీడ- చిత్రకవిత- సరళకవిత- మాతృభాష- సామవేదము- నృత్యము- మధ్యపానము- యువతి- సంగీతము- సాహిత్యము- భావము-

అష్టభోగములు- అష్టయిశ్వర్యములు- సత్కళత్రము- శృంగార
కావ్యరచన- సుకుమారము- గాంధర్వము- వీణావేణుగానము-
వాహనసౌఖ్యము- దేహసుఖము- వారాంగనాలింగనము-
భూషణాలంకారములు- బహుస్త్రీసంగమం- కళానిపుణత- రేతో
బలము- నాటకాలంకారములు- కావ్యరచన- మదనకదననై
పుణ్యము- భరతశాస్త్రము- శివభక్తి- శాంబరీవిద్య- వామాచా
రము- మృదురతి- ప్రబంధరచన- స్త్రీలకత్యంతప్రియము-
శయ్యా- వివాహములలో- విందులలో- పాల్గొనుట- సభా
సన్మానములు- వేశ్యలమిత్రత్వము- సప్తవ్యసనాలోలత్వము-
తాంబూలం- మాంసభక్షణం- శాక్తేయుడు- శక్తిపూజ- అగ్ని-
వ్యభిచారగృహములు- పశువులఇండ్లు- బండ్లువిడుచుస్థలములు-
పశువులకట్టుచోట్లు- వంటకట్టెలుపెట్టుచోట్లు- శయనగృహము-
వేశ్యలు- నవయౌవనులమిత్రత్వము- కామకేళీవిలాసము-

## శనిగ్రహకారకత్వము

రోగములు- దుఃఖము- మరణము- దాసీజనసౌఖ్యము- విధవా
సౌఖ్యము- వికృతాంగనాసుఖము- నపుంసకత్వం- అనాచారము-
పౌరుషహీనము- పాపార్జన- వామాచారము- జీవహింస- గోళక-
మాలిన్యవస్త్రం- సిధిలవస్తువులు- ఖలుడు- క్రూరత్వం- భస్మదారి-
సన్యాసి- సన్యాసిని- పాపులతోమైత్రి- నల్లటివస్త్రములు- శూ
ద్రుడు- పశ్చిమాధిపతి- అధోదృష్టి- కృషీవలుడు- మోసకారి-
కారాగారము- శల్యాధిపతి- జీర్ణవస్త్రధారి- బ్రాహ్మణద్వేషి- గుం
డక- భయంకరుడు- దున్నలకధిపతి- జంతువులతోరమించువాడు-
కాఠిన్యహృదయము- జూదము- బంధన- తైలము- నీచవిద్య- నీచ
దేవతోపాసన- అధర్మము- వధ్యశిల- బంధనము- పాతాళగృ
హము- కంచరగాడిదలు- కురూపము- దుష్ప్రవర్తన- దారిద్ర్యము-

నీచజీవనము- వంటలవాడు- మద్యపానము విక్రయించుట- మాంసవిక్రయుడు- మాంసవిక్రయశాల- భోజనవిక్రయము- దొంకలు- ఇనుముఅంగడి- కాఫీహోటళ్లు- శిథిలగృహనివానము- దిబ్బలు- పాయకానాలు- బలిబెట్టుచోట్లు- స్మశానము- చీకటిల్లు- రుద్రమాన్యములు- భిక్షుకగృహములు- సమాధులు- రుద్రరూపము- జమ్మిచెట్టు(సమిధ)- నూగులు(ధాన్యం)- వృద్ధత్వము- వామభాగము- మారణాస్త్రములు- శక్తిఆలయములు- జీర్ణగృహోపకరణములు- నలుపురంగు- కామదహనస్థలము- సారాయికల్లుఅంగళ్లు- క్లబ్బులు-

## రాహుగ్రహకారకత్వము

క్రూరము- పాపము- పాపస్త్రీసుఖం- గుండక- గోళక- చోరజీవనము- రాత్రిబలము- దుష్టులసహవాసము- అనాచారము- నీచాశ్రయము- చర్మవిక్రయం- విషములు- సర్పములు- తేళ్లు- మండ్రగబ్బలు- క్రిమికీటకాదులు- చెదులు- పుట్టలు- దుష్టగృహములు- పంపులు- ధూమ్రవర్ణము- మినుములు(ధాన్యం)- గరికె (సమిధ)- నీచజీవనము- మాంసవిక్రయము- మలినవస్త్రము- పొగరంగువస్త్రము- విషవైద్యము- మోసము- పాములబట్టుట- చెప్పులుకుట్టుట- దోపిడీలుచేయుట- త్రాగుట- చండాలత్వము- అపసవ్యముగాతిరుగుట- రాక్షసహృదయము-

## కేతుగ్రహకారకత్వము

తత్వజ్ఞానము- మోక్షము- చిత్రవర్ణము- దర్భ(సమిధ)- ఉలవలు(ధాన్యం)- అపసవ్యము- తపస్సు- బ్రాహ్మణమిత్రత్వము- వేదాంతము- జ్ఞానము- మౌనము- అపసవ్యలిపి- వైరాగ్యము- పితామహులు- శూద్రగోష్ఠి- మహమ్మదీయుడు- ముఖాలంకారహీనము- సన్యాసమిత్రత్వము- ఆశ్రమనివాసము- భోగరహితము- దైవభక్తి- మలినవస్త్రము- అహింసాసిద్ధాంతి- భూతదయ- సాకారద్వేషి- నిరాకారతత్వసిద్ధాంతి- సాధువు-

శ్రీ:- స్వామి భావకారకత్వముల గ్రహకారకత్వముల తెలిపితిరి. వీనిని సంధిచేసి బలాబలముల నిర్ణయించుటెట్లో తెలుపుడు-

గు:- పత్సా గృహస్థానము చతుర్థముగదా గృహాధిపతి గురువుగదా. చతుర్థమున గురువుండిన గృహసౌఖ్యమునకు మేరుండదు. చతుర్థమే భూమిగదా. భూకారకుడు కుజుడుగదా. కుజుడు చతుర్థముననుండిన భూమి విస్తారముగానుండును- శనిపాలితలగ్నముల కిట్లుండిన సెంటుభూమి ఉండదు పండను ఉండను గృహముండదు- స్థానము గురుపాలితమా శనిపాలితమా. కారకత్వగ్రహము శనిపాలితుడా. గురుపాలితుడా. ముఖ్యముగా గ్రహించుకొనవలయును. చూడుము- వాహనస్థానము చతుర్థము కారకుడుశుక్రుడు. గురులగ్నములకు చతుర్థమున శుక్రుడున్న వాహనయోగమే గలుగదు. కలిగిన గండములకేనని భావింపవలయును. శనిపాలితలగ్నములకు ఉండిన వాహనయోగము సంపూర్ణముగా నుండును.

శ్రీ:- అట్లయిన గురుపాలితులకు వాహనయోగము శనిపాలితులకు గృహయోగముండదందుర.

గు;- ఉండకేమి. గురుపాలితలగ్నములకు చతుర్థమున నొకశుభగ్రహముండి కారకుడైనశుక్రుడు శక్రగృహములురెండు శుభులు చూచుటో ఉండుటోగలిగిన సంపూర్ణవాహనయోగము గ్రహము గ్రహస్థానమొక్కటి మిగిలియుండిన మధ్యమయోగము గ్రహమొక్కటేచిక్కియుండిన అధమయోగమౌనందురు. దేనికి గ్రహముగ్రహస్థానములు శుభస్కరమైన సంపూర్ణయోగమగునని యెరుంగుము.

శ్రీ:- స్థానము శుభత్వముచెంది కారకుడుపాపియైన గండమేనందుర.

గు:- ఔను శనిపాలితులకు చతుర్థమున నొకశుభగ్రహముండి గురువు శనిశుక్రబుధులకు కట్టుబడియుండిన గృహయోగము చక్కగనుండును. గురువులో పడకపోయిన గృహము శిథిలమగుటో విక్రయ

మగుటో తప్పదని యెరుంగుము—

శ్రీ - స్వామి స్థానము కారకత్వగ్రహము శుభస్థితినొందిన యోగముచక్కగా నుండునందుర

గు:- ఔను సప్తమమున నొకశుభగ్రహముండి శుక్రుడు శుభస్థితినొందిన కళత్రము సౌందర్యవతి లభ్యమగును. సప్తమము శుభగ్రహముతోకూడియుండినా శుక్రుడు పాపులతోకూడియుండిన వివాహమయ్యు సుఖముండదు. కోపిష్టిగానో పాపిష్టిగానో రోగిష్టిగానో తయారై ద్వికళత్రయోగమునకుదారితీయును. స్థానాధిపతి స్థానము కారకుడు శుభస్థితిజెందినది సంపూర్ణయోగమనబడును—

శ్రీ:- స్వామి ఒకగ్రహమును మరియొక గ్రహముచూచిన శుభాశుభములు గలవందుర.

గు; ఔను లగ్నాధిపతి ఎట్టిస్థానముననుండునో ఎవరినిచూచునో వారికారకత్వముల సొనకారకత్వముల గ్రహించి లాభమిచ్చును- పంచమాధిపతి ఎవరినిచూచి ఎట్టిస్థానముననుండునో వారి విద్యలవల్ల వారికారకత్వములవల్ల లాభము గడించును- భాగ్యాధిపతి ఎవరినిచూచి పట్టిగృహముననుండునో వారికారకత్వములవల్ల లాభము గడించును— అనగా లగ్నాధిపతి సూర్యక్షేత్రమందున్న ప్రభుత్వధనముతో జీవించును— పంచమాధిపతి శుక్రునింటనుండి శుక్రునిచూచిన సంగీతసాహిత్యములతో జీవించును- నవమాధిపతి బుధునింటనుండి బుధునిచూచిన వ్యాపారముతోనో వైద్యముననో జీవించును—

శ్రీ:- స్వామి గ్రహస్థానములలో గ్రహకారకత్వములు గలవందుర.

గు:- అవును. గ్రహమునకు ఎన్నికారకత్వములుగలవో అన్నియు స్థానమునగలవని తెలుసుకొనుము— ఉదాహరణ- ధనుర్లగ్నజాతకుడు లగ్నాధిపతి ముఖ 1వ పాదములో సింహమున

నుండెను. ఆయన జీవితమంతయు ప్రభుత్వమున ఉన్నతోద్యోగులకు ఉద్యోగియై జీవించెను—

శ్రీ:- స్వామి సాంగో పాంగముగ నొకప్రశ్న చెప్పనగున. చెప్పగలిగెడు వారున్నారా.

గు:- నాయనా ఈశాస్త్రము షట్‌శాస్త్రములలో గొప్ప విలువైనది. దేహమునకు నయనములెట్టివో శాస్త్రములకు ప్రజలకు నయనములవంటిది. దీనిని సాంగముచేయుటకు సాంగముగ చెప్పుటకు బ్రహ్మకొక్కనికే శక్తిగలదు. అట్టిదానిని మానవుడు చెప్పనగునా- సాంగోపాంగమనగా ఏమనుకొంటివి- విను. అయ్యా నీకుమారునికి కన్య ఫలానాగ్రామంలో ఫలానావారి పుత్రికకలదు- ఫలానా సంవత్సరములో ఫలానామాసములో ఫలానా తిధి వారనక్షత్రములలో ఇన్నిగంటలకు ఈముహూర్తమున వివాహమగునని చెప్పుట సాంగోపాంగప్రశ్న. దీనినెవరు చెప్పగలరు. అంతవరకు చెప్పగలజోస్యులు ఈభారతభూమిలో ఉండినట్లు కొన్నికారణములవల్ల తెలియుచున్నది. వారంతరించినారు. వేదాంగజోస్యులమని వేదాంగజోస్యమని చెప్పుకొను మహామహులు. శనిప్రేరణతో ప్రబలినారు. సాంగోపాంగ ప్రశ్న చెప్పగలధీశాలు లిప్పుడెక్కడున్నారు లేరు. చెప్పగలిగిన లక్షలాది ధనమార్జింతురు. రాజాతిరాజులు తనయింటిముందు మణిచేతులు పట్టుకొని నిలుతురు ఇది లభించుట మహాదుర్లభము.

శ్రీ:- స్వామి భావము భావాధిపతి పాపత్వముచెందినఫలము నిష్ఫలమగునందుర,

గు:- ఔను. ఉదా— ధనస్సులగ్నమైన భాగ్యస్థానాధిపతి సూర్యుడౌను. స్థానము సింహమౌను. సింహము సూర్యుడు పాపులచే దెబ్బతినిన పితృధనమావంతయు గలుగదు, స్వయార్జితధనము చిల్లిగవ్వమిగులదు- ఆస్థానమున ఏవేవి ఉత్పన్నమగునో అవియెల్ల నశించేనని తెలుసుకొనుము. దీనికితోడు ధనమునకు బంగారుకు

అధిపతియైన గురువుకూడ పాపియైన దినగండము నూరేడులాయు వన్నట్లు జీవనము నడచునని యెరుంగుము—

శ్రీ:- స్వామి నవమము ఉచ్చగల లగ్నములెన్నిగలవందురు

గు:- వత్సా సింహవృశ్చికములకు నవమము ఉచ్చగలమ- సింహలగ్నాధిపతి రవికిమేషము ఉచ్చ రవి నవమముందుండిన పిత్రార్జితము లక్షలాదిగానుండును. రాజయోగము పట్టును. గొప్ప సైన్యాధిపతిగాగాని గొప్పపోలీస్ ఉద్యోగిగాగాని ఉండి దండిగా సం పాదించి ప్రభుత్వమున కీర్తి గౌరవములపొందును తనమంచితనము పరాక్రమము ప్రతిభచాటును. ధనము దండిగానిల్వచేయును పాపగ్ర హవీక్షణగలిగినను పాపులుతోడైనను యోగభంగము సంభవించును.

వృశ్చికమునకు నవమము కటకము పంచమాధిపతియగు గురు వుకుఉచ్చ వృశ్చికమున గురుడుండిన ప్రబలయోగము ఇటు ప్రజా రంగమున అటు ప్రభుత్వరంగమున గొప్పగా యోగించును. విద్య యందు మిగుల ప్రవీణుడై ధనమార్జించును. లక్షలకొలదిధనము, బంగారము నిల్వచేయును. ఒకటననేల సకలసంపదలుకూడును. సర్వ సౌఖ్యము లొనగూడును గౌరవప్రతిష్టలు వద్దనినను వచ్చును. ధర్మ కర్తృత్వములన్నీ తనవేయగును పాపగ్రహవీక్షణగలిగిన యోగభ్ర ష్టుడగును—

శ్రీ:- స్వామి చతుర్ధము ఉచ్చగల లగ్నములెన్నిగలవు.

గు:- వత్సా మిధునమునకుతప్ప మరియేలగ్నమునకు చతు ర్ధోచ్చలేదు-మిధునలగ్నమునకు చతుర్ధము కన్య-కన్యబుధునకు ఉచ్చ మిధునములగ్నమై కన్యలోబుధుడుండిన ప్రబలమైనయోగము సర్వ వస్తుసముదయములుండును. మహామేధావియై కీర్తిగౌరవముల పొం దును. స్వయార్జితముగా దండిగాసంపాదించును. వ్యవహారములందు పెట్టినదిపేరుగా నుండును. ఇదియొక ప్రబలయోగము పాపగ్రహ వీక్షణగలిగిన యోగభ్రష్టత గలుగును—

శ్రీ:- స్వామి దశమము ఉచ్చగల లగ్నములెన్నిగలవు

గు:- గలవు. మేష-మకరములు- మేషలగ్నాధిపతి కుజుడు కుజునకు మకరము ఉచ్చ- మకరలగ్నాధిపతిశని- శనికితుల ఉచ్చ వీరు ఉచ్చయందుండిన ప్రబలయోగము (గురుపాలితులకు కుజుడు శనిపాలితులకు శనిఉండవలయును) సర్వసౌఖ్యములు పొందగలరు. మాతృవిద్య రాజవిద్యవచ్చి ప్రజలతో ప్రభుత్వముతో లాభముగడిం తురు. పేరుప్రతిష్టలు గలుగును-సుఖసంపదలు తమంతటవివచ్చును. స్థిరచరాస్తులు దండిగాకూడును పాపగ్రహావీక్షణ గలిగిన యోగ భంగమగును—

శ్రీ:- స్వామి ఏకాదశమము ఉచ్చస్థితిజెందిన లగ్నముతెన్ని గలవు.

గు:- ఉన్నవిరెండు వృషభకటకములు. వృషభాధిపతిశుక్రు నకు మీనము ఉచ్చ శుక్రుడందుండిన ప్రబలయోగము- కటకాధిప తికి వృషభముచ్చ చంద్రుడందుండిన ప్రబలయోగము విద్యయందు వివేకమందు గౌరవప్రతిష్ఠలందుకొందురు కావలసినంతార్జింతురు. ఆస్తులు దురాదాయముగ లభ్యపడును. క్రొత్తదారుల సృష్టింతురు- కోవిదులనిపించుకొందురు- ప్రజలతో ప్రభుత్వముతో ఆదాయము గడింతురు. సర్వసౌఖ్యముల బడయుదురు—

శ్రీ:- స్వామి ద్వాదశము ఉచ్చగల లగ్నములుగలవా.

గు:- లేకేమి. వృషభ సింహతులలకు ద్వాదశములు ఉచ్చ వృషభమునకురవి సింహమునకు గురువు తులకుబుధుడు ద్వాదశ మందుండిన ప్రబలయోగము ధనార్జన గలిగింతురు. ముక్తిసాధన చేయింతును. దైవభక్తిని చేకూర్తురు. ధనము సద్వ్యయము చేయిం తురు. దీనికితోడు దశానుకూలతగలిగిన అగ్నికితోడు వాయువున్న ట్లుండును- రాబోవుజన్మకు కావలసిన పుణ్యాంగములన్నిటను సంపా దింపచేసి ప్రకృతజన్మకు సర్వసౌఖ్యములచేకూర్చి సుఖింపచేతురు.

శ్రీ - స్వామి పాపగ్రహమైనను ఉచ్చస్థితిజెంవిన సత్ఫల మిచ్చునని కొందరన్నారే నిజమేనందుర.

గు:- పాపులు ఉచ్చలోనుండిన మానవునికష్టములకు మేర యుంచరు సర్వనాశనము చేతురు. సర్వత్రా చెరుతురు-మనశత్రువు కోటీశ్వరుడైన మనకు నిలువనీడుండనిచ్చునా, బ్రతుకనిచ్చునా-అట్లే పాపులు బలవంతులైనను ముఖ్యస్థానము లాక్రమించుకొన్నను వాని జీవితకష్టములా. బ్రహ్మకెరుకౌను గ్రంధకర్తలు మక్కీకిమక్కీ వ్రాసి రేగాని పరిశీలింపరైరి. కటకలగ్నమునకు చతుర్ధమున శని ఉచ్చ స్థితినొందిన మతకర్తలు మహానుభావులు అనేకులున్నారు. వారు సన్యాసముపుచ్చుకొన్నవారు దేశదిమ్మరులైనవారు అపనిందలపా లైనవారు కారాగృహములో పడినవారు స్త్రీలతో పరాభవింపబడిన వారు వంశమేలేని వారున్నారు-పాపులు బలవంతులైన పాడుచేయు దురని యెరుంగుము—

శ్రీ:- స్వామి చతుర్ధస్థానములు శుభస్థానములుగా ఎన్ని లగ్నములు గలవు

గు:- వత్సా మేష వృషభ మిధున సింహతుల ధనుక్కుం భములుఏడిటికి చతుర్ధ శుభత్వముగలదు. ఈలగ్నములలో వృషభ తులలకుతప్ప శేషించిన అయిదులగ్నములకు విష్ణుస్థానము (పది) లేదు. చతుర్ధమే బ్రహ్మవిష్ణుస్థానములయ్యెను ఈలగ్నములకు చతు ర్ధము చెడిన యోగభ్రష్టమగును- కటక కన్య వృశ్చిక మకరమీన ములు అయిదుటికి చతుర్ధములు శత్రుస్థానములై దశమములేబ్రహ్మ విష్ణుస్థానములయ్యెను ఈలగ్నములకు విష్ణుస్థానముచెడిన యోగభం గమగును. చతుర్ధదశమములు రెండు శుభత్వముగలిగిన లగ్నములు వృషభతులలని యెరుంగుము—

చతుర్ధదశమములలో నొకస్థానము మిగిలినను రెండుస్థాన ముల ఫలము గలిగినట్లే భావింపవలయును. దశానుకూలత గలిగిన

సర్వశుభములు బడయగలరని తెలుసుకొనుము

శ్రీ.- శ్లో॥ ద్వాదశాష్టమ జన్మంతు శన్యర్కాంగారకా గురుః
కుర్వంతు ప్రాణసందేహం స్థానభ్రష్టం ధనక్షయం

స్వామి ఈశ్లోకమునకు అర్థమింతేనందుర.

గు:- వత్సా గ్రహసంచారమునకు అతుకులువేసి గోచార మనుపేరిడి దీనినొకభాగగా విడిదీసి ఫలములే వేరుగాచేసిరి. శాస్త్ర మును భాగాలుగవిడగొట్టి నానారంగుల నానాబజీదుచేసిరి-ముసుగు దొంగలుచేసిన కార్యములివి. నాయన- స్థిరగ్రహమున కెంతబల ముండునో అంతబలము గోచారములో గ్రహమునకుండును. స్థిర ములో దుర్బలముగానుండిన గోచారగ్రహమంతే ఫలమిచ్చునని తెలుసుకొనుము —

ఈశ్లోకము అర్థమౌటకు గురుశనిపాలితములు తెలిసియుంశిన చక్కనిదారి తెలిసియుండును- తెలియనందున. పెడదారి యేర్పడి నది అయ్యా- వృషభలగ్నమునకు లగ్నాత్ శనిచేరినాడు ప్రాణభ యము స్థానభ్రష్టత ధనక్షయముగలిగించును. గురువు అష్టమములో నుండుటచే అట్టివిపత్తులే గలిగించునని భయపెట్టిరిగాని వృషభలగ్న మునకు భాగ్యరాజ్యాధిపతిశని ఎందుకుభాధిస్తాడు వేధిస్తాడు-బాధిం చడనిచెప్పరైరి. అట్లుచెప్పుటకు ప్రమాణములేదనియు బాధించునను టకు ప్రమాణముగలదనియు తలంచిరేగాని శోధింపరైరి. మారిముం దరమక్కితెగులా అన్నట్లు పెద్దవారిమాటలకు అడ్డుమాటలాఅని తలంచి అన్నిలగ్నముల కట్లేచెప్పి జ్యోతిని ఆర్పిరి. వారు శుభు నిగా గుర్తించిన గురువునే గోచారములో పాపిగామార్చిరి. వారు మార్చినట్లెల్లా శాస్త్రము మారెను. వత్సా గురుశనులు హరిహ రాంశజులుగాన గురుశనులు గోచారమునకు ముఖ్యులు శని 30 నెలలు, గురువు 12 మాసములుందురు. ఒకొ్కక్కగృహమున- వీరి బాధలే ప్రపంచమున కెక్కువగానుండును. వీరినే పరిసీలింతము.

గురుపాలితులగు మీనమేష కటకసింహ వృశ్చికధనస్సు లారులగ్నములకు గురువు ద్వాదశాష్టమజన్మలకు వచ్చినప్పుడు జరుగుఫలము ఎట్లుండును- చూడు గురువు ద్వాదశమునకువచ్చి చతుర్థషష్టాష్టములచూచినఫలము—

శత్రురోగ ఋణవిపత్తుల తొలగించును. దుర్వ్యయ దుర్వినియోగ దురుపయోగముల సద్వ్యయ సద్వినియోగ సదుపయోగములుగామార్చును- దైవచింతన గలిగించును. దైవారాధన, దేవతార్చన చేయించును. సద్గోష్టిలో చేర్చును. సంఘబలము గలిగించును-బంధుమిత్రులకలయికచేయించును-భూమిని గృహములమరమ్మత్తు చేయించును. కట్టించును. గృహోపకరణముల వస్త్రభూషణముల కొనుగోలు చేయించును. బావులు, వనములు పశువులు, ధనధాన్యములు అభివృద్ధి గలిగించును. ఆయురారోగ్యముల నొసంగును. సురతసుఖమొసంగును. వీర్యపుష్టి దేహపుష్టినిచ్చును. గొప్పవారిస్నేహము గలిగించును. దూరప్రయాణములచేయించి ఆనందమొసగును—

గురువు అష్టమమున ప్రవేశించి ద్వాదశ ద్వితీయ చతుర్థముల చూచినఫలము—ఆయురారోగ్యభాగ్యములు దేహపుష్టి ముష్టినొసంగును విపత్తులు తొలగించును-ముక్తిసాధన చేయించును-దైవభక్తి నొసంగును. అకాలమృత్యుభయము నివారించును. కుటుంబసుఖమునొసగును-పలుకుబడి గలిగించును-దాసదాసీజనాభివృద్ధి గలిగించును. ద్వాదశమున గలిగించిన శుభఫలము లనేకమొసగును—

గురువు లగ్నమున ప్రవేశించి పంచమ సప్తమ నవమముల చూచినఫలము—

దేహసౌఖ్యము ఆహారవిహార వ్యవహారసుఖము నొసగును. కళత్రానందము సంసారసుఖము గల్పించును-విద్యాభివృద్ధి గ్రామాధికారము గౌరవప్రతిష్టలు పుత్రానందము నొసంగును విందుభోజనములు మధురాహారములు నొసంగును- వివాహాద శుభకార్యముల

చేయించును-తీర్థయాత్రాది ఫలమొసంగును- పుణ్యనదీ స్నానముల చేయించును-దైవభక్తి గలిగించును- ధనము నిల్వచేయించును-దేవతా దర్శనముల చేయించును- దానధర్మముల చేయించి ధర్మమార్గమున నడిపించును-కావ్యరచనసాగించును-ఇట్టి శుభము లనేకము చేయించునుగాని అశుభముల గల్పింపడు-వృషభమిధున కన్యతులమకరకుంభములారిటకు శత్రువుగాబట్టిదుష్ఫలము లొసగును. ప్రాణభయము స్థానభ్రష్టత ధనక్షయముగాక అనేక చిక్కులకు లోనుచేయును-అకాల నిద్ర అకాలభోజనము అకాలప్రయాణములతో శత్రురోగ ఋణ విపత్తులతో జీవితము నలి చేయునని విపరీత ఫలమొసగునని యెరుంగుము-

శని మకరకుంభ వృషభమిధున కన్యతులారాసులారిటకు ద్వాదశాష్టమజన్మములలో ప్రవేసించిన ఫలము—

శని లగ్నద్వాదశమున ప్రవేసించి ద్వితీయషష్ట నవమములచూచిన ఫలము— కుటుంబసౌఖ్యము మాటపలుకుబడి ధనచలామణీ నొసంగును. శత్రువుల చంపును, రోగబాధ ఋణబాధ తొలగించును. అయురారోగ్య భాగ్యములవృద్ధిచేయును- విపత్తులనుండి ఉద్ధరించును. ధనము దుర్వ్యయముగానీక పోషించి నిల్వచేయించును- వివాహములలో పాల్గొనచేయును, శుభకార్యముల చేయించును-అన్యస్త్రీ సౌఖ్యమొసంగి లాభము గడింపచేయును-దైవచింతన గలిగించును-తీర్థయాత్రా ప్రయాణముల చేయించును-లాభముగా మార్పించును. నీచకార్యములవల్ల ధనార్జనచేయించును. జీవనోపాదుల గట్టిచేయించును. గౌరవసేవకునిగాచేసి సిరిని స్త్రీల చేజిక్కించును-ఏన్నో శుభముల ఎంతోలాభము చేకూర్చునని యెరుంగుము— శని అష్టమప్రవేశమై దశమ ద్వితీయ పంచమముల చూచిన సత్ఫలము- కీర్తి గౌరవముల చేకూర్చును, గృహోపకరణముల భూమిని పశుసంపద మొదలగువాటిని కొనిపెట్టును వృత్తి ఉద్యోగ వ్యాపార గౌరవప్రతిష్టల పెంపొందింపచేయును. నీచమైన వాటితో ఆర్జన చేయించును. సిరిని స్త్రీని చేజిక్కించును ఆయువు

హెచ్చించును. ఆరోగ్యము గలిగించును- పుష్టిని ముష్టిని గలుగచే యును. గ్రామాధికారము పలువిధములగు పలుకుబడి గలిగించును. విధవలతో లాభము గడింపచేయును-సాధుసన్యాసులతో స్నేహము గల్పించును. గౌరవదాస్యముతో లాభము గడింపచేయును బుద్ధిబల ముగడించును. పుత్రానందము చేకూర్చును. ధనకనక వస్తువాహన బలమొనగునని యెరుంగుము—

శని అగ్నాత్ ప్రవేసించి తృతీయ సప్తమ దశమముల చూచిన ఫలము— దేహారోగ్యము దేహసుఖము గలిగించును సం సారాభివృద్ధి చేయించును భార్యాభర్తల అన్యోన్యత పెంచును. మత్తుపదార్థములతో ఆనందము గల్పించును. పరస్త్రీ సంగమసౌ ఖ్యము ఆదాయము గలిగించుచు- దాసీజనుల పొందు గలిగిం చును గౌరవవాస్యముతో లాభము గడింపచేయును. భూమి గృహ ములు మొదలగువస్తువుల కొనుగోలు చేయించును- వృత్తిఉద్యోగ వ్యాపారాభివృద్ధి చేయించును జీవనోపాదుల గట్టిచేయును. ఇట్టిశుభ ములనేకము చేయించునుగాని నశింపుచేయడు.

మీనమేష కటకసింహ వృశ్చికధనస్సులారిటకు మృత్యువై బాధించును. ప్రాణసందేహము స్థానభ్రష్టము ధనక్షయముగాదు. ప్రాణములనే తీయును కారాగారములకు పంపును. చంపును చం పించును. అనేకగండముల అవమానముల చేయించును. స్త్రీలతో దానదాసీజనులతో త్రాగుబోతులతో పరాభవముల గల్పించును. పాపముల చేయించును. తలమాసి వలుమాసి వలువలు మాసినద నుక విడువదని యెరుంగుము- ద్వాదశాష్టమ జన్మములకన్న శని ఆరింటను గురువు లగ్నమున దిగ్బలాధిపతులుగాబట్టి సర్వనాశనము చేతురు. వారివారి గృహములకు సౌఖ్యము చేకూర్తురు గ్రహములు తాముండు గృహకారకత్వములబట్టి సత్ఫల దుష్ఫలముల గల్పిం తురు. గమనించవలయును. ఇదియునుగాక నవగ్రహములు ద్వాదశ

రాసులలో సంచరించునపుడు ఇచ్చెడి గోచారఫలములు పంచాంగములలో చూచిభయపడువారుకలరు- పంచాంగకర్తలు ప్రమాణగ్రంథముల చూచియేకద వ్రాసియుందురు- ప్రమాణగ్రంథములట్లున్నప్పుడు వారేమిచేయగలరు- మక్కికిమక్కి పుట్టినది- వత్సా లగ్నము పేరులేక గ్రహము పేరుచెప్పుట ప్రమాదమని భావించనందున కల్పితశుభాశుభుల ద్రిష్టిదోషము అన్నిటకుతగిలి శాస్త్రము వ్యాదిగ్రస్తమైనదని తెలియుచున్నది. ఉదా:- గురువు చతుర్ధమునకువచ్చిన నాశనమనియు పదింటికివచ్చిన హానియనియున్నది. గురుపాలితలగ్నములకు గురువు చతుర్ధమునకువచ్చిన చతుర్ముఖుడే శారదాసమేతుడై బంధురూపముగా తనఇంటికి వచ్చినట్లుండును. పదింటికివచ్చిన లక్ష్మీసమేతుడై మహావిష్ణువు ఆప్తబంధువుగా తన ఇంటికి వచ్చినట్లుండును అనేకశుభములు గలుగును. శనిపాలిత లగ్నములకుమాత్రము సర్వనాశనము చేయుటయేగాక కర్మచేయివలసివచ్చును- బలుకష్టముల పాలుచేయును-నాలుగవఇంటికి శనివచ్చిన కుక్షిరోగము పదింటజాడ్యమట- శనిపాలితలగ్నములకు చతుర్దశమములకు శనివచ్చిన గౌరీశంకరులు ఆప్తబంధువులై తనఇంటికి వచ్చినట్లుండును. అంతటి సౌఖ్యము లనుభవింతురు- గురుపాలితులకు మహాపదలు కల్పించును కర్మసేయుట. శవములమోయుట. బ్రాహ్మణార్ధముల భుజించుట. తద్దినములలో పాల్గొనుట మొదలగుకర్మలుతప్పవు-ఇట్లే లగ్నములబట్టి మారుచుండునుగాని పీరువ్రాసినట్లు జరుగవని యెరుంగుము- ఈశ్లోకము ప్రజల గగ్గోలు పెట్టుచున్నది.

శ్రీ:- స్వామి- పేరుతో బలాబలముల శుభాశుభముల తెలుపుటకు చూచేచోల అశ్వనిఅన్న వ్యూహమొకటిపన్ని పేరు మొదటక్షరము ఎక్కడున్నదో దానికి నక్షత్రమేదో దానికి రాసియేదో తెలుసుకొనిఆరాసికి గురుశను లెచ్చటుండిరో గమనించి పైశ్లోకమును జతచేయుచున్నారు. ఈవ్యూహము మానవునికి ఉపకరించునందురా.

పృచ్ఛకులడుగు ప్రశ్నలకు ప్రత్యుత్తరమిచ్చుటకు వీలుగలుగునందుర.

గు:- నాయనా ఒకమానవుని జీవితములోగల కష్టసుఖముల గమనించి చెప్పుట అంతసులభముగాలేదు. ఎంతో కష్టముగానున్నది. శాస్త్రమింతో అంతో కష్టపడి చదివియుండిన ఇంతో అంతో సుంత చెప్పగలుగునుగాని ఈవ్యూహములతో సృష్టనలతోకాదు- చూడు వే యను ప్రథమాక్షరముగల వారెందలోగలరు వేమయ్య, వేమన్న వెంకటరెడ్డి, వెంకటేసు, వెంకన్న, వేదగిరి, వెంకటప్ప, అన్నవా రందరకు వేవోకాకి మృగశిరవచ్చును- మృగశిరార్ధం వృషభమగును ప్రకృతము వృషభలగ్నమునశని అష్టమమునగురువు ఉన్నారు. అం దరికి కష్టములు ప్రాణభయము చెప్పిన ఒకరు ఉద్యోగిగా నుందురు. మరొకడు నిరుద్యోగిగానుండును. ఒకడు ధనికుడుగా మరొకడు నిర్ధని కుడుగా నుండును-ఇట్లే అందరన్నివిధముల జీవించుచుందురు. ఎట్లు చెప్పనగును. చెప్పివప్పించనగును- ఏద్రోణాచార్యులో ఈపద్మవ్యూ హముపన్నినాడు- దారితెలుసుకొనలేక అందరు దాసోహమన్నారు. దీనిని తునాతునియలుచేసి దారినివిడగొట్టు మహాబలుడులేక శాస్త్రము మరుగైనది-ఇదిసంపూర్ణముగ కృత్రిమవ్యూహమని గ్రహించుకొనుము

శ్రీ:- స్వామి కందాయఫలములని రాజపూజ్యావమానములని ఆదాయవ్యయములని పంచాంగమున వ్రాయుచున్నారు. దీనికికూడ చూచేచోలయే కావలయును. ఇదిలేక ఏదీనడువదు. దీని నేమందురు.

గు:- నాయనా-అది పద్మవ్యూహము. ఇది గరుడవ్యూహము మానవుల సంతృప్తులచేయ ఎన్నోమార్గముల సృష్టించిరిగాని అడి గెడివారికి సదుత్తరమునిచ్చు త్రోవమాత్రమరయరైరి. ఇది అపోహ మని ప్రజలు తలంచిరేగాని ఇదికాదిదియను నాయకుల గానరైరి. గానకున్నను విడువరైరి. అంతేగాని దీనశుభములేదు-శాస్త్రముఇంకా అధోగతి పాలగుటయేనని యెరుంగుము.

శ్రీ:- అయిన దీనికి మార్గము లేదందురా స్వామి.

గు:- లేకేమి నాయనా పృచ్ఛకుడువచ్చి స్వామి ఈసంవత్స

రము నాపేరబలాబలము లెట్లుండునని అడిగిన టయమునుబట్టి గ్రహకుండలివేసుకొని ప్రకృత నక్షత్రదశనుండి పృచ్ఛకుని వయసు వరకు దశలువేసుకొని లగ్నము గురుపాలితమో శనిపాలితమో నెరింగి చెప్పవలయును. ఆసంవత్సరమున గలుగు వివాహాది శుభకార్యములు తీర్థయాత్రలు పాడిపంట పశువృద్ధి తకరార్లు లాభనష్టములు సంసారపరిస్థితులు పుత్రపుత్రికాదులతో కష్టసుఖములు. భూమి బంగారు గృహోపకరణములు గృహములు పశువులుకొనుట కట్టుట మొదలగునవిచెప్పి- ఆప్రశ్నలగ్నమును జాతకముగా అట్లనే పెట్టుకొమ్మనిచెప్పి ప్రతిసంవత్సరము ఆలగ్నమునుబట్టి గురుశనులమార్పు ననుసరించి చెప్పుచూవచ్చిన నూటికి 90 భా.గలు జోస్యము ఫలించును. గాని నామనక్షత్రముద్వారా చెప్పిన జోతిష్యము పూర్తి నశించును—

శ్రీ:- స్వామి ఈప్రశ్నలగ్నమును జన్మలగ్నమునకు చెప్పినట్లే చెప్పవలయునా లేక వేరేమార్గమున్నదందుర.

గు:- నాయనా జన్మలగ్నము వివాహాదిలగ్నములు తత్కాలిక ప్రశ్నలగ్నము త్రివిధలగ్నములు ఒకత్రాటిపైననే నడచును. దైవజ్ఞుని తెలివితేటలుపయోగించిన సర్వలగ్నములకు ఒకేశాస్త్రము గాని ఒక్కొకక్కదానికి ఒక్కొకక్క శాస్త్రములేదు తల తోక తెలియక అన్నివిషయములకు గురుని శుభునిగాగుర్తించి గోచారములో ద్వాదశాష్టమ జన్మలగ్నములలో పాపిగా నూహించుట, చెప్పుటచూడ విన్నన్న చెప్పినదే వేదమన్నట్లున్నది. లగ్నమునుండి పాపత్వ శుభత్వములు గలిగెనని అన్నిటకు శాస్త్రమొకే దారియని యెరుంగుము-

శ్రీ:- పృచ్ఛకుడడిగిన టయమునకు లగ్నము వేసుకొనవలయుననిన ఎట్లో సూక్ష్మముగా తెలుపుడు.

గు:- వత్సా ఈదినము పరీధావి నామసంవత్సర శ్రావణ శుద్ధ 12 లు సోమవారము తేది. 21-8-1972 ఉదయము 9 గంటలు

అనుకొందము.

నిత్యకృత్యముగా సూర్యోదయము ఎన్నిగంటలకు ఈప్రదేశమునకు ఆగుచున్నదో పంచాంగమున తెలుసుకొని పృచ్ఛకుడు అడిగినటయములో తీసివేయవలయును— అనగా 9 గంటలకు అడిగినాడనుకొందము— సూర్యోదయము 6 గంటలు- 9 గంటల కాలములో సూర్యోదయము 6 గంటలు తీసివేసిన 3 గంటలు వచ్చును- సూర్యోదయమై మూడుగంటలయినట్లు- గంటకాలమునకు రెండున్నర గడియలకాలము ప్రకారము మూడుగంటలకు 7-30 విగడియలగును- అడిగినకాలము 7 30 విగడియలలో నున్నది, ఆదినము సూర్యుడేరాసిలో నుండునో అది ఉదయలగ్నము అది సింహము, సింహప్రమాణము. పంచాంగరీత్యా 5.18 విగడియలు. దానిలో ఆ దినమునకు భుక్తి (గడచినది) 49 విగడియలు. 5-18 సింహప్రమాణములో 49 విగడియలుపోగా సింహశేషము 4.29 శేషముగదా. అడిగిన టయమునకు 7-30 విగడియలకాలము. అందులో 4-29 విగడియలు పోగా 3-1 విగడియ కన్యలో గడచినది. అప్పుడు కన్యాలగ్నమైనదని యెరుంగవలెను.

| | |
|---|---|
| సింహం | 5-18 |
| భుక్తి | 0-49 |
| | 4-29 |
| | 7-30 |
| | 4-29 |
| | 3-01 |

ఆదినము గ్రహచార ఇట్లున్నది.

మఖ2-రవి, పూషా3-చంద్ర. మఖ4-కుజ, ఆశ్లేష1-వక్రబుధ, మూల2-గురు, ఆరుద్ర4-శుక్ర, మృగశిర1-శని, ఉషా2-రాహు, పునర్వసు4-కేతు, ఇట్లు ఈనక్షత్రములందు ఈపాదములలో గ్రహములుండెను. చంద్రుడు పూర్వాషాఢ ఎన్నోపాదమున నుండెనో నక్షత్రప్రమాణ మెంతో తెలుసుకొనవలయునుగదా- ముందుదినము మూలనక్షత్రము 33-40 విగడియలున్నవి. (దినప్రమాణమును) ప్రతి నక్షత్రమునకు బుక్షాద్యంతము 60 గడియలని తలంచవలయును.

60
33-40
26-20

26-20
37-17
63-37

26-20
7-30
33-50

63-37
33-50
29-47

33-50
31-48
2-02

60 గడియలలో మూల 33-40 విగడియలు తీసివేయగ 26-20 విగడియలు పూర్వాషాఢ వచ్చినది. ఈ దినము పూర్వాషాఢ 37-17 ఉన్నది ముందుదినము 26-20. ఈదినము 37-17 కలుపగా 63-37 విగడియలు పూర్వాషాడ ప్రయాణమైనది. దీనిలో భుక్తి ముందుదినము 26-20 ఈదినము గడచినది 7-30 కలుపగా 33-50 పూర్వాషాడ గడచినది-ప్రమాణము 63-37 గడియలలో గడచిన 33-50 తీసివేయగ 29-47 విగడియలు మిగిలినది- పూర్వాషాడ ప్రమాణము నాలుగుభాగలు చేయగ ఒక్కొక్కబాగమునకు 15-54 విగడియలువచ్చును 33-50 విగడియలు గడచిన దానిలో రెండవపాదము దాటి మూడవపాదములో 2-2 విగడియలు గడచినది. గాబట్టి పూర్వాషాడ మూడవపాదమని వేయవలయును. అప్పటికి గ్రహచార 9 గ్రహములకు సరిపోయినది. ఇక-కుండలి వేసుకొనవలయును.

| | | | |
|---|---|---|---|
| | | శ | శు |
| | | | కేబు |
| రా | | | రకు |
| చ గు | | | |

మఖ-2 లో సూర్యుడుండెను- మఖ పుబ్బ ఉత్తరాపాదం. సింహమని యున్నదిగదా సింహములో సూర్యుని వేయవలయును— పూర్వాషాఢ 3 లో చంద్రుడుండెను-మూల పూర్వాషాఢ ఉత్తరాషాఢ ప్పాదం- ధనస్సు ధనస్సులో చంద్రుని వేయవలయును— మఖ 4 లో కుజుడుండెను- మఖ పుబ్బ ఉత్తరాప్పాదమనిగదా. కుజుని సింహములో వేయవలయును- ఆశ్లేష 1 లో బుధుడుండెను. పునర్వసుపాదం పుష్యమి

అశ్లేషాంతం కటకమనిగదా ఉన్నది బుధునికటకములో వేయవలయును. మూల 2 లో గురుడుండెను- మూల పూర్వాషాఢ ఉత్తరాషాఢపాదం ధనస్సనిగదా. గురువును ధనస్సులో వేయవలయును- ఆరుద్ర 4 లో శుక్రుడుండెను. మృగశిరార్ధం ఆరుద్ర పునర్వసు త్రయోర్మిధునం అనిగదా శుక్రుని మిధునములో వేయవలయును- మృగశిర 1 లో శని యుండెను- కృత్తికా త్రిపాదము రోహిణి మృగశిరార్ధం వృషభమనిగదా శనిని వృషభములో వేయవలయును ఉత్తరాషాఢ 2 లో రాహువుండెను ఉత్తరాషాఢ త్రిపాదము శ్రవణ ధనిష్ఠార్ధం మకరమనిగదా మకరములో రాహువును వేయవలయును- పునర్వసు 4 లో కేతువుండెను. పునర్వసుపాదం పుష్యమి అశ్లేషాంతం కటకమనిగద. కటకములో కేతువును వేయవలయును- అప్పటికి నవగ్రహములు లగ్నములలో చేరినవి-లగ్నము కన్య అయినది గాన దీనితో ఫలాఫలముల సాధింపవలయును. ఈగ్రహకోటి పై శ్లోకమునకు అందలేదు గాబట్టి బాగున్నదని చెప్పరాదు. జాతక ఫలమువలె పరిశీలించి చెప్పవలయును- గురువు ధనస్సుకు ఎప్పుడు వచ్చెను-మకరమునకు ఎప్పుడుపోవును-శని వృషభమునకు ఎప్పుడు వచ్చెను మిధునమునకు ఎప్పుడుపోవును. చక్కగా తెలుసుకొనవలయును. దీర్ఘకాల ముండునవి పాలితగ్రహములుగా నుండునవి గురుశనులేగాబట్టి గురుబలమెట్లున్నది శనిబలమెట్లున్నదని ప్రజలు అడుగుదురు- నాయనా-శాస్త్రము నీవు చక్కగాచదివియుండిన ప్రశ్నకు చక్కని సదుత్తరమియ్యగలవు. అనుభవము సంపాదింప గలవు- చక్కగాచదివి చదివినదానిని అర్ధముచేసుకొని అర్థము చేసుకొన్న దానిని ఆచరణలో పెట్టవలయును—

శ్రీ:- స్వామి బాలారిష్టములని ఒకశ్లోకములో అతి సులభోపాయముగచెప్పి జననములో ఇట్లుండిన మరణమన్నారే. దీని అర్థమింతేనందుర. ఇది నిజమేనందుర—

శ్లో॥ చంద్రాష్టమంచ ధరణీసుత సప్తమంచ
రాహుర్నవంచ శనిజన్మ గురుస్తృతీయే
అర్కస్తుపంచ భృగుషట్క బుధశ్చతుర్థే
కేతువ్యయస్తు జనితో మరణాయ సద్యః.
అని శాసించినారు నిజమేనందురు.

గు:- వత్సా అష్టమము ఆయు స్థానమని చెప్పిరిగదా- శ్లోకరీత్యా ఈగ్రహములు ఆయుస్థానమును ఒకరుకూడ చూడరు- చూడకనే ఎట్లు చంపగలరనవలయును-గ్రహము ఎట్టి స్థానముననుండి ఎట్టి స్థానమునుచూచునో అవిమాత్రము అశుభగ్రహమైన నాశనము చేయును- శుభగ్రహమైన పోషించును- శుభాశుభులు వీరిలో చేరన వలయునా- వీరు గల్పించిన వ్యూహములలో ఇది ఒకవ్యూహమన వలయునేగాని వేరొండుగాదు. అష్టమమునుచూడక ఉండక ఏగ్రహము చంపలేదు. స్థానమునుబట్టి కొన్నిచిక్కులు గల్పింతురేగాని చంపుటకు అధికారములేదు-వీరు కొన్నిఅనుభవరీత్యా గమనించి వ్రాసిరేగాని శాస్త్రరీత్యాకాదని గమనించుము- నాయనా- బాలారిష్టములు వీరు చెప్పినవి అన్వయించవు. చక్కని మార్గముకాదు ఏమందువా. ఏగ్రహము ఏవ్యాధిని పుట్టించును. బాల్యకాలమును పోషించు గ్రహమేది- ఏఏఅవయవములందు పాపగ్రహములున్నవి-దేహములో నవగ్రహములకు ఎచ్చటెచ్చట స్థానమున్నది. ఏఏదశలు వచ్చును- ఈలాంటివిషయములు శాస్త్రకారునికి తెలిసియుండిన బాలారిష్టములింతతేలికగా వ్రాయడు- లగ్నవిభజనముందే తెలియనందున శుభాశుభుల గమనించనందువల్ల తనయిష్టమొచ్చినట్లు వ్రాసినారని యెటుంగుము—

శ్రీ:- స్వామి అట్లయిన దీనికి చక్కని అర్థములేదందురు.

గు:- లేకేమి ఉన్నది. చంద్రాష్టమంచ అన్నారుగదా. అష్టమమున చంద్రుడుండి నూరేడులు బ్రతికెడులగ్నములు- మీనమేష

కటకతుల వృశ్చికములు- ఈఅయిదులగ్నములలో చంద్రుడు అష్ట
మమున నుండుట వానిపూర్వజన్మ సుకృతఫలమనవలయును- ఆయు
రారోగ్యభాగ్యము లిచ్చుటయేగాక పుష్టిబలము ముష్టిబలము జీవి
తాంతమిచ్చును- మహారూపవతుల సంగమసౌఖ్య మొసగును-
నూర్లకొలది స్త్రీలతో ఆనందమిప్పించును. వాక్పటుత్వము కుటుంబ
సుఖము సర్వదానొసగును ముఖాలంకారము చిర్వునవ్వు అద్భుత
ముగ నుండును. ఈలగ్నములకు లగ్నపంచమ భాగ్యస్థానాధిపతి
గాబట్టి సర్వదా పోషించునని యెరుంగుము- శేషించిన లగ్నములు
వృషభమిధున సింహకన్య ధనుర్ మకరకుంభములు ఏడిటకు కాల
యముడై భాధించును- బాల్యపోషకకారకుడు చంద్రుడుగాన బాల్య
కాలమంతయు చిద్రములతో చిక్కులతోనడచును పడిశము బేదులు
నిరంతరము గలిగించును- దగ్గును ముక్కులందు పక్కుల జబ్బును
సృష్టించును శిరస్సులో సుండు కురుపులు శిరోభాధ ముక్కులదిమ్మ
చెవులలోచీము నాలుకమందము నాలుకపొక్కుట స్వరభేదము
జొల్లుకారుట గలిగించును. ఉదరదేహము చెవుడు నీటిగండము
నొసంగును. తల్లిపాలు లేకుండచేయును-ఇట్టిజబ్బు లనేకముగలిగించి
పీల్చి పిప్పిచేసి తనదశాభుక్తులందు కాజేయును- లగ్నాత్ లగ్నసప్త
మమున శుభగ్రహములుండిన ఎన్నివచ్చినను చక్రివలె కాపాడును-
గాన బాలారిష్టములన్నంతనే శుభాశుభాల నెరుగక ఫలాఫలముల
చెప్పరాదు-

ధరణీసుత సప్తమంచ అన్నారు. నాయనా గురుపాలితలగ్న
ములగు మీనమేష కటకసింహ వృశ్చికధనస్సులకు కుజుడు సప్తమ
మందుండుట మహాసుకృతము. దేహము చెడనిదై జీవితాంతము కళ
త్రానందము నిచ్చును. శతాయుర్దాయము నొసంగును. యౌవనకాలా
ధిపతి గాబట్టి యౌవనకాలమునకు తగినబలము బుద్ధిబలము ప్రసా
దించి సుఖింపచేయును— అత్తగారింట ఆస్తి లభింపచేయును-

పరాక్రమశాలియై ప్రజలలో కీర్తి గౌరవములపొందును- జీవనములో ఏలోటులేక జీవించును- ఆర్జితము దినదినాభివృద్ధిగా నుండును- ఆహారవిహార వ్యవహారములలో ఏలోటులేకుండ సుఖించును-విందు భోజనములు లభింపచేయును మిత్రబలము పెంచును. కుటుంబసౌఖ్యము ప్రజలలో పలుకుబడి ఎక్కువగా నుండును. జరకు లోపడని దేహమై సుఖించును—

శనిపాలితలగ్నములగు మకరకుంభ వృషభమిధున కన్యతులలారిటకు దండధరుడై బాధించును- ఉష్ణదేహమై నరములబలము తగ్గించును-మూత్రమధికముచేసి దేహము శుష్కింపచేయును. ఊసఎముకల ప్రమాణము తగ్గించి పొట్టిచేయును- రక్తము జాలిపోవునట్లు చేయును. గుండెను బలహీనముచేయును మేహాగ్రంధుల కురుపుల చర్మవ్యాధుల రక్తభేదులపుట్టించును-స్ఫోటకబాధ గలిగించును అగ్రస్థానములనుండి పడద్రోయును. కుక్కలతో కరిపించును, ఎద్దులతో పొడిపించును. ఊసఎముకల విరిపించును వృత్తి ఉద్యోగ వ్యాపారగౌరవముల తొలగించును. కలహముల పెంచి పరాభవముల గలిగించును. పట్టుదల మూర్ఖము పెంచును. మాతృపితృ గురుదేవ బ్రాహ్మణ వయోవృద్ధ సాధుసజ్జన దూషణల పాలుచేయును-సోదర సోదరీ కలహముల పెంచును. క్రూరకార్యము లనేకము చేయించి పాపభూయిష్ఠునిచేయును. కుష్ఠురోగిగా కురూపునిగాచేయును కాళ్ళు లేకుండ చేయును వీర్యగ్రంధుల నశింపుచేసి నిర్వీర్యునిగా చేయును. దశాభుక్తులలో ఈజబ్బులు ఎక్కువచేయునేగాని మృత్యుప్రదము గాదు. ద్వితీయాష్టమములలో శుభులున్న దీర్ఘాయువు గలుగును—

రాహుర్నవంచ అన్నారు— శనిపాలితలగ్నములకు రాహువు నవమములో బలవంతుడు. తన దశాభక్తులందు ధనము నిల్వచేయించును. చోరధనము సంప్రాప్తింపచేయును-నీచులతోలాభము గడించి యిచ్చును. సేవకావృత్తితో తీర్థయాత్రాఫలము నొసంగును-తానున్న

గ్రహస్థానమునుబట్టి సర్వవిధముల మేలుచేయును. కేతుదశపోయిన రాహువైన మరింతసుఖము గలిగించునుగాని చంపడు- గురులగ్నములకైన నిల్వధనము చెరచును. చోరులతో ధనాపహరణ చేయించును నీచులతో నష్టము గలిగించును. శుభకార్యములలో భూషణాంబరముల అపహరణ జరిపించును- యాత్రాస్థలములలో చోరులతో ధనాపహరణ చేయించును తానున్న గ్రహస్థానమునుబట్టి కీడుచేయునుగాని చంపగలడనుట శాస్త్రవిరుద్ధము—

శనిజన్మమన్నారు-స్వపాలితలగ్నములకు లగ్నమున తానుండుట ఈశ్వరుడు దేహమున ఉన్నట్లేయగునుగాని వేరొండుగాదు- శతాయుర్దాయుడై శక్తివంతమైన కాయమై ప్రకాసించును. ఆహార విహారవ్యవహారములందు ఏలోటులేకుండును అనురాగవతి అపురూపవత ఇల్లాలుండును-విధవలతో సాధుసన్యాసులతో సన్యాసినీలతో దాసీజనులతో లాభమిప్పించును-సోదరీసోదరులతో శ్వశృగృహము వారితో ఆదాయము గలిగించును. వృత్తి ఉద్యోగ వ్యాపార గౌరవ ప్రతిష్ఠలపెంచును. గ్రామాధికారము గలుగును—నిరోగిగా జీవింపచేయును. పరాన్నములకు విందులకు బ్రాహ్మణార్ధములకు అపరకర్మలకు పాలెగానిగా చేయును వలలవృత్తిలో (వంట) ప్రవీణునిగా చేసి లాభము గడింపచేయును. దేహసౌఖ్యము జీవితాంతము నొసంగును. గాని చంపడు బాలారిష్టములు చెంతకు రానివ్వడు—

గురుపాలితలగ్నములకు మృత్యువై వేధించును. కామిలా జబ్బు జీర్ణకోశములోఅలజడి అపానవాయువులు అకాలనిద్ర అకాల భోజనము అకాలప్రయాణములు అకాలవివాహము గలిగించి దేహము శుష్కింపచేయును. విధురునిగా చేయును అష్టదారిద్ర్యములకు లోనుచేయును. సన్యాస సన్యాసినీ దాసదాసీజనులతో విధవలతో మోసము చేయించును. సన్యాసము పుచ్చుకొనుబుద్ధిని పుట్టించును. స్త్రీలతో పరాభవింపచేయును. పాండువ్యాధిగ్రస్తుని చేయును.

పాపాంభైరవులిగా తయారుచేయును. నీచజీవనము చేయించును. మలినవస్త్రధారిగా చేయును తలమాసినదనుక విడువడు జీర్ణవస్త్ర ముల ధరింపచేయును. మలలు, ఏనుగకాలు, నూతీలు గుల్మము భగందరము మొదలగు వ్యాధులతో బాధించునుగాని చంపలేడు - ద్వితీయ అష్టమములలో శుభగ్రహములున్న ఇట్టి బాధలతోనే దీర్ఘ కాలము జీవించునని యెరుంగుము—

గురుతృతీయే - తృతీయము నిర్ధనస్థానము గాబట్టి గురువు స్వపాలితలగ్నములకు గొప్పమేలు చేయలేకపోయినను క్లుప్తముగా నీచముగా మేలేచేయును - కీడుచేయడు - శనిపాలితలగ్నములకు తృతీయమున గురుడుండిన సోదరీసోదరకలహము వారితో ధనవ్య యము చేయించును - అకాలనిద్ర అకాలభోజనము అకాలప్రయాణ ములు మాతృపితృ గురుదేవ బ్రాహ్మణ వయోవృద్ధ దూషణలు సం ప్రాప్తింపచేసి ఉష్ణవ్యాధులపుట్టించి దేహము శుష్కింపచేయును ఆ యాసము వీర్యనష్టము ఉబ్బస మోకాళ్లనొప్పులు గలిగించును - రొమ్మునొప్పితో రొమ్ము పైకండరముల నశింపచేయును - పిత్రార్జి తము స్వాహాచేయించును స్వయార్జితనిల్వను చెరచును. శుభకార్య ములలో అనేకచిక్కుల గలిగించును - తీర్థయాత్రల నశింపచేయును - దైవచింతన మరపించును, సంసారములో అమితఖర్చులు, నిరం తర కలహములు గల్పించును - విధురునిచేయును. కళత్రము కోపిష్టి గానో రోగిష్టిగానోచేసి దుఃఖముల పాలుచేయును - గౌరవమర్యాద లను దూరముచేసి లోభిగా నీచునిగా పరాన్నజీవిగా తయారుచే యును - వృద్ధాప్యమున అనేకచిక్కులకు లోనుచేయును - గాని చంప లేడని తెలుసుకొనుము—

అర్కస్తుపంచ - అన్నారు. గురుపాలితలగ్నములకు పంచమ మున సూర్యుడుండ జన్మింపవలయునన్న పూర్వజన్మ సుకృతము బండెడుండవలయును - అట్లుండినవారు మహామేధావులగుదురు -

రాజవిద్యకు మాతృవిద్యకు లోటుండదు గ్రామాధికార గౌరవము లుండును ఉన్నతోద్యోగియై ఉన్నతస్థానము లాక్రమించుకొనును- రాజపూజ్యత గలుగును-విదేశప్రయాణములు చేయును-సమయస్ఫూర్తి జ్ఞానము మితిమీరి యుండును లాభము దురాదాయము తానంత టవి వద్దనినను వచ్చిపడును-ధర్మకార్యములు అనేకము చేయును ధర్మ హృదయుడను పేరుగడించును. అధర్మమార్గముల రూపుమాపి ధర్మ మార్గముల సృష్టించును. ధర్మసంస్థాపనముల చేయును. శాశ్వతమైన కీర్తిని గడించును. తన ఊహకందని దొకటుండదు సఫలీకృతమై తీరును. కావ్యరచనలో పేరు గడించును- దయాళుడై ప్రజల పోషించును. ఇట్టివి అనేకము చేయునుగాని చంపడు. చంపుటనుట శాస్త్రవిరుద్ధము —

శనిపాలితలగ్నములలో వృషభమునకు మినహా శేషించిన అయిదులగ్నములకు సూర్యుడు పంచమమున నుంటుట మహాకష్ట ములకు కారణము — రాజద్రోహము పితృద్రోహము చేయించును. కుక్షిశూల గలిగించును-జీర్ణశక్తిని కంటిచూపును చంపును-కంటిజబ్బు లనేకము గలిగించును. దేహబలము బుద్ధిబలము సంపూర్ణముగా ధ్వంసము చేయును. రాజకీయరంగమున దింపి ధనము సర్వనాశ నము చేయించి పరాభవములకు లోనుచేయును- భావోద్రేకము గలి గించి బుద్ధిహీను డనిపించును. అధికారగౌరవముల క్రింద ధనమును హతముచేయును- విద్యనే రాకుండచేయును వచ్చిన విద్యకు విలు వుండదు. గ్రామములో అధికారహీనునిచేయును. ఉన్నతస్థితి నందు కొనప్రయత్నించి విఫలమనోరధుడై పరాభవపడును జ్ఞానశూన్యు డనిపించుకొనును. దురాదాయములు ధర్మాదాయములకై బ్యాంకు లాడి గ్రామచిక్కులలో తగుల్కొనును-అన్యాయజీవిగా దురాదాయ పరునిగా భావోద్రేకిగా లోకులెంచుకొందురు. తన ఊహలకందు నది ఒక్కటుండదు. ఆత్మ నిరంతరము క్రోధగ్రస్తమై కోపగ్రస్తమై

శోకగ్రస్తమై నేరగ్రస్తమై యుండును. ఆత్మహత్యకు బుద్ధి పుట్టించు చుండును- తనకు అడ్డు చెప్పినవానిని హత్యచేయునంతటి కోపము నిర్దయత గలిగించును. పాపభూయిష్టమైన తలంపులు గలుగుచుం డును. దేశాంతరగతునిగా చేయును. ఇంట బైట అధికారగౌరవముల నాశనము చేయును ఇహపరముల రెండింటిని చెరచును దైవచిం తనను ధర్మబుద్దిని తొలగించి అనేకచిక్కులకు లోనుచేయునుగాని చంపలేదు___

భృగుషట్క-మన్నారుగదా శనిపాలితలగ్నములకు మృత్యుం జయుడై కాపాడును-శత్రురోగ ఋణవిపత్తులనుండి ఉద్ధరించి శత్రు రోగ ఋణవిపత్తులనుండియే కాపాడును- ఎట్లన శత్రువర్గమువారిని పలాయనముచేసి నాశనముచేసి లాభము గడింపచేయును-తన్నునిరో గిగాచేసి రోగములవల్లలాభము గడింపచేయును అనగా ఆరింటగల్న పంచమ భాగ్యాధిపతులు గలవారే వైద్యులు- డాక్టర్లు మాంత్రికులు తాంత్రికులు జ్యోతిషులు మందుల విక్రయించువారు పార్మసీలవారు ఊరంతరోగమయమైన వైద్యునియిల్లు బంగారుమయమౌతుందన్నట్లు భృగుషట్కము వైద్యునిచేసి లాభము గలిగించి సుఖింపచేయును- వడ్డీలవ్యాపారము చేయించి వడ్డీలతో లాభము గడింపచేయును- క్షుద్రుల విపత్తులతొలగించి ఆర్జన చేయించును-కన్యకలతో సుఖింపచే యును-సంగీతసాహిత్యములవల్ల స్త్రీలవల్లధనము చేకూర్చును- జీవిత రక్షణోపాదుల సర్వముగలిగించును- దీర్ఘాయువొసంగును- నవయౌ వనస్త్రీలతో నానావిధముల సుఖపెట్టును- భృగుషట్కము చంపదు.

గురుపాలితలగ్నములకు మారికాశక్తియై బాధించును- వేధిం చును- శత్రురోగ ఋణవిపత్తుల పాలుచేయును. సప్తవ్యసనాలోలు నిగా చేయును- స్త్రీ నేరారోపణ తెచ్చిపెట్టును. స్త్రీ సుఖమును చెర చును- ఇంట బైట స్త్రీ కలహముల సృష్టించి పరాభవముల గలిగిం చును- పొత్తికడుపులో జబ్బులు శూలలు మలలు వృషణవ్యాధులు

సుఖవ్యాధులు పుట్టించును- మాతృభావములో బలహీనత (వాహన గండము స్త్రీగండము గలిగించును) గాని చంపలేదు—

బుధశ్చతుర్థే అన్యాదు శనిపాలితలగ్నములకు బుధుడు చతుర్థమున నుండుట మహాసుకృతము- బంధు మిత్రాదులలో వన్నె గడించును- వ్యాపారములో సంధి కార్యక్రమములు నెరవేర్చుడములో శిల్పము గణితశాస్త్రము జ్యోతిష్యము మంత్ర యంత్ర తంత్రములలో గొప్పమేధావియై కీర్తి గడించును. ఓషధులు తయారు చేయుటలో వైద్యములో ప్రవీణుడై దండిగా ధనమార్జించి గృహములు, గృహోపకరణములు వింతవస్తువులు విరివిగా సంపాదించును- క్రొత్తవస్తువుల ఓషధుల కనిపెట్టును. గృహవాస్తు జలవాస్తు మొదలగువాటిలో కీర్తి గడించును వాక్చతురత, కార్యనైపుణ్యము, సమయస్ఫూర్తి జ్ఞానము ప్రబలముగా నుండును. వాహనయోగముండును దాసదాసీజన పరివారము నిరంతరముండును విలాస భవన నిర్మాణములు చేయును. భూమి పశుసంపద ధనధాన్యములు మొదలగు వస్తుసంపద కావలసినంత ఉండును సప్తవ్యసనములలో చాకచక్యత హాస్యవచనములలో ప్రవీణత బలముగానుండును రిపేరీలు చేయుటలో మేధావిగా నుండును (గొప్ప సైంటిష్టు కాగలడు.)

గురుపాలితలగ్నముల కుండిన మృత్యువై బాధించి వేధించును- సేవకావృత్తితో జీవింపచేయును బంధుమిత్రులలో నీచునిగా చేయును- వైద్యమునకు మంత్ర యంత్ర తంత్రములకు జోస్యమునకు సప్తవ్యసనములకు ధనవ్యయము చేయించును. బుద్ధిబలము సమయస్ఫూర్తి, జ్ఞానము పూర్తి నశింపచేయును. గృహములు గృహోపకరణములు శిథిలముగా చేయును- మలినవస్త్రములు జీర్ణవస్త్రములు ధరింపచేయును. హాస్యవచనములతో కలహములు గలిగించును- సంధికార్యములు చేయడములో పరాభవములు గలిగించును- ప్రాణాపాయము గలిగించును- పైత్యాధివృద్ధి చేయును-

నడుము వెన్నెముక పిరుదులు డొక్కలు గిరిగెలలో ఎక్కువతక్కు వలు గలిగించును- గూని నడ్డి వణకడ భూతభయము వాంతులు ఎక్కిళ్లు పుట్టించును-నీచకార్యములు చేయించును-నీచముగా జీవింప చేయును- వాహనగండము నిచ్చును- మాతులన్యాయము వారితో నష్ట పెట్టించును- గాని చంపలేడు—

కేతువ్యయస్థ జనితో మరణాయ సద్యః అన్నారు — వశ్యా గురుపాలితలగ్నములకు కేతువు ద్వాదశమున నుండుట శ్రేయోదా యకము- ద్వాదశమున కేతువు మోక్షకారకుడనిచెప్పి ద్వాదశమున కేతువుండిన బాలారిష్టమనుటవింత సమంజసముగాదు శుభగ్రహము బాలారిష్టము గలిగింపదు-ఎందుకనిరో వారికే తెలియును-నాయనా రాహుదశపోయిన కేతువు గురుపాలిత లగ్నములకు ద్వాదశమం దుండిన తత్వజ్ఞానము నొసంగును- దైవభక్తి గలిగించును- మంచి మార్గము చూపును- ధనము సద్వ్యయము చేయించును- రాబోవు జన్మకు గొప్ప సహాయము నొసంగును, పుణ్యకార్యములపైన ప్రీతి గలిగించి దైవమున్నాడను నమ్మకము గలిగించి జపతపాదుల చేయించి పుణ్యమూర్జింప చేయును- వృద్ధాప్యములో దైవధ్యానము చేయు తలంపు గలిగించును. సాధు సజ్జన సహవాసము కుదిరిం చును. అనాయాసమరణము పుణ్యలోకప్రాప్తి నొసంగును భూత దయాపశ్చాత్తాపము శాంతము గలిగించును- ఇట్టి శుభములు అనే కము గలిగించునుగాని బాలారిష్టములు గలిగించి చంపడు

శనిపాలితలగ్నములకైన రాహుదశపోయిన కేతువు కాఠిన్య హృదయుని పాషండుని చేయును- నాస్తికము బోధించి చెడుమా ర్గము బట్టించును. ధనము దుర్వ్యయము చేయించును రాబోవుజన్మకు సర్వపాపముల చేకూర్చును- పుణ్యకార్యముల దూరముచేయును— వృద్ధాప్యమున అనేకచిక్కుల గల్పించును. దుర్మార్గుల స్నేహము కుదిరించును-అనేకభాధలతో మరణము గలిగించును- అపస్మారము

మూర్ఛ తిక్క మతిహీనత గలిగించును గాని చంపలేదు- ఈశ్లోక
అరము తలతోక లేక యున్నది—— వత్సా జననాదిగా రాబోవు
వ్యాధుల వ్యాధిస్వరూపముల ఆయుర్దాయము చెప్పుటకు వలనుప
డక బాలారిష్టములని ఒక్క పదముతో వదలినాడు- బాలారిష్టము
ఎట్టిదిగానుండునని పృచ్ఛకుడడిగిన ప్రత్యుత్తరము ఇట్లుండునని తెలు
పుటకు ఆధారము లేవిలేవు- ఇక ఆయుర్దాయ మున్ననో మరింత కష్ట
ముగా నుండును. చూడుము——

అష్టమాదిపతి శుభుడో అశుభుడో తెలిసికొనుట- అష్టమాధి
పతి పాపులతో చేరియుండెనా? శుభులతో చేరియుండెనా? అష్టమము
శుభాశుభులలో నెవరుచూచుచుండిరి- లగ్నద్వితీయ సప్తమాష్టమ
ములలో శుభాశుభులుగలరా బాల్యదశలు భుక్తులు ఏవిగలవు- పాప
గ్రహబలము ఎట్లున్నది పాపగ్రహ భుక్తినాధులు అష్టమముపై
ప్రయాణము చేయగలరా! దశానుకూలత ఎట్లున్నది ఆయుఃకారకు
డెట్లుండెను- అన్నవిషయముల గమనించి ఆయుర్దాయమును వ్యాధి
స్వరూపముల చూచుకొనవలయునుగాని ఈబాలారిష్ట శ్లోకార్థము
గ్రహించుకొనికాదు

లగ్నద్వితీయ సప్తమాష్టమములలో నొకచోట నొకశుభగ్రహ
మున్నను లగ్నాధిపతి పంచమ భాగ్యాధిపతులతో కలిసి బలీయుడై
యున్నను బాలారిష్టములేమీ చేయజాలవు. దీర్ఘాయువు గలుగును ఆ
చంపెడుగ్రహము బాల్యయౌవన కౌమార వృద్ధాప్యదశలలో ఏదశకు
చెందినవాడో ఆదశయందే అపాయము గలిగించుటకూడ గలదు- ఈ
విషయములు చక్కగా గమనించవలయును- అష్టవర్గుతో ఆయుర్దా
యము కనుగొనుట- వధూవరుల బలాబలములు గుణములతో కూట
ములతో చెప్పినట్లుండును. ఆయుర్దాయము అష్టమములో అష్టమాధి
పతిలో ఆయుఃకారకునిలోన ఉన్నదని తెలుసుకొని చక్కగా
పరిశీలించుము——

**శ్రీ:- స్వామి ప్రధానమంత్రి శ్రీ ఇందిరాగాంధిగారి జాత**

కము మీరిప్పుడు చెప్పువిధముగా చూచిన యోగభ్రష్టత కలుగవల సినదే ఎందు కింత ఉన్నతస్థితి నందుకొన్నదో తెలియచెప్పుడు.

గు:- వత్సా ఆజాతకమును పరిశీలించిన మహారధ శ్రేష్ఠు లకు దశానుకూలత గ్రహానుకూలత లగ్నమునకు శుభాశుభగ్రహవిమ ర్శలేక పొరబడినారు ప్రమాణగ్రంధములలో ఈవిషయము లెక్కడ గనబడుపలేదు ఆప్రమాణ గ్రంధవచనములనే నమ్మినవారు గాబట్టి చక్కనితోవ నడుపలేక పోయిరి చూడుము- 1917 సంవత్సరము నవంబరు 19వ తేది రాత్రి 11-11 నిమిషములకు జననము. అయిన కటకలగ్నము వచ్చును. ఈలగ్నము గురుదశ గురుభుక్తి పోయినంత వరకు గొప్పరాజయోగమే గురుపు నడిపించవలసియున్నది- ఎట్లన గురువు ఏకాదశమమునందుండి సూర్యచంద్రులను చూడడము. సిం హామున కుజుడుండి సూర్యుని చూడడమువల్ల మహారాజయోగము పట్టినది. అదిస్థిరమా అస్థిరమా అన్నవిషయములు తెలుసుకొనవల యునుగదా! బాల్యముననే లగ్నాధిపతి చంద్రదశ భాగ్యాధిపతి కుజ దశ పోవడము షట్స్థానములో శుక్రునితో కలిలిన రాహుదశ 19 సంవత్సరమే వచ్చుటయు గలిగి కొంతకష్టము కొంతసుఖము గలిగి 37 నుండి గురుదశప్రారంభమై రాజయోగముపట్టిన దనుకొందము కటకలగ్నమైన గురుదశ గురుభుక్తి పోయినతోడనే గురుబలము సన్నగిల్లును- అప్పటికి లగ్నపంచమ భాగ్యస్థానాధిపతుల బలము పోయినట్లేగదా. పంచమముననున్న బుధరవులు లగ్నములోనున్న శని ఆరింటనున్నశుక్రుడు ఊరకుందురా పదవీభ్రష్టత గలిగింపలేరా అందులో ఉద్యోగస్థానము పదియవయిల్లుగదా. శని లగ్నము లగ్నా ధిపతిని దశమమునుచూచుచున్న ఉన్నతోద్యోగమెట్లు లభ్యమగును గురుదశ శనిభుక్తియందే వృత్తి ఉద్యోగ కీర్తి గౌరవముల తొలగించి యుండును. ఇట్టి సందేహములు పండితులకు కలిగియుండిన సవరించు కొనియుందురు-గురుపుకు రవిబుధులుఏడింట నుండిరి-గురుదశ గురు

భుక్తి పోయిన గురువుబలము తగ్గునుగదా. రవిబుధులు ఊరకుం డురా అధికారగౌరవముల తొలగించరా.

పాపగ్రహ శుభగ్రహసమ్మేళనమునగాని సమసప్తకమునగాని శుభగ్రహ దశాన్యభుక్తి పోయినగాని పాపగ్రహమునకు బలముగలిగి యోగభ్రష్టత గలిగించునని ఏగ్రంథమున లేనందున వారు గమనించ నందున జాతకవిమర్శ తలక్రిందులైనది. కటకలగ్నమునకు ఇంతటి శక్తి గలుగుటకు దశానుకూలత గ్రహానుకూలతలేవు. సింహలగ్న మైన సర్వము చేకూరును దశానుకూలత చెడినను గ్రహానుకూలత యేర్పడును. గమనింపుము— ఏగ్రహము ఏగృహము ఏమిపని చేయవలయునో అవి తప్పక చేయవలసి యుండునుగదా. చూడు- రాజగృహమగు సింహమున రాజగ్రహమగు కుజుడుండెను లగ్నా ధిపతి రాజగ్రహమయ్యి రాజగృహమగు చతుర్థమున బుధుని ముం దిడుకొని బలీయుడై ఉద్యోగస్థానము విష్ణుస్థానమగు దశమమును దశమముననున్న గురువును చూచెను- గురుదశ ప్రారంభము నుండి యోగించెను- పంచమాధిపతియగు గురువు విష్ణుస్థానమునుండి రాజ గ్రహములగు సూర్యచంద్రుల చూచెను- నవమ చతుర్థస్థానాధిపతి యగు కుజుడు సూర్యుని చూచెను. రవి కుజునిఇంటిలో- కుజుడు రవిఇంటిలో పరివర్తనగా నుండిరి- లగ్నపంచమ నవమాధిపతు లగు రవి గురుకుజులు పాపులచే చూడబడక బలీయులై యుండిరి- ఇక ప్రబల రాజయోగమెందుకు లభ్యపడదు. పడును ఇంకా దశా నుకూలత గలిగియుండిన చక్రవర్తి యోగము పట్టియుండును. అయి నను చక్రవర్తిగా ఏలగలుగుశక్తి సూర్యభగవానుడు ఇవ్వగలడు—

వత్సా రాజయోగమునకు సూర్యుడు చంద్రుడు కుజుడు. వీరి స్వగృహములు ప్రధానములు. వీరు వీరి గృహములులేక రాజయో గము లేదని యెరుంగుము- రాజచిహ్నము ధరించవలెనన్నను రాజ

ముద్రాధికారము కావలయునన్నను వీరి అనుగ్రహము పొందవల యునని తెలుసుకొనుము— ఉన్నతోద్యోగుల జాతకముల పరి శీలింపుము—

| | | | |
|---|---|---|---|
| | | గు | కే |
| | | | శ |
| చ | | | ల కు |
| శు రా | బుర | | |

శ్రీ ప్రధానమంత్రి శ్రీ ఇందిరాగాంధి గారి జాతకము 1917-11-19 తేది రాత్రి 11-11 నిమిషములకు జననమ న్నారు. 11-45 జననమైన సింహ లగ్నము వచ్చును 32 నిమిషములు ముందుకు నడువవలెను—

జననకాల సూర్యదశ శేషము 1-7-20 ర-అనూరాధ1, చ-ఉషా3, కు-పుబ్బ1, రా-మూల4, గు-రోహిణి2, శ-ఆశ్లేష3, బు-అనూ రాధ4, కే-అరుద్ర2 శు-పూషా3

వత్సా ఇట్లున్నది- జాతకము చతుర్ధమందున్న సూర్యుని శుభముల కొన్ని తెలుపుదును. గమనింపుము- సూర్యుడు సుక్షత్రి యుడు. శుభుడై చతుర్ధ దశమములో నుండిన జీవితాంతము ప్రభు శక్తి గలిగి కీర్తి గౌరవములతో జీవించువాడగును- జగద్విఖ్యాతిని గడింపచేయును పాలనాశక్తి యుక్తి నొసంగును. రాజాతిరాజులలో అగ్రరాజ్యములలో వందనీయత పూజనీయత గలిగించును. ఎదురు లేని పాలన నడిపించును- ధర్మబుద్ధిని గలిగించును- కననివి విన నివి మనోవీధిలో సృష్టించును. స్థాపిత నిర్మాణముల చేయించును- దైవభక్తి నొసంగును అధర్మముల అన్యాయముల ఖండించి ధర్మ మును నెలకొల్పును- దేశరక్షణలో ప్రజారక్షణలో కడుజాగ్రత్త గలిగించి శత్రువులకజేయునిగా నొనర్చును-పరాక్రమము సాహసము యుక్తి యుక్తజ్ఞానము సంపూర్ణముగా నొసంగును చక్రవర్తిగా చేయును- ధర్మసంస్థాపనలు చేయించును- ఎనలేని సౌఖ్యమొసగును. ప్రజాదరణ గల్పించును రాజ్యస్థాపనలు చేయించును ప్రజోపయుక్త

ములగు కార్యము లనేకము చేయించును సూర్యగ్రహము నందంత బలమున్నదని గ్రహించుకొనుము- సూర్యుడు క్రూరుడన్నవచనము మరచిపోమ్ము- మరియొక్కటి శనిదశవచ్చినది- ద్వాదశమునుండి ఏగ్రహమైనను తానున్నచోటు చూచినచోటునే పాలించును వేరొకటి చేయజాలదు శని శత్రురోగ ఋణవిపత్తుల గల్పించి చంప చూచును-శత్రువృద్ధి గల్పించును భీతిని గల్పించును. ప్రాణభయము సృష్టించునుగాని ఉద్యోగము నేమి చేయజాలడు. పదియవగృహమును చూచియుండిన ఉద్యోగమునకు ఆటంకము గల్పించి యుండును. కటకలగ్నమునకు దశమము శని చూచుచుండెను లగ్నమదియైయుండిన ఉద్యోగము ధ్వంసముచేసి యుండును.

శ్రీ:- స్వామి ఈజాతకమును విశ్వవిఖ్యాత జ్యోతి శ్శాస్త్రజ్ఞులెందరో పరిశీలించి యుండరా. వారు అనుమానించి యుండరా.

గు:- అనుమానించుటకు విమర్శించుటకు వీలు గలిగించవలసినది శాస్త్రము. శాస్త్రమే పెడమార్గము పట్టినప్పుడు పండితులు ఏమి విమర్శించ గలరు. ప్రథమముననే వక్రగతిపట్టి అందరికన్నులు గప్పి సంచరించినది గాబట్టి ఎవరేదిచెప్పినా నమ్మవలసి వచ్చినదే గాని నిజమిదియను శాస్త్రము శాస్త్రజ్ఞులు కరువయెగదా. అనేక విధముల గ్రంథములు వ్రాయగలిగిరి. నాయనా- వారి జాడలపోకనే చెప్పిన జాడన పొమ్ము. గమ్యస్థానము చేరగలవు ప్రజల కుపకరింప గలవు——

శ్రీ.- స్వామి వృత్తివిద్యలలో శాస్త్రములలో ఖ్యాతి వహించిన వారున్నారే. వారి జాతకములు ఎట్లుండునందురు——

గు:- శాస్త్రములకు కళలకు ఒక్కొక్కదానికి ఒక్కొక్కచోట శుభగ్రహము లుండవలయును. ఒక్కొక్కకళకు ఒక్కొక్కశాస్త్రమునకు ఒక్కొకగ్రహబల ముండవలయును. ఇప్పుడు కొన్ని రాజయోగములను తెలిపితినిగదా! జ్యోతిష్కుని కుండవలసిన బలము నెరిగిం

తును. వినుము- వత్సా జ్యోతిష్యమునకు బుధుడు కారకుడుగదా- శనిపాలితలగ్నమై ఈబుధుడు పంచమములో నుండి తనగృహము లగు మిధునకన్యలలో శనిశుక్రులుండిన అనగా వృషభలగ్నమై మిదునములో శని ప్రధమపాదస్థితుడై చతుర్థమున శుక్రరవులుండి బుధుడు కన్యలో ప్రధమపాదస్థితుడై యుండిన గొప్ప జోస్యపండితుడుగాని పంచాంగ గుణిత శాస్త్రజ్ఞుడుగాగాని గణితశాస్త్ర వేత్తగాగాని సైంటిష్టుగాగాని వకీలుగాగాని మాంత్రికుడుగాగాని వ్యావహారికుడుగా గాని జగద్విఖ్యాతి వహించును. క్రొత్తవస్తువుల క్రొత్తబద్ధతుల కనిపెట్టును. ప్రతిభావంతుడై ప్రజా-ప్రభుత్వములందు వన్నె గడించి సుఖించును. కీర్తి గడించుటకు ఆర్జించుటకు దశమబల ముండవలయును. కారకుడు కారకుని గృహములు బలీయములై యుండవలయును. దశానుకూలత గలుగవలయును- గురుపాలిత లగ్నమైన బుధుడు బుధగృహములు శుభులచే కట్టుబడి పంచమములో శుభ గ్రహముండిన 75 భాగల బలముండును—

శ్రీ.- స్వామి కవులలో మహాకవులు ఆశుకవులు అష్టావధానులు శతావధానులు, ప్రభంధకవులు, చిల్లరకవులు కుకవులని పలు విధములుగా నున్నారే కారణమేమందురు. విశ్వకవులగుటకు బల మెట్లుండవలె నందురు —

గు:- వత్సా కవితకు కారకుడు శుక్రుడు— శుక్రుడు శుక్రగృహములగు వృషభతులలలు శుభత్వము చెందిన అనగా ( వృషభ తులలలో శుభగ్రహము లుండి శుక్రుడు బలవంతుడై పాపగ్రహ పీడన లేకుండ నుండుట ) మహాకవి కాగలడు. ఎట్లనగా మకరము లగ్నమై పంచమమగు వృషభమున ప్రధమపాదస్థితుడై శుక్రుడుంత తులలో శనియు కటకమున బుధుడుండగా దశానుకూలత గలిగిన ( అనగా భరణి పుబ్బ పూర్వాషాఢ నాలవపాదాంతమున జననము కవియైన ఆకవిత ప్రజాదరణ ప్రభుత్వాదరణ పొందును కవిత

అమృతము నొలుకుచుండును స్థిరస్థాయిగా గ్రంథము ప్రపంచమున నిల్చును. వీరే మహాకవులు. వీరి భావములు మణులవలె ప్రకాసించును. అట్టివారు చేవట్టినవస్తువు అట్టిదిగానే వుండును. స్థిరస్థాయిగా నిలుచును. ఉదా- లగ్నాధిపతిశని దశమమున ఉచ్చనుపొంది కటకమును చూచుటవల్ల కటకము చంద్రుడు గ్రాహిత జ్ఞాపకశక్తులకు నెలవు గాబట్టి ధారణాశక్తి ప్రబలముగా నుండును ఆశుకవిత్వమునకు ఆటంకము లేకుండును. విశ్వకవి యగుటకు సందేహమే యుండదు. ఇట్టివాని కవితే కవిత- అటుగాక శుక్రగృహములు ఒకటి శుభత్వము జెందినవాడు రెండు శుభత్వము చెందినవాడు. ఒకశుక్రుడే శుభత్వము చెందినవాడు గలవు వీరు కవులనిపించు కోగలరు. గాని వారుపోయిన తోడనే వారిరచనలు వెంటనే నశ్యము పొట్లాలకు పోవును. స్థిరస్థాయిగా నిలువవు గురుపాలితులు కవులుగాగలరు- వృషభతులలు శుక్రుడు శుభులతో చూడబడి కూడబడి కవియైన పదిసీతులు ధర్మములు మొదలగు సుగుణములుండి కొంతవరకునిలుచును శుక్రుని వాసనేలేక కవులయిన వారిగ్రంధములు కవిత ప్రజాదరణ పొందవు స్థాయిగా నిలువవు- దేనికి కారకుడు. వాని గృహములు స్థానము బలీయమైన ప్రబలయోగ మనబడును- అన్నిటకు దశానుకూలత ముఖ్యమని యెరుంగుము- గొప్పవారి జాతకములను పరిశీలింపుము. దశానుకూలత గలవారు తొంభై భాగలున్నారు దశానుకూలత అన్నపవము శాస్త్రము లందెచ్చటగానము. శాస్త్రమున కిది కన్నువంటిదని తలంచుము——

శ్రీ:- స్వామి వ్యాపారులు అసాధ్యముగా సంపాదింతురు. భవనములు నిర్మింతురు. ఫ్యాక్టరీలు కట్టింతురు. వాహనములలో తిరుగుదురు కోటీశ్వరులయ్యెదరు. వీరిజాతకము లెట్లుండునందురు-

గు:- వత్సా వ్యాపారమునకు కారకుడు బుధుడు. వ్యాపారస్థానము దశమము లాభస్థానము పదకొండుగదా శనిపాలిత జాత

కమై దశమమున శుక్రుడుండి లాభమున బుధుడుండి ఆరింటశని యుండి దశానుకూలత గలిగినయెడల దండిగాఆర్జించి భవననిర్మాణములు చేయును. పట్టినదంతా బంగారమై ఆర్జన మితిమీరును- దురాదాయముగా కొండిలొచ్చిపడును. ఋణ మిచ్చినదంతా వచ్చి తీరును. ఎడతెగనిసంపదలతో బహుముఖముల సౌఖ్యమొందును- సిరి. స్త్రీ. ఈతనిసొత్తుగా సుఖించును ఉదాహరణ- తుల లగ్నమై చతుర్ధమున చంద్రుడు దశమమున శుక్రుడుండుట మహావాజయోగము- ఆరింటశని దిగ్బలాధిపతియై మీనధనస్సుల ద్వాదశమును చూచుట ప్రబలయోగము బుధుడు ఏకాదశమమగు సింహమున నుండుట మేరతప్పిన రాజయోగము- శుక్రుడు ప్రజాధన మొసంగును- బుధుడు ప్రభుత్వధన మొసంగును. శని సర్వతోముఖుడై బహుముఖముల ధనార్జన గలిగించును- చంద్రుడు విదేశీయులతో వ్యాపారము సాగింపచేసి కోట్లు లాభమొసంగును. వాహనములకు భవనములకు గృహోపకరణములకు మేరయే లేకుండును. ఇట్లు గ్రహము లున్న వారే కోటీశ్వరులు- వీరు పూర్వజన్మమున జీవితాంతము అనేకవిధముల దేవుని పూజించినవారు- వీరి పూజాఫలముపైమెట్టనందుకొనలేక ఆపూజాఫలము ఇహములో అష్టయిశ్వర్యరూపమున సర్వసౌఖ్యములనుభవింపచేయుచున్నది. తిరిగి దానధర్మరూపమున దైవధ్యానమున తీర్ధయాత్రాఫలమున ఉన్నతస్థితి నందుకొనగలడు. పుణ్యము పుణ్యమునే చేయించును ఇట్టిజాతకులు అరుదుగా పుట్టుచుందురు. శ్రీ మహాత్మాగాంధిగారి జాతకములో దశమాధిపతియగుచంద్రుడు ఏకాదశమమున నుండ పంచమాధిపతియగుశని తులాలగ్న ద్వితీయము నుండి చంద్రుని చూచుటచే రాజ్యమునే సంపాదించెను లగ్నమున లగ్నభాగ్యస్థానాధిపతుల కలయికవల్ల శిలావిగ్రహమై నిలచెను- ఇట్టివారు పూర్వపుణ్యులు అరుదుగా పుట్టుచుందురని యెరుంగుము-

శ్రీ- స్వామి ఖగోళమునుండి భూగోళమునకు జీవులు వచ్చి

పుట్టుచున్నవిగదా! ధనికులుగా, విద్యాధికులుగా, ఉన్నతోద్యోగులుగా పుట్టుచున్నారే వారెట్టి సమయములలో పుట్టుదురందురు—

గు:- వత్సా ఖగోళమున లగ్నపంచమ నవమాధిపతుల కలయిక గలిగినప్పుడు దశానుకూలతగలిగినప్పుడు పాపులు దుర్బలులుగా శుభులు బలవంతులుగా నున్నప్పుడు పంచమాధిపతులు పంచమములలో నున్నప్పుడు నవమాధిపతులు నవమము నందున్నప్పుడు లగ్నాధిపతులు పంచమ నవమ చతుర్ధ దశమము లందున్నప్పుడు లగ్న పంచమ నవమాధిపతులు ఉచ్చస్థితి నొందినప్పుడు గురుశని పాలిత లగ్నములలో పుట్టుచుందురు. ముందుజన్మమున విష్ణు పరంపరగా ధ్యానము చేసినవారు గురుపాలితులుగా శివపరంపరగా ధ్యానము చేసినవారు శనిపాలితులుగా జనించుచుండిరని యెరుంగుము—

శ్రీ.- స్వామి నిర్భాగ్యులు నిరక్షరకుక్షులు నిరుద్యోగులు జీవనోపాదిలేక దుఃఖించుజీవులు భిక్షాటకులు పుట్టుచుందురే ఖగోళమప్పుడెట్లుండునందురు.

గు;- వత్సా లగ్నపంచమ నవమాధిపతులు పాపులచే చూడబడినప్పుడు కేంద్రకోణములలో పాపులున్నప్పుడు దశానుకూలత లేనప్పుడు శుభులు పాపులచే చిక్కినప్పుడు పుట్టుచుందురు— వీరు ముందుజన్మమున సత్యములేదని దేవుడులేడని ముందుకధ చూతము లెమ్మని సర్వపాపములుచేసి జననమగువారని యెరుంగుము—

శ్రీ:- స్వామి ప్రాథమికవిద్యావిధానము ఇంతటితోచాలించి వివాహాది సుముహూర్తముల తెలుపుడు.

గు:- వత్సా చెప్పవలసిన భాద్యత వహించితినిగాన అడుగుము చెప్పెదను—

శ్రీసద్గురు రాఘవేంద్ర శ్రీలక్ష్మీనృసింహ శ్రీరామకృష్ణ.

శ్రీగౌరీశంకర శ్రీబ్రాహ్మీ బ్రహ్మార్పణమస్తు.

ఆదిత్యాది నవగ్రహార్పణమస్తు.

---

శ్రీ శారదాంబాయైనమః ఓం నమః శ్రీ లక్ష్మీనృసింహాయనమః

శ్రీ రాఘవేంద్ర గురుభ్యో నమః

# సప్రమాణ జ్యోతిశ్శాస్త్రము,

## ద్వితీయాతరంగము

## సుముహూర్త నిర్ణయము.

శ్రీ:- స్వామి వివాహ ముహూర్తముల గురించి పలువురు పలువిధముల ప్రశ్నింతురు. వాటికన్నిటకు విమర్శించి చక్కగా చెప్పుటకు శాస్త్రములందు తెలుపలేదు—వేమన అన్నాడు. శాస్త్రజ్ఞులు గుంపుకూడి ముహూర్ధముంచిన చావెట్లుగలిగెరా? ముండెట్లమో శరా? శాస్త్రమేమాయరా? అన్నాడు ప్రాకృతము అట్లడుగువారు అనేకులున్నారు- వారడుగు ప్రశ్నలకు సదుత్తరమిచ్చుటకు కాలామృతము ముహూర్ధదర్పణము మొదలగు గ్రంథములలో గానము_ గుణములు గణములు కూటములు మొదలగునవి గలవు. వధూవరుల కష్టసుఖములను గురించి అడిగిన ప్రశ్నలకు తగినట్లుగా సమాధానములు లేవు. తామేమందురు. తమరు చెప్పునది క్రొత్తగానున్నది- శల వింతు.

గు:- నాయనా క్రొత్తమార్గముగాదిది పాతత్రోవయే. త్రోవ చూపువారు కాలానుగుణ్యముగ మరుగైనారు. కలికాలములో ఈ శాస్త్రము సంపూర్ణముగా నుండిన కలికాలము నడువదు. ఈశాస్త్రముతోపాటి ఇక మూడుశాస్త్రములు దాటిపోయినవి. అంజనములు, మంత్రములు, మంత్రాంగములు ఓషధీప్రభావముల తెలుపు సద్గ్రంథములు ఈనాలుగు. సంపూర్ణముగ నుండిన చోరులు, జారులు, క్రూరులు, కూనీలు, మోసములు మొదలగు పాపములు సాగవు—

వత్సా నాస్తికులు ప్రబలపలసిన కాలముగాబట్టి శాస్త్రములు ప్రక్కకు వైతొలగవలసి తొలగినవి.

అట్లు మరుగుపడుటకు కాలము ముఖ్యము. కాలము ననుసరించి మానవులు నడువవలసి యుండునుగదా! ఒక్కొక్క శాస్త్రము ఒక్కొక్క వంశపరంపరగా వారిలోనే ఇమిడిఉండినవి. వారి వంశములు అంతరించుటచేతను ఆవంశములో యోగ్యత గలుగువారు పుట్టకపోవుటచేతను కొంతవరకు నశింపయినది- వైద్యము జ్యోతిషము పాపమనియు దానితో జీవించెడివారు మరెంత పాపులనియు ధర్మశాస్త్రజ్ఞులు శాస్త్రములందు వ్రాసి చెప్పుటచేత జోస్యులు వ్యతిరేకించి శాస్త్రమును మరుగుపరుచుటచేత ఉన్నకొంచము సన్నగిల్లెను- అప్పుడు శుభాశుభకార్యములకు దారిచూపువారు కొరత గలుగుటచే పలువురు పండితులుచేరి ప్రజల నడిపించుకొనుటకు ఏదోవక వంకర టెంకరదారిని సృష్టించుకొనక తప్పినది,గాక పలువురు పలు విధములుగ సృష్టించుకొని ఇది నామతము. ఇది నామతమని ప్రజల పండితుల చీల్చి కాలమును ప్రజల నడిపించుచువచ్చిరని తోచుచున్నది. మతములు బయలుదేరి మరింత శాస్త్రమునకు విలువవచ్చెను ఎవరిని కాదనుటకు వీలులేకపోయెను దృక్కుకు ఎవరిమతము నిలువక కడకు కాళ్లిరిగిన కోడి బ్రతుకాయెను- పండితులకు బిఱ్ఱులేక పోయెను-శాస్త్రములు మక్కీకిమక్కి అనంతమయ్యెను- వత్సా వారు వేసిన పునాదిరాయి మూడుముఖములు గలది దానిపై కట్టినగోడలు పునాదిరాయి తొనుగుటచేత కూలిపోవసాగెను——

మూడుముఖములరాళ్లు ఏవనగా గురుశుక్ర పూర్ణచంద్ర శుద్ధ బుధులు శుభులనియు మిగులు కుజరవి శని రాహుకేతువులు పాపులనియు నియమించుకొనుట మూడుముఖముల రాళ్లనవలసివచ్చినది.

శ్రీ:- స్వామి గ్రహరూపి జనార్దన అన్నారే. ఆవాక్యమేమి కావలయును- సూర్యుడు త్రిమూర్తి స్వరూపుడన్నారు. ఈమాటేమి

కావలయును.

గు:- ఔను నాయనా జనార్దను డొకడేకాదు గ్రహరూపము- మహాశివుడుకూడా గ్రహరూపమున నున్నాడు. వత్సా గ్రహమండలములందు పాపుల నియమింపరు ఊర్ధ్వలోకములందు క్రూరులకు పాపులకు స్థానములేదు. ప్రపంచమునకు సర్వశక్తులు ప్రసరించు సూర్యభగవానుడు క్రూరుడుగాదు సూర్యునికి అండదండయైన కుజుడు అంతకు క్రూరుడుగాదు. ఈశ్వరాంశజుడై సర్వశక్తిసమోపేతుడై సర్వజీవుల లయమొనర్ప గలుగు శని పాపియుగాడు. కుజ రవిగురువులు- వారిగృహముల స్థానమిచ్చి మోక్షకారకునిగా జేసిన కేతువు పాపికాడు-శనికి తోడునీడయై వామాచారమును భుజస్కంధమున నిడుకొని శనిబుధ శుక్రగృహములలో స్థాన మేర్పరచుకొని శివునికి మిగుల ప్రీతికరుడైయున్న రాహువు అంతకు పాపికాడు నవగ్రహములు శివకేశవ స్వరూపములనియే భావింపవలయును- వీరి పుట్టుపూర్వోత్తరములు తెలియక పలికిన పలుకులు జ్యోతిశాస్త్ర ప్రపంచమును చిమ్మచీకటిలో నుంచినది. అప్రమాణగ్రంధములని పండితులే నిరాశ చెందవలసివచ్చినది.

శ్రీ:- స్వామి దీనికి దారిఏది- నిరాశ చెందవలసినదేన.

గు:- వత్సా లగ్నము ననుసరించి శుభాశుభస్థానములు ఏర్పరచి ఆస్థానాధిపతులు ఆలగ్నమునకు పాపులనిరేగాని గ్రహములలో క్రూరులు పాపులులేరు. పుట్టుకున్నప్పుడు చావులేకున్న ఎట్లగును. లయమునకు కావలసిన వస్తుసముదాయము కావలయును. ఆవస్తువులకు అధిపతికావలయునుగదా-పాపవస్తువులున్నంతమాత్రమున గ్రహమునకు పాపత్వము క్రూరత్వము వచ్చునా? శివుడు తాను మృత్యుంజయుడయ్యు అన్నిజీవులకు మృత్యుప్రదుడుకాడా? అయినంతమాత్రమున దేవుడుకాదని వదలిరా? శని ఆయువును తీయుననియు శని పటిన పరమదరిద్ర మేర్పడుననియు ప్రజల భయపెట్టిరేగాని శని

పరమపవిత్రుడు. కారకత్వములచేత తన్నట్లు భావించి ప్రజలలో విశ్వాసము తగ్గించి శనిదశ వచ్చునన్నంతమాత్రమున విలవిలతన్ను కొని చచ్చునట్లొనర్చిరి. శనిని ఈశ్వరుడనియే భావింపవలయును. విష్ణుపరముగా గురుకుజ రవిచంద్రకేతువులను- శివునిపరముగా శని శుక్ర బుధరాహుగ్రహములను- ఇరువురు సృష్టించిరి- ప్రజల పుట్టుక కూడ రెండు తెగలయ్యెను — గురుపాలితులనియు శనిపాలితులని విభజింపబడియెను. మేష కటక సింహ వృశ్చిక ధనుర్మీనముల జననమైనవారిని గురువు పాలించును-శని లయమొనర్చును. వృషభ మిధున కన్య తుల మకరకుంభరాసుల జననమైన వారిని శనిపాలించును— గురువు లయమొనర్చును- జీవులకు చావుపుట్టుకలు గలవు- పాపపుణ్యములు గలవు ధనము, దారిద్ర్యము, జ్ఞానము, అజ్ఞానము ఆరోగ్యము అనారోగ్యము, బలము, దుర్బలము- అన్ని రెండురెండుగా గలవు. ఒక్కటి ఏదీలేదు — శ్రీవత్సా- మేషాది క్రమేణలగ్నములకు శుభాశుభుల తెలుసుకొనవలయును ఇది రైల్వేపట్టాలు-జ్యోతిశ్శాస్త్రమను ఇంజను ఈపట్టాలపై కూర్చుండబెట్టిన ప్రశ్నలను పెట్టెల ఎన్నితగిలించినా ఈడ్వగలదు-మానవుడు గమ్యస్థానము చేరగలడు పట్టాలు లేక బండి నడువలేదు నాయనా-

శ్రీ:- స్వామి పూర్వపుణ్యస్థానములు అన్నారు. పూర్వపాప స్థానములుకూడ ఉండవలయునుకదా రెంటిని తెలుపుడు—

గు:- వత్సా లగ్నపంచమ నవమస్థానములు మూడు ప్రతి లగ్నమునకు పూర్వపుణ్యస్థానములు వీటికి సప్తమములు పూర్వపాప స్థానములు— పాపస్థానములన్న 6, 8. 12 లగ్నమార్పుడివల్ల శుభ స్థానములుగామారును. అశాశ్వితపాపస్థానము లనబడును. 3, 7, 11 స్థానములు శాశ్విత పాపస్థానములు మారునవికావు.

శ్రీ:- స్వామి పాపస్థానములు 3, 6, 8, 12 అన్నారుగాని 3, 7, 11 ఎక్కడ పాపస్థానములని చెప్పలేదు. అందులో పదునొ

కండవయిల్లు లాభస్థానము చాలామంచిదన్నారు. దీనిని విమర్శించి చెప్పుడు —

గు:- వత్సా ధనికుడు నిర్ధనికుడు. ధనము నిర్ధనము అని ప్రతిది రెండుగా తేలుచున్నదిగదా లక్ష్మీస్థానము ధనమునకు నెలవు నవమస్థానమైనప్పుడు ( దానికి ఎదురిల్లు ) దానికి సప్తమము నిర్ధన స్థానముగాక వేరేమగును. ద్వాదశస్థానములకు శుభునియిల్లుకు ఏడవ ఇల్లు అశుభునియిల్లు ఉన్నది. చూడుము-అందువల్ల ధనమునకు ఎదురిల్లు నిర్ధనముగా నిలచినది. గమనింపుము—

జ్ఞానమునకు, విద్యకు సరస్వతికి నెలవు. పంచమస్థానమైనప్పుడు దానికి సప్తమము అజ్ఞానము నిరక్షరాస్యతగాక వేరేముండును- అయిదవయింటికి పదునొకండవయిల్లు ఎదురిల్లగునుగదా.

దేహబలము, ఆరోగ్యము లగ్నమైనప్పుడు దానికి ఏడవఇల్లు ( సప్తమము ) దేహదుర్బలము అనారోగ్యముగాక యేమగును-సప్తమమునకు కళత్రస్థానమని పేరున్నది. కళత్రము ఏడవఇల్లు అయినప్పుడు (లగ్నము) దానికి ఏడవఇల్లు వరుని గృహమవలయును గదా. వధూవరగృహములు 1, 7 అవును. లగ్నము వధువయిన లగ్నసప్తమము వరుని గృహమగును. ఒకటికేడు ఎప్పటికి శత్రుగృహమనియే తలంపుము —

శ్రీ:- స్వామి- వరునికి, వధువు శత్రుగృహము నుండియే వచ్చునందుర.

గు:- వత్సా ఈవిషయము చెప్పదలచిన సీవడుగతగినదేదో నిలిచిపోవును. వధూవరుల గురించి లగ్నసప్తముల గురించి చెప్పదలచిన కావ్యమగును-మరొకసారిచూతము అడుగతగినది అడుగుము

శ్రీ:- స్వామి పదకొండవఇల్లు లాభస్థానము. అక్కడ శుభులుండుట మంచిదన్నారే తాము అజ్ఞాన స్థానమనెదరే ఎట్లు?

గు:- నాయనా- పదియవగృహము వృత్తి. జీవనము, ఉద్యో

గము, ఆదాయము, వ్యాపారము మొదలగు జీవనసముదయస్థానము పదునొకండవస్థానము ప్రవృత్తి ఉపజీవనము దురాదాయము పాపము సంపాదించునది పదునొకండవ ఇంటివాడు స్వస్థానమునవే యుండిన అయిదవ ఇంటిఫలము నాశనమొనదే.గాక. తన పిత్రార్జిత ములో దురాదాయముగా దుఃఖింపచేసి భాగముపంచు కొనువారిని, సృష్టించును. గ్రామచిక్కుల నిరంతర ముంచును—— లగ్నపంచమ భాగ్యస్థానాధిపతులు అందుండిన దుర్లాభముగా విద్యను, ధనమును యిప్పింతురు. పదకొండు నిరక్షరాశ్యతస్థానము అనబడును. పాపస్థానము అజ్ఞానమునకు నెలవు గమనించి చూడుము——

శ్రీ:- స్వామి సంవత్సరములు, అయనములు, ఋతువులు. మాసములు, పక్షములు, తిథులు, వారములు ఉన్నవిగదా? ఇవి మానవునికి సుఖదుఃఖముల గల్పింపగలవనియు శుభాశుభము లివ్వగలవనియు తెల్పుదురు- నాకు సందేహము పీడించుచున్నది. తామే మనెదరో శలవిండు.

గు:- వత్సా నీవన్నవన్ని అప్రాణిచయములు- కాలగతుల గ్రహగతుల లెక్కించుటకు ఏర్పరచిపెట్టిన గుర్తులు- మానవునిపై సుఖదుఃఖముల ప్రసరింప జేయుశక్తి వీటియందు లేదు- శక్తిగలవి మూడుగా గన్పట్టుచున్నవి- ఒకటిలగ్నము-రెండునక్షత్రము-మూడు గ్రహము- ఈమూడు ముమ్మూర్తులై పిపీలిక మొదలుకొని బ్రహ్మ పర్యంతము చావుపుట్టుకల నియమించుచున్నవి- మానవుడు చేయు పాపపుణ్యముల నవగ్రహమండలములు తీసుకొని భద్రపరచుటకు మరల ప్రసరింప చేయుటకు నెలవు- ముందుజన్మ పాపపుణ్యముల ప్రసరింప చేయును- ఈజన్మలోచేయు పాపపుణ్యముల సంగ్రహించు కొనుచు ఎడతెగనిత్రోవను గల్పించుచుండును——

పండ్రెండు లగ్నములలోగల యిరువదేడు నక్షత్రములపై గ్రహములు సంచరించుచు శివకేశవస్వరూపులై పరిపాలించుచుందురు

సీవన్నవన్నియు అప్రాణిచయములని తెలియుము—

శ్రీ:- స్వామి వైశాఖ జేష్ఠ ఫాల్గుణమాసములలో వివాహము చేయు టుత్తమమనియు కార్తీక మార్గశిరమాసములు యల్పఫలమ నియు సూర్యుడు ధనుర్ మకరరాసులయందుండగాను ఆషాఢమాస మందు మిధునకర్కాటకరాసుల యందుండగాను వివాహము చేయుట యమంగళకరమని శాస్త్రము చెప్పుటలో మాసములు మానవుని బాధించుట, వేధించుట, పోషించుటగలదని తెలియుచున్నది అనేక సందేహములు గలుగుచున్నవి. తామేమనెదరు

గు:- శ్రీవత్సా సంవత్సరమును పండ్రెండు భాగలుచేసి ఆయా కాల వాతావరణము ననుసరించి పండ్రెండు నామములమ ర్చిరిగాని ఇవి నిర్జీవప్రతిమలు మానవుని పాపపుణ్యముల గ్రహించు కొని మరుజన్మకు తిరిగి విడువబడు శక్తివంతమగు గ్రహమండల ములుగావు- ఆశక్తి గ్రహములకే గలదు. వీటికి మానవునికి సంబం ధము లేదు శోధింపవలసినవి గావు ఇందులో శుభాశుభముల గలి గించుశక్తి ఏమాసమునకు లేదు. గ్రహబలానుకూలముగ నేమాస మైనను వివాహమునకు యోగ్యమనియే చెప్పవలయును— పెద్దవా రెందుకు వ్రాసిరను చదువరులు లేకపోలేదు, పెద్దవారుకూడ మాన వులే గ్రహబలము గలిగినవారేగాని అయోనిసంభూతులుగాదు. వారి కక్కడికే గానవచ్చినది అక్కడికే మార్గమేర్పడినది అవతలకు పోకూడదన్నారా? వారివారిబుద్ధిబల మెంతవరకో అంతవరకుపోయి ఒకరినొకరు కాదనలేక మతములనిరి. దృక్కుకుమాత్రము లేదు— మహనీయులగు తపస్వులపేర్లిడి వారిని గడ్డకీర్చిరని గమనించు- మునుల పలుకులేయైన చక్కనితోవలే గన్పడియుండునని తెలుసు కొనుము- ఇక ధనుర్ మకరమాసములు, మిధున కర్కాటకమాస ములు అమంగళకరమనుట అమంగళము. ఇవి అయన సంధులు గాబట్టి వారనిరి. సంధి కాలమనిన మృత్యుప్రదమని భావించిరి—

వారిని కాదనువారిని మాత్రము కానము. సంవత్సరసంధి ఆయన సంధి, ఋతుసంధి, మాససంధి, పక్షిసంధి వారసంధి, తిధిసంధి, లగ్నసంధి, నక్షత్రసంధి, దినసంధివరకు తీసిరి. ఈసంధుల తప్పించుకొని గ్రహబలము చూచుకొనవలయునన్న శాస్త్రము తల్లక్రిందులగును- అలవిగాదు- చూడ పనిలేదు—

నాయనా- దినసంధి ఒకటి పాటించవలసియున్నది ఉదయం మధ్యాహ్నం సాయంత్రం మిగతసంధులు విడువుము- కాలమునకు సంధిఇదియే కంటికగుపడు సంధులివియేగాని వేరొకసంధి నీకగుపడదు. అవి కాలమును లెక్కించుటకని గమనింపుము- దృఢమనస్కుడవుగమ్ము- వారి ననుసరించిన కన్నులున్న గృద్ధివగుదువు— కన్నులుతెరచి చూడుము. దినమునకు సంధులున్నవిగాని కాలమునకు సంధులులేవు విమర్శించ బోకనమ్ముము —

నాయనా- మేషాదిలగ్నములు-భూమ్యాదిలోకములు-మేషాదిలగ్నములు అన్నారు. గాబట్టి మేషకటక సింహధనుస్సులు గురుపాలితులకు వృషభకన్య మకరములు శనిపాలితులకు శ్రేయమొసంగు లగ్నములు బలానుగుణ్యముగ ఏతెగవారికి ఆతెగలోగల లగ్నములన్నియు మాసము లన్నియు, వారము లన్నియు, క్షేమమేనని యెరుంగుము. సంధియన్న పదము వదలుము

నాయనా- మేషాధి నాలుగవఇల్లు కటకం. అయిదవది సింహాము తొమ్మిదవది ధనస్సు మేషాది లగ్నపంచమ భాగ్యస్థానములు చతుర్ధసుఖస్థానముగదా- ఇట్లే లగ్నపంచమ భాగ్యస్థానములు ఏలగ్నజాతకునికైన శుభములే ఆయామాసములు ఆయావారములు ఆయారంగులు శుభష్కరములే యగును.

లగ్నపంచమ భాగ్యస్థానములే పూర్వపుణ్య స్థానములు. ఆ స్థానాధిపతులే పూర్వపుణ్యగ్రహములు వీటి ననుసరించియే శాస్త్రము నిలచి యున్నది.

మేషకటక వృశ్చిక ధనుర్ మీనజాతకులకు ధనుర్మాసము కటకమాసము ఎందుకు పనికిరాదు మకరకుంభ వృషభమిధున కన్య తుల రాసులవారికి మకరమాస మెందుకు పనికిరాదు. ప్రతిరాశికి లగ్నపంచమ భాగ్యములగునుగదా. ఎందుకు పనికిరావు. వారు సంధిమాసములుగా తలంచి వద్దనిరిగాని ఇందులో ఏజబ్బులు లేవు.

ఇక మాసములనిన సూర్యుడున్నరాసికి మాసప్రారంభము ముందగునుగదా-

సూర్యుడు తిరిగెడిరాసులకు సంధి చైత్రాది మాసములకు సంధి కాలమంతయు సంధిలోపోయినది. వ్యర్థమైనది.

శ్రీ:- స్వామి మిధునలగ్నము అందులోగల పునర్వసు కటక లగ్నము పుష్యమి వాడుకొన్నారే సూర్యుడక్కడున్న పనికిరా దన్నారే- ఏల-

గు:- మేషాది మీనాంతరమువరకు చైత్రాది ఫాల్గుణాంతము వచ్చినది—— మిధునరాసి వివాహయోగ్యమై మిధునమాస మెందుకు యోగ్యముగాదు కటకలగ్నము యోగ్యమై కటకమాస మెందుకు యోగ్యముగాదు ఆయన మార్పిడియేగాని సూర్యుని మార్పిడి ఏమిలేదుగదా. ధనస్సు మేషాది నవమస్థానము ప్రపంచమునకే శుభకరమైనది దైవ యోగ్యమై భాగ్యమునకు నెలవై శుభకార్యములకు ఆటపట్టైయున్న ధనుర్మాసమును యోగ్యము కాదనడము చాలా హేయ్యము. శోచనీయము. ఇది అయన సంధిగమానిరి, మేషాది, దశమ స్థానము, మకరమాసము. మకరములో సూర్యుడుండుట పనికిరాదు. మకరలగ్నము అందులోగల, ఉత్తరాషాఢ శ్రవణధనిష్ఠలు పనికివచ్చు నన్నారు. శని గృహములలో కుంభము పనికి వచ్చును. మకరము పనికిరాదు. శని పనికిరాడు. శని గృహములు పనికి వచ్చును. ఈ తరహాచూచిన ఆది, అంత్యములు,

అయన సంధులని తలంచి మానిరని తోచు చున్నది. ఇట్లే, వరాహ మిహిరులవారు కుంభలగ్నము లగ్నములలో మంచిది గాదన్నట్లు లున్నది.

శ్రీ:- స్వామీ-సంవత్సర అయన ఋతు, మాసములన్నీ, కాలము తెలుసుకొనుటకే గాని, మానవుని పాప పుణ్యముల ప్రసరింపజేసి సుఖ దుఃఖముల గల్పింప లేవంటిరి అప్రాణిచయ మంటిరి ఇదియూ లేదా-

గు.- ఔను నాయనా యోచించి పలికిన పలుకులు గావు. మాసములకు శుభాశుభములు లేవు. ఎండ, గాలి, వాన చలియను కాలములలో మానవునికి ఈతిబాధలు గలవు గదా, వాటి బాధల తప్పించుకొనుటకు కొంత పన్నిరి కొంత సంధి తీసుకొనిరి గాని, యోచింప తగినవిగావు. లగ్నాధి గ్రహబలమును తెలుసుకొని జోస్యుడు ముహూర్తము. నిర్ణయించుట_క్షేమము కాలమంతయు వ్యర్థము చేయుటగాక గ్రహానుకూలతకు అడ్డుతగులును- వీరి నను సరించిన అశుభకరమని తలంచుము —

శ్రీ: స్వామి మాసములో రెండుభాగలుచేసి శుక్లపక్షమని కృష్ణపక్షమనియు అందులో శుద్ధపంచమినుండి కృష్ణపక్ష పంచమి వరకు మంచిదన్నారే దీని విషయమేమి.

గు:- పక్షములు చంద్రుని పూర్ణత్వ క్షీణత్వముల కంటికగు పడునట్లు చేయుచున్నవి శుక్లపక్షములో దినదినాభివృద్ధియై పౌర్ణిమ నాటికి సంపూర్ణ స్థితినొందును. కృష్ణ పక్షములో, దినదినమునకు సన్నగిల్లుతుపోయి అమావాశ్యనాడు కంటికగు పడడు గాని, చంద్రుడు మాత్రము సూర్యుని వెనుక నున్నాడు. తన శుభాశుభత్వముల మానవులపై ప్రసరింప చేయుచునే యున్నాడు.

పూర్ణచంద్రుడు దేనికి ఎవరికి శుభుడన్న ప్రశ్నయే లేక శుభుడు కావలయు చంద్ర బలము కావలయుననిరి-ఏ లగ్న జాత

కునికన్న మాటయే లేదు-క్షీణుడైనంతనే అశుభత్వము పాపత్వము దుర్బలత్వము వచ్చునన్నారు .. చంద్రుడు మీన, మేష, కటక తులా వృశ్చికములకు మినహా మిగతా రాసులకు బాధనీయుడు. లగ్నాత్ పాప స్థానాధిపతి.

శ్రీ:- స్వామీ అదెట్లు, ఈరాసులకు శుభుడై మిగులు, రాసులకు పాసియెయ్యేనో శలవిండు.

గు:- వత్సా, మీనమునకు పంచమాధిపతి మేషమునకు చతుర్ధాధిపతి కటకమునకు లగ్నాధిపతి తులకు దశమాధిపతి వృశ్చికమునకు నవమాధిపతి గాబట్టి శుభుడయ్యెను-మిగత రాసులకు తృతీయ షష్టాష్టమ వ్యయ ఏకాదశ స్థానాధిపతి యగును ఆదిపత్య దోషము సూర్యచంద్రులకు మిక్కుటముగా గలదు. ఒకే యింటివారు గనుక వచ్చినపేరు మారదు. ఈలగ్నములకు చంద్రుడు పాపిగా భావించ వలయును-

శ్రీ:- లగ్నాంత్యమనిన యేమిస్వామీ.

గు:- వత్సా మృగశిరనక్షత్రములో చంద్రుడుండగా లగ్నము నిశ్చయింతురు. వృషభరాశిలో మృగశిర రెండుపాదములు మాత్రమే గలదు. చంద్రుడు దుర్బలుడుగాదా. కృత్తికాత్రిపాదం రోహిణిమృగశిరార్ధమనిగనా యున్నది. ఈతొమ్మిదిపాదములలో అంత్యపాదములందు చంద్రుడు దుర్బలుడుగాదా ఏగ్రిహమైన రాశ్యాంత్యమున దుర్బలుడుగాదా. తొమ్మంద్రుగురిలో చంద్రుని ముందుకుతెచ్చి అందరిని వెనుకకునెట్టి దేనికి చంద్రబలము ఆవశ్యకమనిరి.

నాయనా- శుక్లపక్ష చంద్రునికన్నా రాశిలో బలవంతుడౌట ముఖ్యముగా నెరుంగుము. అమావాశ్య సమీపించినంతటితో చంద్రుడు దుర్బలుడనకు. రాశిబలమే బలముగాని శుక్లపక్ష చంద్రుడుగాదని తలంపుము-

చంద్రుడు ఎప్పటికి నున్నాడు- నీకంటికి కానరాక పోయిన

బలములేదని తలంపకుము చంద్రుడుపాపియై బలవంతుడౌటకన్నా వేరొండు విపత్తు లేదని తలంచుము.

శ్రీ.- క్షీణచంద్రుడు మేలుచేయలేడు. పాపియన్నారే నిజమే నందురా.

గు:- గ్రహములు లగ్నాత్పాపులగుదురు-పాపులు క్రూరులు నవగ్రహములలో నెవరులేరు. పాపులగుటకు శుభులగుటకు లగ్నమే కారణము— పూర్వపుణ్యస్థానములని, పాప స్థానములని విభజనగలుగుట లగ్నమును బట్టియేగదా. పూర్వపుణ్య స్థానములవారు పుణ్యులు పాపస్థానములవారు పాపులు- పుణ్యస్థానములలో పుణ్యముండును- పాపస్థానములలో పాపముండును- అందువలన కొందరిని పాపులనవలసి వచ్చినదేగాని వారు పాపులు గాదు. మానవుడు పాపపుణ్య మిశ్రితుడు గాబటి లగ్నము పాపపుణ్య మిశ్రితమైనది- ఈలగ్నము జనార్ధన పాలితమా- మహేశ్వరుని పాలితమా- అని తెలుసుకొనిన శుభాశుభుల నెరుగనగును. ప్రమాణగ్రంథముల నిర్మించిన వారికే తెలియనందున లగ్నము ననుసరించి గ్రహములకు పాపత్వము, పుణ్యము సంభవించుననక రవికుజ రాహుకేతుశనుల క్రూరులుగా సృష్టించిరి. దీనితో జోస్యమునకు ప్రాణవాయువు నశించెను. గ్రహములలో పాపులెవ్వరు లేరు. అందరు పూజనీయులే. నీ పాపపుణ్యముల ననుసరించి జననములో లగ్నము నిశ్చయమగును. పుణ్యమున్నచోట్లు పాపమున్న స్థలములు స్థానాధిపతులు శాస్త్రజ్ఞునికి తెలియును గాని క్షీణచంద్రునిలో పాపములేదు. పూర్ణచంద్రునిలో పుణ్యములేదు-రాశిలో ఆరోహణగ్రహముగా నుండుట బలము అవరోహణలో నుండుట దుర్బలము. అనగా- రాశిలోగల తొమ్మిది పాదములలో అయిదవపాదము విడచినది మొదలుకొని దుర్బలత్వమునకు నాంది యనుకొనుము— లగ్నములో సగము దాటినది మొదలుకొని అవరోహణ యగునుగదా—

పూర్ణచంద్రుడు శుభుడన్నవచనము హోరప్రాప్తి లగ్నము నుండి శుభాశుభములు శుభాశుభులు గ్రహములగుదురు. పూర్ణచంద్రుడు శుద్ధబుధుడు శుక్రుడు గురువు శుభులు మిగులు గ్రహములు క్రూరులు పాపులనుట శాస్త్రదూష్యమగును. జ్యోతి కూర్మనను అందున శుభులేనని తలంచు—

శ్రీ:- స్వామి- గ్రహబలము పాపులకుగాని, శుభులకుగాని, లగ్నములో ఒకటి రెండుపాదములలో గ్రహమున్ననే బలమధికమున్నాదన్నగా.-

గు:- ఔను- మేషరాశిలో అశ్విని, భరణి, కృత్తిక- పాదమున్నారుగదా. అశ్విని ఒకటోపాదములో గ్రహముండిన రాసినంతటిని చూచును— అక్కడున్న ఫలమేమిటో సర్వము నిచ్చును- కృత్తిక ఒకటోపాదములో గ్రహముండిన రాసి అంత వెనుకబడి పోవను. ఫలము నిష్ఫలమగును. గ్రహముండి ఫలములేదు ఇది ప్రతిగ్రహమునకు ప్రతిస్థానమునకు గలదని నెరుంగుము- పాపగ్రహములు దుర్బలములై శుభులు బలవంతులై గ్రహానుకూలత దశానుకూలతగలవారే గొప్పవారై ప్రకాశించుచున్నారు- లగ్నపంచమ భాగ్యస్థానములు నాయకులు పాపులచే లయమయి పోయినవారే బుద్ధిబలము దేహబలము ధనబలముచెడి కాయకష్టముతో దాస్యము చేసి బ్రతుకుతున్నారు. ముందుజన్మలో ఏపుణ్యము చేయని జీవులు వీరనితలంచు. లగ్నపంచమ భాగ్యస్థానాధిపతులు ఎచ్చటనో ఒకచోట సజీవులై యుండినచో ఆమానవుని సజీవునిగా చేయును- ఈముగ్గురు నిర్జీవులైన మానవుడు నిర్జీవియై బ్రతుకును- దీని తెలియ చెప్పెడువారులేక ప్రజలు అమితపాపములకు ఒడిగట్టుచున్నారు. మానవుడు ముందుజన్మమున చేసినపుణ్యము లగ్నపంచమ భాగ్యస్థానముల స్థానాధిపతులలో నుండెనని తెలుసుకొనుము—

శ్రీ - స్వామి- చంద్రునకు బాల్యయౌవన కౌమార వృద్ధాద

వ్యములు గలవన్నారే నిజమా.

గు:- బాల్యమున స్త్రీ పురుషులను పోషించువాడు చంద్రుడు యౌవనమున పురుషులను కుజుడు స్త్రీలను శుక్రుడు పోషించును కౌమారములో పురుషులను సూర్యుడు స్త్రీలను చంద్రుడు పోషించును. వృద్ధాప్యములో పురుషులను గురువు స్త్రీలను శని పోషింతురు గాని చంద్రునకు బాల్యములేదు వృద్ధత్వములేదు. ఎప్పటికి కౌమారదశలోనే యుండును. చంద్రబలము వల్లనే స్త్రీ మాతృరూపము ధరించును. లేకున్న కన్యాత్వములోనే నిలచిపోవును మాతృవుగా స్త్రీ మారవలయునన్న చంద్రబల మావశ్యకము ఇంతేగాని చంద్రునకు బాల్యములేదు. వృద్ధాప్యము లేదని గ్రహించు.

శ్రీ:- స్వామి-గ్రహములలో చంద్రుడు మానవులకు ముఖ్యుడైనట్లు- చంద్రుని- నక్షత్రమును చూచుచు లెక్కించుచు తారాబలము ముఖ్యముగా చూడవలయుననిరి- తారాబలము సరిపోకపో యిన వధువుకు పేరు మార్చుమనిరి. పేరుమార్చినట్లయిన శుభము చేకూర్చునా. పేరులో అదృష్ట దురదృష్టము లుండున- నక్షత్రము— నక్షత్రముపైనున్న చంద్రుడు సుఖదుఃఖములు గల్పింప జాలునా?

గు:- శ్రీవత్సా- ఎటుపోవుటకు దారితెలియనప్పుడు ఏదారినో ఒకదారిన మానవుడు పోవలయునుగదా. గమ్యస్థానము చేరని చేరకపోని దొరికినదేదారియని నడచినారు తెలిసియుండిన వారెందు కట్లు పోవుదురు. ( ఉదాహరణ ) లగ్నము, బేటరీ, నక్షత్రము శెల్పు గ్రహముబలువు- బల్బులేక బేటరీ, శెల్పులు పనిచేయనట్లు గ్రహము లేని లగ్నములు- నక్షత్రములు పనిచేయవు- మానవునికి సుఖదుఃఖములు గల్పింపజాలవు- లగ్నము- నక్షత్రము- గ్రహము సంధించి నప్పుడే వెలుగు నిచ్చును- అది చంద్రునియందు గలదు గాని ఆచంద్రుడు శుభుడా లేక అశుభుడా అని తెలుసుకొనకచేసిన ఆచంద్రుడే మృత్యువగును- తారాబలము మాత్ర ముపకరింపదు.

గ్రహములుండుట చూచుటలోగల లగ్నములు నక్షత్రములు వెలుగొంది సుఖదుఃఖముల గల్పించును. ఈవిషయములు గమనింపక తారాబలమని ప్రక్కదారి నొకదారిని గల్పించి నామనక్షత్రము నుండి దిననక్షత్రమువరకు లెక్కించి తొమ్మిదితో భాగించగ శేషము తారగా భావించి వారుమంచిదన్న తారవచ్చిన మంచిదన్నారు- ఈతొమ్మిదితారలలో కొన్నిమంచివిగాను, కొన్నిచెడ్డవిగాను వ్రాసిరి గదా—— మంచితారవచ్చినను మంచినక్షత్రమే లభ్యపడినను మంచివిగా తిథి యోగకరణములు తటస్థించినను సప్తమాష్టమములలో పాపగ్రహములున్న వధూవరుల జీవితము దుఃఖభాజనమేయగును. వధూవరుల జీవితము కలయిక అన్యోన్యత ఆనందము ఆయుర్దాయము మాంగల్యభద్రత మొదలగునవి. సప్తమాష్టమములలో గలవని తెలియనివారే దారి నేర్పరచిరి. ఈతారాబలము అజాగళస్తనములు పేరుఫలాలు వ్యర్థభాజనము తిథివారనక్షత్ర యోగకరణములు బలాబలములు మంచిచెడ్డలు వృధాప్రయాస- పేరుతో అదృష్ట దురదృష్టము లుండిన ఒకపేరమ్మ చక్కగా కాపురము చేయుచుండును-మరొకపేరమ్మ విధవయై మూలనకూర్చొని మైధున నిద్రాహారములకు మలమలమాడు చుండును- దీని కేమనును శాస్త్రము పలుకునాపలుకదు- నీళ్లున్నవన్నచోట నీళ్లనిలచు పల్లమైనావుండదు- పేరులో పరమాణుబలము కూడా లేదు. వారివారి ఇలువేల్పు ననుసరించి పేరు పెట్టియుందురు, అందులో శుభాశుభములు ఏమిలేవు. గ్రహరూపి జనార్దనఅన్నారేగాని తిథిరూపినక్షత్రరూపి యోగరూపి తారారూపిఅనిఎక్కడాలేదు గదా- ఈగోలంత తెలియక తెలిపినది- తెలియనివారు తెలియనట్లుండక తెలిసినట్లు వర్తించిన తప్పక ప్రమాదము సంభవించునన్నట్లు జ్యోతిష్యప్రమాదము జరిగినదనవలయును

వత్సా దిననక్షత్రముపై చంద్రుడుండును. చంద్రుడున్నదే దిననక్షత్రముగదా. జన్మనక్షత్రము-లేదా నామనక్షత్రము- మొదలు

కొని చంద్రునివరకు లెక్కించి అనగా-దిననక్షత్రమువరకు లెక్కించి తొమ్మిదితో భాగించగ మిగులు శేషమును తారలుగా భావించుటలో గ్రహములకు సంబంధము లేదు గ్రహవీక్షణలేక ప్రపంచములో స్థావరజంగమములకు సుఖదుఃఖములు లేవు- చావుపుట్టుకలు లేవు-

జీవులకు దేవునికి సంబంధములేదు. కర్మకు సంబంధమున్నది. కర్మము గ్రహమండలము లందు నెలకొనియున్నది. గ్రహరూపముతో చావుపుట్టుకలు, సుఖదుఃఖములు గల్పించు చుండెనని తెలుచున్నది (ఉన్నదంతే) భగవంతునితో సంబంధము కల్పించుకొనవలయునని వారిని ధ్యానించిన వారిని- నమ్మినవారిని మాత్రము తాను చూచును—— నీ ఉపాసనాశక్తిని నీమొరను నీవిన్నపముల నీజాతకరీత్యా నవమస్థానము ఏగ్రహమునకు సంబంధించినదో ఆ మండలము ఆగ్రహము సంగ్రహించుకొనును- అద్దానిని నీ ఉపాసనా దైవము అలకించును ఆలోకించును. ఆచోట ఆఫలము దిన దినాభివృద్ధిచెంది మరుజన్మకు ప్రసారమగును. ఇట్లున్న మార్గమును గమనించక పెడమార్గ మొకదానిని గల్పించిరి- సంపత్తార సంపత్తు నివ్వలేదు, క్షేమ తార క్షేమము నివ్వలేదు. విపత్తార విపత్తును గల్పింపలేదు——

శ్రీ:- స్వామి- ఈతారాబలము వివాహమున కొకటికే గాదు అన్నిటకు బలాబలముల తెలుపుటకు చూచుచున్నారు- అయ్యా ఈ ఊరు విడచి ఆఊరు చేరుచున్నాను. నాపేర బాగున్నదా అనిఅడిగిన నామనక్షత్రము నుండి ఊరు నక్షత్రము వరకు లెక్కించి భాగించి మంచితారవచ్చిన బాగున్నదని బాగులేదని చెప్పెడివారు గ్రామచక్రం నరాకారమన్న శ్లోకరీత్యా చెప్పెడి వారున్నారు- తారాబలము చూడనిది ఏదిలేదు——

గు:- ఔను- పృచ్ఛకుడు వచ్చినప్పుడు తత్కాల లగ్నమేదో గమనించి దానిలో గ్రామస్థానము తెలుసుకొని అందు శుభగ్రహ

ములున్నవా పాప ఖండితా గమనించిన ఎన్నిఊర్లు తిరుగగలది- అక్కడెట్లుంచినది. తిరిగి స్వగ్రామము చేయునది చేరనిది- ఈలాటి విషయముల ప్రశ్నైన చెప్పవగునుగాని తారాబలము చెప్పగలద— నాయనా- ప్రమాణగ్రంథము లందులేనప్పు డేమిచేయగలరు. గ్రంథ కర్తలే గాబరాపడి ఏదో ఒకదారిని చూపినారు విమర్శకు నిలవదు- విమర్శకు దృక్కుకు నిలువనిది. శాస్త్రము గాదు. మతము గాదు ఇదినామతమన్నచో దృక్కుకు నిలువవలయును ఊరకనిన గాలిలో ఊపెదరు. నిలువనివ్వరు—

శ్రీ:- స్వామి- మకరకుంభ మిథునకన్యలకు సూర్యచంద్రు లిద్దరు పాపలు గదా- వీరిబాధ కొంత తగ్గించు కొనవలయునన్న ఏమి చేయవలయును—

గు:- నాయనా- వారున్నరాశిలో దుర్బలులుగా రాశ్యాంత మున నుండునట్లు చూచి రాత్రి నాలవయామమున ముహూర్తము కుదిరింపవలెను. పూర్వులవలె చంద్రబల మావశ్యకమనక అమా వాస్య సమీపింప చేసిన దుర్బలులగుదురు- ఈరాసులకు పగలు బలములేదు- శనిపాలిత లగ్నములు గనుక రాత్రికాలము మంచిది. రాత్రి మంచిదన్నారని ప్రథమ, ద్వితీయ, తృతీయ యామములందు చేయరాదు. రాక్షస కాలమగును. మానవులకు దుర్బలకాలము నాలవ యామముగా నుండవలయును- కొన్నిజాతులవారు కొన్ని మతములవారు అర్ధరాత్రియందే వివాహములు చేసుకొందురు. కొం దరు శాస్త్రజ్ఞులు రాత్రియనగా రాత్రియేగా యని మూడవయామము నందే శుభకార్యములు ప్రారంభింతురు- అది రాక్షసకాలము, రాక్ష సత్వము పనికి రాదందురు- శనిపాలిత లగ్నములకు పరవాలేదు గాని అయినా నాలవయామమే శ్రేయము—

శ్రీ:- స్వామి- శుక్రగృహములలో వృషభమునకు చంద్రుడు తులకు సూర్యుడు పాపలుగదా దీనినెట్లు చేయవలయునందురు—

గు:- వత్సా- లగ్నోత్తమ లగ్నములగు మేషవృషభ తుల వృశ్చికములలో ఇదియొకటి- మూడింట్ల చూపుగల గ్రహము శని పాలిత లగ్నములకు శనియొక్కడే- శని వృషభలగ్నమునకు చంద్రుని చూచునట్లు చేయవలయును- తులాలగ్నమునకు సూర్యుని చూచునట్లు చేయవలయును- మూడింటిచూపుతో పదింటిచూపుతో చూడవలయును- ఏడింట చూడరాదు- ఆయుఃకారకుడు శనిగనుక పాపుడు ఆయుక్షీణ మొనర్చును సమసప్తమ మే గ్రహమునకు పనికి రాదు శనిపాలిత లగ్నములకు శని చూడవలెను- గురుపాలితలగ్నములకు గురువు చూడవలయును లేదా కుజుడు చూడవలయును- చంద్రుడు శుభుడైన లగ్నములకు ఎవ్వరు చూడనక్కరలేదు. తానే శుభుడైన మరింత మంచిది.

శ్రీ:- అనగా- సూర్యచంద్రులు పాపులగు లగ్నములకు అమావాశ్య ఎంత సమీపించిన అంత మేలనిగదా తామందురు.

గు:- ఔను- ఉన్నదంతే నేననునదీ అంతే.

శ్రీ:- శనిపాలిత లగ్నములకు రాత్రి. గురుపాలిత లగ్నములకు పగలు బలమందురా?

గు:- ఔను- ఈశ్వరాంశజులు. శని శుక్ర బుధ రాహుగ్రహములు గాబట్టి రాత్రికాలము శనిపాలితులకు బలము- నారాయణాంశజులు గురురవికుజచంద్రకేతుగ్రహములు గాబట్టి పగలు గురుపాలితులకు బలము- పగలని నాలుగుగంటలని కూడ ముహూర్తములు నిర్ణయించుచున్నారు పగలు రెండవయామము లోపలనే యుండవలెను. అనగా- పండ్రెండుగంటలు దాటరాదు- ఇది దైవనివేదనా కాలమందురు- పండ్రెండుగంటలు దాటిన అపరాహ్ణమందురు- పితృదేవతా నివేదన కాలమందురు గాన శుభకార్యములు పండ్రెండు గంటల లోపలనే యుండవలయును- పండ్రెండుగంటలు దాటిన అది కాలమందురు- సప్తమస్థానము చెడినవారికి అకాలనిద్ర, అకాలభోజ

నము, అకాలవివాహము, అకాలకామసుఖము, అకాలప్రయాణములు, అకాలసంసారము తోడ్పడును- సకాలమునకు దొరకదు- అకాలమనగా పగలు పండ్రెండు గంటలు దాటినది మొదలుకొని రాత్రి నాల్గవయామము ప్రవేసించిన దనుక అన్నారు. దీనిని వేకువ జామందురు. రాత్రి నాలుగు గంటలనుండి శుభకార్యములకు శుభప్రదమని తెలియవలయును. శుభ ముహూర్తములు అపరాహ్ణములో చేయరాదు. శని పాలితులకు నాలవయామము నుండి సూర్యోదయము వరకు శ్రేయము.

శ్రీ:- వ్రతములు కొందరు అకాలములందే చేయుచున్నారే అశుభమేనందురు.

గు:- వ్రతములుకూడ దైవ నివేదన కాలమందే చేయవలయును. సత్యనారాయణ వ్రతము మొదలుకొని అపరాహ్ణములందుగాని పగలు నాలవ యామమందుగాని చేయుచున్నారు. ఇది శ్రేయస్కరముగాదు. సూర్యోదయమునకే ప్రారంభించి పండ్రెండు గంటలకు లోపలనే సమాప్తము చేయుట క్షేమము

శ్రీ:- ధనస్సుకు అష్టమాధిపత్యమువల్ల చంద్రుడు- షట్స్థానాధిపత్యమువల్ల మీనమునకు సూర్యుడు- పాపులు గదా ఈలగ్నముల వారికి పగటి ముహూర్తములు మంచిదందురా? లేక రాత్రి మేలందురా?

గురు:- వత్సా ధనుర్ మీనములు గురుగృహములు పగలే బలము గురుకుజుల చూపు ఆగ్రహములపై పడునట్లు చూచిన దోషపరిహారమగును. గురువు అయిదింట తొమ్మిదింట చూడవలయును. కుజుడు నాలుగింట ఎనిమిదింట చూడవలయును. గాని, గ్రహమున కెదురుండరాదు.

శ్రీ:- శుభుల కెదురుగ పాపులుండిన శుభులకు బలము లేదందుర.

గురు:— వత్సా- శుభులకు పాపులు ఎదురుగ నుండిన శుభా శుభములు మిశ్రమములై పోవును శుభము అశుభమగును. అశుభము శుభమగును. శుభునికి పాపిఎదురు గాకూడదు. సత్ఫలము దుష్ఫల మగును.

శ్రీ:- స్వామీ- పాపగ్రహమును శుభగ్రహము చూచును గదా. పాపగ్రహ మున్నచోటు శుభత్వ మొందునా?

గు:— నాయనా శుభుడు పాపిని చూడడమువల్ల నూటికి డెబ్బై భాగలు ఉపశమన మగునుగాని పాపియున్న చోటునుండి చూచినచోటు పాపత్వము చెందకపోదు. ఆ స్థానమెయ్యదియో అచ్చోట కారకత్వము లేవిగలవో వాటిని నశింపచేయును. దుష్ఫల స్థానమైన దుష్ఫల మధికము చేయును. సత్ఫలస్థానమైన సత్ఫలము పాడుచేయును-

శ్రీ:- స్వామీ- వారములలో బుధ, గురు. శుక్రవారము లుత్తమములనియు ఆదిశనివారములు మధ్యమములనియు మంగళ వారము మారకమనియు సోమవారము పునర్వివాహము గలిగించున నియు కాలామృతాది శాస్త్రములు చెప్పుచున్నవి తామేమందురు—

గు:- వత్సా! శాస్త్రకారకులు వారములకు గ్రహనామము లనే నియమించు టెందుకో గమనించలేదు. సోమవారము పునర్వి వాహము మంగళవారము మారకము గల్పించుటకు శక్తియున్నదా లేదా? అని గమనించక పలికినపలుకులు సప్తమాష్టమములలో శుభ గ్రహములున్నవారికి మంగళవారము మారకము చేయలేదు. సోమవారము ద్వికళత్రమును గలిగింపలేదు- గ్రహములలో రవి శని కుజుల క్రూరులుగాచేర్చి వారములలో ఆది శని వారములు మధ్యమములనిరి. అంగారకవారము బోడికొట్టునని భయపడి మారకుడనిరి. క్రూరుల క్రూరులుగా నుండనివ్వక రవి శనుల తీసు కొని కుజుని మారకుడనిరి. దేశమందరిని మంగళవారము చంపు

నని చెప్పిరి. కుజుడు మంగళుడేగాని అమంగళుడు గాడని ఒక్క
రైనా తెలుపక పోయిరి. మేషాది క్రమేణ- అని లెక్కించిరి.
మేషము, కుజ గృహము, భూమి మొదలుకొని సువర్లోక పర్యంత
మనిరి. భూమికి అధిపతి కుజుడు- భూ పుత్రుడనిరి- బాల్య యౌవన
కౌమార వృద్ధాప్యములలో యౌవన కాలాధిపతి కుజుడు- ప్రజారక్ష
కులకు ( పోలీసు ) దేశ రక్షకులకు ( మిల్టరీ ) కారకుడు కుజుడు-
దశ దిక్కులలో రెండు దిక్కులకు ఆదిపత్య మిచ్చిరి ( దక్షిణము
భూమి ) కుజునకు స్థావర వర్గమునకు దుర్గములకు పర్వతములకు
అధిపతి కుజుడు- సూర్యునకు అంగరక్షకుడు కుజుడు నవ నాయకు
లలో యౌవనవంతుడుకుజుడు అట్టికుజుని పేరుగలవారమును మార
కమని విసర్జించిరి- కుజగృహములగు మేషవృశ్చికములు పవిత్రము
లుగా భావించి లగ్నములుంచుచుండిరి-వత్సా సప్తమాష్టమములలో
శుభగ్రహము లున్నవానిని మంగళవారమేమి చేయుననువారులేక
పోయిరి-మేషవృశ్చికములకు లగ్నాధిపతి లగ్నాధిపో దైవః అన్నారు.
కుజుడు దైవమైనప్పుడు మంగళవార మేమగునను వారులేకపోయిరి.
కటక సింహ ధనుర్మీనములకు పంచమ భాగ్యస్థానాధిపతియై
అంగరక్షకుడైయున్న కుజగ్రహవారమును మారకమనిన పట్లను
వారులేకపోయిరి. గురుపాలిత లగ్నజాతకులకు మంగళవారమెంతో
శుభమని తెలుపువారగుదైరి నాయనా- ఇట్లే వివాహములకు సోమ
వారము పునర్వివాహము గలిగించునని విసర్జించిరి. సోమవారమును
గురించి వ్రాసిన భారతమగును- తిథులు, నక్షత్రములు, వారములు-
యోగములు, పునర్వివాహము గలిగింపలేవు. సప్తమాష్టమములు
చెడుట. శుక్రునితో పాపగ్రహములు చేరుటచేత గలుగును. సోమవా
రమున కాశక్తి లేదు- చంద్రబల మావశ్యమన్నవారే సోమవారము
వలదనుట ఎట్లున్నదో గమనింపుము- మరికొన్ని విషయముల గమ
నింపుము—— లక్ష్మీకరమైనది, సకలైశ్వర్యములకు ఆలపట్టయినది-

రాజలక్షణములకు ముఖ్యమైనది. జగత్తుకే మాతృకరమైనది సోమ వారము. ఈవారము లక్ష్మీవారమనక శుక్రవారమనిరి— శుక్రుని కాదివ్యతేజస్సంపన్నత ఎక్కడ గలిగెనను వారరుదైరి— శుక్రవారము పార్వతీవారము- శుక్రునిలో మాతృవిద్య గలదు, సంగీతము గలదు. దుష్ప్రవర్తనలకు ఆటపట్టు శుక్రదశ వచ్చుననగా ఎంతో సంతోషపడునట్లు చేసిరిగాని శివాంశజుడు ప్రపంచము లయమొనర్చువారిలో నొకడగు శుక్రునివారమునకు లక్ష్మీవారమని పేరిడిరి. శనివారము శివునివారము. శివునికి ముఖ్యము. శివపర్యాయమునకు శనిపాలితులకు ముఖ్యమగువారము- దీనినిమార్చి సోమ వారముగ జేసిరి. చంద్రుడు నారాయణాంశజుడని తెలియరైరి. శని శివాంశజుడని ఎరుగరైరి. మహావిష్ణువారము గురువారమై యుండ శనివారమునకు మార్చిరి. కలియుగనాయక కలికావతార యని వేంకటేశ్వరునికి శనివార మంటగట్టిరి. కలికాలమునకు నాయకుడు శనిగాని వెంకటేశ్వరుడుకాదని తెలియరైరి. ఈమహాపురుషునకు గురువారము, ఆదివారము ప్రీతికరమైనవి. ఈశ్వర ప్రీతికర శనివారము విష్ణువుకు తగలగట్టిరి లక్ష్మీవారమగు సోమవారము శివునికి ప్రీతికరమనిరి. ఈమార్పిడి మతద్వేషులు చేసినట్లు తెలియుచున్నది. శ్రీ రామానుజాచార్యులకు ముందు శివార్చకులు ప్రబలిన కాలములో ఈమార్పులు జరిగి యుండవచ్చును—

వత్సా- గురుపాలిత లగ్నములకు (గురుపాలిత జాతకులకు) మంగళవారము శుభము- శుభకార్యములకు ప్రయాణములకు క్షుర కర్మకు స్థాపితనిర్మాణములకు ఒకటననేల సర్వకార్యములకు శ్రేయోదాయకము- సోమవారము ధనస్సుకు- ఆదివారము మీనమునకు- పనికిరాదు. ధనస్సుకు చంద్రుడు- అష్టమాధిపతి మీనమునకు- సూర్యుడు షట్స్థానాధిపతి యగుటవల్ల వర్జించుట క్షేమము. మంగళవారము గురురవిచంద్రులకు ప్రీతికరము- సర్వానిష్టములకు అరిష్టము

లకు అంగారకుడని సర్వదారిద్ర్యములకు శనియని వీరిద్దరిని లోకభ యంకరులుగామార్చిరి. శుక్రబుధుల శుభులగాతీసికొని శనిని క్రూరు లలో చేర్చిరి. శివాంశజులలో శని ప్రధముడు అధనేత. అట్టివానిని దూరము చేసిరి. లోకుల భయపెట్టిరి. శనిపాలితలగ్నములకు (శని పాలిత జాతకులకు) శనిశుక్రబుధవారములు శుభమని తెలియుము- నాయనా- వారఫలము గ్రహఫలము నాశము చెందిన నాశమగును ఎట్లనిన- కుజుడు మేషవృశ్చికములు పాపులచే చూడబడి కూడబడి యున్న మంగళవారము- చంద్రుడు కటకము అశుభమైన సోమవా రము రవి సింహము అశుభత్వమైన ఆదివారము గురువు ధనుర్ మీనములు పాపులచే కట్టుబడిన గురువారము పాపత్వమొందును- గురుపాలితులకు పనికిరావు. వారఫలము నశింపగును. మార్పు చేసుకొనవలయును. శుభముగా నున్నవారమును తెలుసుకొనవల యును— గ్రహము గృహములు చెడిన ఆఫలములు సర్వనాశన మగును- గ్రహము గృహములు శుభత్వమొందిన సర్వశుభములు గలుగును— శనిపాలిత లగ్నములకు ఇట్లే యుండును. శని-మకర కుంభములు పాపత్వమొందిన శనివారము— శుక్రుడు వృషభ తులలు పాపులచే కట్టుబడిన శుక్రవారము- బుధుడు మిధునకన్యలు చెడిన బుధవారము పనికిరాదు. (ఉదాహరణ) గురుపాలిత లగ్న ములకు శని మీనములో నుండిన ధనస్సును పదింట చూచును— వృషభములోగాని ధనస్సులోగాని గురువుండిన శనిచూచును. అప్పు టిలో గురువుయొక్క సత్ఫలము ధ్వంసమగును- శనిపాలిత లగ్న ములకు కుజుడు మిధునములో నున్నప్పుడు కన్యలోగాని మకరము లోగాని బుధుడుండిన కుజుడు చూచును-బుధుని సత్ఫలము ధ్వంస మగును. ఆ గ్రహకారకత్వము లన్నియు సర్వనాశనమగును. గాన ఈవిషయము వారమున కొకటేగాక ఫలము చెప్పుటలో పూర్తిగమ నించవలసిన విషయమని యెరుంగుము—

శ్రీ:- స్వామి-అట్లయిన వారేభావముతో వ్రాసినారందురు-

గు:- వత్సా- వారు గ్రహకారకత్వముల పరికించి శుక్ర బుధుల శుభులని శుక్రబుధవారములు శ్రేయస్కరమనిరి. శని కారకత్వములు మంచివిగావు గాబట్టి క్రూరుడని శనివారమును దూరము చేసిరి. ఏల్నాటి శనియని పేరిడిరి. శనిపట్టినదని ఏదికాకపోయిన వాడుచుండిరి. శనియనిన గుండెదడ పుట్టునట్లు చేసిరి. శని- ప్రపంచములో దేహములో శుభాశుభములలో సర్వకార్యములలో అర్ధ భాగస్తుడన్నసంగతి తెలియక పలికినపలుకులుగాని వేరొండుగాదు- విష్ణువుదేవుడుగాదను మతస్తులు శివుడుదేవుడుగాదను మతస్తులున్నట్లు జోస్యులు శనిని, నలుపురంగును దూరముచేసిరి. ప్రతిజీవికి వాక్కు ఆహారము తీసుకొనుచు మలమూత్రముల విడుచుచున్నది. మూడు రంధ్రములు పనిచేయుచున్నవి. ముప్పురు పనిచేయకపోయిన లేక పోయిన జీవులులేవు, మూడుస్థానముల ముప్వేల్పులు పోషించుచున్నారు. దేహశక్తి, జ్ఞానశక్తి, ధనశక్తి. ఇవి శక్తిత్రయము. ఈశక్తులలో ఏశక్తిలేకుండిన మానవుడు వ్యర్థుడగునుగదా. శని వ్యోమ మార్గమునకు అధిపతి. శని కరుణలేకుండిన మలబద్ధకవ్యాధి ఏర్పడి మలము నోటనే వచ్చును. సమయమునకుచావక మలమూత్రములు బంధించి మలమూత్రములలో పొరలి చచ్చును- శని ఆయుఃకారకుడు. శనియే శివుడు, శివుడేశని- గురువే విష్ణువు- విష్ణువే గురుడు శనిలేని ప్రపంచములేదని యెరుంగుము—

ఇట్లే-సూర్యుని కుజుని క్రూరులనిరి. రాహుకేతువుల క్రూరుల క్రిందనే జమకట్టిరి ప్రతిగ్రహమునకు లగ్నమునుబట్టి శుభత్వపాపత్వములు వచ్చుచున్నవిగాని నైజపాపి నవగ్రహములలో నెవ్వరులేరని తెలుసుకొనుము—

శ్రీ:- స్వామి- రంగులు మానవునికి సుఖదుఃఖముల, అదృష్టదురదుష్టముల గల్పించెడిశక్తి ఉన్నదని కొందరు లేదని మరి కొందరందురు. ఈ మేము నెదరు—

గు:- శ్రీవత్సా- రంగులు గ్రహములకేయున్నవి గాబట్టి మానవునికి సుఖదుఃఖముల అదృష్టదురదుష్టముల గల్పింపగలవు- బుద్ధిని మార్చగలవు.

శ్రీ:- గ్రహములకు రంగులు ఎట్లో తెలుపుడు.

గు:- నాయనా- సూర్యునకు గోధుమరంగు, చంద్రునకు తెలుపు, కుజునకు ఎఱుపు, బుధునకు ఆకుపచ్చ, గురువుకు పసపు రంగు, శుక్రునకు తెలుపు, శనికి నలుపు, రాహువుకు ధూమ్రవర్ణము, కేతువుకు చిత్రవర్ణము-ఏఏగ్రహములకు ఆయారంగులు ప్రీతికరము వీటిలో గురుపాలితరంగులు, శనిపాలితరంగులు గ్రహముల బట్టి తెలుసుకొనుము- గోధుమరంగు, తెలుపు, ఎఱుపు, పసపు, చిత్రవర్ణము గురుపాలితములు నలుపు, చిలకపచ్చ, ధూమ్రవర్ణము (పొగ రంగు) తెలుపు శనిపాలితములు- చంద్రునకు శుక్రునకు ఒకేరంగు గలదు. గురుపాలితతెలుపులో పసపురంగు ఎఱుపు గీటులైన వుండుట శ్రేయము. శనిపాలిత తెలుపులోనలుపు చిలుకపచ్చ గీట్లుండుట శ్రేయోదాయకమని తెలుసుకొనుము—— ఉదాహరణ- మేషలగ్న జాతకునికి ఎఱుపురంగు దేహారోగ్యము దేహబలము-గోధుమరంగు జ్ఞానాభివృద్ధి, విద్యాభివృద్ధి- పసపురంగు ధనాభివృద్ధి దైవభక్తి కార్యసిద్ధియగును. లగ్నాధిపతి కుజుడు పంచమాధిపతి రవి భాగ్య స్థానాధిపతి గురువుగాబట్టి ఎఱుపు గోధుమ పసపు రంగులు ముఖ్యము- ఇట్లే ప్రతిలగ్నమునకు లగ్నపంచమ నవమాధిపతుల రంగులు శుభము. వస్త్రముల రంగులు ఇట్లేయుండుట క్షేమముగాని వస్త్రస్థానము చతుర్థమగుటచే చతుర్థమున ఏగ్రహముండునో ఏగ్రహము చతుర్థమును చూచునో ఆరంగువస్త్రము తప్పకాజీవి ప్రేమించును. ధరించును——

శ్రీ:- గురూ- నవరత్నముల ధనికులు ధరింతురే వాటియందు అదృష్ట దురదుష్టము లుండునందురా.

గు:- ఔను- నవరత్నములు నవగ్రహములకు ఒకొకరికి ఒకొకటి ప్రీతికరమైయున్నవి. రవికి మాణిక్యము- చంద్రునికి ముత్యము కుజునకు పగడము- బుధునకు మరకతము- గురువుకు పుష్యరాగము శుక్రునకు వజ్రము- శనికి నీలము- రాహువుకు గోమేధికము- కేతువుకు వైడూర్యము. నాయనా-ఈనవరత్నములు గురుపాలితులు శనిపాలితములను శనిపాలితులు గురుపాలితములనుధరించిన తప్పక దుష్ఫలితముల నిచ్చును- వీటిని దరించుటకు ముందుజన్మ సుకృతముండవలయును. లేకున్న ధనికుడైనను ధరింపజాలడు. ధరించువారు లగ్నపంచమ నవమస్థానముల గమనించవలయును—

శ్రీ:- స్వామి- జాతకములు లేనివారు ఏమిచేయవలయును.

గు:- పృచ్ఛకుడు అడిగిన టయమునుబట్టి తత్కాలలగ్నమేర్పరచుకొని వారికోరికేదో తెలుసుకొని నిర్ణయింపవలయును- గురుశని పాలితలగ్నముల తెలియక చెప్పరాదు. తెలియకపోయిన లగ్నపంచమ నవమములనైనా తెలియవలయును- కవులు, గాయకులు, సినీతారలు, పండితులు. విద్యార్థులు పంచమ స్థానగ్రహము ననుసరించియు- ధనికులు ధనాపేక్ష గలవారు- వ్యాపారస్తులు రాజులు భూస్వాములు నవమస్థానాధిపతిరంగును దేహారోగ్యము, దేహసౌఖ్యము కావలెననువారు వ్యాధిగ్రస్తులు లగ్నాధిపతిరంగును ధరింపవలయును. నిర్ధనికులు, సామాన్యులు ఆయారంగుల సామాన్యరాళ్లనైన ధరించుట క్షేమము లేదా రోల్డుగోల్డు రంగులనైన ధరించుట శ్రేయము.

శ్రీ:- స్వామి- నవలోహములలో వెండి బంగారు విలువైనవిగదా- ఆభరణములకు మూలధాతువుగదా- ధనికులయ్యు కొందరు బంగారమే వారిపైవుండదు. కొందరు నిర్ధనికులయ్యు వారిదేహమే బంగారము తగులును. దీని నేమందురు—

గు:- శ్రీవత్సా- గురువు గురుగృహములగు ధనుర్మీనములు చతుర్థస్థానము షాపులచే లయమైన బంగారువస్తువులు వాని

యందు చేరవు. వానిమనస్సు వాటిపై పోదు కాదని పెట్టుకొన్న విరిగిపోవుటో, పోవుటో, పగలిపోవుటో గలిగి ఇంటిలో పెట్టిలో భద్రముగా నుండును. లేద వేరేవారు అపహరింతురు. కటకము— చంద్రుడు శుద్ధముగా నుండిన వెండిపాత్రలు, నగలు దండిగా నుం డును- కటకము-చంద్రుడు పాపత్వమైయుండిన వెండి ఆఇంటిలో నిలువదు —

శ్రీ:- స్వామి-వివాహసమయములో సాంప్రదాయాను గుణ్య ముగ పసపురంగు, అందులో మిశ్రమరంగులు వాడుకొనుటగలదు. పూర్తిగ నలుపురంగును వర్జింతురు, తామేమందురు—

గు:- నాయనా- మకరకుంభజాతకులను శనియే పాలించ వలయును. శని దైవత్యేయని వ్రాయవలయును. ఈవిషయము తెలి సియు వ్రాసియు శనిదానమనినను నలుపురంగనినను భయపడునట్లు ప్రజలచేసిరి. శనిపాలితులతో సత్యనారాయణవ్రతములు చేయిం చిరి. శనిపాలితులను గురువు (విష్ణువు) మృత్యువై బడబానలమై త్రి నేత్రజ్వాలయై కాల్చుననుట యెరుగరైరి. నాయనా- హిందూసాంప్ర దాయములలో నలుపురంగును వర్జించినను శనిపాలితులకు శుభసమ యములలో నలుపురంగు కొంచమైనను వస్త్రములకు పూయుట క్షేమము- శనిపాలితుల ఎఱుపు, పసపు, గోధుమవన్నె చిత్రవ ర్ణము ఎఱుపు, పసపురంగు, అంచులుగలతెలుపు పరమశత్రుత్వమై బాధించును- నలుపురంగు కొంచమైనను తగిలించవలయును లేదా చిలుకపచ్చ ధూమ్రవర్ణము (పొగరంగు) వాడవలయును. గర్భా దానము శీమంతము మొదలగు సమయములలో లగ్నపంచమ నవ మాధిపతుల రంగుల వాడుట క్షేమము- లగ్నపంచమ నవమాధి పతుల వారములే మంచివి— శనిపాలితలగ్నములకు నల్లరంగును గాని చిలుకపచ్చగాలి తెలుపుగాని ధూమ్రవర్ణముగాని వాడుకొనుట మంచిది. శుద్ధతెలుపు వాడరు. వాడిన శుభమునే చేకూర్చును—

శ్రీ:- స్వామి- పండుగ పర్వదినములలో వస్త్రములు తెచ్చు కొని దేవుని ఎదుటపెట్టి నమస్కరించువేళ పసపునే అంచులకు పూయుదురు. శనిపాలితులకు తగదందురా-

గు:- ఔను- ఈశ్వరునికి అర్పణ చేయువాటికి సాదును వాడుట క్షేమము, విష్ణువుకు వాడువాటికి పసవు శ్రేయము ముప్వు రిని కొల్చువానికి ఏదైనను సరియే.

శ్రీ:- స్వామి- అపశకునములనునవి ఉన్నవిగదా. వాటి నే మందురు.

గు:- శనిపాలితులకు విధవలని సన్యాసులని అమంగళకర వస్తువులని వికలాంగులని అస్పృశ్యతయని నీచములని నీచవస్తువు లని ఎంగిలిమంగలమని అశౌచములని తలపనేరాదు. శనిపాలితుల కివి తప్పక వెన్నంటి యుండును. భూతగణమందు తాండవించి యుండును. వీరు శుభములనే చేకూర్తురు ఈజాతకులకు రాత్రినాల వయామము ముహూర్తములే శ్రేయము.

శ్రీ - స్వామి- కాలములో రాహుకాలమని, యమగంతకాల మని, త్యాజ్యమని ఆకాలములో మూత్రవిసర్జనకుకూడా పోని మాన వులన్నారు, తామేమందురు.

గు:- రాహుకాలము యమగండకాలము త్యాజ్యము మొద లగు దుష్కాలములు గురుపాలితులకు యోచింపవలసి యుండును గాని శనిపాలితులకు యోచింపనక్కరలేదు, ఇట్టికాలములు వేయి వచ్చినను భయములేదు. రాహువు శనికి మిత్రుడు భూతములు సేవ కాజనము శనిభూతనాథుడు గాబట్టి ఏభయము ఉండదు —

శ్రీ:- స్వామి- రోహిణి, మృగశిర, మఖ, ఉత్తర. హస్త, స్వాతి, అనూరాధ, మూల, ఉత్తరాషాఢ, ఉత్తరాబాధ్ర, రేవతి. వీనిలో పాపగ్రహములేని నక్షత్రము యోగ్యమని శాస్త్రకారులు వ్రాసిరి. తామే మందురు.

గు:- నాయనా-వీనిలో పాపగ్రహములేని నక్షత్రము యోగ్యమని వ్రాసిరిగదా-ఏనక్షత్రమును తీసుకొన్న ఆనాడా నక్షత్రముపై చంద్రుడుండునుగదా. చంద్రుడే పాపియైనప్పుడు నక్షత్రమునకు శుభమెట్లేర్పడును. లేక చంద్రుడు ద్వాదశలగ్నములకు సర్వులకు శుభుడని చెప్పనగున-చంద్రునికి పాపత్వములేద త్రిషడిష్టాయరిప్పేశ అన్న సూత్రప్రకారము చూచిన మీనమేష కటకవృశ్చిక తులలగ్నములకు తప్ప మిగత ఏడులగ్నములకు పాపియని తెలుచున్నదిగదా యోగ్యమెట్లౌను చంద్రుడున్నదేగదా. దిననక్షత్రము-నక్షత్రములలో ఉత్తమములని యోగ్యమని చూపించినను లగ్నమును చూపించవలయునుగదా. లగ్నాత్‌చంద్రుడు పాపత్వమొందడా చంద్రుడే పాపియైనవానికి నక్షత్రమేదియుండినను పాపత్వమేకద. గ్రహము గ్రహవీక్షణలేక నక్షత్రము పనిచేయునా? గ్రహము గ్రహవీక్షణలేకున్న నక్షత్రము లుండునుగదా. అవి మానవునికి సుఖదుఃఖములు గల్పింపగలవా? లగ్నము పేరు చెప్పక ప్రత్యేకించి శుభాశుభముల గల్పింపగల గ్రహముగాని, నక్షత్రముగాని యున్నదా? నక్షత్రములలో నైజపాపత్వముగల నక్షత్రములు గలవా? ఇరువదేడు నక్షత్రములను తొమ్మిదిగ్రహములకు దశానుకూలమగునట్లు పంచినారుగదా. నక్షత్రములలో శుభాశుభములున్నప్పుడు గ్రహబలము చూడనవసరము లేదుగద అన్నసందేహములు అనంతముగా గలుగును నాయనా-గ్రహములేక నక్షత్రము అప్రాణిచయము. లగ్నమునుబట్టి స్థానమునకు కారకత్వములు ఏర్పడినవిగాని నక్షత్రముబట్టి కాదు. గ్రహములేక రాసులుగాని నక్షత్రములుగాని యోగములుగాని పనిచేసినట్లు నిరూపించపలేరు—

వత్సా- ముహూర్తము మేషలగ్న మందుంచిన లగ్నము గురుపాలితమగునుగదా— ఆనాడు దిననక్షత్రము గురుపాలితముగానే యుండవలయును. అనగా- మిధునములో పునర్వసు గురువు

కున్నది. పుష్యమి ఆశ్లేషలు శనిబుధులకు కటకములో నున్నవి-ఇట్లే ప్రతిరాశిలో శనిపాలితనక్షత్రములు గురుపాలితనక్షత్రములు కలసి యున్నవి. గురుపాలితలగ్నములకు గురుపాలితనక్షత్రములే క్షేమము అందులో చంద్రుడు ఎన్నిఇంటనుండినమేలగునో గమనించవలయును గాని వీరుచెప్పినట్లు పోయిన శాస్త్రము మూలమే చెడి అర్థములేని దగును. శ్రీవత్సా- లగ్నము పేరు చెప్పక గ్రహములలో నక్షత్రములలో వారములలో శుభాశుభుల శుభాశుభముల నేర్పరుచుకొనుట గ్రుడ్డితనము. లగ్నమునుండి ఏర్పడుచున్నవిగాని నైజపాపత్వము గల గ్రహముగాని నక్షత్రముగాని వారముగానిలేదు నైజపాపత్వముగలదేదీ ఊర్ధ్వలోకమున లేదు- నాయనా రాశి-రాశిలోగల నక్షత్రములు సంచలనము లేనివిగద. వీటిపై గ్రహములు సంచరించునపుడు మానవులకుగాని, దేశములకుగాని సుఖదుఃఖములు గలుగును. నక్షత్రముల వల్లగాదని శాస్త్రకారకునికి తెలియక తెలిపిన వాక్యములని తెలియుచున్నది. గ్రహములుండు స్థానములబట్టి ప్రపంచమునకు సుఖదుఃఖములు గలుగుచుండుననియు ఖగోళమున గ్రహయుద్ధములు జరిగిన భూగోళమున మానవులకు యుద్ధములు జరుగునని తెలుచున్నదిగాని నక్షత్రము లందు శుభాశుభములుండునని నక్షత్రములు ప్రపంచమును నడుపుచున్నవని తేలదు. లగ్నములు, నక్షత్రములు, నిర్జీవప్రతిమలు గ్రహమందు చేరినప్పుడు జీవము గలుగును, అప్పుడు మానవులపై సుఖదుఃఖముల ప్రసరింపగలుగును.

వత్సా- నక్షత్రములలో గురుశనిపాలితముల చూచుటొకటి దశానుకూలతగలుగునట్లు చూచుటొకటి- లగ్నసప్తమాష్టమములలో శుభులనియమించుకొనుట మరియొకటిముఖ్యమని గమనించుకొనుము లేక వీరి ననుసరించిన గ్రుడ్డివాడు గ్రుడ్డివానిని నమ్ముకొని ప్రయాణము చేసినట్లగును, మానవుడు జ్యోతివెలుగు ననుసరించి నడువవలయును, జ్యోతియే కూర్కుచున్నప్పుడు మానవునికి వెలుగెక్కడిది

అప్రమాణగ్రంథపఠనమువల్ల బుద్ధి చెడునేగాని చక్కబడదని తెలుసుకొనుము —

శ్రీ:- స్వామి- ఆరుద్ర నాలవపాదమునుండి స్వాతి నాలవ పాదమువరకు వివాహములు చేయరాదన్నారు శాస్త్రజ్ఞులు- మేషాది చతుర్థపంచమములు కటకసింహములు- మాతృకారకుడు చంద్రుడు పితృకారకుడు సూర్యుడు- మనస్సునకధిపతి చంద్రుడు. కాయమునకధిపతి సూర్యుడు- శిరస్సునకధిపతి చంద్రుడు- నయనములకధిపతిసూర్యుడు. వీరులేనిది వీరికెరుకపడనిదేదిలేదు. రాజ్యపాలకులుగానున్న వారిగృహములలో సూర్యుడు సంచరించునపుడు వివాహము లెందుకు చేయరాదు మాతృపితృ కారకులు పనికిరారా? దీనికి తామేమందురు.

గు:- నాయనా- కటకము నుండియేగద దక్షిణాయనము పుట్టుచున్నది. అయనమునకు ముందొకపక్షము వెనుకొకపక్షము విడుచుటలో మిధునములోసగము, సింహములో సగము వదలిరి. మిధునములో శుక్లపక్షమి సింహములో కృష్ణపక్షమి కొందరు వివాహములు చేయుచున్నారు. కొందరు అయనసంధియని మానుకొనిరి. సంధికాలము మృత్యుప్రదమని భావించి, పక్షములు, పక్షములనే వదలిరి- కొందరు వెనుక ముందు మాసములు మాసములేవిడచిరి- ఇక కన్యామాసము భాద్రపదములో శుక్లపక్షములో ఒకప్పుడు కృష్ణపక్షములో ఒకప్పుడు వచ్చుచుండును. కృష్ణపక్షములో మాళాయము పితృదినములువచ్చును. అందుచే ముందొకపక్షము వెనుకొకపక్షము వదలిరి- వీటివల్ల స్వాతి నాలుగోపాదము వచ్చినది- దీనికితోడు తులారాశి సూర్యునికి నీచ. దీనిని కొందరు మంచిదికాదని వదలిరి- వత్సా-శాస్త్రజ్ఞులు సంధికాలములు మృత్యుప్రదముగా భావించి కాలమును గ్రహబలమును నాశనము చేసిరి— ఈకాలములో గాలి వాన దోమలు నల్లులు చలి-చలిజ్వరములు మొదలగు యీతిభాదలు గల

కాలము కర్షకులకు పూర్తి పనులకాలము గాబట్టి ఈ అయిమమాస ములు వదలుటే మంచిదనిరి—— వత్సా- మేషవృశ్చిక ధనుర్రాసుల వారికి కటకసింహములలో సూర్యుడున్నప్పుడు వివాహము క్షేమము మీనమునకు షట్స్థానాధిపతి గాబట్టి తగదు- వృషభమునకు సూర్యుడు సింహముననుండ శ్రేయమొసగును- మిధున కటక కన్య తుల మకర కుంభరాసులవారికి అనిష్ట—సూర్యుడు శుభుడైన మహాశుభము- పాపియైన మహాపాపత్వము గాన సూర్యుడు ఉచ్ఛస్థితి యందున్నప్పుడు స్వక్షేత్రము నందున్నప్పుడు శుభుడైన యోగించును- పాపియైన పీడించును-గాన ఆరుద్రనుండి స్వాతివరకు సూర్యుడు సంచరించునప్పుడు శుభకార్యములు చేయరాదనుట— అర్ధములేని మాట. శనిపాలితలగ్నములకు మిధునకన్యలందు కూడ చేసుకొనవచ్చును. ఆషాఢము లేదు. సంధికాలము లేదు. మాళాయ ముల వదలి చేయవచ్చును. శనిపాలితులకు అమంగళములన్నీ మంగళములే యగును, అమంగళకర వస్తువుల కధిపతియైన శనియే వారికి దైవము గాబట్టి వారజేయులు.

దక్షిణాయన సంధికాలము పాటించినను మూడుదినములు ముందువెనుకలు విడచి వివాహాదిశుభకార్యములు చేసుకొనవచ్చును.

శ్రీ:- స్వామి- గురుపాలిత నక్షత్రములని శనిపాలితనక్షత్రములని అన్నారే అవియేవందురు.

గు:- శ్రీవత్సా- అశ్విన్యాది నక్షత్రములలో అశ్విని కృత్తిక- రోహిణి మృగశిర- పునర్వసు- మఖ- ఉత్తర- హస్త చిత్త -విశాఖ- మూల ఉత్తరాషాఢ- శ్రవణం- ధనిష్ట- పూర్వాభాద్ర- గురుపాలిత ములు పదునైదు- భరణి- ఆరుద్ర-పుష్యమి- ఆశ్లేష-పుబ్బ- స్వాతి- అనూరాధ- జ్యేష్ఠ- పూర్వాషాఢ- శతభిషము- ఉత్తరాభాద్ర- రేవతి- శనిపాలితములు పండ్రెండు. వెరసి ఇరువదేడు నక్షత్రము లైనవి. గురుపాలితులు అయిదుగురు. అయినందున పదునైదు వచ్చి

నవి. శనిపాలితులు నలుగురైనందున పండ్రెండు వచ్చినవి. శుభాశుభములు పాలితుల ననుసరించి యుండును- ఎవరినక్షత్రములు వారికి శుభశ్కరములేనని తలంచుము—

శ్రీ:- స్వామి- రాహుకేతువులకు స్వగృహములులేవు. వీరు క్రూరులన్నారు వీరికి మిత్రులెవరు. శత్రువులెవరు. గృహబలమేది. ఎవరితో చేరిన బలముండును. ఎవరితో చేరిన దుర్బలమందురో సెలవిండు.

గు:- నాయనా- వీరు ఛాయాగ్రహములు. బలము లేదని కొందరు రాహుకేతువులనే విడచి సప్తగ్రహములనే నియమించు కొన్నవారు కొందరు అందరికన్నా రాహువు బలవంతుడన్నవారు కొందరుగలరు. అందరివలెనే వీరికి బలమున్నది కారకత్వములు గలవు. గృహములు మాత్రమే లేవుగాని గురుపాలితులు కేతువుకు శనిపాలితులు రాహువుకు స్థానము లిచ్చినారు- కేతువుకు కుజుడు మేషమున అశ్వనీనక్షత్రమును- సూర్యుడు సింహమున మఖానక్షత్రమును గురువుధనస్సులో మూలానక్షత్రమునుఇచ్చి ఇవే స్వగృహములుగా భావింపమన్నారు. ఈస్థానములు కేతువుకు మహాబలము- రాహుదశపోయిన కేతువు మహాబలవంతుడు. గురుపాలితులు మిత్రులు, శనిపాలితులు శత్రువులు గురుపాలితులతోచేరిన కేతువు బలవంతుడు. రాహుదశపోయి మిత్రులతోనున్న కేతువు మహాబలవంతుడు రాహువుకు కుంభమున శతభిషనక్షత్రము శని యొనంగెను- మిధునమున ఆరుద్రనక్షత్రమును బుధుడిచ్చెను-తులలో స్వాతినక్షత్రమును శుక్రుడొసంగెను- ఈనక్షత్రస్థానములు స్వగృహములవలె బలవంతుడవై యుండుమని శనిశుక్రబుధులు మిత్రులైరి— కేతుదశపోయిన రాహువు బలీయుడు. కేతుదశ పోయిన రాహువు శని పాలితులతో నుండిన పూర్తి బలవంతుడు- నాయనా-నవగ్రహములేననియు సప్తగ్రహములు గావని యెరుంగుము—

శ్రీ:- రాహువు పోయిన కేతువు. కేతువుపోయిన రాహువ న్నారే అదెట్లు.

గు:- వత్సా- గురుపాలితజాతకుకు మృగశిరలో జననమైన రాహుదశ వచ్చును పోవును. కేతువొక్కడు మిగులును. రాహుకేతువులు సమసప్తమమున నుండుటచేత ఒకరిబలమును ఒకరు నాశనము చేయుచుందురు. ఒకరిదశపోయి ఒకరుమిగిలిన అపమార బలవంతులగుదురు గురుపాలితులకు కేతువు శనిపాలితులకు రాహువు మిగిలిన ప్రబలబలులని యెరుంగుము

శనిపాలితులు ఆశ్లేషాంత్యమున జననమైన కేతుదశ బాల్యమున పోవును రాహుదశ వుండును రాహుదశాభుక్తులలో ప్రబలముగా యోగించును కేతుదశపోయిన రాహువు రాహుదశపోయిన కేతువు యోగప్రదులని యెరుంగుము.

శ్రీ:- స్వామి- ఖగోళమున గ్రహయుద్ధము లేనిది భూగోళమున యుద్ధములు జరుగవన్నారే అదెట్లు

గు:- నాయనా- ఖగోళమున గ్రహయుద్ధము జరుగుటచేతనే భూగోళమున యుద్ధములు జరుగుచుండును. గమనించి చూచిన తెలియును చూడుము- 1971 నవంబరు 18-19-20 తేదీలలో గ్రహయుద్ధము చూడుము గురువు వృశ్చికములో నుండగ 1971 ఏప్రెల్ 28 తేది శనివృషభమునకుచేరి గురుశని సమసప్తకము గలిగినది-గురుశనిసమసప్తకములు ప్రపంచారిష్టము ప్రజాక్షయము యుద్ధములుగలిగించును. అక్టోబరు 24 తేది కుంభములో కుజుడుచేరి నాలుగింట శనిని చూచెను- శని పదింట కుజునిచూచెను. ఇది విప్లవమునకు ప్రజాక్షయమునకు నాందియయ్యెను అక్టోబరు 30 తేది శుక్రుడు వృశ్చికమున చేరెను నవంబరు 1వ తేది బుధుడందే చేరెను. నవంబరు 16 తేది సూర్యుడు వృశ్చికమున ప్రవేశించెను. 17 వ తేది రాత్రి చంద్రుడు వృశ్చికమున చేరెను. అప్పటికి వృశ్చికములో

గురురవిచంద్రులు శుక్రబుధులు పంచగ్రహకూట మయ్యెను. శనిచే కుజునితో ఆరుగ్రహములు కేతువుతో ఏడుగ్రహములు ఛాదనయ్యెను ఆరుగ్రహములు శనిని చూడనయ్యెను– నవంబరు 17, 18, 19, 20 తేదీలలో ప్రపంచవిప్లవ మేర్పడెను. ప్రజాక్షయమునకు కాలమాసన్న మయ్యెను గురుశనిపాలితుల కలయిక లిట్టివిప్లవములకు కారణములని యెరుంగుము– శనికి అష్టమము నందొకగ్రహము లేనందున వారియుద్ధ కార్యకలాపముల కొకఆటంకముండెను నవంబరు 23, 24 తేదీలలో శుక్రబుధులు ధనస్సుకు చేరిరి. అప్పటికి అష్టమము పూర్తియయ్యెను. అప్పుడు శనిఒక్కడు గురురవికుజులు ముగ్గురై బలవంతులైరి 25, 26 కుజునితో చంద్రుడుండగా శనిచూచి అన్నిరంగములలో యుద్ధకవ్వింపులు చేయుచు తూర్పుపాకిస్తాన్‌లో పిచ్చికుక్కవలె వెతకివెతకి మేధావుల స్త్రీల యువకుల కరుణలేక చంపించెను. అప్పటికి గురు, రవి, కుజులు, ధర్మబద్ధులై ఆగియుండిరి డిశంబరు 1 2, 3 తేదీలు. శనితో చంద్రుడయ్యెను. పాకిస్తాన్ భారతపైయుద్ధము ప్రకటించి ముందుకు సాగెను భారతదేశమునే కబళింతమని దురుద్దేశ్యము. వెలిబుచ్చి లక్షలాదిసైన్యమును. యుద్ధరంగమునకురికించెను శని శుక్ర బుధ రాహుగ్రహబలము నిరాయుధుల, నిద్రపోవువారిని, ఇరుకునపడినవారిని. స్త్రీ, బాలవృద్ధుల నిర్మాణముల నాశనము చేయించునుగాని హోరాహోరిపోరాడించు గ్రహములుగావు గాబట్టి కదనరంగస్థలమందు నిలచువారుగారు మోసములనేనేర్పి హత్యలు చేయింతురు. పాకిస్తాన్ కావలసినన్ని హత్యలుచేసెను. భారతసైన్యమునకు అండదండగ గురురవికుజచంద్రులు నిలిచి గురువు దైవబలమును యుక్తియుక్తము సమయస్ఫూర్తిజ్ఞానము నొసంగెను. సూర్యుడు తేజోశక్తి ధైర్యోత్సాహము నొసంగి సుక్షత్రియ వీరులుగండని దీవించెను యువకవర్గమునకు అధినాయకుడెన కుజుడు సైన్యాధ్యక్షుడై బలపరాక్రమముల నిచ్చి

మిడమ త్రిప్పకుండ ముందుకు నడిపించెను. చంద్రుడు బుద్ధికుశలత సమయస్ఫూర్తి జ్ఞానమునిచ్చి గగనము సముద్రము తనయాధిపత్య స్థానములుగాబట్టి శత్రువుల విమానబలము, నావికాబలము మూడు దినములలో ధ్వంసము చేయించి గగనమార్గమున సముద్రములో విచ్చలవిడిగా తిరుగచేసి కాల్బలమునకు అండదండగానిలచెను. మూడుదినములకు తూర్పుపాకిస్తాన్‌లో ప్రజానీకమునకుప్రాణమాన రక్షణచేయుచు శత్రువుల అష్టదిగ్బంధనలో నిల్పి బీభత్సమొనరిం చెను మూడోతేది నుండి 16 తేది లోపల పాకిస్తాన్ సర్వవిధముల దెబ్బతినెను. తూర్పుపాకిస్తాన్ భారతసైన్య వశమయ్యెను- బాంగ్లా దేశ్ కు జై- భారతవీరులకుజై – ఇందిరాగాంధికిజై - యను జయ జయధ్వనులు మిన్నుముట్టెను- పశ్చిమపాకిస్తాన్‌లో చాలాభూభా గము పట్టణములు, ఆయుధములు భారతీయుల వశమయ్యెను- లక్ష లాదిప్రజలు అసువులు బాసిరి నిర్మాణములెన్నో ధ్వంసమయ్యెను- ప్రజల హాహాకారములు ప్రతిధ్వనించెను. తూర్పుపాకిస్తాన్ పేరు మాసిపోయి బాంగ్లాదేశమనుపేరు స్థిరపడియెను. డిసెంబరు 16 వ తేదికి పదమూడున్నరరోజుకు పాకిస్తానీయులు నిరాశచెంది తూర్పు పాకిస్తాన్ వదలుకొనిరి. 16 వ తేది ఉదయం 8 గంటలకు రవి ధనస్సు చేరెను. అదే తేది సాయంత్రము 3-30 నిమిషములకు కుజుడు మీనమునకుపోయెను. భారతీయుల కార్యక్రమములు చక్క బడి ఏకపక్షవిరమణ 16 తేదినే చేసిరి. కుజరవులు ధనుర్ మీనముల ప్రవేశించి ప్రజాక్షయమును నాపిరి. ప్రధానమంత్రి శ్రీశ్రీ ఇందిరా గాంధి ఖ్యాతి భూనభోంతరములు నిండెను. భారతసైన్యముల కీర్తి నలుదిక్కులబ్రాకెను. శత్రువులు, శత్రుపక్షనాయకులు తలలొంచిరి. బాంగ్లాదేశము స్థిరప్రజ్ఞతో నిలుచునట్లు చేసిరిగాని గురుశని సమ సప్తకము మారిన పర్యంతము యుద్ధోన్మాదము తగ్గలేదు. 1972 జనవరి 6వ తేది గురువు ధనస్సుకుపోయి గురుశని సమసప్తకము

వల్లగలుగు ఉపద్రవముల తొలగించెను. శని కటకమునన్న కేతువును చూచుటవల్ల పాకిస్తాన్‌లో అలజడులు మానలేదు. యుద్ధోన్మాదము తగ్గలేదు. కేతువు మిధునమునకు పోయిన ఉన్మాదముతగ్గి కుదుటపడి భారతను కుదుట పడనిత్తురు. అందనుక గోకుతునే వుందురు- మనరు మననియ్యరనునట్లు చేతురు—

నాయనా- చేసినది గ్రహములో నక్షత్రములో మరేవో గమనించుము-గురుశని సమసప్తకములు స్థలానుకూలముగా గ్రహానుగుణ్యముగా విప్లవముల గలిగించుచుండును. గురుశని సమసప్తకములందు ప్రతిష్ఠలు వివాహములు ఉపనయనములు శంఖుస్థాపనలు మొదలగు శుభకార్యములు గ్రహబల మెరింగినవారు చేయరు చేయించరు.

| | | | |
|---|---|---|---|
| | | శ | |
| కు | | | కే |
| రా | | | |
| | గురచ శుబు | | |

భారతపై పాకిస్తాన్‌యుద్ధము ప్రకటించవలసినదినము. శని సప్తగ్రహములచూచి లోకవిప్లవము గలిగింపవలసినదినము. 1971 నవంబరు 17, 18, 19, 20 తేదీలు.

| | | | |
|---|---|---|---|
| | | శచ | |
| కు | | | కే |
| రా | | | |
| శు బు | గుర | | |

1971 డిసెంబరు 1, 2, 3 తేదీలు. భారతపై పాకిస్తాన్‌యుద్ధము ప్రకటించినదినము—

| | | | |
|---|---|---|---|
| శు | | శ | |
| | | | కే |
| రా | | | |
| శుబు ర | గుచ | | |

1971 డిసెంబరు 16 తేది భారత ఏకపక్షయుద్ధవిరమణ చేసినదినము బాంగ్లాదేశము స్థిరపడి భారతసైన్య పరాక్రమము దిక్కుదిక్కుల వ్యాపించినదినము. బాంగ్లాదేశ ముక్తిసైన్య ఆశయముతీరి గట్టెక్కినదినము శత్రువులు శత్రుపక్షనాయకులు తలలొంచి నిరాశ చెందినదినము-

| | | | |
|---|---|---|---|
| శు | | శ | |
| | | | కే |
| రా శు | | | చ |
| బుగు ర | | | |

గురుశని సమసప్తకము తొలగినదినము బాంగ్లాదేశము స్థిరపడి భారతదేశము జగద్విఖ్యాతిబడసినదినము పాకిస్తాన్ సర్వవిధములగు ఆశలకు తిలోదకములు విడచినదినము——

శ్రీవత్సా ఖగోళమున గ్రహయుద్ధము జరుగుటచే భూగోళమున యుద్ధములు జరిగెనో లేక మానవులే కల్పించిరో గమనించితివా. 1971 సం॥రం ఏప్రిల్ 23 తేదినుండి గురుశనిసమసప్తకము వచ్చినది. ఆనాటినుండియే యుద్ధమునకుపాకిస్తాన్ ఆయత్తపడినదని తెలుసుకొనుము- గ్రహరూపీ జనార్ధన అన్నవాక్య మొకటేగాదు- గ్రహరూపీ మహేశ్వర అన్నవాక్య మొకటున్నదని తెలిసినదా! గురుశని సమసప్తకము లిట్లుండునని తెలుసుకొనుము——

శ్రీ:- స్వామి- ఇట్టివి చెప్పనారంభించిన ఎడతెగవు. పోవుచున్నమార్గమునకు ఆటంకమగును చాలించెదను. జన్మమాసములో వివాహము చేయరాదన్నారే నిజమేనందుర.

గు:- వత్సా జన్మసంవత్సరమనికూడ అందురు. అది అరవైయేడుల కొకసారి వచ్చునది గాబట్టి దానిని వదలిరి. మాసము

సంవత్సరమునకొకసారి వచ్చును గాబట్టి వదలమన్నారు. అంతేగాని మాసము ప్రాణములేనిది వదలనక్కరలేదు. మాసములో జననతిథి వదలినచాలును. జన్మదినమున పుట్టినపండుగ చేయుదురు. గాన ఆ దినము వదలినచాలు. మాసము వదల నక్కరలేదు జననమాసము జననసక్షత్రము జన్మరాశి జననవారము జన్మతార అనునవి అన్ని వదలమన్నారు. అర్ధములేని పలుకులనవచ్చును. ఇందువల్ల గలుగు నష్టకష్టములను వ్రాయలేదు. కష్టముల గలిగింపలేవు. వట్టి బూతులని తలంచు.

శ్రీ:- జన్మమాసమున కెనిమిదవమాసము కూడదన్నారే నిజమేనందుర.

గు;- ఎనిమిదవమాసము ఎనిమిదవతిథి ఎనిమిదవదినప్రయాణము ఎనిమిదవగర్భము ఎనిమిదవదేదయిన పీడించును. వర్జింపమనిభయపెట్టినారు. ఎనిమిదవకంత పీడించెడిశక్తి గలిగినట్లు ఎట్లు గ్రహించిరో వారికే తెలియును. అష్టమము కష్టములు గలిగించుటకు ఏలాటిశక్తి లేదు. అప్రాణిచయము- పాపపుణ్యానుసారముగ నవగ్రహకేంద్రముల నుండి సుఖదుఃఖములు వెలువడివచ్చునుగాని అష్టమమాసము అష్టమినుండి వచ్చునవిగావు. జాతకునకు గ్రహానుకూలతగల మంచిముహూర్త ముండిన మాసము తిధి, వారము, నక్షత్రము మొదలగు అష్టమములు ఏమిచేయలేవు. సప్తమాష్టమములు చెడినవానికెట్టి ముహూర్తముంచినను అష్టకష్టములు దాపురించుట నిజము. అది తెలియక సృష్టించిన సృష్టనని యెరుంగుము—

శ్రీ:- స్వామి- చంద్రుడున్న లగ్నమునుండి ఎనిమిదవ లగ్నముకూడ పనికిరాదన్నారు. తామేమందురు.

గు:- వత్సా చంద్రుడున్న లగ్నమునుండిగాని సూర్యుడున్న లగ్నమునుండిగాని శుభాశుభములుఁగలుగవు. ఆరాశికి ఎనిమిదవరాశి ఏమిచేయును. అష్టమము సంధికాలము మృత్యుప్రదమని ఈరెండిటి

పైన పూర్తి ఊనుకొని శాస్త్రము వ్రాసినారు. వృథావచనములని భావించు-జన్మకాలగడియలనుండి లగ్నమేర్పడును. లగ్నమునుండి పాలితములేర్పడి శుభాశుభగ్రహము లేర్పడును వాటినుండి మంచి చెడ్డలుత్పన్నమగును. దీనిననుసరించి ఫలము జోస్యుడు చెప్పగలుగును. దృక్కుకువచ్చును అష్టమములు సంధులు లెక్కింపక ముందడుగు వేయుము చంద్రుడు శుభుడుగానుండిన చంద్రుడున్నరాశి రాశికిసప్తమము శుభస్కరములేయగును. లగ్నసప్తమ ద్వితీయాష్టమములలో నేగ్రహమైనను పాపియైయుండరాదని తెలుసుకొనుము

శ్రీ:- స్వామి- లగ్నాష్టమములో ముహూర్త ముంచరాదన్నారే నిజమేనందుర.

గు:- లగ్నాష్టమము పనికిరాదన్నమాట. నిశ్చయమేయైనను ఇందులోకొన్ని పనికివచ్చునవి లేకపోలేదు. మేష, మిథున, సింహ, తుల కుంభరాసులకు అష్టమస్థానములు శుభ స్థా న ము లు. ఎట్లనగా—మేష తులా రాసులకు లగ్నాధిపతుల స్థానములే అష్టమస్థానములైనవి. సింహ కుంభరాసులకు పంచమాధిపతులస్థానములే అష్టమస్థానములైనవి. మిథునమునకు నవమస్థానాధిపతిగృహమే అష్టమమైనది. ఇందువల్ల సీలగ్నములకు అష్టమదోషమావహించదు- మిగతరాసులకు అష్టమదోషమున్నది నిజమే— ఈదోషరహితమైనరాసులకు గ్రహానుకూలత గలిగిన ముహూర్తము నిర్ణయింపవచ్చును. దోషములేదు—

శ్రీ:- స్వామి- జన్మనక్షత్రము ఆనక్షత్రమున కెనిమిదవ నక్షత్రము వారమున కెనిమిదవవారము పనికిరాదన్నారే. నిజమా.

గు:- జన్మనక్షత్రమును యోచింపవలసియున్నది. జన్మనక్షత్రముపై చంద్రుడుండును. చంద్రుని శుభాశుభముల గమనించవలసియుండును. మీనమేష కటక తులావృశ్చికరాసులకు చంద్రుడు శుభుడు— లగ్న సప్తమ ద్వితీయాష్టమములలో అమృతపుత్రుడు

అంతకన్న శుభమింకొకటుండదు. ఈరాసులకుజన్మనక్షత్రములోలగ్న మంచిన శుభాతిశుభము మిగులురాసులకు లగ్నాత్ చంద్రుడుండుట మిగులదోషము- వధూవరుల అమితబాధల పెట్టును. గాని జన్మనక్ష త్రముపై చంద్రుడుండినా లగ్నము వేరొకటైన శుభమే గలుగును- దోషములేదు. జన్మనక్షత్ర మేమీచేయజాలదు. దాని కెనిమిదవనక్ష త్రము వారమున కెనిమిదవవారము ప్రయాణము చేసినవారమున కెనిమిదవవారము మొదలగు అష్టమములు బాధింపజాలవు- సంధి కాలముల తీసుకొని కాలము వ్యర్థము చేసినట్లు ఎనిమిదిని వ్యర్థము చేసినారేగాని ఇందులో శుభాశుభముల గలిగించుశక్తి దేనికిలేదు- ఇస్సన్న చెప్పినదే వేదమైనిలచినదని తెలుసుకొనుము —

వత్సా- లగ్న ద్వితీయ సప్తమాష్టమములలో పాపులు బలీ యులై యుండిన అశుభములు తప్పవు- వాటియందు శుభులున్న అమావాశ్య అష్టమి పున్నమ చతుర్దశి లగ్నసంధి దుష్టనక్షత్రములు మంగళవారము మొదలగునవి శాస్త్రదూష్యమైనవి గమనించి వాటిలోముహూర్తముంచినను వధూవరులుశతాయుర్దాయులై వర్ధిల్లు దురు- పాపులాస్థానము లందుండిన ముహూర్తము లేమీచేయజా లవని యెరుంగుము- అందుకే తదేవలగ్నము తారాబలమన్న వచ నము పుట్టినదని తెలుసుకొనుము —

శ్రీ;- స్వామి- గురుశుక్రుల బాల్యవృద్ధత్వముల గురుశుక్ర మౌఢ్యముల గురించి బాలుడని వృద్ధుడని తెలిపిరి బాల్యవృద్ధత్వ ములుండు నందురా.

గు:- వత్సా గ్రహము అస్తమించుటకు సమయము వచ్చి నప్పుడు కాంతి. బలము తగ్గును ఉదయించిన వెనుక బాల్యమను దినములులేవు. ఉదయించుటకుముందే శక్తివంతమై గ్రహముం డును. అస్తమయమునకు మూడు దినములు వర్జించుట కొంతవరకు మేలుండునుగాని ఉదయించిన వెనుకదినములు విడువనక్కరలేదు.

శనిపాలితులకు గురు మౌఢ్యములో గురుపాలితులకు శుక్ర మౌఢ్యములో శుభకార్యములు శుభప్రదములు-శనిపాలితులకు గురువు శత్రువు. శత్రుగ్రహము అస్తంగతమైనప్పుడు కార్యము సాగించుకొనుటుత్తమము.

గురుపాలితులకు శుక్రమౌఢ్యము శుభోదయము - శుక్రుడు గురుపాలితులకు మృత్యుప్రదుడు గాన, శుక్రాస్తమయములో గురుపాలితులు కార్యము సాగించుకొనుట క్షేమము.

గురువు శుభకార్యముల కధిపతియనియు, శుక్రుడు కన్యల కధిపతియనియు గురుశుక్రులు అస్తంగితమైనప్పుడు శుభకార్యములు పనికిరావనిరి స్త్రీలకు—యౌవనకాల పోషకుడు. కన్యాత్వ కారకుడు శుక్రుడుగాబట్టి శుక్రాస్తమయముపాటించినకుజాస్తమయముపాటించ నక్కరలేద యౌవనకాలమునకు, యౌవనమునకు యువకులకు కారకుని పాటించవలదా. కుజునిపాపిగా క్రూరునిగాత్రోసిపుచ్చిరి గాబట్టి కుజాస్తమయముతో వారికి పనిలేక పోయినది-కుజాస్తమయములో గురుపాలిత యువకులకు బలముతగ్గును పాటించుట శ్రేయము. శనిపాలితులకు కుజాస్తమానము శుభఫలమే యొసంగును ఏ జాతకునకైన లగ్నాధిపతి అస్తంగతుడైనప్పుడు వివాహాది శుభకార్యములు చేయరాదు.

నాయనా చంద్రునికి బాలత్వ వృద్ధత్వ క్షీణత్వములు పక్షములనుండి శాస్త్రజ్ఞులు చెప్పిరి. అదే శాస్త్రజ్ఞులు లగ్నాత్ బలాబలముల తెల్పిరి. ( ఉదాహరణ ) అశ్విని భరణి కృత్తికాపాద మన్నారుగదా కృత్తిక ఒకటో పాదములో చంద్రుడున్న దుర్బలుడందురు. అశ్విని ఒకటోపాదములో నుండిన బలవంతుడందురు. చంద్రుడు పక్షముతో బలవంతుడ? రాశితో బలవంతుడ? అన్న సందేహము గలుగును. శాస్త్రము ననుసరించిన రాశిలో బలవంతుడే బలవంతుడనవలయును; గాని, పక్షముతో బలవంతుడు కాదని

తేలుచున్నది అన్నిగ్రహములరాశినుండియే బలాబలముల గ్రహించు చున్నాము చంద్రునికూడ అట్లే చూడవలయును. గాని పక్షమును గమనించి బలవంతుడనరాదు కృష్ణపక్ష త్రయోదశియైనను రాశిలో బలవంతుడై యుండిన క్షీణచంద్రుడని భావించరాదు — రాశియు పక్షము రెండు కూడిన మరింతమేలని గమనించుము అవరోహ ణలో ఏ గ్రహమైనను దుర్బలము. అందులో రాశ్యాంతములో ఏ గ్రహమైనను మరింత దుర్బలమని గ్రహించుము.

వత్సా, చంద్రునికి బాల్యము. వృద్ధాప్య మన్నారు. శుద్ధ పంచమివరకు బాల్యమనియు బహుళ పంచమినుండి వృద్ధాప్య మనియు, చెప్పిరిగదా. చంద్రుడు పౌర్ణమినాడు సూర్యునికి పూర్తి యెదురౌటచే సంపూర్ణ చంద్రుడయ్యెను అమావాశ్యనాటికి సూర్యు నిలో చేరుటచే చంద్రుడు కానరాడయ్యెను అప్పుడు సూర్యునివల్లనే చంద్రుని కళలుత్పన్నమగు చున్నవని తెలియుచున్నవిగదా. అట్ల యిన సూర్యకిరణములు లేకున్న, చంద్రునికి స్వబలములేదనియా, సూర్యకిరణముల వల్లనే తానొకగ్రహమయ్యెనని తలంతువా? భూమి పై చంద్రకళలు ప్రసారము లేనిదినములలో. చంద్రుడు లేడందువా సూర్యకిరణములవల్ల బాల్యవృద్ధాప్యములు చంద్రునికి గలిగెనం దువా లేక ఒకనెలలో బాల్య యౌవన కౌమార వృద్ధాప్యములు చం ద్రునకున్నవందువా, సూర్యకిరణములవల్లనే కదా. చంద్రునిలో నీవు బాల్యవృద్ధాప్యముల నిరూపించుకొంటివి — చంద్రకళలు భూమిపై ప్రసరింపక పోయినను చంద్రునికున్న బలమున్నదని గ్రహించు, చంద్రుడు శుభుడై రాశిలో బలవంతుడైయున్న క్షేమము. పాపియై రాశిలో దుర్బలుడై యుండుట శ్రేయము. గ్రహానుకూలత గలిగినశుద్ధ పాడ్యమినుండియు చతుర్దశి పౌర్ణమివిడిచి బహుళ పాడ్యమినుండి త్రయోదశివరకు శుభకార్యములకు బలమేనని తెలియుము — సూర్య చంద్ర సమసప్తక దోషము పౌర్ణిమనాడు సూర్య చంద్రుల కలయిక

దోషము అమావాస్యనాడును, గలదుగాబట్టి, పౌర్ణిమ అమవాస్యలు వదలి మిగులు తిథులందు ముహూర్తము లుంచవచ్చని తెలుసు కొనుము.

బాల్య వృద్ధాప్యములనునవి నీవేర్పరచు కొన్నవేగాని, చంద్ర గురు శుక్రులకు వృద్ధత్వము లేదని యెరుంగుము.

ఉదాహరణ — 1972-4-2 తేది గ్రహము లిట్లున్నవి పంచాంగకర్తయే ఇట్లుముహూర్తము నియమించెను పరికింపుము వత్సా

| | | | |
|---|---|---|---|
| బు ర | | కుజ శు | |
| ల | | | కే |
| రా | | | |
| గు | చ | | |

ఇందులో సప్తమాష్టమములు పద భ్రష్టమైపోయినవి-సప్తమము కళత్ర స్థానమనియు కళత్రసౌఖ్యమనియు కళత్రానందము కళత్రముయొక్క అన్యోన్యత ఆహారవిహారనిద్ర మొదలగు సంసారసౌఖ్యములన్నీ గలుగు స్థానమని మానవునికి ముఖ్యమైన నెలవని ప్రమాణగ్రంథములే పలుకుచుండ ఆ సప్తమస్థానమును లగ్నాత్పాపులగు గురుకుజులు చూచునట్లు చేయడము ప్రమాణ గ్రంథములగు కాలామృత ముహూర్త దర్పణము మొదలగునవియే కద, ఈలగ్నము దోష రహితమనుటకు ప్రమాణ గ్రంథముల లోపమనియే భావింపవల యునుగాని వేరొండుగాదు. లగ్నసప్తమాష్టమములందు లగ్న, పంచమ నవమ స్థానాధిపతులలో నొక్కరైనలేకున్న జాతకులకు అధోగతేయగును. కళత్రానంద ముండదు. జాతకుల పరీక్షింపుము వివాహ లగ్నమునకు లగ్న పంచమ నవమ స్థానాధిపతులలో నొకరైన సప్తమాష్టమములలో నొకచోటనైన లేనిలగ్నము భగ్న మని గ్రహించు ఈ ప్రమాణ గ్రంథముల విమర్శించు వారుండినను భయముచే విమర్శించ లేకపోయివుందురని తలంతును. జాతకమున సప్తమాష్టమములలో నొకచోటనైన శుభగ్రహములేని జీవితము

వ్యర్థమని భావింపుము.

శ్రీ- స్వామి-చంద్ర-గురు-శుక్ర మూఢములందు వివాహ మైన వరుడు శీఘ్రముగ మృతినొందుననియు వీరు బాలురైయున్న వివాహమైన కన్యక— అంకులాడి యగుననియు- వృద్ధులైయున్న కన్యక మృతినొందుననియు ఈ ముగ్గురీవిధముననుండ ఉపనయన మైనవాడు, ఉపనయనముకాని ద్విజుడేనని శాస్త్రముచెప్పుచున్నది. నిజమేనందుర, కాదందుర.

గు- నాయనా ఇది శాస్త్రజ్ఞులు తెలిపిన వచనములుగావు. పాండిత్యబలముతో ఊహాకందిన వాటినిబట్టి శ్లోకము లల్లినవేనని జ్యోతిశ్శాస్త్రమెరంగి వ్రాసిన శాస్త్రములుకాదని తెలియుచున్నది— అష్టమముననొక శుభగ్రహమున్నవానికి మౌఢ్యములలో బాల్య వృద్ధత్వములలో వివాహముచేసిన వాని ఆయుషెట్లు క్షీణించును. మూఢములే ఆయువునియ్యను తియ్యను శక్తివంతములా, ఆయువు. ఈ మువ్వురిచేతనే యున్నదా ఆయుఃకారకుడు శుభుడై అష్టమము శుభులచే చూడబడి ఆయు స్థానమున శుభగ్రహమున్న గురుశుక్రులు అస్తంగతులైనప్పుడు వివాహమైన చంద్రుడు బాల్య వృద్ధాప్యము లలో అగ్నమైన ఆయువు క్షీణించి మరణించునా- ఆయువుకు వీరికి సంబంధమేమి అష్టమములోనున్న గ్రహమునకో చూచెడిగ్రహము నకో లేక ఆయుఃకారకునికో గదా- అయువు నియ్యను. తియ్యను అధికారముండునని వాదించినవారు లేనందున శాస్త్రము శాస్త్రజ్ఞుని వచనము మిగిలినదేగాని వాదించెడివారుగాని నిరూపించెడివారుగాని ఎదురైయుండిన శాస్త్రము ముందుకు రాకపోయివుండెడిది. ఆకాలము నుండి ఈకాలమువరకు దీనినెదిరించి మంచిమార్గమును చూపెడి వారులేక ప్రపంచము నంతయు శాస్త్రము నాక్రమించుకొని స్థిరత్వ మేర్పరచుకొన్నది. ఇప్పటికైనను జోస్యులు కన్నులుతెరచి చూచుట శ్రేయోదాయకము. శుక్రమౌఢ్యములో గు రు పా లి తు ల కు—

గురుమౌఢ్యములో శనిపాలితులకు- వివాహము చేయుట క్షేమమని తెలుసుకొనుట శ్రేయము.

నాయనా- తిరుపతికిపోయి కొందరు మూఢములలో వివాహము చేసుకొనుచున్నారే వారలిట్లయిరా అక్కడైనదేవుడు తప్పించుననియా వ్రాతకు మారువ్రాత దేవుడు వ్రాయుననియా- శాస్త్రజ్ఞులు మౌఢ్యములు చావునే సిద్ధింప చేయుననుటవల్ల భయపడి, ప్రజలందరువదలిరి. అంతటి మాటవాడినగాని, విసువరని తలంచి వాడిరేగాని నిజమెరిగికాదు ఇదిశుద్ధఅబద్ధము-శ్రీ రంగులాడియగునన్నారు పుట్టుకతోవచ్చునుగాని, ఈ మౌఢ్యములవల్ల వచ్చునా, మౌఢ్యములువదలి శుభముహూర్తములందు చేసినవారు విధవలై దుష్ప్రవర్తనలైపోలేదా, పోలేదని నిరూపింపగలరా, పుట్టుకతోవచ్చునది తెలుసుకొనలేక జ్యోతిష్యులనదుగక ఉభయభాషాప్రవీణులు ధర్మశాస్త్రజ్ఞులు పండితులు సృష్టించిన అప్రమాణగ్రంధములు వారిఊహాల కందినట్లువ్రాసి దీని విలువ చెరచిరి- గురుశనిపాలితముల గమనించి శుభకార్యములచేయ నిర్ణయింపుము- భయరహితుడవై ప్రజలకు చక్కనితోవ చూపుము-

గురుశుక్రమౌఢ్యములలో చంద్ర బాల్య వృద్ధత్వక్షీణత్వసమయములలో పుట్టుచున్నారే వారందరు చత్తురా? చచ్చిరా? మాంగల్యము కట్టినంతనే చంపెడిబలము వీరికెట్లు గలుగును.

శ్రీ- స్వామి జ్యేష్ఠపుత్రుడు జ్యేష్ఠపుత్రిక జ్యేష్ఠమానము- మూడుజ్యేష్ఠలు వివాహమునకు పనికిరాదన్నారే నిజమేనందురా,

గు- వత్సా, జ్యేష్ఠపుత్రికను జ్యేష్ఠుడే చేసుకొనుటక్షేమము కనిష్ఠుడు చేసుకొనరాదు అట్లవీలుగాకపోయిన సింహకటక ధనుర్ మీనలగ్నములలో జననమైన కనిష్ఠుడైననుపనికివచ్చును, రవిచంద్ర గురులు గ్రహశ్రేష్ఠులు సురజ్యేష్ఠాంశజులు రవితనుకారకుడు. చంద్రుడు మనోకారకుడు గురుడు దనకారకుడు సురగురువు గాబట్టి

కనిష్ఠులైనను జ్యేష్ఠకన్నియ జ్యేష్ఠత్వము హరింపగలరు. అంతేగాని త్రిజేష్ఠలన్న శబ్దము కల్పితము. గ్రహానుకూలతగలిగిన చేయవచ్చును. వత్సా- చంద్రగురులు పాపులై లగ్నద్వితీయ సప్తమాష్టమ చతుర్ద దశమములలోనుండిన- ద్విజేష్ఠలు- కనిష్ఠవరునకు జ్యేష్ఠకన్నియను సమవయస్కులను- వయస్సులో వధువు పెద్దదిగను- దేహబలము లో పెద్దదిగను- ఎత్తులో పెద్దగనో పొట్టిగనో- గోత్రములో ద్విసం ధిగాను ( ఒకవరుననవావి మరొకవరునన వావిగాకపోవుట ) ఇట్టి చిక్కులు గల్పించి చిద్రముల గల్పింతురు. అప్పుడు త్రిజ్యేష్ఠల సృష్టింతురు- సింహకటక ధనుర్మీనరాసుల జాతకుడైన నాలుగు జ్యేష్ఠలగును చేసుకొనవచ్చును. జాతకబలాబలముల తప్పింపనలవి గాదు- రాశి మిత్రత్వమున్నను మాసాధిపతుల మిత్రత్వమున్నను పనికివచ్చునని ఇది మన్వాదుల వచనమన్నారు-గ్రహములకు గలదు గాని రాసులకు మిత్రత్వశత్రుత్వములులేవు. మన్వాదుల వచనమని హిమాలయమంతమాట అడ్డముంచి మన్వాదుల రచ్చకీడ్చిరి. వారు దేవతలు ఈపొల్లు వచనముల వారు పలుకరు- గురుచంద్ర దోష మున్న తప్పక ఇట్టివి కలుగుచుండునని యెరుంగుము—

శ్రీ:- స్వామి- కన్యక జన్మలగ్నమునకైనను జన్మచంద్రలగ్న మునకైనను గురువు 8, 12 సానముల యందున్న కన్యకవిధవయగు నని వచించిరే నిజమేనందుర.

గు:- వత్సా- లగ్నముపేరు చెప్పక ఎనిమిది పండ్రెండు అనడమువల్ల శాస్త్రజ్ఞులు తప్పుడుదారిన పడినారనుటకు సందేహము లేదు- శనిపాలితజాతకమైన విధవయగుటో చచ్చుటో భర్తరోగ గ్రస్తుడవుటో దూరగ్రస్తుడవుటో తప్పదు. వారిమాట నిజము కొం చము అనుభవముతో చెప్పినారు. గురుపాలిత జాతకమైన భర్తశత వత్సరములుండును. యౌవనసుఖము సర్వదాననుభవించును సద్గుణ వతియని కీర్తినిగడించును. భార్యాభర్తలు అన్యోన్యముగ జీవింతురు

చూడుము- (అష్టమము) ఆయువు సురతసుఖము నిచ్చును మాంగల్యమును సర్వదా కాపాడును. పాపము- నరికట్టును ద్వితీయము చూచుటచేత కుటుంబసౌఖ్యమిచ్చును, మాటకు విలువనిచ్చును చతుర్థమునుచూచుటవల్ల గృహములు గృహోపకరణములు విలువైనవి గల్పించును. బలవంతులగు బంధుమిత్రాదుల సృష్టించును. ధన కనకవస్తు వాహనాదుల సమృద్ధిగానిచ్చును. ఇవి యననేల సర్వము చేకూర్చును అయిదింటద్వాదశమును చూచుటచేత దైవభక్తిని గలిగించును. ధనము సద్వ్యయముచేయించును-ముందుజన్మమునయెంతో పుణ్యముచేసియున్నవారికే యిట్టియోగము గలుగును- శనిపాలిత లగ్నములకు సర్వనాశనము చేయుటనిజము గురుశని పాలితముల నెరుగకపోవుటచే ఇట్లు భావించిరని తెలియును—

శ్రీ- స్వామి బృహస్పతి వరునిలగ్నమునకు 3, 6 స్థానములలోనున్న మృత భార్యావంతుడగునని శాస్త్రకారకులు తెలిపియున్నారు నిజమేనందుర.

గు- శ్రీవత్సా గురుపాలితులకుగురువు తృతీయముననుండినయడల అయిదింటిచూపుతో కళత్రస్థానమును ఏడింటపితృస్థానమును తొమ్మిదింట ఏకాదశమునుచూచును. తృతీయము నీచస్థానమైనను శత్రుగృహమైనను సత్కళత్రమును చెడని పితృధనమును తీర్థయాత్రాపుణ్యమును దైవభక్తిని నొసంగును. ఎడతెగని లాభమును గడించియిచ్చును. ఆరింటనుండిన అయిదింటిచూపుతో దశమమును ఏడింట ద్వాదశమును తొమ్మిదింట కుటుంబమును రక్షించును. జీవితమెంతో హాయిగానడిపించును. ఆరింటనుండుటవల్ల శత్రురోగ ఋణ విపత్తులు జీవితాంతము లేకుండునట్లుచేయును. ఇట్లుండుట జాతకుని పూర్వపుణ్య మనవలయును

వారుచెప్పినది అనుభవరీత్యా గమనించినది. శనిపాలిత జాతకములు మకరకుంభ, వృషభమిథున, కన్య, తులా రాసులకు

3, 6 స్థానములలో గురుడుండిన జీవితరక్షణోపాదులన్నీ ధ్వంస మగును. కళత్రసౌఖ్యమే వుండదు. ఉండినా చచ్చినదానిలోనేజమ యనవలసి వచ్చును- శుభాశుభములు ఇందులోనే యున్నవనితెలియ నందున వారిట్లు వ్రాయగలిగిరి.

శ్రీ- స్వామి వధూవరులకు గురువు చతుర్థదశమస్థానము లందున్న దంపతులు దుఃఖితులగుదురన్నారు. నిశ్చయమేనందుర.

గు- నాయనా, లగ్నము గురుపాలితమై గురువు చతుర్థ దశమములనుండుట పూర్వపుణ్యము. మేరదప్పినదనవలయును. చతుర్థము బ్రహ్మస్థానము, దశమము, విష్ణుస్థానము ఈ రెండు స్థానములలో గురుడెక్కడుండినా బ్రహ్మ, విష్ణువులు తన గృహ ములోనున్నట్లే యనవలయును. ఈ శుభములగురించి క్లు ప్త ము గ వ్రాసిన యాభై పేజీలగును. పూర్తి వ్రాసిన నూరుపేజీలగును — నాయనా అనుభవము. శాస్త్రజ్ఞానములేక శనిపాలిత జాతకులచూచి మోసపోయిన గ్రంధకర్తలనవలయునేగాని వేరొండుగాదు - శని పాలిత జాతకులకు చతుర్థదశమముల గురుడుండిన వారన్నదొక్క మాటేచూడు గృహము గృహోపకరణములు భూమి మొదలుకొని స్థాపితనిర్మాణములు వస్త్రభూషణాదులు నాశనముచేయును అనగా చతుర్థమున ఏ వస్తువులు గలుగుచున్నవో అవి సర్వనాశనమొన ర్చును. భిక్షమెత్తినవరకువిడువడు- అయిదింట అష్టమమునుచూచుట వల్ల ఆయుక్షీణముచేయును. మాంగల్యముత్రెంపించును. నేరగ్రస్తుల చేయును. భార్యాభర్తల బద్ధద్వేషులుగా తయారుచేయును- ఏడింట దశమమునుచూచి- వృత్తి ఉద్యోగముల నాశనముచేసి నిరుద్యోగిని చేయును. గౌరవహీనునిగాచేయును. దాస్యముచేయించును జీవన చ్ఛిద్రములగలిగించును ధనముదుర్వ్యయముచేయించును-దైవదూరు నిగాచేయును. వీడు పూర్వజన్మమున, మాతృపితృగురు దేవ బ్రాహ్మణ సాధు సజ్జనవయోవృద్ధ దూషణలకు పాత్రుడైనవాడు గురుద్రోహి

బంధుమిత్రద్రోహిగాబట్టి చతుర్ధదశమముల గురుడుండ జన్మించును సంపూర్ణముగ వారిఆశీస్సులందినవాడు గురుపాలితుడుగాన తెలుసు కొనకపలికిన పలుకులని తెలియుము గురుశనిపాలిత లగ్నముల నెరింగిన శుభాశుభము లెరుగనగును-

శ్రీ- స్వామి గురువు 2, 5, 7, 9, 11 స్థానములలో నుండిన శుభుడని తెలిపిరి. స్థానములబట్టి శుభాశుభము లేర్పడునో లేకలగ్న ములబట్టి యేర్పడునో వివరింపుడు.

గు- నాయనా స్థానమార్పడివల్ల గ్రహములకు శుభాశుభము లెట్లేర్పడును యేర్పడదు- లగ్నముద్వారాగ్రహములకు శుభాశుభము లేర్పడుచున్నవి. ఇటువంటి నియమములేని వచనములవల్ల జ్యోతి షమునకుసర్వాంగములు కృశించినవి. గురుశనిపాలితముల విడదీసి యుండిన దారిదొరికెడిది. వారికావిధము గనబడకపోవుటవల్ల నానా విధముల శాస్త్రము నడిపించిరి. నానా, నామధేయముల గల్పించిరి. నవగ్రహములుగాక ఎక్కువగ్రహములు గలవనిరి. నానామతముల సృష్టించిరి. అనేకమార్గముల చూపించిరి. వివిధరీతుల చెరచిరి, గాని నిజమైనది దృక్కుకునిలుచునది గన్పడలేదు. పునాదిభద్రతలేక గృహమునిలువనట్లు శాస్త్రమునకుపునాది గురుశనిపాలిత లగ్నవిభ జన ఇవి తెలియక శాస్త్రముచేబట్టిన జ్యోతికూరుకును దృక్కునాశన మగును శాస్త్రమునిర్జీవ ప్రతిమయై నిలుచును-

నాయనా గురుపాలితలగ్నములకు గురువు లగ్న, పంచమ నవమ స్థానములలో దిగ్బలాధిపతి. అంతకన్నా శుభము వేరొండు లేదు. చతుర్ధదశమములలోనుండిన మహావిష్ణువేతనవాడైనట్లుండును ద్వితీయ సప్తమాష్టమములలోనుండిన సర్వసౌఖ్యముల నొసంగును. తనపాలిదైవమైకాపాడును విషయమెరుగక పలికినపలుకులని యెరుం గుము- శనిపాలిత జాతకులకు వారుచెప్పిన 2, 5, 7, 9, 11 స్థాన ముల గురువుండిన మృత్యువై బాధించును భిక్షాటనచేసినదనుక

మాతృపితృ గురుదేవబ్రాహ్మణ సాధుసజ్జన వయోవృద్ధ సోదర సోదరీ బంధుమిత్రశాపగ్రస్తుని చేసినదనుకవిడువడు గురువు. శుక్రుడు శుద్ధబుధుడు పూర్ణచంద్రుడు శుభులన్న వాక్యమింతచేసినది. వీరికి శుభత్వము మిగతావారికి అశుభత్వమెట్లొచ్చెనని విమర్శించినవారు లేకపోవుటయే దీనికికారణమని యెరుంగుము.

శ్రీ- స్వామి పంచాంగ శుద్ధిహీనదోషమన్నారు తిథివార నక్షత్రయోగ కరణములన్నియు శుభస్కరములై గ్రహానుకూలత గలుగవలయునన్న సాధ్యమేనందుర.

గు- వత్సా, వారములలో నక్షత్రములలో గురు శనిపాలిత ముల విభజించితినిగదా. వాటి ప్రకారము లగ్నము ననుసరించి ఉపయోగించుకొనుము. తిథులు, అప్రాణిచయములు సుఖదుఃఖముల ప్రసరింపచేయుశక్తిలేదని యిదివరకే చెప్పితినిగదా. సమయాను కూలముగ వాడుకొనవచ్చును. యోగములు కరణములుపరిశీలించ వలసియున్నది. అటుపైచూతము. ఇప్పటికిమాత్రము పాటింపక వదలుము.

శ్రీ- స్వామి సూర్యసంక్రమణ ప్రవేశమునకు 16 గడియలు వర్జింపవలయును. మేష, కటక, తుల మకరరాసులయందు ప్రవేశ మునకు ముందు వెనుక 30 గడియలు నిషేధింప వలయుననియు అయనములకు నిదే విధియని విధించినారు. నిజమేనందుర

గు- నాయనా సంధికాలము మృత్యుప్రదమని వారుభావించి నారు. ఇందులో శుభాశుభముల గలిగించుశక్తిలేదు. కాలగతుల నడి పించువారు గ్రహములని వారుగమనింపలేదు. ఉదయాది లగ్నము నుండి అహోరాత్రములలో పదకొండులగ్నములదాటి పండ్రెండవ లగ్నము సూర్యుడున్న లగ్నములో సూర్యోదయమునకు కాలము (సూర్యప్రసారము) చేరునుగదా. ఇదికాలము. ఈ కాలములో పండ్రెండు లగ్నములు ఇరువదేడు నక్షత్రములు చేరియున్నవిగదా.

ఏ, ఏ, లగ్నమునకు ఏ ఏ గ్రహము ఏమేమి చేయవలయునో అవి చేయుచున్నది. ఒకచోట శుభగ్రహమైనగ్రహము మరొకచోట పాప గ్రహముగా మారుచున్నది. లగ్నము నక్షత్రములు గ్రహములు ఈ మూడిటివల్లనే కాలములో శుభాశుభములు గలుగుచున్నవి. గాని, సంధికాలమువల్లగాదు అది వారుగమనింపజాలక ఆడలేకమద్దిలకాని గోడు పోసుకొన్నట్లు సంధికాలములబట్టి శాస్త్రము తయారుచేసినారు అందువల్లకూర్చుంటే సంధి-లేస్తేసంధి యనిబంధించినారు. కాలము వ్యర్థముచేసినారు. పంచాంగ పద్మవ్యూహములో సంధికాల ద్రోణా చార్యుల ముఖద్వారము వద్దనిలిపినారు. ఈ వ్యూహభేదన చేయలేక మహనీయులుకూడ తలలొంచినారు. ఈవ్యూహము భేదించి సాధించి గ్రహానుకూలత సంపాదించుటకష్టము. ఈవ్యూహము ఛేదించినగాని నీవు ప్రజలకుమేలు చేయలేవు. శాస్త్రమున్నదని నిరూపించు కొనలేవు సంధికాలము మానవుని యుద్ధరింపలేదు. చంపనులేదు. గ్రహముల చేతిలో కష్టసుఖములు మంచిచెడ్డలు కాలము ఉన్నదనియు, కాలము చేతిలో గ్రహములున్నవని గ్రహించి గ్రహానుకూలత ప్రాణముగా చూడుము- సంధిగలది ఒక్కదినము మాత్రమే. ఉదయసంధి అస్త మానసంధిని మాత్రముపాటింపుము- సంక్రమణసంధి, సంధిగాదని తలంచుము. ఆలగ్నమునకు సూర్యుడు పాపియైయుండిన రాశ్యంత మైన మేలనియు, శుభుడైన రాసిప్రథమమున మేలనియు గమనించి నడుపుము- పగలు ఆరురాసులు రాత్రి ఆరురాసులు నిత్యముతిరుగు చున్నవి వీటిలోకూడ సంధికాలము తీసియున్నారు- జ్యోతిశ్శాస్త్ర మనుటకన్నా సంధిశాస్త్రమనిన బాగుండునని తలంతును. ఈ గాఢాంధకారమునుండి వెలువడి జ్యోతినివెలిగించి శాస్త్రమున్నదని నిరూపించుము. నిర్భయుడవై సంచరింపుము.

శ్రీ- స్వామి సౌమ్యగ్రహరాసులు శుభరాసులని పాపగ్రహ రాసులు క్రూరరాసులని తెలిపిరి రాసులలో సౌమ్యములు క్రూర

ములుగలవందురా.

గు- నాయనా రాసులుగాని గ్రహములుగాని స్థిరపాపత్వము గలవిలేవు. లగ్నాత్ సౌమ్యము క్రూరము కాగలుగుచున్నవి. వారు ప్రథమముననే వీరుసౌమ్యులు వీరుక్రూరులని వితదీయుటచేత సౌమ్యరాసులు క్రూరరాసులని విదదీయగలిగిరి. గ్రహములలో రాసులలో క్రూరములేవీలేవు. లగ్నముద్వారా శుభాశుభగ్రహములు స్థానములేర్పడినవి గ్రహములేనిరాసి గ్రహములేని నక్షత్రము ఏమీ చేయజాలదు. లగ్నమునుండి గురుశనిపాలితముల లగ్న పంచమ నవమస్థానములనెరింగి సౌమ్యాసౌమ్యరాసుల తెలుసు కొనుము. స్థిరపాపత్వగ్రహముగాని స్థిరపాపత్వరాసిగానిస్థిరపాపత్వ నక్షత్రముగాని స్థిరపాపత్వవారముగాని, లేదనిగమనించుకొనుము లగ్నాత్ వీటికిశుభత్వ పాపత్వము లేర్పడినవిగాని స్థిరపాపత్వము గలదేదీ ఖగోళమునలేదని యెరుంగుము.

శ్రీ- స్వామి లగ్నములలో చరములని స్థిరములని ద్విస్వ భావమని తెలిపిరి. నిజమేనందుర.

గు- వత్సా లగ్నములు స్థిరమైనవేగాని చరములుగావు గ్రహములు మారుచుండునే కాని లగ్నములుమారవు. మేషాధిపతి కారకత్వములే మేషమునకుండును- అనగా కుజునకు భూకారకత్వ మున్నదికదా. మేషమునకు వృశ్చికమునకు భూకారకత్వమే యుం డును. ( ఉదా ) కుంభలగ్నమునకు మేషమున శనిపాలితులు. ఏ గ్రహముండినా భూకారకులు గాకపోయినను భూమిని కలుగజేతురు కలుగును. ఏ గ్రహముండినా రాసికి ఒకేగుణముండును మారదు. కుజుని కారకత్వములనే ప్రసరింపచేతురు లగ్నము సంచరించునది గాదు. చరత్వములేదు, భావముమారదు, గాబట్టిద్విస్వభావములేదు. ఎట్లనగా. గురుజాతకునికిగురువు- కుంభములోనున్న శనికారకత్వము-

లతోపోషించును. తనకారకత్వములతోపోషింపజాలదు. గ్రహామున్న యింటినిబట్టి ఫలముండును. గాని గ్రహామునుబట్టి ఫలముండదు— గ్రహము స్వక్షేత్రములోతనకారకత్వముల నొనగును అన్యక్షేత్రము లలోనుండిన ఆరాసినిబట్టి ఫలమిచ్చును. దానినిబట్టి ద్విస్వభావ మన్నారు- గ్రహము పాపగ్రహమై చతుర్థమందుండిన గృహ మార్పులు వృత్తి ఉద్యోగమార్పులు చేయును. పంచమములోనుండిన గ్రామమార్పులుచేయును. దానినిచూచి చరరాసులన్నారేగాని రాసు లలోచరములు ద్విస్వభావములులేవు. స్థిరములేనని తలంపము-

శ్రీ:- స్వామి లగ్నమును రెండుభాగలుచేసి సూర్యహెూర చంద్రహెూరలని పేరిడిరి ఆచరణీయమైనదే ననెదర.

గు:- వత్సా ఇదిహిందువుముసల్మానుపేరు పెట్టుకొన్నట్లు న్నది- అర్ధలగ్నమువరకు ఆరోహణ యందురు- ఆరోహణలగ్నము నకు బలము అర్ధమునుండి అవరోహణయందురు. అవరోహణలో ఎంతదిగు ముఖమైన అంతదుర్బలముగా నుండునుగాని శనిపాలిత లగ్నములకు అవరోహణలో బలముండును. శని, బుధశుక్రాంశలు అవరోహణలోగలవు గాబట్టి బలముండును.

శ్రీ - అంశలన్నారే అవియెట్లో తెలుపగలరా.

గు:- నాయనా లగ్నప్రమాణమును దశావత్సరములగు 120తో భాగించి లబ్దమువచ్చినదానిని ఆ, యా గ్రహదశావత్సర ములతో హెచ్చింపు చేయుచుపోయిన జననకాలము ఎవరికాలపరి మితిలో నిలుచునో వారి అంశలో జననమని తెలుసుకొనవలయును. లగ్నమైన లగ్నపంచమ నవమాధిపతుల అంశలోనిలుపు కొనవల యును- ఆఖరాంశ శుక్రునిదగునుగదా. అది లగ్నాంతమని భావింప రాదు బలమనియే భావింపవలయును- సూర్యహెూర చంద్రహెూర యని, హెూరాశాస్త్రము సృష్టించిరిగాని, దీనశుభములేదు. దివ్య కీర్తియులేదని ఆరోహణ అవరోహణ యనుపేర్లనే వాడుకొనుము.

శ్రీ:- స్వామి హోరా ద్రేక్కాణ నవాంశ ద్వాదశాంశ లన్నా రే వీటిబలాబలములు వివరింపగలరా.

గు;- నాయనా ఈభాగింపులు హెచ్చింపులు శాస్త్రజ్ఞునికి ఉపకరించునవిగావు. వృధాశ్రమ గలిగించును అజాగళ స్థములవలె శాస్త్రజ్ఞునికి బరువనియే చెప్పవలయును. ఇందులో శుభాశుభముల గమనింపదగుమార్గము పరమాణువుకూడ లేదనియే చెప్పవలయును. పుష్కరాంశముకూడ ఇంతేనని భావించు లగ్న, పంచమ నవమాధి పతులఅంశలలో లగ్నమునిశ్చయింపుము. దీనికన్న క్షేమమొకటుండ దని యెరుంగుము. 74, 75, 76 శ్లోకములలో లగ్నముకంటె నవాంశ ముఖ్యమని వచించిరి. ప్రాథమిక విద్యావిధాన మెరుగక లగ్నబలా బలముల కారకత్వము లాదిగాగలవి తెలియక దొంగదారులెన్నొ కల్పించినారు. అన్నముతినుటకు నోరేగావలయును. మానవునిభూత భవిష్యత్ వర్తమాన కాలములలో సుఖదుఃఖముల తెలుసుకొనుటకు లగ్నమేకావలయును ఉపరంధ్రములతో అన్నముపోదు వీరిభాగిం పులతో సుఖదుఃఖములు వెలువడవు. గాన ఈవ్యూహముల భేదించి ముఖద్వారమునగల సంధిద్రోణుని నెట్టివేసి ముందుకుకాలుపెట్టుము ఈ వ్యూహములందుచిక్కిన నీబగిసిపోవును. శాస్త్రము నిర్జీవప్రతిమ యౌను. వీటికన్నిటకు అగ్ని బుక్కు నుపయోగింపుము.

మరొకటిచెప్పెదనువిను. నాలుగువేదములు షట్శాస్త్రములు పదునెనిమిది పురాణములు ఒకభాండమునవేసి ధృతినిదింపిన వచ్చు నది చేశావు. టోశేశావన్న ధృతియె-యైనట్లు ఎన్నిభాగింపులుహెచ్చిం పులుచేసి కొత్తదార్లు ఎన్నివేసిన జననకాలలగ్నముకాడికిరాక అన్య శరణ్యములేదు. లగ్నమే సాధనము సారమని గ్రహించు.

శ్రీ:- స్వామి కుజాష్టమదోషమని, గోరంతను కొండంతచేసి కుజుడనిన గుండెపగిలి చచ్చునట్లు చేసినారు. అందరికిలేని దోష మీకుజునకెట్లొచ్చెనో చక్కగా వివరింపుడు.

గు;- వత్సా కుజుడు గురుపాలిత లగ్నములగు మీన మేష కటకసింహ వృశ్చిక ధనస్సులకు అంగరక్షకుడు. వీని అనుగ్రహము గలిగిన ఎంతటిదరిద్రునికైన ఎంతనిమ్నజాతీయునికైన యౌవనకాల సౌఖ్యము దానంతటదివచ్చి సుఖపెట్టును. పాపియైన ఎంతటికోటీశ్వరునికైన యౌవనకాలమంతయు పదభ్రష్టము చేయగలడు- శని పాలితములగు వృషభ మిధున కన్యతుల మకర కుంభరాసులకు కాలయముడై బాధించును-ఈరాసులవారికి జరిగినచిక్కుల గమనించి కుజాష్టమము చాలాచెడ్డదని అనుభవముపైనవ్రాసిరేగాని శాస్త్రము తెలిసిగాదు- గురుపాలితులకు అష్టమకుజుడు శతాయుర్దాయ మొన గును. 70 యేడులవరకు యౌవనముగల పురుషునిగా చేయును. సౌందర్య సౌశీల్య సౌకుమార్యముగల భార్యనుతెచ్చి యిచ్చుటయే గాక 70 యేడులవరకు అంగసౌష్టవముల కాపాడి వృద్ధనారియను పేరురాకుండ యౌవనవతిగా నిలుపును. నిత్యయౌవనునిగాచేయును- సప్తమాష్టమములలో నుండినా చూచినా కళత్రానందముజీవితాంత మిచ్చును- శనిపాలిత లగ్నములకు సప్తమాష్టమములలో నుండిన సప్తమాష్టమములచూచిన కళత్రానందము యౌవనకాలముచెరచును కళత్రమును రోగగ్రస్తగనో కోపగ్రస్తగనో దూరగ్రస్తగనో నేరగ్రస్త గనోచేయును మూర్ఖురాలిగా పట్టుదలగలదిగా చేయును- పురుషుని యౌవనహీనునిగా చేయును. అనుమానములకు ఆస్పదము గలిగిం చును. విడిపోవునట్లు చేయును. సంఘములో తలెత్తితిరుగరానిపనుల చేయించును. ఇట్టివి అనుభవముపైచూచి కుజాష్టమదోషమని గోరం తను కొండంతగా జెంచి అలజడిగల్పించిరి. సప్తమాష్టమములలో పాపియై యేగ్రహమున్నను దోషమని బాధించునని యెరుగరైరి. వారి వారి కారకత్వములతో రాసులబట్టి బాధింతురు. సప్తమాష్టమ ములలో పాపియై శనియుండిన ప్రాణములనే తీయును. పురుషుడైన సన్యాసత్వమును స్త్రీయైన విధవత్వమును తప్పక కల్పించును. దీనిని

గమనించలేదు. కుజాష్టమము గట్టిగా వ్రాసిరి. ప్రాథమికవిద్యా విధానము చక్కగాతెలియకపోవుటయే దీనికికారణమని యెరుంగుము వత్సా స్థానశుభులు కాలశుభులని యున్నారు. స్థానము- సప్తమము రెండు అష్టమము ఇక్కడ యౌవనకారకు లుండిన స్థాన శుభత్వ మేర్పడును. వృద్ధాప్యలుండినస్థానశుభత్వ మేర్పడదు-గమనింపుము యౌవనకాలాధిపతి పురుషులకు కుజుడు స్త్రీలకు శుక్రుడు వీరు శుభులై యుండిన సప్తమాష్టమ సౌఖ్యము చక్కగా యౌవనకాల మంతయు స్వర్గముగా నడచును. వధూవరులు నిరంతరానంద మనుభవింతురు- పురుషులకు రవికౌమార కారకుడు- స్త్రీలకు చంద్రుడు కౌమారకారకుడుగాబట్టి శుభులై సప్తమాష్టములనుండిన కౌమార కాలము శుభప్కరముగా మిగులానందముతో నడచిపోవును- పురుషులకు గురువు. వృద్ధాప్యకారకుడు. స్త్రీలకు శనివృద్ధాప్య కారకుడు. గాన శుభులై సప్తమాష్టములందున్న వృద్ధాప్యమున నూతనదంపతులవలె అన్యోన్యులైసుఖింతురు. స్థానబలమునుబట్టి గ్రహబలమును బట్టి ఎక్కువతక్కువలు గలుగుచుండును- శుభులైయున్న శుభత్వము పాపులై యుండిన పాపత్వము కలుగును. వధూవరులకు యౌవన కాలమేగదా. మంచికాలము సప్తమాష్టమములకుజుడు శుభుడైబలీయుడై యుండిన పగలనక, రాత్రియనగ కేళీవిలాసములతో కళత్రమును సుఖింపచేయును. తాను సుఖపడును. స్త్రీలకు శుక్రుడుండిన తగుసమయమునకు వచ్చినవరుని చూపించి రాత్రింబవళ్ళు యౌవన కాలమంతయు కామసౌఖ్యమనుభవింప చేయును- పాపులైయుండిన నరకబాధలతో నిరంతర దుఃఖముతో యౌవనకాల మంతరించును- అట్టికుజుని దోషిగా నిరూపించుట తెలియనితనమని యెరుంగుము. కుజదోష మొక్కటియేగాదు, పాపులై ఏగ్రహములు 7, 8 లోనుండిన జీవితమంతయు వ్యర్థమని తెలుసుకొనుము-

శ్రీ:- స్వామి భృగుషట్క మన్నారే దీనినేమందురు.

గు:- నాయనా కుజాష్టమమెంతో భృగుషట్కమంతేనని తలంచు- రెండుమాటలలో చెప్పవలయునన్న గురుపాలితములకు కీడు. శనిపాలితములకు మేలు-స్థానమునుబట్టి శుభాశుభములుండును గురుపాలితులకు భృగుషట్కమున్న కన్యాత్వము యౌవనకాలసౌఖ్య మంతరింపచేయును ముకోపము మూర్ఖము వృద్ధిచేసి చేజేతుల తన జీవితమును తానేచెరచు కొనునట్లు చేయును- యౌవనహీనము చేయును. నిత్యరోగిగాచేయును అంతవాయువును తెచ్చిపెట్టును, బుద్ధినిమార్చును-విడాకుల పెట్టించును-పాపభూయిష్టగా దుఃఖజీవిగా తయారుచేయును. భార్యాభర్తల అన్యోన్యత చెరచును భృగుషట్కమునకుతోడు చతుర్థాష్టమములలో పాపగ్రహములుండినా చూచినా మరింతపరాభవము ప్రాణహానిగల్పించును-శనిపాలిత లగ్నములకు భృగుషట్కము మేలుచేయును. శత్రురోగఋణ విపత్తులనెదిరించి కాపాడగలశక్తిని గలిగించును. యుక్తియుక్తజ్ఞానమిచ్చి ఆపత్తులు అవమానములనుండి రక్షించును. నవయౌవనస్త్రీలతో మిత్రత్వము కల్పించును. స్త్రీలవల్ల లాభము గడించియిచ్చును. స్థానమునుబట్టి శుభములచేకూర్చును. గురు శనిపాలితముల గమనింపక వ్రాసిన వ్రాతలని యెరింగి శుభాశుభముల తెలుపుము-

శ్రీ:- స్వామి- వివాహలగ్నమున కేడింట సూర్యుడున్న వైధవ్యము వచ్చునన్నాడు. కాలామృత గ్రంధకర్త దీనినేమందురు.

గు:- నాయనా ఈగ్రంధకర్త ఒకక్రొత్తదారినిసృష్టించుటలో క్రొత్తపేర్లను సృజించి లేసినాతప్పు. కూర్చున్నతప్పనియు తప్పితే మృత్యుప్రదమనియు గట్టిదెబ్బ ప్రతిదానికికొట్టి భయపెట్టినాడు- సూర్యుడు సింహవృశ్చిక ధనుర్మేష వృషభరాసులకు సప్తమాష్టమ లగ్న ద్వితీయముల లగ్న త్రితయములగు జాతక ప్రశ్న వివాహ లగ్నములలో ఏలగ్నమునకుండినను రాజుకుజరిగినట్లు జరుగును. జీవితాంతము వధూవరుల కన్యోన్యత గలుగును- సంపూర్ణాయువు

గలుగును. ఈరాసులకు సూర్యుడు లగ్న పంచమభాగ్య రాజ్యాధి పతిగాబట్టి జ్యోతిశ్శాస్త్రరీత్యా అనుభవరీత్యా ప్రబలయోగమై, ప్రకాశించును. మిగత మీన, మిధున కటక కన్య తుల మకర కుంభరాసులకు మృత్యుప్రదమగును. వీరిఅనుభవములో ఏదోఒకటి జరిగియుండును దాని నాధారము చేసుకొని వ్రాసిరేగాని శాస్త్రరీత్యా అనుభవరీత్యాకాదని యెరుంగుము.

శ్రీ:- స్వామి చంద్రుడేడింటనుండిన ద్వికళత్ర యోగము సంప్రాప్తమనిరి ( సపత్ని ) నిజమేనందురు.

గు:- నాయనా మీన మేష కటకతుల వృశ్చికరాసులవారికి సప్తమాష్టమలగ్నద్వితీయముల చంద్రుడుండుట పూర్వజన్మ సుకృతమనవలయును. త్రివిధలగ్నములలో ఈరాసులకట్లుండుట శ్రేయోదాయకము వధూవరులు శతాయుర్దాయులై నిత్యయౌవనులై నిరంతర వైభవములతో మృష్టాన్న భోజనములతో ధర్మార్ధకామ మోక్షములను పురుషార్ధములతో తులతూగగలరు. శేషించిన యేడురాసులకు మృత్యువుకు మిన్నయై బాధించును వేధించును. నిరంతర దుఃఖముల గలిగించునని యెరుంగుము.

శ్రీ:- స్వామి కుజుడేడింటనుండిన చంపునన్నారు. నిజమేనందురు.

గు:- వత్సా కుజాష్టమమునుగురించి ఇదివరకే చెప్పితిని గదా. మీన, మేష, కటక, సింహ వృశ్చిక ధనస్సులకు లగ్నద్వితీయ సప్తమాష్టమముల ఈఆరులగ్నములకు కుజుడుండుట వానిపుణ్యఫల విశేషమనవలయును. శతాయుర్దాయుడై 70 యేడులవరకు యౌవన సౌఖ్యమనుభవించును. పరాక్రమవంతుడగును- ఇదియొక ప్రబల యోగమనబడును. శేషించినరాసులకు అనగా శనిపాలితలగ్నములకు కాలాంతకుడని యెరుంగుము.

శ్రీ:- స్వామి సప్తమమునబుధుడుండిన పుత్రహానియన్నారు నిజమా.

గు:- వత్సా శాస్త్రకారకుడు ఈమాటనదములో గ్రహాకారకత్వముల- స్థానములనే మరచినట్లున్నది. పుత్రకారకుడు గురువు పుత్రస్థానము పంచమము-సప్తమము పుత్రస్థానము గాదు బుధుడు పుత్రకారకుడుగాదు— సప్తమమున బుధుడుండి పుత్రహాని నెట్లు గల్పించునో గ్రంధకర్తగారికే తెలియును సంస్కృతపండితులు గాబట్టి శ్లోకము లల్లిరేగాని శాస్త్రమొకప్రక్క వీరి మాటలొకప్రక్క నున్నవి. అయినా మనకెందుకు వినుము

వృషభ మిధునకన్య తులమకరకుంభరాసులకు సప్తమాష్టమ లగ్న ద్వితీయముల బుధుడుండిన దీర్ఘాయువౌసగును మేనమామ, బావ పుత్రికలు సౌందర్య సౌశీల్య సౌభాగ్యవతులుగా నుందురు. వారినే వివాహమాడి అన్యోన్యులైసుఖింతురు-జీవితాంతము సర్వసౌఖ్యములులభించును- గురుపాలితలగ్నములకుండిన విడాకులుపెట్టించును. దుఃఖ జీవులచేయును కడకు విధవత్వముగల్పించును అకాలముల సర్వముచేయునని తెలుసుకొనుము.

శ్రీ:- స్వామి గురుడేడింట నుండిన వినాశమని వచించిరి. నిశ్చయమే యగునా?

గు:- నాయనా, గురువు వందనీయులలో పూజనీయులలో ప్రథముడు. అట్టి మహనీయుడు సప్తమములో నుండిన నాశనము చేయుటెందుకన్న సందేహమేవిడిచి వ్రాసిరిచూడు. మీన మేషకటక సింహ వృశ్చిక ధనస్సులకు లగ్న పంచమ భాగ్యరాజ్యాధిపతి. లగ్న పంచమ నవమములలోదిగ్బలాధిపతి ప్రబలయోగము. ఈలగ్నములలో గురుడు సప్తమాష్టమ లగ్నద్వితీయములలో నుండిన సుగుణవతి ధర్మపరాయణ ధనికవర్గములో చేరినది— పతిని ప్రేమించునది. ప్రజలలో బంధుమిత్రులలో కీర్తిని గడించునది. ఇల్లాలుగా లభ్యమగును. మృష్టాన్నభోజనము లభ్యమగును దంపతులు వందనీయులై పూజింపబడుదురు దీర్ఘాయురారోగ్య భాగ్యములు గలుగును.

వృద్ధ దంపతులుగా స్వజాతీయులలో అన్యజాతులలో వందనీయులై వర్ధిల్లుదురు. శనిపాలిత లగ్నములగు మకరకుంభ వృషభ మిధున కన్య తులరాసులకు బాధకమై బాధించును. మూర్ఖమును గలిగించి మాతృ పితృగురు దేవ బ్రాహ్మణ వయోవృద్ధులచే చీవాట్లుపెట్టించి సంసారము ధ్వంసము చేయునని యెరుంగుము-

శ్రీ:- స్వామి- శుక్రుడేడింటనుండ, రోగభయ మన్నాడు. రోగమో భోగమో తెలుపుడు.

గు:- వత్సా- విస్పన్నవేదమిదియని తెలుసుకొనుము- విను, వృషభమిధున కన్యతుల మకరకుంభరాసులకు అమృతప్రదుడై త్రివిధలగ్నముల కాపాడును- కామకళా విలాసచతురయగు అత్తకూతురును సృజించి సర్వభోగముల ననుభవింపచేయును సకాలమునకు వివాహము వైభవోపేతముగ చేయించును- సంపూర్ణాయుర్దాయ మిచ్చును. నవయౌవన స్త్రీ విభవ మొసంగును. వధూవరులకు జీవితాంతము అన్యోన్యత గలిగించును సప్తమాష్టమ లగ్నద్వితీయముల శనిపాలితలగ్నముల కిట్లుండును- గురుపాలిత లగ్నముల కుండిన అష్టకష్టములబెట్టి ముచ్చెరువుల నీళ్ల త్రాగును. రోగగ్రస్తనేకాదు- కోపగ్రస్తగను నేరగ్రస్తగను దూరగ్రస్తగను చేయును. సంసారము నాశనము చేయునని యెరుంగుము——

శ్రీ:- స్వామి- శనిసప్తమము నందుండిన మరణము సంభవించునన్నాడు. తామేమనెదరు.

గు:- నాయనా- గురుపాలిత శనిపాలితలగ్నములు లగ్న పంచమ నవమాధిపతుల నెరుంగక పలికిన పలుకని విశదమగుచున్నది. మకర కుంభ వృషభ మిధున కన్య తులారాసులకు సప్తమాష్టమ లగ్న ద్వితీయములలో నెందుండినా త్రిశూలధారియై కాపాడును. సంపూర్ణాయు వొసంగును. సర్వశుభముల చేకూర్చును. ఆస్తిపాస్తుల నిప్పించును- ఆనందముగా జీవితము నడిపించును. విధవ

ఆస్తిల నిప్పించును- ఎంతో మేలు చేయును- గురుపాలిత లగ్నముల కుండిన మరణము తప్పదు. ఆవివాహములలో ఇరువాగుల ఒక శవము మాత్రము వెళ్ళకతప్పదు, దంపతులకని చెప్పరాదు. గ్రహానుకూలతను బట్టి యుండునని యెరుంగుము—

శ్రీ:- స్వామి- రాహువు సప్తమము నందుండ బంధనమన్నారు. కేతువును వదలినారు. కేతుగ్రహము లేదనుకొన్నట్లున్నది- దీని నేమందురు.

గు:- వత్సా- రాహుదశ పోయిన కేతువు కేతుదశ పోయిన రాహువు బలవంతులు- గురుపాలితలగ్నములకు సప్తమాష్టమములలో కేతువుండుట శుభము- శనిపాలితలగ్నములకు సప్తమాష్టమముల రాహువుండుట శుభము—వీరితో శుభులు కలిసిరా శుభము— పాపులు కలిసిన అశుభము- వీరు లగ్నద్వితీయములలో నుండిన ద్వికళత్రయోగము సంభవించుట తటస్థించును- బాధ గలుగుట తప్పదు. బాల్యమున వీరిలో పాపగ్రహదశ పోయివుండిన కొంత నయమని చెప్పనగును—

శ్రీ:- స్వామి- చంద్రుడు శత్రుశూన్యుడన్నారు. ఇదెంత స్థానము నుండియైన (కటకము) శత్రువులేర్పడుదురు. గ్రహము నుండి శత్రుశూన్యుడనుటకు వీలున్నదందురా?

గు:- నాయనా- జ్యోతిశ్శాస్త్రము నుండి ఈశాస్త్రము పుట్టెనందమూ! శాస్త్ర సమ్మతమైన పలుకొక్కటిలేదు- కాదందమా-లగ్నములు నక్షత్రములు గ్రహముల వాడుకొనుచునేయున్నాడు—ఇదేమయ్యా అని పండితులనడిగిన ఇది ముహూర్తభాగమయ్యా జాతకభాగము కాదంటారు. ఒక్కశాస్త్రమును గుణితభాగమని జాతకభాగమని, ప్రశ్నభాగమని, ముహూర్తభాగమని గృహభాగమని (వాస్తు) భాగలుచేసి శాస్త్రము అధఃపథనము చేసినారు- ఈ భాగములన్నీ ద్వాదశలగ్నములలోనే ఇమిడిఉన్నవి. చూడు- శాస్త్రముయొక్క

సృష్టి గుణితభాగమందము. దానివృద్ధి ప్రకాశఫలములు జాతకభాగము- జాతకభాగము లేనిది ప్రశ్నభాగము, ముహూర్త భాగము, వాస్తుభాగము లేదు- జాతకభాగములోనే ఇమిడిఉన్నవి మానవునికి కావలసిన విషయములన్నియు అందేయున్నవి-ఇమిడియున్న విషయముల తెలియక భాగలుచేసి ఇది నామతము- ఇది నామతమని పేడబెల్లమువేసి పిసికినట్లు పిసికినారు-పంచాంగకర్తకు గ్రహవిషయములు ఫలభాగము తెలియకపోయిన శాఖలులేని మోడుచెట్టువలెనగును- పంచాంగకర్త సర్వమెరిగి యుండవలయును, ఫలము చెప్పువానికి గుణితభాగములేకున్నను రాణించును. ద్వాదశలగ్నములలోనే సర్వముహూర్తములుగలవు. గోటపోవుదానికి గొడ్డలినుపయోగించినారు. ఆఉపయోగము సర్వనాశనమైనది. చూడు-గ్రహసంచరణకొరకే లగ్నములు నక్షత్రములు సృష్టియైనవి. ఈమూడుదేహిదేహన్యాయముగానున్నవి. గ్రహములు, గ్రహవీక్షణ లేనిరాసులు నక్షత్రములునిర్జీవములని ఇదివరకేతెలిపితినిగదా. నవగ్రహములకు శతృత్వము గురుశనిపాలితులకు గలదు. లగ్నమునుండి మితృత్వ శతృత్వము లేర్పడినను గురుశనిపాలితులకే యేర్పడును. చంద్రుడు గురుపాలితుడు. శనిపాలితులందురు శత్రువులగుదురు-గమనింపుము వ్యయ తృతీయాధిపతి గాబట్టి, బుధుడు తనకు తనరాసికి, పాపియై నిలచెను. లగ్నపంచమనవమాధిపత్యములేకున్న ద్వితీయాధిపతి పాపి గాబట్టి సూర్యుడుపాపి ఏకాదశస్థానాధిపతి గాబట్టి, శుక్రుడు పాపి. సప్తమాష్టమాధిపతి గాబట్టి శనిపాపి- లగ్నమునకు. పాపస్థానాధిపతులు. శతృవులు. అనగా బుధరవి, శుక్రశనిరాహువులు చంద్రునికి ప్రబలశత్రువులు పంచమ నవమాధిపతులగు కుజగురు కేతువులు మిత్రులు-శనికి సప్తమ షట్స్థానాధిపతిచంద్రుడు. శుక్రునికి తృతీయాధిపతిచంద్రుడు. బుధునకు ద్వితీయ ఏకాదశ స్థానాధిపతి చంద్రుడు. రవికి ద్వాదశాధిపతి చంద్రుడు లగ్నాధిపతికి వీరు పరమ

శత్రువులగుదురు శాస్త్రరీత్యానిట్లున్నది-అనుభవరీత్యా తులా లగ్నము నకుతప్ప మకరకుంభ వృషభమిధున కన్యరాసులకు శని శుక్రబుధ రాహువులతో చంద్రుడు కలిసిన ఫలితము సర్వనాశనమగును తులా రాసికిమాత్రము జీవనక్షేత్రాధిపతి గాబట్టి శనిశుక్రబుధరాహువులతో చేరిన ప్రబలయోగమునిచ్చును. మిగిలినరాసులకుచేరిన పాపఫలము పండించును. గ్రహములకన్నిటకు మిత్రత్వ శత్రుత్వము లెట్లున్నవో చంద్రునికికూడ మిత్రుత్వ శత్రుత్వములట్లున్నవి. శాస్త్రమువిడచి వారివారి యిష్టానుసారము పోయిన పోకడలివి. చంద్రుడు శత్రు శూన్యుడనుమాట. శాస్త్రదూష్యము ఏగ్రహమునకైన పంచమనవమా ధిపతులేమిత్రులు. శేషించినస్థానాధిపతులు శత్రువులనియెరుంగుము.

శ్రీ:— స్వామి రవికి కుజగురుచంద్రులు మిత్రులు శనిశుక్రులు శత్రువులు. బుధుడు సముడన్నారు. నిజమేనందుర.

గు.— వత్సా— రవికి ద్వాదశస్థానాధిపతిచంద్రుడు. మిత్రు డెట్లగును బుధుడు ఏకాదశద్వితీయాధిపతి సముడెట్లగును ఈ సమ శబ్దమే లోకవిరుద్ధము. మిత్రత్వమో శత్రుత్వమో ఉండునుగాని సమత్వమేమిటి. ఇదికల్పనలోకల్పన. రవికి పంచమ నవమాధిపతు లగు గురు కుజులు మిత్రులు శేషించిన శనిబుధశుక్రచంద్రులు. శత్రు వులు ఒక్క వృషభలగ్నమునకు మాత్రము రవికి శని బుధ శుక్రులు మిత్రులై గురుకుజ చంద్రులు శత్రువులైరి. ( దీనివిమర్శ ద్వాదశ లగ్న శుభాశుభులలోనున్నది ) రవిశనులు రవిశుక్రులు రవిబుధులు కలిసిన వృషభమునకు ప్రబలయోగము.

శ్రీవత్సా— ఏమయ్యా శాస్త్రవిరుద్ధముగ వ్రాసిరేయనిన ఇది వేదాంగ జోస్యమయ్యా వేదమునకు సన్నిహితమైనదని చెప్పుదురు. ఏమయ్యా మంచి ముహూర్తమనిచెప్పితివి. వెంటనే త్రాడుతెగెను ముందు ఈవార్త చెప్పరాదేమయ్యా అనిన జోస్యమునకు పార్వతీ శాపమయ్యా అన్నీఫలించవని సమాధానమిచ్చుచున్నారు. శాస్త్రము

నకు త్రిశంక స్వర్గము కల్పించినందువల్ల శాస్త్రజ్ఞులమాట పొల్లులైనవని యెరుంగుము-

శ్రీ:- స్వామి కుజునకు రవి గురుచంద్రులు మిత్రులునిజమే బుధుడు శత్రువు శని శుక్రులు సములన్నాడు. తామేమందురు.

గు:- ఏమందును శాస్త్రదూష్యమందును. బుధుడు మేషమునకు తృతీయషట్స్థానాధిపతి వృశ్చికమునకు అష్టమ ఏకాదశస్థానాధిపతి ఎట్లుశత్రువో శనిశుక్రులు శత్రువులే. 3, 11 ఇంటివాడు శని 7, 8 ఇండ్లవాడు శుక్రుడు శత్రువులుగాకెట్లు పోయిరి- శనికుజులు శుక్రకుజులు బుధకుజులు కలయిక జీవులకు ప్రాణహాని మానహాని జీవితమే ఒకనరక కూపమగును కుజునకు శని శుక్ర బుధులు ప్రబల శత్రువులు. శనికుజుల కలయిక కూనీలకునెలవు- కుజ శుక్రులకలయిక భార్యాభర్తల విడదీయుటకు పిడుగు- కుజబుధుల కలయిక వ్యవహారముల కల్పించి నాశనము చేయుటకు మృత్యుదేవత- సమశబ్దమంతా శత్రుశబ్దముగానే మార్చుకొనుము. శాస్త్రము శీర్షాసనములోనున్నదని యెరుంగుము.

శ్రీ:- స్వామి బుధునికి రవి శుక్రులు మిత్రులట చంద్రుడు శత్రువట. కుజ శని గురువులు సములగుదురట. తామింతేనందుర.

గు:- వత్సా శాస్త్రము ఇటు వ్యావహారికమునకు అటుశాస్త్రమునకు దూష్యమైకదా ఫలించక పోవుటకుకారణము. గమనించు బుధుని ఒకయింటికి తృతీయాధిపతి. రవి మరొకింటికి, వ్యయాధిపతి రవి మిత్రుడెట్లగును. కాదు శత్రువు- చంద్రునికి బుధుడు మిత్రుడన్నాడు. బుధునికి, చంద్రుడు శత్రువనుట లోకవిరుద్ధముకాదా చంద్రునికిబుధుడు వ్యయతృతీయాధిపతి బుధునికిచంద్రుడు ద్వితీయ ఏకాదశస్థానాధిపతి. ఒకరికొకరు మిత్రులెట్లగుదురు. ఇది విపరీతమైనపలుకు. బుధునికి చంద్రుడు, చంద్రునకు బుధుడు శత్రువులేయగుదురు. తనకు పంచమ నవమాధిపత్యము వహించి సంఘనాయ

కుడై శనిని సముడనుటయు శత్రువైనరవిని మిత్రుడనుటయు చాల విపరీతము బుధునికి గురుకుజులు పరమశత్రువులు గమనింపుము. గురుగృహములరెంటికి బుధుడు-బుధుని రెండుగృహములకుగురువు సమసప్తకమై మారకులై ఇరువురకు బద్ధద్వేషమైయుండెను. ఇకకుజుడందమా మిథునమునకు 6 11 కన్యకు 3 8 ఇండ్లవాడయ్యెను. వీరెట్లు శత్రువులు గాకపోయిరి. సాలూమూలాలేని గ్రహమైత్రి అయినది— అయినావిను-బుధునికి శనిశుక్రులు పంచమనవమాధిపతులు మిత్రులు పాపస్థానాధిపతులగు గురుకుజ రవిచంద్రులుశత్రువులు. ఇందులో పరమశత్రువు గురువనవలయును- గురుబుధులు గురుశనులు గురుశుక్రులు చేరిన మానవుని జీవితము దుఃఖభాజనమని యెరుంగుము.

శ్రీ:- స్వామి- గురునకు కుజచంద్రరవులు మిత్రులు బుధశుక్రులు శత్రువులు శనిసముడన్నాడు నిజమేయుండునా.

గు:- నాయనా గురునకు శనిసముడనుటవింత. ఒకపక్షమునకు నాయకుడుశని. మరొకపక్షమునకు అధినేతగురువు ప్రజాపోషకుడుగురువు. ప్రజానాశకుడుశని వీరిరువురు ఒకచోటకలిసినను సమసప్తకముగ నుండినను విప్లవములు చెలరేగును ప్రజాక్షయము తప్పదు. జాతకుడు పౌరోహితుడై బ్రాహ్మణార్థములుతినుట అపరకర్మలుచేయించుట అపరములలో పాల్గొనుటతప్పదు అనేక విపరీతముల గల్పించు వీరిని సములని వచించుట చాలాశాస్త్రదూష్యము గమనింపుము గురువుకుశని తృతీయ వ్యయాధిపతి. శనికిగురువు తృతీయఏకాదశస్థానాధిపతిగాన ఒకరికొకరు పరమశత్రువులు. గురువుకు- రవికుజ చంద్రులు మిత్రులు శని శుక్రబుధులు శత్రువులు—. లగ్నాధిపతికి పంచమనవమాధిపతులు మిత్రులై శేషించినవారు శత్రువులని భావింపుము. శని శుక్రబుధులకు వారికివారే పంచమనవమాధిపతులయినారు. గాని, గురుకుజ రవిచంద్రులయినారేమో చూడుము, గురుకుజ రవిచంద్రులకు శని శుక్రబుధులు పంచమ నవ

మాధిపతులైరేమో చూడు ఎక్కడలేరు—జనార్ధనపాలితులు గురుకుజ రవిచంద్రకేతువులు— శని శుక్రబుధరాహువులు— మహేశ్వర పాలితులు వారికివీరు వీరికివారు శత్రువులగుదురు. ఇది ఎరుగక కల్పించిన కల్పనా గ్రహమైత్రియని యెరుంగుము-

శ్రీ;- స్వామి శుక్రునకు శని బుధులుమిత్రులు. సూర్యచంద్రులు శత్రువులు. గురుకుజులు సములన్నాడు సరియేనందురా.

గు;- వత్సా శుక్రునకు గురుకుజులు సములనివచించుట. కుక్కను కోతియన్నట్లున్నది-వీరు సములెట్లయిరో వారికేతెలియును గాని ఇతరులకు తెలియదు- శుక్రుని ఒకయింటికి అష్టమ ఏకాదశ స్థానాధిపతి మరొకింటికి తృతీయషట్స్థానాధిపతి గురువు ఇకకుజుడందమా ఒకఇంటికి సప్తను వ్యయాధిపతి. మరొకింటికి ద్వితీయ సప్తమాధిపతి వీరు శుక్రునకు శత్రువులుగాక సములెట్లయిరి. ఇది ప్రమాదము- శుక్రునకు శనిబుధులు మిత్రులు నిజమే రవి చంద్రకుజ గురువులు పరమ శత్రువులనుట నిజమేననిభావించు శుక్రకుజులు కలసిన వధూవరుల యౌవనము. అడవిగాసిన వెన్నెల బ్రతుకు నిరర్ధకము, శుక్రకుజుల కలయికలో గురుశనుల సమసప్తకములో లగ్నాధిపతి అస్తమయములో వివాహములు ప్రతిష్టలు అప్రతిష్టపాలని యెరుంగుము—

శ్రీ:- స్వామి శనికి బుధశుక్రులు మిత్రులు కుజరవిచంద్రులు శత్రువులు గురుడు సముడన్నాడు తామేమందురు.

గు:- నాయనా గురునకు శనిసముడు శనికిగురువు సముడనుటవింత సముడనుటయె క్రొత్తపదము మిత్రుడుగాదు శత్రువుగాదు అన్నమాట శాస్త్రమే క్రొత్తపద్ధతిలో నడపినపుడు దారులెన్నో పదములెన్నో కలసియుండును. అందులో ఇదీ ఒకటని తలంచుము-శనికి గురుకుజరవిచంద్రులు శత్రువులు శుక్రబుధులు మిత్రులనియెరుంగుము

శ్రీ:- స్వామి- మిత్రత్వ శత్రుత్వములుగాక తాత్కాలికమిత్ర

శత్రుత్వములు నైసర్గిక (స్వాభావిక) మిత్రశత్రుత్వములని, అల్ల కల్లోలముచేసినారు. దీనినేమందురు.

గు:- ఏమందును మిత్రశత్రుత్వముల నెట్లుకల్పించెనో అట్లే వీటెను కల్పించెనందును నైజముగా గ్రహములురెండుతెగలై ఒకరి కొకరు శత్రువులైయున్నారు. మానవులు పాపపుణ్య మిశ్రితులుగదా. వారుచేయు పాపపుణ్యములువిభజనచేసినపుడు ఒకపక్షమునపుణ్యము ఒకపక్షమున పాపము చేరి సుఖదుఃఖముల ప్రసరింపచేయుటకై చేసెడి పాపపుణ్యముల గ్రహించుకొనుటకై చావుపుట్టుకల గలి గించుటకై నవగ్రహములు ఆదిలోనే రెండుచీలికలైయున్నవి. గురు పాలితులు శనిపాలితులని రెండుతెగలుగా నిలచినారు. అంతేగాని తత్కాలమిత్రత్వ శత్రుత్వములు కల్పితగాథ తత్కాలమిత్రత్వము శత్రుత్వము రవిచంద్రులకుగలదు. ఎందుకనగా అయిదుగ్రహములకు రెండుగృహముల వంతున యిచ్చి వీరికి ఒక్కొక్కగృహమేయిచ్చి నిష్పక్షపాతబుద్ధితో స్థానపాపత్వము స్థానశుభత్వము ఇరువాగుల వారికినియ్య నియమించిరిగాబట్టి తాత్కాలిక మిత్రత్వ శత్రుత్వములు సూర్యచంద్రులకు గలిగినది గమనింపుము.

వృషభలగ్నమునకు చతుర్ధస్థానాధిపతి సూర్యుడైనందున తాను గురుపాలితుడయ్యు నిష్పక్షపాతబుద్ధితో తాత్కాలికమిత్రుడై శనిపాలితులతోచేరి చతుర్థస్థాన ఫలమియ్యక తప్పినదిగాక స్థానఫల మిచ్చుచుండెను. అందువల్లనే బుధార్కయోగమని కల్పించిరి. ఈ లగ్నమునకు మినహా ఏలగ్నమందైన రవిబుధులుచేరిన యోగనాశ మగును- చతుర్థపంచమాధిపతులు రవిబుధులైకలిసినందున యోగ మైనది ఈలగ్నమునకు తాత్కాలిక మిత్రుడయ్యేనేగాని, నైజశత్రువు శని బుధశుక్రులకని యెరుంగుము-

మీనలగ్నమునకు షట్స్థానాధిపత్యము వచ్చుటచేత గురు పాలితుడయ్యు తాత్కాలిక శత్రువై నిష్పక్షపాతబుద్ధితో శనిపాలితు

లతోకలసి గురుపాలితుల బాధింపజొచ్చెనని తెలుసుకొనుము-

ధనుర్లగ్నమునకు అష్టమాధిపత్యము చంద్రునకొచ్చుటచేత తాను గురుపాలితుడయ్యు స్థానపాపత్వమువల్ల తాత్కాలికశత్రువై నిష్పక్షపాతబుద్ధితో శనిపాలితులతోగూడి. గురుపాలితుల పీడింపజొచ్చెను గమనింపుము-

తులాలగ్నమునకు దశమాధిపత్యము చంద్రునకు గలుగుటచేత గురుపాలితుడయ్యు ఆధిపత్యశుభత్వముచేతనిష్పక్షపాతబుద్ధితో తాత్కాలికమిత్రుడై శనిపాలితులగూడి శుభఫలమియ్యనాయెను. తాత్కాలిక మిత్రత్వము శత్రుత్వము సూర్యచంద్రులకే గలదుగాని వేరుగ్రహములకు లేదు, అధిపత్యపాపత్వము ఆధిపత్యశుభత్వము వీరికితప్పలేదు. ఏకగృహస్థులు గాబట్టి తప్పనిసరి అయినది-

సింహరాశికి అష్టమాధిపత్యము పంచమాధిపత్యము గురువుకు గలదు గాబట్టి అష్టమాధిపత్య దోషములేదు- వ్యయాధిపత్యమువల్ల చంద్రునకు దోషముగలదు- మీనమునకు ద్వితీయాధిపత్య నవమాధి పత్యములు గలుగుటచేత కుజునకు ద్వితీయాధిపత్య దోషములేదు.

మేషలగ్నమునకు లగ్నాధిపత్యమువల్ల కుజునకు అష్టమాధిపత్య దోషములేదు.

వృషభమునకు లగ్నాధిపత్యముచేత శుక్రునకు షట్స్థానాధిపత్య దోషములేదు

మిధునమునకు నవమాధిపత్య శుభత్వమువల్ల శనికిఅష్టమాధిపత్య దోషములేదు.

కటకమునకు నవమాధిపత్య శుభత్వమువల్ల గురునకు షట్స్థానాధిపత్య దోషములేదు.

కన్యకు పంచమాధిపత్య శుభత్వమువల్ల శనికి షట్స్థానాధిపత్య దోషములేదు.

తులకు లగ్నాధిపత్య శుభత్వమువల్ల శుక్రునకు అష్టమాధి

పత్య దోషము లేదు,

వృశ్చికమునకు లగ్నాధిపత్య శుభత్వమువల్ల కుజునకు షట్ స్థానాధిపత్య దోషము లేదు.

ధనుర్ లగ్నమునకు పంచమాధిపత్య శుభత్వముచేత కుజునకు వ్యయస్థానదోషము లేదు-

మకరమునకు నవమ స్థానశుభత్వమువల్ల బుధునకు షట్స్థానదోషము లేదు.

కుంభమునకు పంచమాధిపత్య శుభత్వమువల్ల బుధునకు అష్టమస్థాన దోషము లేదు.

మీనమునకు షట్స్థాన మొక్కటేగలిగి శుభస్థానము వేరొకటి కలుగక పోవుటచేత ఆధిపత్యదోషము సూర్యునకాపాదించి శని పాలితులలోచేరనాయను.

ధనస్సుకు అష్టమస్థాన మొక్కటేగలిగి శుభస్థానము వేరొకటి గలుగక పోవుటచేత ఆధిపత్యదోషము చంద్రునకాపాదించి శని పాలితులలో చేరనయ్యెను.

వృషభమునకు తులకు ఇట్లే ఆదిపత్యశుభులై గురుపాలితులకు శత్రువులై శనిపాలితులకు మిత్రులైరని యెరుంగుము — నాయనా- మరియొకటి గురుపాలితులకు గ్రహాధిక్యతలగ్నములు మేషవృశ్చికములు-వీటిపాలకులు కుజచంద్రరవి గురుకేతుగ్రహములైదు- శనిపాలితులకు గ్రహాధిక్యతలగ్నములు సూర్యచంద్రులు కలియకపోయిన కావు. కాబట్టి వృషభమునకు సూర్యుడు కలియడముతోటి అయిదు గ్రహములైనవి. శనిబుధశుక్రరవిరాహువులు-తులాలగ్నమునకు చంద్రుడు కలియడముచేత అయిదు గ్రహములైనవి శని శుక్ర బుధ చంద్రరాహువులు గ్రహాధిక్యతలగ్నములు. మేషవృషభ తులవృశ్చికములు ఈనాలుగులగ్నములకు శుభులు అయిదుగురు పాపులు నలువురు అయినందున బలీయులు పుణ్యులు ఈలగ్నములలో జననమగు

చుందురు- తాత్కాలిక మిత్రశత్రుత్వములు రవిచంద్రులకు తప్ప మరెవ్వరికి లేవనియెరుంగుము.

శ్రీ.- స్వామి 3, 6, 12 ఇంట పాపగ్రహములున్న శుభఫల మిత్తురన్నారు. అందులోసూర్యుడు 11 ఇంటనుండిన వేలదోషముల పోగొట్టునన్నారు. శామేమందుచు.

గు:- ఏమందును శుద్ధ అపద్ధమందును. స్థూలముగాచెప్పెదను విను- శనినివారు పాపగ్రహమన్నారు గదా శనిఆరింట దిగ్బలాధపతి అనగా 6, 8, 12, 3 పాపస్థానములన్నిటి ఒకపరి చూడగల డన్నమాట. ఆరిట శత్రురోగ ఋణ త్రిశక్తులపురికొల్పి తైతకలాడిం చును- మూడింట అష్టమమునుజూచి ఆయువును తగ్గించును. మాం గల్యమును త్రెంచును. ప్రాణభీతిని గల్పించును. సురత సుఖమును తొలగించును- ఏడింటి చూపుతో ద్వాదశమునుచూచి ధనముదుర్వ్య యముచేయించును. పాపభూయిష్టునిచేయును. జీవితమే దుర్వ్యని యోగము చేయించును. పదింట తృతీయమునుచూచి నిర్ధనికుని చేయును సోదరసోదరీపీడ గలిగించును- ఒక్కుమ్మడి పాపస్థానము లగు 3, 6 8, 12 స్థానముల చూడగల శక్తివంతుని శనిని ఆరెంట మేలనుట గురుశనిపాలితము లెరుంగకనేయని యెరుంగుము-పాపులు పాపస్థానముల బలవంతులై యుండిన దుష్ఫలము కావలసినంత ఇత్తురని వారెరుగనిది ఒకటి శుభాశుభులవిభజనచేయుటములో పొర బడుట మరొకటి- శాస్త్రబలమునే చెరచినది. శాస్త్రదూష్యమైనది—— పేడకు అధిపతి శని- బెల్లమునకధిపతి గురువు- గురువును స్థిరశుభు డనుట- శనిని స్థిరపాపియనుట పేడబెల్లము నొకటిగాచేర్చి పిసికి నట్లు శాస్త్రమైనది- పాదులు తప్పినది. పాపులు పాపస్థానములందుం డుట ప్రమాదము. దిగ్బలాధిపతిశని యుండుట మహాప్రమాదమని యెరుంగుము—— ఇక 3, 12, 8 ఉండిన ఇంతేనని తెలుసుకొనుము-

పదకొండింట రవియున్న చంద్రుడున్న సర్వదోషములు పోవు

ననుట మరింతహాస్యాస్పదము-రవియున్న కుటుంబనియంత్రణ తానే చేయును- చంద్రుడున్న చాకలేనంతమందిని గలిగించును- పాపులైన విపరీత ఫలమిత్తురు. వివాహములకు వీరుచెప్పిన స్థానములకు వివాహబలమునకు వింధ్యహిమాలయముల కున్నంత దూరమున్నది- భేదమున్నది- గురుపాలిత శనిపాలితలగ్నము లెరుగక షట్స్థానమున శనియుండ ముహూర్తముంచిన మూడుముళ్లుతెగుట నిజము.

శ్రీ:- స్వామి- బుధగురుశుక్రులలో ఒకరు వివాహసమయమున వ్యోచ్చ. మూలత్రికోణ మిత్రక్షేత్ర స్వక్షేత్రముల యందైనను లగ్నమందైనను 4, 5, 9, 10 స్థానముల యందైననుండిరేని యర్బుదసంఖ్యాకంబులగు దోషముల పోగొట్టుదురన్నారు— ఇందుకు సందియము లేదన్నారు నిశ్చయమా!

గు:- నాయనా- దైవములేదను నాస్తికుని పగిదిగా గ్రహరూపమగు దైవమును విడచి నాస్తికులై తిధివార నక్షత్రయోగకరణములపైబడి సంధికాల పైశాచికము తెచ్చిపెట్టుకొని దిక్కుతెలియక వెట్టిమొట్టిదారులనేకము కల్పించుకొన్నారు. నీవు వీరిననుసరించిన అగడ్తలోపడిన కుక్కకధోగతేనన్నట్లు వీరిదారినేపోయి శాస్త్రమున్నదా లేదా అనుసందేహము గల్పింతువు గమనింపుము. గ్రహములు తామున్న స్థానములను- చూచిన స్థానములను శుభత్వ పాపత్వముల గలిగించునేగాని తామెక్కడనోవుండి వధూవరులకు శుభత్వ మియ్యగలరనుట శాస్త్రదూష్యము కళత్రస్థానము మాంగల్య స్థానమని సప్తమాష్టమములతెలిపి ఆస్థానముల శుభులుచూడక నుండక శుభఫలమెట్లియ్యగలరని తెలియక పలికిన చిలుకపలుకులుగాని బ్రహ్మపలుకులుగాదని యెరింగి నేచెప్పెడిదానిని చక్కగాగమనింపుము. ప్రతిలగ్నములకు లగ్నపంచమ నవమాధిపతులు శుభులని చెప్పితిని శేషించినవారు వారి గృహములు వారివారములు వారి నక్షత్రములు వారుండు స్థానములు వారుచూచినగృహములు పాప

మేనని ఇదివరకే తెలిపియుంటినిగదా. లగ్నమునకు పంచమనవమములకు కోణములన్నారుగదా. కోణములు కోణాధిపతులు శాశ్వత శుభులు వారు సప్తమాష్టమములనుండుటగాని చూచుటగాని లేకున్న ధనబలముతో విద్యాబలముతో వివాహము చేసుకొన్నను భార్యాభర్తలలోనొకరు చెల్లుకొనుటో రోగగ్రస్తులై దుఃఖించుటో కోపగ్రస్తులై విడిపోవుటో నిత్యకలహములతో దూరగ్రస్తులగుటోతప్పదు. శాస్త్రకారులు నిర్ణయించిన శుభాశుభులు శాస్త్రదూష్యమని చెప్పితినిగదా. గురుశనిపాలితుల యెరింగి లగ్నాత్ శుభాశుభుల నిర్ణయించుకొని ముందడుగిడుము- మరియొకటి జననలగ్నములో 7, 8 లో శుభులులేకున్న ప్రశ్నలగ్నములో 7, 8 లో శుభులుండదు ప్రశ్నలగ్నములోలేనిది వివాహలగ్నములో 7, 8లో శుభులనియమించుట కష్టము అట్లకుదరనికాలములోనే కన్యక కుదురును- త్రివిధలగ్నము లొకగ్రాటిపైననే నడచునుగాని వేరుత్రోవలపోవు- ఇది అనుభవము వప్తమాష్టమములలో లగ్నపంచమ నవమాధిపతు లుండక చూడక భార్య భర్తకు- భర్తకుభార్య ఉన్నదేమో జాతకముల పరికింపుము, దృక్కుకురాని శాస్త్రమును అగ్నిసంస్కారము చేయవలయునేగాని శాస్త్రమని నమస్కరింపరాదని యెరుంగుము.

శ్రీ:- స్వామి జననకాల లగ్నమునను సరించి వివాహకాల లగ్నముండుట చేతనే తదేవలగ్నంతారా బల మనుపదము ప్రయోగించినారందురా.

గు:- ఔను పాపపుణ్యాను సరణముగ జననకాల లగ్నము ( లేక ప్రశ్నలగ్నము ) బ్రహ్మచే నియమింప బడినది, అందువల్ల దేవలగ్నమనబడినది. దాని ననుసరించి తారాబలముపుట్టినది. తార యనగా నక్షత్రము నక్షత్రము అప్రాణియని చెప్పితినిగదా ఆనక్షత్రముపై గ్రహము ప్రవేసించినపుడు ఆలగ్నమునకు నక్షత్రమునకు ప్రాణమేర్పడును. తారాబలమనగ్నంతనే నక్షత్రమని బావింపకుము

గ్రహబలమన్నమాట తదేవలగ్నము ఎట్లుండునో (తారాబలం) గ్రహబల మట్లుండునన్నమాట.

శ్రీ;- స్వామి- సప్తమాష్టమముల శుభులుండుటకు అశుభులుండుటకు కారణము పూర్వజన్మ పాపపుణ్యములేనందురు.

గు:- ఔను- కన్యాదాన ఫలము స్త్రీలకుపకారము చేసిన ఫలము అనాధస్త్రీలను కాపాడినఫలము బంధుమిత్ర పుత్రికలకు వివాహములు చేసిన పుణ్యము- దేవతలకు కల్యాణోత్సవములు చేయించిన పుణ్యము- భార్యసుఖదుఃఖముల పరికించి సహాయమిచ్చి సంతోషింపచేసిన పుణ్యము పుత్రికలకు తన జీవితాంతము పుట్టినిల్లు చక్కగా జరిపిన పుణ్యము అనాధస్త్రీ కుటుంబములకు చేయూత నిచ్చిన పుణ్యము అనాధస్త్రీల దుర్మార్గులనుండి తప్పించినపుణ్యము వివాహములకు చేదోడువాదోడునిచ్చి, సహాయపడిన పుణ్యము. స్త్రీలపై కనికరించిన పుణ్యము సప్తమాష్టమములచేరి సౌందర్య సౌశీల్య సౌభాగ్యములు గలిగి వినయవిధేయ శాంత సుస్వభావ యుతమై ధర్మమెరింగిన కన్యకను లభ్యమగునట్లు చేయును- దీనికి వ్యతిరిక్తులైనవారికి విపరీతఫలమై సప్తమాష్టమముల పాపగ్రహము లేర్పడును. ఇది జననకాలముననేతెలియును జననాదిలోనే సప్తమాష్టమములు ధ్వంసమైయున్న జాతకునకు వివాహ లగ్నముపకరించదు. కుదరదు అందువల్లనే తదేవలగ్నం తారాబలమన్నారు. శాస్త్రజ్ఞులని యెరుంగుము-

శ్రీ:- స్వామి ఇరువదివర్గులు తయారుచేసి కడకు ఆరువర్గులే చాలన్నారు- కన్యక నక్షత్రము వరునినక్షత్ర మన్నప్పుడు నక్షత్రములపైన చంద్రుడుండునుగదా ఆచంద్రుని శుభాశుభత్వముల గమనించక నక్షత్రమునే అక్కడనుండిఇక్కడ. ఇక్కడనుంచిఅక్కడ ఎంచి శుభాశుభముల చెప్పుటలో యిరువది కూటముల కల్పించిరి గ్రహములేనిది నక్షత్రమునకు ప్రాణములేదని తామ్ము

చెప్పెదరు. ఈవిధముగజూచిన ఇరువదివర్గులుకూటములు. కల్పనా కథయని సంపూర్ణముగ తేలిపోవుచున్నది. పూర్వబద్ధతులు ఇంకెందుకునేనడుగవలె తమకు క్రమగలిగించుటతప్ప వేరొకశుభమిందులో గానరాకున్నది ఇంతటితో మానుకొనెదను-

గు:- నాయనా జోస్యులు ముహూర్తముంచిన పౌరోహితులు కార్యములు చేయించుచుండెడివారు శిల్పులు గృహములు దేవాలయములు కట్టుచుండెడివారు (ఇది వంశపరంపర వృత్తుల కాలము రాజులపాలన) జోస్యులు ముహూర్తము పెట్టిఇచ్చిన దినమునకు పౌరోహితునికి గృహవసతులు లేక కొన్ని కార్యక్రమముల యిబ్బందులవల్ల చిక్కులేర్పడి జోస్యులకు పౌరోహితులకు భావవిభేదములేర్పడి కలహములకు దారులేర్పడుటచేత పౌరోహితులందరుకలసి తిథివారనక్షత్రయోగకరణములచేత సంధికాలము గ్రహములు కలకూరగంపవలె కలిపి క్రొత్తక్రొత్తదారులతో కొన్నిగ్రంథములు షోడశకర్మలకు యజ్ఞయాగాదిక్రతువులకు ప్రతిష్ఠలకు సర్వకార్యములకు ముహూర్తములు ఏర్పరుచుకొని ఇది వేదాంగజోస్యమనిచెప్పి జోస్యుల సంబంధబాంధవ్యముల తెగతెంపులు చేసుకొని జోస్యుల దగ్గర ముహూర్తముల పెట్టించుకొనిన మేముకార్యముల చేయించను రామని ప్రజల భయపెట్టి వారిమాటలలో నిలుపుకొని ఆదాయముల తింటూ కార్యముల నెరవేర్చుకొనుచు వారియిష్టమొచ్చినట్లు వారిపీలుచూచుకొని ముహూర్తముల నియమించుచు వచ్చిరి. ఇకశిల్పులు వీరినిచూచి వీరివలెనే మయవాస్తను పేరుతో నొకగ్రంథమును సృష్టించుకొని జోస్యుని ఆదాయము పౌరోహితుని ఆదాయము శిల్పులే తినుచుండగా పౌరోహితులకు కడుపులోమండి కృష్ణవాస్తనుపేర మరొకదానిని సృష్టించి శిల్పుల ఆదాయముతినుచుండగా శిల్పులు దానినిచూచి పౌరోహితులతో ముహూర్తముల పెట్టించుకొనిన మేము గృహముల కట్టుటలేదని ప్రజలచిక్కులలో

పెట్టగా గృహనిర్మాణములే నాశనమైనవి. ఇది హిందూ సంప్రదాయులగు రాజులకాలమంతరించి ముసల్మానులు క్రైస్తవులపాలనలో వంశపరంపర వృత్తులు అన్యకులజుల చేతిలోపడి వృత్తిఅంతరించినప్పుడిది జరిగియుండునని తెలుచున్నది అప్పుడు జ్యోతిశ్శాస్త్రము చీలికలైనను అడిగెడువారు లేకపోయినారు. శాస్త్రముప్రజోపయోగముగాక చెడినదని తెలియుచున్నది- వంశపారంపర్యముగనున్న జ్యోతిశ్శాస్త్రమును శాస్త్రజ్ఞులు-పౌరోహితులకు- ఎక్కడచోటిచ్చినవారుగారు గాన వీరికి తోచినట్లంతా వ్రాసినది లోకవ్యాప్తిచెందినది. జోస్యుల కుటుంబములు కాలక్రమేణ నశింపైనవి. శాస్త్రము మూలనపడినది వీరుతయారుచేసిన కృత్రిమశాస్త్రమునకు మరింత బలము గలిగినది- ఇంతవరకు ఇదెందుకు ఫలించలేదని కొందరు పరిశీలించినారేగాని వీరు నియమించిన పునాదులపైననే జరిగినది— గాబట్టి వారిఆశయములు చక్కగాపండక నిరాశచెందినారు. ప్రకృతము నేను చెప్పినదారినపోయిన స్థూలముగా సర్వమునెరుంగగలవు సూక్ష్మాతిసూక్ష్మములు బుద్ధిబలముకొద్ది దైవబలమునార్జించినకొద్ది ( అనగా ఉపాసనాబలము నార్జించినకొలది అన్నమాట ఉపాసన జ్యోస్యునికి ముఖ్యము, చెప్పెడివాని జాతకబలముకొద్ది వెలువడి ఫలించును. ఇక ఈశాస్త్రము శోధించిన విమర్శించిన ఫలమూ వంతయులేదు. ఇకనీవడుగ తగ్గవి అడుగుము చెప్పతగ్గవి. చెప్పెదను

శ్రీ:- స్వామి దిగ్బలాధిపతులన్నారే ఏ, ఏ, స్థానములలో ఏ, ఏ, గ్రహమునకు బలమో తెలియచెప్పుడు

గు:- నాయనా గురువులగ్నములో దిగ్బలాధిపతి శుభుడై లగ్నములోనుండిన మహావిష్ణువు తనకుబంధువైనట్లే ఇదిప్రబలయోగముఎట్లందువా? లగ్నసప్తమ పంచమనవమ స్థానముల వక్కుమ్మడి చూచును గాన మానవునికి గావలసిన శుభములన్నీ అందేగలవు. సర్వము చేకూర్చునుగాబట్టి లగ్నాత్ గురువు దిగ్బలాధిపతిఅన్నారు.

శనిపాలిత లగ్నములకుండిన భిక్షాపాత్ర చేఁబట్టినదనుక పోనియ్యడు. కాయకష్టముతో దాస్యముతో జీవింపవలసి యుండునని యెరుంగుము

శనిషట్కము మహాబలము శని ఆరింట దిగ్బలాధిపతి 6, 8 12, 8 పాపస్థానముల వక్కృమ్మడి పట్టుకొనును. పాపకార్యముల వల్లనే పోషించి నూరేడులు బ్రతికించును. ప్రబలయోగముగా జరుగును. గురుపాలిత లగ్నములకుండిన మృత్యుప్రదమై జీవితకాలమంతయు దుఃఖభాజనమై పోవును. సర్వవిపత్తులు వెన్నంటియే యుండును.

కుజుడు చతుర్థమున దిగ్బలాధిపతి 4, 7, 10, 11 గృహముల వక్కృమ్మడిచూచును. మానవునికి కావలసిన వస్తువులుగల గృహములుగాబట్టి నాలుగింట కుజుడు బలవంతుడన్నారు శనిపాలిత లగ్నములకుండిన అష్టకష్టములపెట్టి బంధుమిత్రాదుల దూరముచేసి కళత్రమునువిడచి జీవనోపాదులచెరచుకొని నిలువనీడకూడ లేకుండచేసి కాయకష్టముతో జీవింపచేయును. గురులగ్నములకు చతుర్థ కుజుడు ప్రబలయోగ ప్రదుడన్నారు.

సూర్యుడు దశమమున దిగ్బలాధిపతి శుభుడైయున్న రాజయోగమునడచును ప్రజారంజకుడై ప్రజాపాలకుడై ప్రభుత్వమునకు అండదండయై ప్రకాసించుచు సర్వసౌఖ్యములనుభవించును. అశుభుడైయుండిన రాజద్రోహియై రాజదండనకు పాత్రుడై ఎందున రాణించక సర్వపాపముల చేయుచు తినతిండి కట్టబట్టలేక దేశదిమ్మరియై అనేక నేరగ్రస్తుడై సర్వత్ర చెడిపోవును.

చతుర్థమున చంద్రుడు దిగ్బలాధిపతియందురు. సర్వసౌఖ్యములచేకూర్చును. భవనములలో సంచరింపచేయును. అనేకములగు స్థాపిత నిర్మాణములతో లాభముగడింపచేయును. దాసదాసీజనులతో సపరివారయుతముగ సర్వభోగము లనుభవింప చేయును. రాజయోగము నొసంగును. పాపియైయుండిన నిలువనీడ లేకుండచేసి దేశ

దిమ్మరిగ చేయును- అనేకబాధలకులోనుచేసి భిక్షాన్నము తినుపించు నని యెరుంగుము—

శుక్రుడు చతుర్థమున దిగ్బలాధిపతి. శుభుడైయుండిన వాహన యోగము సకలైశ్వర్యములతో నుండును- స్త్రీలవల్ల లాభము గడించి యిచ్చును- పశుసంపద ప్రబలముగానుండును. స్త్రీసౌఖ్యము కావలసినంత గలిగించును- సుఖపురుషునిగా చేయును- పాపియై యుండిన ఇంటబైటస్త్రీలతో చిక్కుల గల్పించును- వాహనగండము గల్పించును- సకలైశ్వర్యముల విలాసవినోదములతో సప్తవ్యసనము లతో నశింపుచేసి చిప్పచేతికిచ్చి నెత్తిన గుడ్డవేసుకొని అగ్నిమూలకు ప్రయాణము చేయించితలమాసి వలుమాసి అల్లాడుదనుక విడువదని యెరుంగుము- గురుపాలితులకు బడబానలమని తెలియుము—

బుధుడు పంచమమున దిగ్బలాధసతి శుభుడైయుండిన మహా మేధావియై కార్యములుచేసి కీర్తిగౌరవముల పొందును- ప్రజారంజ కుడై ప్రకాసించును. పాపియై యుండిన గ్రామసేవకుడై అన్యగ్రామ నివాసియై అనాధజీవితము ననుభవించును. గ్రామస్తులతో దూషింప బడును—రాహుకేతువులు వారివారినక్షత్రములపై నుండగ అనగా రాహువు, ఆరుద్ర, స్వాతి. శతభిషనక్షత్రములపై నుండగ కేతుదశ పోయిన రాహువు బలవంతుడు- రాహుదశపోయిన కేతువు బలవం తుడు- వీరికిది దిగ్బలాధిపత్యమని యెరుంగుము

శ్రీ:- స్వామి-వరుడు ఎన్నిలక్షణములతోకూడిన వారందురు

గు:- నాయనా- సామాన్యముగా ప్రతిమానవుడు చూచునవి 1. రూపము 2. విద్య 3. పితృధనము 4. స్వయార్జితము (వృత్తిఉ ద్యోగవ్యాపారములు) ఈ నాల్గులక్షణములు కంటికగుపడునవి గాబట్టి వీటిని పరికింతురు. కాంక్షింతురు. ప్రయత్నించి చూతురు- ఈనాలుగుగలవరుడు ఉత్తమవరుడందురు.

శ్రీ:- ఈనాలుగు లక్షణములుగల వరుడని తెలుసుకొనుటెట్లు

గు:- తను స్థానాధిపతి- తనుకారకుడగు సూర్యుడు- ముఖా లంకారకుడగు చంద్రుడు ఈముప్వురు శుభస్కరులైయుండిన అంగ సౌష్టవములు బలము ముఖాలంకారము బాగుండునని యెరుంగుము.

విద్య- విద్యాస్థానాధిపతి విద్యాస్థానము ( ఐదు ) బాగుండిన విద్యాబలముండును ఇందులో మాతృవిద్య, రాజవిద్యగలదు గదా. మాతృవిద్యాకారకుడు శుక్రుడు లేకగురువు- రాజవిద్యా కారకులు సూర్యచంద్రకుజులు-వేద విద్యకుకారకుడు గురువు-శుక్రుడు వృషభ తులలు లగ్నపంచమ నవమాధిపతులకు దొరికిన-ఉండిన మాతృ విద్యయు- లగ్నపంచమ నవమాధిపతులకు సూర్యచంద్రులు కటక సింహములు దొరికియుండిన రాజవిద్యయు-గురువు ధనుర్ మీనములు లగ్నపంచమ నవమాధిపతులకు లోనైయుండిన వేదవిద్యయులభ్య మగును మిధున కన్యలు బుధుడు లగ్నపంచమ నవమాధిపతులకు లోనైయుండిన వ్యాపారము- కుజుడు మేషవృశ్చికములు లగ్న పంచమ నవమాధిపతులకు చిక్కియుండిన భూజీవనము గలుగును. శనియు, మకరకుంభములు లగ్నపంచమ నవమాధిపతులకు చిక్కి యుండిన నీచవ్యాపారముతో లాభముగడించును. లగ్న పంచమ నవమస్థానములు స్థానాధిపతులు చెడియుండిన కాయకష్టముతో జీవించును. విద్యలుండవు.

పితృధనము- నవమము స్థానాధిపతి శుభస్కరమైయున్న పితృధనముండును. స్థానము స్థానాధిపతి చెడియుండిన పితృధన ముండదు- వివాహసమయమునకు ధనహీనుడైయుండును- మరియొ కటి జాతకమునకు పంచమములో శుభగ్రహముండి దశానుకూలత గలిగినయడల తండ్రిఆస్తి సంపాదించిన దుండును-జాతకునిలగ్నము నుండి తొమ్మిదవఇల్లు పితృస్థానము. దానిని లగ్నముగా చూచు కొని పరిశీలించిన జాతకుని తండ్రికి ధనస్థానమగును- పంచమము తండ్రి ఆస్తి పాస్తులు తెలియును- జాతకునికి పంచమము-తండ్రికి

నవమస్థానమగును- స్వయార్జితము- దశమస్థానమున లగ్నపంచమ నవమాధిపతులు ఎవరైనబలీయులై యుండిన స్వయార్జితము బలముగానుండును. పాపగ్రహవీక్షణగాని గ్రహములు దుర్బలులైయుండుటగానియుండిన సాధారణముగనుండును శుభులులేకున్న స్వయార్జితముండదు పాపులున్న జీవనముకొరకై దుఃఖించువాడగును ఈ నాల్గులో ఏదిబలముగానున్నదో ఏదితక్కువగా నున్నదో గమనించి చెప్పవలయును.

శ్రీ:- స్వామి వివాహసమయములలో విద్య-ధనము పరమాణువులేకుండి మధ్యలో విద్యను ధనమును సంపాదించి జగజ్జేగీయమానముగ ప్రకాసించినవారున్నారే వీరియోగము లెట్లుండును.

గు:- నాయనా లగ్న పంచమ నవమాధిపతులు ముగ్గురు పాపులచే బంధింపబడి యుండిరేని పూర్వపుణ్యము ( సుకృతము ) పరమాణువులేదని తెలుసుకొనుము దశానుకూలముగా ఈముగ్గురు ఏకాలమున పాపులనుండి విడిబడెదరో అప్పటినుండి జాతకుడు ప్రకాసించును దీనిని దశానుకూలత యందురు. ఉదాహరణ-కటక లగ్నమునకు పంచమమున శనికుజులు నవమమున గురుబుధులు దశమమున శుక్రుడుండ విశాఖ చతుర్థపాదమున జననమైనగురుదశ ఒక్క సంవత్సరమును శనిదశస్వభుక్తి పోవునప్పటికి 4 సంవత్సరముల వయసువచ్చును. అంతవరకు జ్ఞానమేలేకుండి శనిస్వభుక్తి పోయినదాదిగా కుజుడు బలవంతుడై విద్యాభివృద్ధి జ్ఞానాభివృద్ధి చేయనయ్యెను. పంచమమునుండి అష్టమ ఏకాదశ ద్వాదశముల చూచి మేలుచేయుచుంతగా శనిదశ పోవునప్పటికి 20 వయసగును. అక్కడ బుధదశ బుధభుక్తి పోవునప్పటికి 28 వయసుదాటును. అప్పుడు భాగ్యాధిపతికి ఆటంకములు గలిగించు బుధుని స్వభుక్తి పోయినదాదిగా ధనము దైవభక్తి విలువగలిగించుటకు గురునకు బలముగలిగెను అటువిద్యయు ఇటుధనము చేకూరనయ్యెను. బుధ

దశాంత్యమునకు 37 వయసగును అక్కడ 7 యేండ్లు కేతుదశవచ్చి కొంతవరకు మేలుచేయును. అప్పటికి 44 వయసై శుక్రునిలో స్వభుక్తి పోవునప్పటికి 47 వయసగును చతుర్థమున చంద్రునికి బలముగలిగి స్థాపితనిర్మాణములు చేయించును. 67 యేండ్లకు విద్య ధనము నిర్మాణములు స్వయార్జితమువల్ల చేకూరును. యిట్లుండబడిన జాతకుడు రాణించును. భార్యా పుత్రులచక్కగా పోషించును. ఉత్తమ జాతకుడనబడును- దశానుకూలతయనిన యిదేనని యెరుంగుము.

ఉదాహరణ

| | | | |
|---|---|---|---|
| గు బు | శు | ర | |
| | | | ల |
| | | | |
| | కు శ | చ | |

విశాఖ 4 పాదం గురుదశ.

1 గురు
19 శని
20
17 బుధ
37
7 కేతువు
44
20 శుక్ర
64

శ్రీ:- స్వామి దశానుకూలత గురుశనిపాలితులకు ఎట్లుగలుగునో తెలుపుడు.

గు:- నాయనా- ప్రాథమికవిద్యావిధానము చక్కగ తెలియక పోయిన ఫలము చెప్పలేరు. దశానుకూలత గ్రహానుకూలత లేకపోయిన జాతకుడు ప్రాపంచకసుఖములకు దూరమై దుఃఖించును- ఈ గ్రహానుకూలత దశానుకూలత ఇట్లు గలుగునని శాస్త్రమున ఎక్కడ గానము. వత్సా-గురుశనిపాలితములని రెండుతెగలవారిని చెప్పితిని గదా- వీరిని దశలలోనే పూర్వులు విభజించినారు. చూడుము-

సూర్యుని మొదలుకొని గురువు పర్యంతము దశలు వచ్చినవి- ఇన శశి కుజ రాహుర్గురువన్నారు. వీరు గురుపాలితులు- శని బుధ కేతు శ్శుక్రు డన్నారు. వీరు శనిపాలితులు దశలలోనే రెండుతెగలుగా చేసినారు. గురుదశాంత్యమునుండి గురుజాతకులకు దశప్రారంభ మైన పాపులగు శనిబుధకేతుశుక్ర దశలైపోయి శుభగ్రహములుమిగు లును అనగా పాపకాలము బాల్యమున గడచిపోయి పుణ్యకాలము మిగులును. పాపకాలము అయిపోను పోను పుణ్యకాలము బలీయమై మానవుడు బలకొనును. ఇందుకు విరుద్ధమై శుభగ్రహదశలు బాల్య మునపోగా పాపగ్రహదశలు మిగిలినవారు కౌమారదశనుండియే భార్యాపుత్రుల పోషింపలేక బాధపడెదరు. కుటుంబము చిక్కులకు చిద్రములకు లోనై తనఆశయము లడుగంటును- దశానుకూలత గలి గినగ్రహానుకూలతలేకున్నను ఎట్లోమానవుడు భార్యాబిడ్డలపోషింప నగును. ఇక శనిపాలితులకు శుక్రదశాంత్యమునుండి దశప్రారంభ మైన పాపగ్రహదశలగు రవిచంద్ర కుజ రాహు గురు గ్రహదశలు బాల్యమున గడచిపోయి దాదాపు 45 వయసునుండి మంచిదినము లొచ్చి మానవుడు ప్రకాసించును- గురుజాతకునకి గురుదశాంత్యము నుండియు శనిజాతకునికి శుక్రదశాంత్యమునుండియు దశప్రారంభిం చిన పాపకాలము ముందుగడచిపోయి పుణ్యకాలముమిగిలి సుఖిం చును. భార్యాబిడ్డల సుఖింపచేయును. దశానుకూలత లేకున్నవారు భార్యాబిడ్డల సుఖింపచేయలేరని యెరుంగుము.

శ్రీ:- స్వామి దశానుకూలత గలనక్షత్రములేవందురు

గు:- నాయనా గురుపాలితులకు పునర్వసు విశాఖ పూర్వా భాద్ర ఈమూడు నక్షత్రాంత్యముల చంద్రుడుండ దశానుకూలత గలుగును. ఈనక్షత్రములు గురుదశ ప్రారంభనక్షత్రములు. శనిపాలి తులకు భరణి పుబ్బ పూర్వాషాఢ నక్షత్రాంత్య పాదములందుండిన దశానుకూలతయేర్పడును. ఈమూడునక్షత్రములు శుక్రదశప్రారంభ

నక్షత్రములు- శనిపాలితులకు శుక్రదశాంత్యమున- గురుపాలితులకు గురుదశాంత్యమున జననము మిగుల ఫలప్రదము పూర్వపుణ్యులకే యివి తటస్థించునని యెరుంగుము-

శ్రీ:- స్వామి దశాంత్యమన్నారే నాలవపాదమనిగదా, అర్ధము ఆగ్రహదశ అయిపోయినదని తలంచవలయునా లేక, ఉన్న దన వలయునా?

గు:- వత్సా ఏగ్రహమైనను తనస్వభుక్తిపోయినగ్రహబలము తగ్గిపోవును లేక స్వభుక్తిమిగిలి దశ అంతయు గడచిపోయినను ఆ గ్రహబలమున్నట్లే భావింపవలయును. గాని పోయినట్లు తలంపరాదు

శ్రీ:- స్వామి దశఅయిపోయిన గ్రహబలమయి పోయినట్లు తలంపవచ్చునా లేక బలముండునందురా?

గు:- వత్సా దశ అయిపోయిన శుభాశుభ గ్రహములన్నిటకు నూటికి 10 భాగల బలముండును ఇంగువపెట్టినడబ్బీవలె వాసన చావదు. ఎక్కువ శుభాశుభము లివ్వజాలవు చరగ్రహరీత్యా జనన కాలమున తానున్నచోటికి వచ్చినప్పుడు పాపియైన 50 భాగలు భాధించును- శుభుడైన శుభఫలమంతే యిచ్చును దశపోయిన గ్రహ భుక్తులుకూడ 10 భాగల ఫలమునే యిచ్చునని యెరుంగుము-

శ్రీ:- స్వామి రాహువు గురుపాలితుల మధ్యలో కేతువు శనిపాలితుల మధ్యలోనున్నారే అట్లెందుకు శత్రుమధ్యములో చేర్చినారు.

గు:- వత్సా రాహువు కుజగురుల మధ్యలోనుండి బుధ శుక్రులమధ్య చూచును. కేతువు బుధశుక్రులమధ్యనుండి కుజగురుల మధ్యచూచును. కేతువున్నచోటును రాహువు- రాహువున్నచోటును కేతువు- చూతురు గాబట్టి వారికట్లేర్పాటుచేసిరి రాహువుపోయిన దాదిగా- కేతువు తానున్నచోటును చూచెడిచోటును పాలించును. కేతువు పోయినదాదిగా రాహువు తానున్నచోటును తా చూచెడి

చోటును పాలించును- దశలలో రాహుకేతువులకు శత్రువులమధ్య చోటివ్వబడినది ఇరువురుండిన ఫలాఫలములంతగా ఇవ్వజాలరు. ఒకరిదశపోయి ఒకరుమిగిలిన బలమధికమని యెరుంగుము.

శ్రీ:- స్వామి గ్రహానుకూలతన్నారే అదెట్లుండును.

గు:- వత్సా లగ్న పంచమ నవమాధిపతులలో నొకరు. చతుర్ధ దశమములలో నుండుట పంచమ నవమములలో నుండుట బలీయులై యుండుట- పాపులతో చేరక చూడబడకుండుట- గ్రహానుకూలతయందురు చతుర్ధమున నొకగ్రహమున్న స్థిరాస్తిని యేర్పరచును. అనగా భూమిగృహములు గృహోపకరణములు మొదలగునవి దశమమునందున్న వృత్తి ఉద్యోగ వ్యాపారము మొదలగు జీవనముల వృద్ధిచేయును- చతుర్ధదశమములలో గ్రహమున్న చతుర్ధ దశమముల రెండింటిని కాపాడును జీవితరక్షణోపాదుల నభివృద్ధి నకలవిధముల చేయును-

పంచమమునందున్న విద్యాబలమొసంగి అధికార గౌరవములతో దురాదాయములతో సత్పుత్రులతో జీవనము చేయించును. నవమమునందుండిన పిత్రార్జితముతో నిల్వధనముతో దేవాదాయములతో జీవింపచేయును. దీనిని గ్రహానుకూలతయందురు. లగ్నపంచమ నవమాధిపతులు స్వక్షేత్రములందుండిన గ్రహానుకూలతయందురు- లగ్నాధిపతి నవమములోనవమాధిపతి పంచమములో పంచమాధిపతి లగ్నసప్తమములోనుండుట పూర్తిగ్రహానుకూలతయని యెరుంగుము. ఈలగ్న పంచమ నవమాధిపతులు వారిగృహములు చెడినసర్వత్రా జీవనముచెడి కాయకష్టముపై ఆధారపడి దుఃఖించును-

శ్రీ:- స్వామి ఈవరునకు వధువుఏదిశన-దొరుకునని అడిగిన ఏదిశయని చెప్పవలయును.

గు:- వత్సా గ్రహములకు దిశాధిపత్యముగలవు. ఏదిశాధిపతి సప్తమమందుండునో అదిశలో కన్యలభ్యపడును. సప్తమమున ఏ

గ్రహము గ్రహవీక్షణలేకున్న సప్తమాధిపతి ఏదిశాధిపతి గృహము నందుండునో ఆదిశనగును- సప్తమములో శుభులులేకున్న నవమ పంచమలగ్నాధిపతుల బలముతో అయినను కళత్రమువల్ల చిక్కులుండును. సప్తమాధిపతి సప్తమములోనుండిన వివాహమగుటకే కష్టము. అనేక అపశకునములతోకార్యమై కడకు ధ్వంసమగును. నాలుగైదు గ్రహములుండిన వెనుకభాగములో ఏగ్రహముండునో ఆదిశనగును, అష్టమాధిపతియే సప్తమములోనుండిన వివాహ సమయములో చావులుసంభవించి వివాహము నిలచిపోవును. కడకు మృత్యుప్రదముగా నుండును పాపలుండిన ఆదిశలకన్యను చూపించి ఎగరగొట్టింతురు. వృధాఖర్చుల పెట్టుదురు.

శ్రీ:- స్వామి గ్రహముల దిశల తెలుపకోరెదను

గు:- వత్సా గ్రహదిశలు శాస్త్రములకు జోస్యమునకు భేదముగలదు- తూర్పునకు సూర్యుడు అగ్నేయమునకు శుక్రుడు దక్షిణమునకు కుజుడు నైరుతికి రాహువు పశ్చిమమునకు శనియు వాయువ్యమునకు చంద్రుడు ఉత్తరమునకు బుధుడు ఈశాన్యమునకు గురువు భూమికి కుజుడు ఆకాశమునకు చంద్రుడు అధిపతులు కేతువు. ఈశాన్యమొనకే అధిపతియగును. శాస్త్రజ్ఞులవచనము అనుభవములో చెడిపోవుచున్నది వారిననుసరించిన వాస్తుధ్వంసమగును.

శ్రీ:- స్వామి వారు నియమించిన ప్రకారమును తెలిపెదరా.

గు:- నాయనా వారు సూర్యుని మధ్యలోనుంచి తూర్పునకు శుక్రుని అగ్నేయమునకు చంద్రుని దక్షిణమునకు కుజుని నైరుతికి రాహువును పశ్చిమమునకు శనిని వాయువ్యమునకు కేతువును ఉత్తరమునకు గురువును ఈశాన్యమునకు బుధుని నియమించుకొన్నారు. ఇది గృహవాస్తుకుగాని కార్యక్రమములకుగాని దిక్కులనుచూపలేవు. జోస్యునిమాట పొల్లగును. గాన ముందు నేనుడివినదిశలు జోస్యరీతిగా నెఱుంగుము-

శ్రీ:- స్వామి జోస్యులకు వేదాంగజోస్యులకు ప్రతిదానిలో విరుద్ధముగానే యున్నట్లున్నదే.

గు:- ఔను వీరునియమించిన నవగ్రహప్రతిష్ఠలుకూడ జోస్యమునకు విరుద్ధమనియే చెప్పవలయును. అష్టదిక్పతులకు నగ్రహములకు సంబంధములున్నవి గమనింపుము. తూర్పునకు అధిపతి ఇంద్రుడు శుక్రునకాశక్తి ఎట్లుగలుగును ఇంద్రుడుదేవనాయకుడు సూర్యుడుగ్రహనాయకుడు ఇట్లేదిక్పతులకు నవగ్రహముల పోల్చిననరిపోవలయునుగదా.

శ్రీ:- ఎట్లో చెప్పుడు విందును.

గు:- వత్సా ఇంద్రునిశక్తి సూర్యునియందు అగ్నిదేవునిశక్తి శుక్రునియందు ( చతుర్థమున పాపియై శుక్రుడుండిన వానిగృహము కాల్చును. పరిశీలింపుము.) యమునిశక్తి కుజునియందు నైరుతిశక్తి రాహువునందు వరుణునిశక్తి శనియందు వాయుదేవునిశక్తి చంద్రునియందు కుబేరునిశక్తి బుధునియందు ఈశాన్యునిశక్తి గురువునందు కలదు. భూమిశక్తి కుజునియందు గగనశక్తి చంద్రునియందుగలదు. అష్టదిక్పతులుశక్తి నవగ్రహములశక్తి నొక్కటేయయి జంగమస్థావరముల పాలించుచున్నవని యెరుంగుము-

శ్రీ.- స్వామి వివాహ ముహూర్తమడుగ వచ్చెడివారి నియమము ముహూర్త నిర్ణయపద్ధతులెట్లో తెలుపుడు.

గు:- వత్సా వివాహముహూర్తమడుగవచ్చెడివారు ముందు ఇలువేల్పును ఇష్టదైవమును పూజించుకొని ఇచ్చిపుచ్చుకొను వారిరువురు పెద్దలతోగూడి ముత్తైదువుల సహితముగ శుభశకునముతో కర్పూరనారికేళ ఫలపుష్పతాంబూల దక్షిణ పసపు కుంకుమ పంచఖర్జూయ ఊదువత్తుల యుతముగ జ్యోతిషుని గృహముచేరి బృహస్పతికినమస్కరించి ఫలపుష్పములందుంచి ముహూర్తమడుగవలయును ఆవేళకేలగ్నమగునో దానికెక్కడెక్కడ గ్రహములు గలవోయెరింగి

లగ్నకుండలివేసుకొని ఆలగ్నము గురుపాలితమో శనిపాలితమో యెరింగి ఏపాలితలగ్నమునకుఆపాలితలగ్నము నిశ్చయింపవలయును

శ్రీ:- అట్లొక పాలితలగ్నమును మరొకపాలితలగ్నములో పెట్టరాదంమిరా స్వామి-

గు:- ఔను- ప్రకృతము పృచ్ఛకులడిగెడి ప్రశ్నలకు ప్రత్యుత్తరమియ్యవలయును గదా- ఈరెండుతెగలను తెలుసుకొనకపోయిన ఎట్లు చెప్పనగును. మావానికి బంధుత్వములో కన్యదొరుకునా. క్రొత్తచోటికి పోవలసివచ్చునా అని పృచ్ఛకులడిగినప్పుడు ఎట్లుచెప్పనగును. గురుపాలితులకు శనిపాలితులు 3, 6, 7, 8, 11, 12 గృహముల వారగుదురు. శనిపాలితులకు గురుపాలితులు అట్లేయగుదురు. లగ్నమునకు 3, 6, 7, 8, 11, 12 స్థానములలో ముహూర్తముంచరాదు. అశుభస్థానములు ఆస్థానాధిపతులు అశుభులు లగ్నమునకు 3, 7, 11 స్థానములు బొత్తిగపనికిరావు- 6, 8, 12 స్థానాధిపతులు కొన్నిలగ్నములకు మారుచుండును. ఈవిషయము తెలియజెప్పితిని గదా.

శ్రీ:- స్వామి- బంధుత్వములో కన్య లభ్యపడువారి జాతకము లెట్లుండునందురు.

గు;- వత్సా బంధుత్వములో కన్యదొరికి వివాహమగువారికి లగ్న సప్తమములో లగ్న పంచమ నవమాధిపతులలో నెవరోవక్రరుందురు. లగ్నసప్తమము కళత్రస్థానమందుముగదా. అచ్చోటశుభగ్రహములుండవలయును బంధుత్వములోగావలయును. అట్లుండక విద్యాబలముతో ధనబలముతోనొకవేళ అయినను రాయికి టెంకాయ కున్నట్లుండి కడకు దుఃఖభాజనమగునని యెరుంగుము-

శ్రీ:- స్వామి బంధువులలో అత్తకూతురు అక్కకూతురు మేనమామకూతురు మూడు విధములగు బంధుత్వమున్నదిగదా తెలుసుకొనుటెట్లు.

గు:- ఔను కుజడు సప్తమమున శుభుడై యుండుటో చూము టోయుండి కుజగృహములు రెండు శుభత్వమొందిన అక్క కూతుర గుటయేగాక కుజుడు భూకారకుడు గాబట్టి అక్కడ భూమికూడలభ్య మగును సర్వసౌఖ్యములులభించును తనకెదురులేకనడచును. శ్వశ్రృ గృహమర్యాదలు సౌఖ్యములు లభించుటయేగాక కన్యఅన్యోన్యముగ సంసారముచేయును. సుఖపెట్టును. పాపియైయుండిన వివాహమే కానివ్వకచెడగొట్టును. ఒకవేళ అయిన సంసారసుఖము ధ్వంసమగును

శ్రీ:- స్వామి అత్తకూతురు కాగలయోగ మెట్లుండునందురు. అత్తన్యాయముగల గ్రహమేదందురు.

గు:- వత్సా శుక్రుడు శుభుడై సప్తమమునందుండిన శుక్ర గృహములురెండు శుభస్కరమైన అత్తకూతురగును. అగుటయేగాక శ్వశ్రృగృహ మర్యాద లపరిమితముగ నడచును. కన్యక అపురూప వతియై అన్యోన్య హృదయయై కామకళానైపుణ్యయై భర్తనుసుఖ పెట్టును చరాస్తికావలసినంత దొరుకును.

పాపియై శుక్రుడు సప్తమమందుండిన కుదురనియ్యక చెడ గొట్టి బద్ధద్వేషము గల్పించును. లేక పిల్లలే అత్తకులేకుండచేయును. కాదని అయినట్లయిన భార్యాభర్తలకిరువురకు జీవితాంతము శత్రుత్వ ముతప్పదు. ఒకరినొకరునమ్మనితెరవుగల్పించి దుఃఖింపచేయును విడ దీసి పరాభవముల పాలుచేయును యౌవనకాలమంతయు వృధాచేసి పాపమును వడిగట్టును. శుక్రుడు అత్త అవ్వ న్యాయముగలవాడని యెరుంగుము—

శ్రీ:- స్వామి మేనమామ కూతురగు యోగమెట్లుండును. మాతుల న్యాయముగల గ్రహమేదందురు.

గు:- వత్సా సప్తమమునశుభుడై బుధుడుండిబుధగృహములు రెండు శుభస్కరములైయుండిన తప్పక మేనమామ కూతురగును. ఇట్టిజాతకుడు పుట్టినతోడనే మేనమామకు కూతురు పుట్టునని చెప్ప

నగును. పుట్టుటయేగాక రూప లావణ్యములందు వాక్చతురతయందు యుక్తియుక్తజ్ఞానములందు మిన్నయగు కన్యకగానుండును. అత్త వారింటి మర్యాదలన్ని చక్కగా జరుగును. అన్యోన్యులై యుందురు. సర్వసౌఖ్యములు చేకూరును. చరాస్థిరాస్తులుకొన్ని లభ్యమగుటో అక్కడనెయుండునట్లు యేర్పాటు జరుగుటయో తటస్థించును

పాపియై యుండిన మామకు కూతురులేకుండ చేయును లేకుండిన సంబంధము కుదురకుండ చేయును, కాదనిఅయినట్లియిన ఇరువురకు బద్ధద్వేషము కల్పించును. విడదీయును. జీవనమునకు వ్యవహారము చేయించును బంధుమిత్రులలో పరాభవము గల్పించును. ప్రాణభయమువరకు తెచ్చును. మందుబుమాకులు పెట్టినారనుభీతిని గల్పించును. మంత్రయంత్రములపై బుద్ధినిఈడ్పించి ధనవ్యయము చేయించును- బుధుడు మాతులన్యాయము గలవాడు- తాత మేన మామ బావ బావమరిది మేనల్లుండ్రు పిల్లనిచ్చినమామ మాతుల న్యాయము గలవారని యెరుంగుము- బుధుడు మాతులకారక గ్రహము.

శ్రీ:- స్వామి గ్రహముగాక గృహములరెండిట చెప్పితిరే గృహములలోకూడ బలమున్నదందురా.

గు:- ఔను గ్రహము ప్రదమపాదస్థితమై గృహములలో పాపగ్రహములులేక చూడక శుభగ్రహములుండుట చూచుటగలిగిన సంపూర్ణబలమగును ఒకగృహము పాపులతోచేరిన మూడింట ఒక భాగమును రెండుగృహములు పాపులతోచెడిన మూడింట రెండు భాగములును గ్రహము దుర్బలమగుటయో పాపగ్రహవీక్షణ గలుగుటయో గలిగిన ఆ గ్రహబలము భావబలము సర్వమునాశనమయినట్లు తెలుసుకొనుము. గ్రహముగృహములు శుభస్థితినొందిన ఆకారకత్వములు భావఫలము సంపూర్ణస్థితియని యెరుంగుము-

శ్రీ: స్వామి బంధుత్వములో కన్యకుండితప్పిపోవునే కారణ

మేమందురు-

గు:- వత్సా సప్తమముతోనున్న శుభగ్రహము కన్యకుండు నట్లు చేయును. పాపగ్రహ వీక్షణవల్లనో పాపగ్రహమందుండుట వల్లనో కన్యకుండి విడిపోవుదురు. శుభగ్రహము ముందై పాపగ్రహము వెనుకైయుండిన విడదీయును. బంధుత్వము చెడిపోవును. శుభగ్రహము వెనుకై పాపగ్రహము ముందైయుండిన ఇవ్వమని చెప్పుచుకడకు యిత్తురు ఆదంపతులు భావవిభేదములతో నిత్యకలహములతో కాపురము చేయుచునేయుందురు. సప్తమములో పాపులు బలవంతులైన విడదీసి చిక్కులనేకము గల్పింతురు. శుభుడు బలవంతుడైన ఎన్ని చిక్కులు గలుగుచుండినను కాపురము చెరుపక సాగించుచునే యుండును అందుగలుగు చిక్కులు ఎట్టివో స్థానము శుభాశుభ గ్రహముల బట్టియుండును. స్త్రీ గ్రహములైన స్త్రీలవల్ల పురుషగ్రహములైన పురుషులవల్ల నేరములుత్పన్నమై ఇరువురకు కలహములు గలుగుచుండునని యెరుంగుము.

శ్రీ:- స్వామి గ్రహములకు రూపము లెవ్వియందురు.

గు:- సూర్యునకు పితృరూపము చంద్రునకు మాతృరూపము కుజునకు సోదరరూపము బుధుడు మాతులరూపము గురువు అగ్రజరూపము శుక్రుడు కన్యరూపము శని విధవరూపము రాహుకేతువులు సేవక రూపము గాన సప్తమములో ఏ గ్రహముండునో ఏగ్రహము. పాపియో గమనించవలసి యుండును ఉదాహరణ- గురుశనులు సప్తమమునందుండి గురులగ్నమైయుండిన అగ్రజులు ఇవ్వవలయునందురు విధవ ఇవ్వకూడదనును- శనిపాలితలగ్నమైన విధవయివ్వవలయుననును అగ్రజులు ఇవ్వకూడదందురు - శుభగ్రహ పాపగ్రహము లేగ్రహరూపములో ఆరూపములతో శుభాశుభముల చేయుచుందురని తెలుసుకొనుము-

శ్రీ:- స్వామి ఎట్లో నానావిధకష్టములతో అపశకునములతో

నిర్ధనత్వముతో వివాహమై కొంతకాలమునకే నానావిధములచిక్కులు గలిగి కడకు స్త్రీ గతించగ ఏకాకియగునే వారిజాతక మెట్లుండును-

గు:- వత్సా-సప్తమాష్టమములలో పాపగ్రహములున్న వివాహము కాదు. అట్లుండియు వివాహము అగుటకు కారణము. కన్యాకారకుడగు శుక్రుని లగ్నపంచమనవమాదిపతులు చూచుటవల్ల వారితోచేరుటవల్ల కష్టములతో వివాహమగును- సప్తమాష్టమములలోనున్న పాపగ్రహదశలు భుక్తులు వచ్చినప్పుడు రోగగ్రస్తగనో కోపగ్రస్తగనో నేరగ్రస్తగనోచేసి ఇరువుర దూరగ్రస్తుల శోకగ్రస్తులుగనొనర్చి కడకు చంపును- అదేశుక్రుని రెండుశుభగ్రహములు బలీయముగా చూచియుండిన ద్వికళత్రము సంప్రాప్తించును. మాంగల్యస్థానమున బలముగా పాపగ్రహమున్న చంపును- లేదా విపరీతఫలమొనంగి దుఃఖంప చేయునని యెరుంగుము—

శ్రీ:- స్వామి- కొన్నిగ్రహములకు స్త్రీయజమానత్వముకొన్నిగ్రహములకు విధవయాజమాన్యత్వ ముండునే కారణమేమందురు- దీనిని వంశపారంపర్యమున వచ్చునా?

గు;- ఔను- సప్తమమునందున్న గ్రహమేదో దాని పాలనమున ఆగృహముండును. రవియున్నతండ్రియు-చంద్రుడున్నతల్లియు కుజుడున్న సోదరుడు- బుధుడున్న మామయు- గురుడున్న అగ్రజుడు- శుక్రుడున్న అత్త లేక కన్యలును శనియున్న విధవ లేక సన్యాసి (ఆలులేనివాడు) పాలనలో నుండును- వీరు శుభులైయుండిన ఆగృహపాలన చక్కగనుండును. పాపులైయుండిన నిత్యకలహములతో అపరిమితఖర్చులతో ఒకరియాజమాన్యము లేక పరులయాజమాన్యముతో సంసారము చిక్కుల పాలగును. దుఃఖము కోపము తాండవించుచుండును-జాతకునకు సప్తమమునందే గ్రహముండునో శ్వశ్రూగృహమున అదేపాలన జరుగుచుండునని యెరుంగుము- సప్తమమున పాపగ్రహమున్న అత్తవారికి తనకు అన్యోన్యతతుండదని

తెలుసుకొనుము. ఆపాపగ్రహరూపము బాధించును బద్ధద్వేషమేర్ప డును శుభగ్రహమున్న ఆరూపముతో సర్వసౌఖ్యములు గలుగును.

శ్రీ:- స్వామి కన్యకు వరుడు సులభోపాయముగ దొరికి తనను తనసంతతిని సుఖపెట్టవలయునన్న శుభగ్రహము లెచ్చట నుండవలయును. ఎట్టిపుణ్యముచేసి ఉండవలయునందురు.

గు:- వత్సా కన్యకువరుడు సులభోపాయముగ గాని, బంధు త్వములోగాని దొరుకుటకు లగ్న-సప్తమాష్టమములలో లగ్నపం చమ నవమాధిపతు లుండవలయును అట్లు జన్మించుటకు ముందుజన్మ సుకృతముండవలయును. ఎట్లనగా, ఉదయ సాయింత్రముల త్రిదేవీ ఉపాసనచేయుచు తానుచేసిన పదార్థములు ఎంగిలి మంగలము చేయక దైవనివేదనచేసి తానువస్త్రములు మొదలుకొని క్రొత్తవస్తు వులు పూలవరకు త్రిదేవుల యెదుటబెట్టి నమస్కరించి తీసుకొనుచు భర్తను అనురాగముతోచూచుచు వారిఆజ్ఞను శిరసావహించి ఆతని దేహము తనదేహమని ఆతనిఆకలి తనఆకలియని జీవితాంతము భర్తనుపోషించి- భర్తతెచ్చినదే పదివేలని సంతోషించి పెండ్లినాటి ప్రమాణముపాటించి భర్తఆయురారోగ్య భాగ్యములకొరకై కీర్తి గౌరవ ప్రతిష్టలకొరకై త్రిదేవుల త్రిమూర్తులధ్యానించిన ఇల్లాలికి ఈజన్మలో రూపవంతుడు ధనవంతుడు విద్యాగౌరవములుగలవాడు, ఉన్నతోద్యోగి యౌవనవంతుడు దీర్ఘాయువుగలవాడు లభ్యపడి సుఖ పెట్టును. అట్టివారికి లగ్నపంచమ నవమాధిపతులు సప్తమాష్టమము లందుండుదురు. అనగా పూర్వపుణ్య ముందుండుననుమాట.

శ్రీ:- స్వామి సప్తమాష్టమములలో శుభగ్రహములులేకున్న వివాహము కాదందుర.

గు:- ఔను శుభులచ్చోటలేకున్న శుభము నున్న సప్తమాధి పతి శుభులతోకలియుట కన్యాకారకుడగు శుక్రుడు శుభులతోకలియుట లేక శుక్రునకు శుభగ్రహవీక్షణ గలుగుటవల్ల అయినను వియోగము

తప్పదు. సులభోపాయముగ వివాహమై కళత్రానంద మనుభవించు టకు కళత్రముద్వారా ధనకనకవస్తు వాహన భూగృహాది చరస్థిరాస్తులు లభ్యమగుటకు ఆహార విహార వ్యవహారనిద్రాదులు సుఖప్రదముగనుండుటకు దీర్ఘకాలము కళత్ర సుఖ మనుభవించుటకు సౌకుమార్య సౌందర్య సౌభాగ్యవతిగ కళత్రము దొరికి అనుకూల దాంపత్యముతో జీవించుటకు కళత్రస్థానములో నొక శుభగ్రహముండవలయును. దీర్ఘ కాలము ఆయురారోగ్య భాగ్య యౌవన వంతుడై మనవలయునన్న అష్టమములో నొకగ్రహముండవలయును మైదున నిద్రాహార సౌఖ్యములకునిలయము సప్తమాష్టమములేయని యెరుంగుము- వివాహలగ్నమునకు లగ్నపంచమ నవమాదిపతులు సప్తమాష్టమములలో నియమించినదే లగ్నమని తెలుసుకొనుము.

శ్రీ.- స్వామి ఒకరికి ఒకటిరెండు తప్పి మూడవచోటును మరొకరికి ఒకటి రెండు మూడుచోట్లు తప్పి నాలవచోట వివాహమగుటకలదే ఎందుకల్లగును

గు:- వత్సా సప్తమము శనిపాలితులదై యుండినను శని పాలితులందుండినను మూడుచోట్లు విఘ్నమొనర్తురు. సప్తమముగురు పాలితులమైయుండినను గురుపాలితులందుండినను నాలుగు వరకు భగ్నముచేయుదురు. పాపులుగాక శుభులైయుండిన విఘ్నముగాదు- చక్కగా జరిగిపోవును-

శ్రీ - స్వామి అత్తవారింటినుండి లక్షలాది ధనము భూమి వస్తు వాహనాదులు దండిగా లభ్యపడునే దీనికి కారణమేమందురు.

గు:- వత్సా జాతకుని నవమస్థానాధిపతి సప్తమములో బలీయుడైయుండి కన్యాకారకుడగు శుక్రుడు లగ్నపంచమాధిపతులతో కలసి లేక చూడబడియుండి సప్తమాధిపతి రెండవగృహమున శుభులుండి, సప్తమాధిపతి శుభులకు కట్టుబడి యుండిన సంపూర్ణ యోగ మనబడును. ఈవిధులనుండి తప్పుతువచ్చి సప్తమమునున్న నవ

మాధిపతిపై నిలచిన అర్ధయోగ మనబడును వరకట్నము దండిగా దొరుకును. వివాహసమయమునకు ధనముగాని విద్యగాని భూమిగాని దండిగానుండిన వాడగును. పాపగ్రహములున్న అల్లునిధనమే అత్తగారు స్వాహాచేయుదురు. కడకు బద్ధద్వేషము గలుగును—

శ్రీ:- స్వామి వివాహమైన తదుపరి కొందరికి విద్యాభివృద్ధి యగును కొందరికి విద్యానాశన మగునే దీనినేమందురు.

గు:- శ్రీవత్సా విద్యాస్థానాదిపతియగు పంచమాధిపతి సప్తమమందుండిన వివాహానంతరము విద్యాభివృద్ధియగును. కీర్తి గౌరవములుచేకూరును కోర్కెలు ఫలించును విద్యతో సర్వకార్యములందు నేర్పరితనముగల సుగుణవతి కన్యలభ్యపడును- విద్యాస్థానాధిపతి సప్తమాధిపతితో లయమైయుండిన వివాహానంతరం విద్యానాశనమగును. సర్వాధికారములు నశించును బుద్ధిబలమే పనిచేయక నిలచిపోవునని యెరుంగుము.

శ్రీ:- స్వామి ఇల్లెటపల్లుడుగా అత్తవారింటనే ఒకజాతకుడు నిలచిపోవునే ఆజాతకమెట్లుండు నందురు.

గు:- వత్సా లగ్నాధిపతి సప్తమమందుండుటో సప్తమాధిపతితో చేరుటో గలిగినప్పుడు అత్తవారింటి కాపురమగును. లేక దశమజీవనాధిపతి సప్తమమున చేరుటవల్ల గలుగును. నవమాధిపతి ఎడింటనుండుటవల్ల గలుగును పంచమాధిపతి ఉండుటవల్ల గలుగును ఆతని నివాసమెక్కడ, ఆతనివిద్యయేది, ఆతని ధనార్జన దేనితో ఆతని జీవనమెక్కడని పరిశీలించినప్పుడు తెలియును. లగ్నాధిపతి నవమ మందుండుట ప్రబలయోగము జీవితాంతము ధనికత్వము దైవభక్తిగలిగి ఆనందముగా జీవితము నడచిపోవును. నవమమునకు ఎదురిల్లు తృతీయము. నిర్ధనికస్థానము అక్కడ లగ్నాధిపతియుండిన నిర్ధనికత్వముతో నీచధనముతో నీచముగా చోరత్వముతో జీవితము నడచును. పంచమమునందుండిన విద్యతో ధనమార్జించును మంత్రి

త్వముతో గ్రామాధికారముతో గౌరవముగా జీవించును. పంచమము నకు ఎదురిల్లు ఏకాదశమము అవిద్యాస్థానము అందుండిన విద్య లేకనే దుర్లాభముతో ఇతర ఆస్తిలతో జీవించును. ఇట్లే లగ్నపంచమ నవమాధిపతుల పరిశీలించవలయును ఈముగ్వురు పాపగ్రహము లతో దెబ్బతిన్నవారే నిర్ధనికులు నిరక్షరకుక్షులు అనారోగ్యజీవులు. అంగహీనులు నిరంతర దాస్యజీవులని యెరుంగుము.

శ్రీ:- స్వామి ఒకడు వృత్తితో మరొకడుద్యోగముతో జీవించునే కారణమేమందురు.

గు:- నాయనా ధనములో ప్రజాధనమనియు ప్రభుత్వధనమ నియు రెండువిధములుగాగలదు. కటకసింహములు సూర్యచంద్రులు లగ్నపంచమ నవమాధిపతులకు చిక్కిన ప్రభుత్వ ధనముతో అనగా ఉద్యోగముతో జీవించును. లేక ఇతర గ్రహములతో ఇతర స్థాన ములతోచేరిన ప్రజాధనము వృత్తి వ్యాపారములతో జీవించునని యెరుంగుము-

శ్రీ;- స్వామి కొందరు రాజులుగా జమీందారులుగా కొం దరు చక్రవర్తులుగా నుందురే. కారణమేమందురు. వారి జాతకము లెట్లుండును.

గు:- నాయనా చక్రవర్తులకు సూర్యచంద్రులు కటక సింహ ములు శుభస్కరమై స్థానములకు స్థానాధిపతులగు సూర్యచంద్రు లకు పాపగ్రహవీక్షణలేకుండి దశానుకూలతేర్పడును అట్టివారు చక్రవర్తులగుదురు. ఈనాలుగంశములలో ఒకటిరెండు తప్పినవారు రాజులగుదురు జమీందారులగుదురు. ఉన్నతోద్యోగులగుదురు. నాలుగు తప్పినవారు వృత్తిగాని వ్యాపారముగాని చేసి జీవింతురు. ముద్రాధికారము గావలయునన్న ఈనాలుగు హంగులలో రెండైన నుండవలయును. ఇంతో అంతో వాసనలేక రాజధనములభ్యపడదు. ముద్రాధికారము శుక్రునకు గలదని కొందరన్నారు. తెలియక పలి

కిరి. ముద్రాధికారము సూర్యచంద్రులకు కటక సింహములకేగలదు. ఉదాహరణ- తులాలగ్నమై ద్వితీయమున శని ఏకాదశమమున సింహములో చంద్రుడుండ జననమై మహాత్మాగాంధి తన బుద్ధి బలముతో రాజ్యమునే సంపాదించి భూవలయమంతటా ఆబాల గోపాలమునకు తెలిసినవాడయ్యెను. సూర్యగ్రహము దొరుకక గురువుచే బడుటచేత- రాజగురువు రాజయోగిగా జీవింపనయ్యెను. చచ్చియు బ్రతికినవాడుగా ప్రకాసించుచుండెను. రాజగ్రహములు సూర్యచంద్రులు రాజగృహములు కటకసింహములు ఈనాలుగు హంగులలో బలముగా శుభుడై ఒక్కటుండినను జగద్విఖ్యాతి నార్జించునని యెరుంగుము.

శ్రీ:- స్వామి వరులలో నుత్తమవరుని లక్షణ మెట్లుండు నందురు-

గు:- నాయనా ఉత్తమవరుడెవడో అందరికి తెలియదు. ఇది లద్దెలో మాణిక్యమువలె నణగియుండును ఎట్లనగా బాల్యములో గ్రహానుకూలతలేక ఎందుకు పనికిరాని విధముగానుండును. విద్య ధనము బలములేక సర్వవిధములా మందభాగ్యుని విధముగా గన్పడును. అందువల్ల బంధువులు దూరము చేయుదురు. కన్యక నెవ్వరివ్వరు యౌవనకాలము దాటును ఏయుక్తియందో నిర్ధనికులయింట వివాహమైన తదుపరి గ్రహానుకూలత ఏశానుకూలతవల్ల విద్య-ధనము బలము 40, 45 ఏండ్లకు లోపలగలిగి ఏదోఒక విధముతో నార్జించి కీర్తిని గడించును. ఈవిషయము జోస్యునికొక్కనికే తెలియును. ప్రజలకు తెలియదుగదా. 40, 45 వయసులోపల మంచి దశవచ్చిన భార్యాబిడ్డల చక్కగా పోషింపనగును. విద్యా వివాహాది శుభకార్యములు చక్కగా జరిగిపోవును మింధుమిత్రాదులలో వన్నెకెక్కును. కుటుంబమెంతో హాయిగా నడచిపోవును. అట్లుగాకబాల్యములో అన్నివిధములానుండి 40, 45 కు ఆస్తీపాస్తీలు చెడుకాలము

వల్ల తగ్గిపోయిన భార్యాబిడ్డల బ్రతుకు అధోగతి యగును. తన జీవితము దుఃఖభాజనమగును.

ఉత్తమవరుడు జీవితాంతము ధనయోగము గలవాడు.

మధ్యముడు 40, 45 వయసులోపల దశానుకూలత గ్రహానుకూలతగలిగి దినదినాభివృద్ధి గలవాడు-

అధముడు—బాల్యమున శ్రీమంతుడైయుండి 40, 45 యేడులకు పైన నిర్ధనవంతుడౌవాడు ఈమూడు విషయములు గమనింపవలసినవి. తెలియచెప్పవలసినవి ఒక్క గ్రహమైనను శుభస్థితిలో నుండక పోయినట్లయిన నిత్యజీవనమునకే కష్టమగునని యెరుంగుము

శ్రీ:- స్వామి వివాహముహూర్తము టయము నిర్ణయింతురే అది జిలకర బెల్లము పెట్టుటకా? లేక తాళికట్టుటకా? అని ప్రశ్నించు వారున్నారు తామేమనెదరు.

గు:- వత్సా జిలకర బెల్లము కంకణముడి బ్రహ్మముడి మొదలగునవి అశాశ్వతములు (తీసివేయునవి తాళిమాత్రము శాశ్వతము (తీసివేయనిది) హిందూ సంప్రదాయమునకు ముఖ్యమైనది విడువనిది, భర్తమినహా యెవరు తగులరానిది భద్రతగా కాపాడుకొనతగినది. భర్తజీవితమునకు సుమంగళీత్వమునకు ఆధారభూతమైనది సంప్రదాయ సిద్ధమైనది మంగళసూత్రముగదా స్త్రీ జీవిత సౌఖ్యమంతయు అందులోనిమిడియున్నది. గాబట్టి మంగళసూత్రము కట్టుటకే ముహూర్త టయమని తెలుసుకొనుము ముందువెనుకల జరిగి జరిగెడివి. ఆమంగళ సూత్రధారణమున కేర్పరచిన శుభ సూచకములేగాని అవి ప్రధానములు గావని తెలుసుకొనుము. ఆ మంగళ సూత్రధారణ జరుగునప్పుడు తుమ్ముట దగ్గుట అమంగళ కర వాక్యములు వినబడుట కూడదని అపశకునమని మంగళ వాద్యములు ప్రతిధ్వనింప శ్రవణపుటములు బ్రద్దలగునట్లు వాయించెదరు. దీర్ఘాయురారోగ్య భాగ్యములతో వంశాభివృద్ధి గలిగి వర్ధిల్లుడని ఆశీ

ర్వదించి పెద్దలు అక్షింతలు చల్లెదరు. మంగళసూత్రధారణ ముహూ
ర్తమున కేముహూర్తము-టయముగాని వేరేవాటికికాదని యెరుంగుము

శ్రీ:- స్వామి మంగళసూత్రము అందరిని తగులమందురే దీనిఅర్ధమేమందురు.

గు:- నాయనా మంగళసూత్రము అందరుతగులుటచే ఎవరి చేతిలో ఏముండునో పరశవేదితో ఇనుము బంగారమైనట్లు వారి చేతి స్పర్శతో మంగళసూత్రమునకు బలము గలుగునని భావించిరి గాని అట్లుచేయుట మంచిదిగాదు. అరువదేడులుదాటిన ముత్తైదువలు తగులవలయును. వారికి మంగళసూత్ర బలముగలిగి దీర్ఘసుమంగళీత్వము గలిగినది అట్టివారు ఒక్కరైనను చాలు. అప్రయోజకులు. సన్యాసులు ఆలుచచ్చినవారు వ్యభిచారులు అంగహీనులు రోగులు బాలబాలికలు తగులరాదు. అన్యపురుషులు తగులనేరాదు. పౌరోహితులవారిని బృహస్పతి సమానులందురు. గాబట్టి వారికొక్కరికి తగులుటకు హక్కుగలదు గాజులవాడు అందరాండ్ల చేయిబట్టినట్లు పౌరోహితునకు వివాహసమయముల అందరితాళి తగులుటకు అధికారమున్నది వయోవృద్ధులైన పుణ్యాంగన లెందరైన తగులవచ్చును గాని పురుషులు తగులరాదు అష్టమశుద్ధి గలిగినవారే తగులుటకర్హులని యెరుంగుము-

శ్రీ:- స్వామి బుధవారము ముహూర్తముంచిన మంగళవారము పెండ్లికొడుకును పెండ్లికూతురిని చేయవలసి వచ్చుననియు శనివారము ముహూర్తముంచిన శుక్రవారము ఆడబిడ్డను ఇంటి నుండి పిలుచుకపోవలసి వచ్చుననియు శుక్రవారము ముహూర్తముంచిన శుక్రవారము ఆడబిడ్డను ఒకరిసొత్తు చేయవలయుననియు నవమిముహూర్త ముంచిన అష్టమిప్రయాణము చేయవలయుననియు ఈమధ్యలో రాహుకాలమనియు అంతరాయముల ఆటంకముల అనేకము పలికెదరు. దీనినేమి చేయవలయునందురు.

గు:- నాయనా మంగళవారము గురుజాతకులకు శ్రేయస్కరము శనిపాలితులకు మంచిదిగాదు. దీనిని గమనించవలసివచ్చును. శుక్రవారము లక్ష్మీవారమని శాస్త్రజ్ఞులు తెలుపుటచేత అట్లనిరి. సోమవారము లక్ష్మీ సరస్వతులకు ముఖ్యమని తెలియరైరి అందువల్ల ఆటంకము పలికిరి. ఇంటి ఆడబిడ్డ మంచికిపోవు చున్నదిగాని చెడ్డకుపోలేదు. తానొక కుటుంబిణి యౌటకు ప్రారంభదినము-శుక్రునియందే యగుట శ్రేయము ఇది శనిపాలితులకు శుభము గురుపాలితులకశుభము- ముహూర్తముంచిన దినమునకు ముందు దినములు శుభాశుభముల చూడనక్కరలేదు. ఆముహూర్తబల మెట్లుండునో అట్లుజరుగకమానదు. అష్టమియనియు అమావాశ్యయనియు శుక్ర మంగళ శనివారములనియు అపశకునములనియు తలంచరాదు ముహూర్తబలముపైననే ఆధారపడియుండును ముహూర్తము జాతకుని బలాబలములపై ఆధారపడియుండును గాన ముహూర్తమునకు ముందురోజులను మంచిచెడ్డల నెంచరాదు. రాహుకాలముల నెక్కింపరాదు. శనిపాలితులకు రాహుకాలము శ్రేయస్కరము. గురుపాలితులకు కొంతవరకు ననుసరించుటమేలు మంగళసూత్రధారణమైనదాదిగా మంచిచెడ్డల గమనింపవలసి వచ్చును పదహారునాళ్ళ పండుగవరకు మంచిచెడ్డల గమనింపవలసినదిలేదని కొందరిమతము ముహూర్తమై పోయినవెనుక ఆలగ్నబలమై పోయెను ముందుకు కూడ శుభముండుననరాదు- జాతకుని బలాబలమే వివాహమునకు వచ్చినవారిపైన సర్వకార్యములపైన వంటవార్పులపైన ప్రయాణములపైన ముందు వెనుకల జరుగునుగాని ముందుజరుగునవే గొప్పవి. తిథివార నక్షత్రయోగకరణములు శకునములు ఏమి చేయజాలవు. వరునిజాతకబలముపైన ఆధారపడియుండుననియెరుంగుము

శ్రీ:- స్వామి గాటికి ఎద్దువచ్చినా దొంతికి కుండవచ్చినా ఇంటికి ఇల్లాలువచ్చినా శుభాశుభములుండునని అన్నారే తామేమందురు

గు:- నాయనా ఈమాటలవల్ల పలువురుకన్యలు అనేకబాధల పాలై పలువురనోళ్ళలో కరిగినారు బుద్ధిలేని పద్దన్నలు కల్పించిన వాక్యములవల్ల ప్రజలు అత్తవారింటివారు కన్యకల నాడిపోసు కున్నారు. జాతకుని సప్తమమున శుభగ్రహములున్న వానికి భార్య అదృష్టవతియే వచ్చును. పాపగ్రహములున్న దురదృష్టవతియే వచ్చును. అదృష్ట దురదృష్టములు జాతకునియందే గలవుగాని జాత కురాలియందులేవు- ఋణానుబంధ రూపేణ పశుపత్నిసుతాలయ అన్న ప్రమాణమెరుగనివారు పలికినపలుకిది. ఏనాటికైన పురుషుడు కర్త స్త్రీకర్మ గాన స్త్రీలో ఏమీలేవు. పురుషునియందే అదృష్ట దుర దృష్టములు గలవని యెరుంగుము.

చతుర్థ స్థానముపై పశువులు కుండలు కుదుళ్లు ఒకటన నేల గృహము. గృహోపకరణములు స్థాపితములు స్థిరచరసముదయ మంతయు ఆధారపడి యుండును. అక్కడశుభగ్రహములున్న అన్ని మంచివే వచ్చును. అనగా చతుర్థము శుభస్కరమై యుండవలయు నన్నమాట- చతుర్థమున పాపగ్రహములున్న పశుసంపద నశించును కుండలు పగిలిపోవును ఒకటననేల సర్వవస్తు సముదయమంతయు చీలుట ఇరుగుట చెడిపోవుట ముక్కలుపోవుట రంధ్రములువడుట చెడిమూలన పడుట చినుగుట పలాయనమగుట అయి దుఃఖింప చేయును గాని వధువువల్లగాదని యెరుంగుము. చతుర్థశుద్ధిలేనివాడు పడుకొను మంచముకూడ మూలేన తిరుగుట కుక్కియగుట కోళ్ళు చీలుట పట్టెలు వంగుట గలుగును. చతుర్థ శుద్ధిలేనివానికి గర్భాదా నముహూర్త దినమునందుగూడ ఇట్టిమంచమే దొరుకును వసతి యైన శయన గృహము దొరుకదు. కావలసిన చిక్కులన్నియు తోడ్ప డును. స్త్రీలనెత్తిపోయుట పశువుల అచ్చిరాలేదని విక్రయించుట గృహముల మారుట. అప్రయోజకము-వివాహమైనది మొదలుకొని ఈమహాతల్లి ఇంటిలోకాలు పెట్టినది. మొదలుకొని ఒకే నష్టములు

ఒకే రోగములని దూషింతురు జాతకుని నవమస్థానమునుబట్టి శుభా శుభములు గలుగుచుండును. సర్వము జాతకునిబట్టియే యుండునని తెలియక కన్యకల దూషింతురు శాస్త్రజ్ఞులు చెప్పనందున ఇట్టి విప రీత పదములు పుట్టినవి. స్త్రీలకు విపత్తులు గలిగినవి- పురుషుని ఋణము స్త్రీ-స్త్రీ ఋణము పురుషుడు-తానుముందు సృష్టించుకొన్నదే ఇల్లు ఇల్లాలని తెలిపియుండిన తెలిసియుండిన స్త్రీల నాడిపోసు కొనరు. వానికర్మ మిట్టిదని వగతురు. వత్సా ఇట్టివిషయముల నెరింగి తెలియ చెప్పుము.

శ్రీ:- స్వామి- మంగళ సూత్రధారణానంతరం దైవమునకు నమస్కరించిన తదుపరి మాతృదేవోభవ అన్నారని తల్లినుండి నమ స్కరింప వలయునా? గురువునుండి ప్రారంభింప వలయునా?

గు:- వత్సా- వందనీయుల పూజనీయుల చెప్పుమనగా, తల్లి తండ్రి గురువు దైవమన్నారు. ఒకరికన్నావకరు పెద్దవారనుట వీరిలో అగ్రస్థాన మెక్కడనుండి అనగా దైవము గురువు తండ్రి తల్లియగును- తల్లినుండి నమస్కరించు మతస్తులున్నారు పరా శక్తియే ప్రపంచమునకు అధికారిణి త్రిమూర్తుల త్రిదేవుల పుట్టించిన దను మతమున్నది. వారు తండ్రియెదుటనే తల్లికిముందు నమస్క రింపజేతురు. స్త్రీనే సర్వసృష్టికి మూలమందురు బీజములేక సృష్టి ఎట్లు సాగునో వారికే తెలియును వారి ననుసరించిన ధర్మముడు గంటును పాపము ప్రజ్వరిల్లును మతానుసారముగ భార్య భర్తకు నమస్కరించు చున్నదిగాని పరాశక్తియని భర్తభార్యకు నమస్క రించలేదు. తండ్రియెదుటముందుతల్లికి నమస్కరించుట యధర్మము- దైవమునకు ముందునమస్కరించి అటుపై ఆచార్యుడు (గురువు) తండ్రితల్లి అటుపిమ్మట వృద్ధదంపతులు మొదలుకొని వందనీయులగు వారందరికి నమస్కరింతురు. మతభేదమువల్ల అనేక ధర్మములు మారినవి. ఆచారములు కట్టుజుట్టుబొట్టు తల్లక్రిందులైనవి. మతముల

పేర మానవుల చీలికలు చేసి మన్నుతాల్చి నోట కొట్టినారు. మానవుల నుద్ధరించుటకు కాదని యెరుంగుము—

శ్రీ:- స్వామి- వివాహమునకు నిబంధన లెట్లుండవలయునో తెలుపుడు. ముఖ్యమదియేగద.

గు:- వత్సా- ముహూర్తమునకు సమయమునకు లగ్నమే దగునో తెలుసుకొని గ్రహము లెచ్చటెచ్చటగలవో గమనించి వేసుకొనుటొకటి. 2) లగ్నపంచమ నవమాదిపతు లెచ్చటుండిరో గమనించుట. 3) సప్తమాష్టమాధిపతు లెందుండిరో తెలుసుకొనుట- 4) సప్తమాష్టమములు శుభస్కరములో అశుభస్కరములో పరికించుట (అనగా సప్తమాష్టమములలో) శుభగ్రహమున్నది. శుభస్కరము లేనిది. అశుభస్కరము 5) ఆమాసములో ఆపాలితలగ్నమునకు సప్తమాష్టమములలో లగ్నపంచమ నవమాధిపతు లుండుదినమును వెతకుట 6) చంద్రుడు ఆజాతకునకు శుభుడో అశుభుడో నెరుంగుట. 7) జాతకుడు గురుపాలితుడైన గురువుగాని కుజుడుగాని చంద్రుని చూచునట్లు శనిపాలితులకు శని చంద్రుని చూచునట్లు ఏ దినము వచ్చునో తెలుసుకొనుట 8) లగ్నము ననుసరించి వారముల నియమించుకొనుట. 9) నక్షత్రములనుకూడ వీలుగలిగినంత వరకు లగ్నమునకు సరిపోవునట్లు చూచుట. 10) పాపగ్రహవీక్షణ సప్తమాష్టములకు లేకుండునట్లు చూచుకొనుట. 11) అష్టమాధిపతిని శుభులు చూచునట్లు పరికించుట. నిబంధనలని యెరుంగుము-

శ్రీ:- స్వామి- లగ్నాది ద్వాదశరాసులలో వివాహసమయమున గలుగు శుభాశుభముల తెలుపుడు

గు:- లగ్నశుద్ధి గలిగిన ఏయీతిబాధలులేక దేహారోగ్యములతో బంధుమిత్రాదులు ఒకరికొకరన్యోన్యులై సంతోషముగ కార్యము నడుపుదురు. అహారవిహారములందు ఏలోటుగాన్పింపక రుచిగా శుచిగానుండును వధూవరులు ఆరోగ్యముగా అన్యోన్యులై జీవితాంత

ముందురు. ఆనందముగా కార్యము నడచిపోవును. పాపగ్రహమున్న ఇందుకు వ్యతిరిక్తమగును.

ద్వితీయశుద్ధిగలిగిన కుటుంబచ్ఛిద్రములు, వాక్కలహములు మాటలపొరపాటు, చేదుడుకు లేక- సంతోషముగా కార్యము గట్టెక్కును- పాపగ్రహమున్న ఇందుకు వ్యతిరిక్తమగును.

తృతీయశుద్ధి గలిగిన సోదరీసోదరులు దాయాదులు అన్యోన్యులై యుందురు క్లుప్తముగా ధనవ్యయమగును. విలాసవినోదఖర్చులు తగ్గును సాఫీగా కార్యము నడచిపోవును.

చతుర్థశుద్ధి గలిగిన వస్త్రభూషణాలంకారములు విరివిగానుండును. బంధువులు విశేషముగా కూడుదురు. వాహనముల కేయాటంకముండదు. స్థలము విశాలమై గృహోపకరణములు దండిగానుండును. బంధుప్రేమ చక్కగ నుండును. వస్తువులు కావలసినన్నియుండును. కార్యము ఆనందముగా నడచిపోవును-

పంచమశుద్ధి గలిగిన కార్యము చక్కగ జరుపగల పిన్నపెద్దలకు కార్యము చేయించు బృహస్పతులకు కొదవ లేకుండును. దండిగా ఆదాయముండును- శాస్త్రసమ్మతముగా కార్యము గట్టెక్కును. మంచిచెడ్డల విచారించు పెద్దలనేకులుందురు. కలుగబోవు సంతతి సత్సంతతి గలుగును. విద్యాగోష్ఠితో కార్యము నడచిపోవును-

షట్స్థానశుద్ధి గలిగిన కలహములులేక చక్కగా కార్యము జరుగును. శత్రురోగ ఋణభీతిలేకుండ అవమానములు అపవాదులు లేకుండ కాపాడును.

సప్తమశుద్ధి గలిగిన ఆహారవిహారవ్యవహారములందు అన్యోన్యతయందు ఆహార రుచికరములందు స్థలమునందు ఏలోటులేక నడచును- భవిష్యత్కాలములో వధూవరులు అన్యోన్యులై సంసారభారము బారమనక ప్రీతిగా నిర్వహించు కొందురు. జంటపక్షులవలె నింట బైట మెలగుచుందురు.

అష్టమశుద్ధి గలిగిన ఆయురారోగ్య భాగ్యములు గలుగును- వృద్ధదంపతులై పుణ్యదంపతులై వన్నె గడింతురు. సమయమునకు మాంగల్యధారణ జరుగును. సర్వసౌఖ్యములు చేకూరును- విపత్తు లెవ్వియులేక సాంగోపాంగముగ జరుగును.

నవమశుద్ధి గలిగిన కార్యమే యాటంకము. ఏచిక్కులులేక ధనమున కేకొరత గలుగక నిర్ధనికుడైన ధనికునివలె చక్కగ నడచును- కార్యము శాస్త్రసమ్మతముగా జరుగును- కార్యము కీర్తిగౌరవములతో సాగిపోవును.

దశమశుద్ధి గలిగిన కీర్తిగౌరవములతో సర్వకార్యములకు సర్వవస్తువులకు ఏలోటు గాన్పింపక పరివారబలముతో బంధుమిత్ర సహాయముతో ప్రకృతిభాధలులేక సుఖముగాకార్యము నడచిపోవును

ఏకాదశశుద్ధి గలిగిన లాభముతో కార్యము నడచును. సమయస్ఫూర్తి జ్ఞానముతో కార్యనిర్వహణ జరుగును. అంతటా లాభమే గల్పించును

ద్వాదశశుద్ధి గలిగిన ధనము దుర్వ్యయముగాక సద్వ్యయమై పొగడ్తకెక్కును- సాంగోపాంగముగా కార్యము నడచిపోవును—

ఏఏస్థానమున పాపగ్రహములుండునో పాపగ్రహవీక్షణగలుగునో ఆస్థానము ఇందుకు వ్యతిరిక్తముగ విపరీతఫలము గలుగును.

శ్రీ:- స్వామి. ఇందులో ముఖ్యమైనస్థానము లెన్నిగలవు-

గు:- నాయనా- ముఖ్యస్థానములు సప్తమాష్టమములు. వీటియందు శుభగ్రహములుండుట అష్టమస్థానాధిపతిని శుభగ్రహము చూచుట లేక శుభులచే కట్టుబడుట ముఖ్యము. దశమచతుర్థముల శుభులుండుటో చూచుటో గలిగిన మరింతశుభము ఇంతమాత్ర ముండుదినమును వెతకవలయును. నిబంధనలకు లోనుగాకున్న చిక్కులు వివాహములో నగును. జననకాలమునగాని ప్రశ్నలగ్నమునగాని సప్తమాష్టమముల శుభులు లేకున్న వివాహలగ్నమున

సప్తమాష్టమముల శుభులుండులగ్నము దొరుకుట కష్టము. పరికించి యోచించి నియమించవలయును.

శ్రీ:- చంద్రుని శుభులు సమసప్తకములో చూడవచ్చునా? చూడకూడద?

గు:- వత్సా- సమసప్తకము ఏగ్రహమున కుండినా మంచి చెడ్డలు కలియబిసికి నట్లుండును- ప్రక్కచూపుతో చూచిన శుభము చెడక అశుభము నశించును. గాన చంద్రుడు పాపియైన అట్లశుభులు చూచుట శ్రేయోదాయకము అట్లు- చూడకున్న తానున్నచోటు చూచినచోటు సత్ఫలముల ధ్వంసముచేసి వివాహము అనేక చిక్కులకు లోనుచేయును.

శ్రీ:- స్వామి- చంద్రునట్లు చూపించుటెందుకు

గు:- నాయనా- చంద్రుడున్న నక్షత్రమునుండి దశప్రారంభమగుచున్నది- చంద్రుడు పాపియై దశానుకూలుడు పాపియై లగ్న సమయమునకు పాపగ్రహదశ వచ్చిన కార్యక్రమములో కొన్నిచిక్కులు గల్పించును. గాబట్టి చంద్రుని చంద్రుడున్న నక్షత్రమును శుభులుచూచిన అశుభత్వము తొలగును-చంద్రుడు శుభుడైయుండిన శుభులు చూడనక్కరలేదు. శుభులు చంద్రుని చూచిన దుష్టనక్షత్రమైనను శుభఫలమే యొసంగును—

శ్రీ:- స్వామి- పుష్కరాంశలన్నారే దీనినేమందురు.

గు:- నాయనా- లగ్నగడియలను మానవుని దశాసంవత్సరములను 120 తో భాగించగా వచ్చిన విగడియలను దశావారిగా హెచ్చించుచు లగ్నపంచమ నవమాధిపతుల గడియలలో మంగళ సూత్రధారణ నియమించుము. అనగా మేషలగ్నప్రమాణము 4, 23 అనుకొందము— దీనిని 120 తో భాగించి వచ్చిన లబ్ధమును దశావారిగ హెచ్చింపుచు పంచమ నవమాధిపతులకాలములో నిలుపవలయును-

శ్రీ:- స్వామి-దీనిని సూర్యుని మొదలుకొని వేయవలయునా ఆనాటి నక్షత్రనాథునుండి వేయమందురా.

గు:- నాయనా-సూర్యునుండి ప్రారంభించి వేయవలయును. ఇన శశి కుజ రాహు గురు శని బుధ కేతు శుక్ర అనియున్నదిగదా. ఇట్లే-పంచమ నవమస్థానాధిపతుల కాలపరిమితి గమనించవలయును

ఉదాహరణ— మేషలగ్నప్రమాణము 4, 23 విగడియలు— దీనిని విగడియలుచేయగ 263 వచ్చునుగదా. 120 దశాసంవత్సరములతో భాగించగ లబ్దము 2 విగడియలువచ్చి 23 విగడియలు శేషముండును- శేషమటుంచి రెండువిగడియలను రవిదశాసంవత్సరములు ఆరింటికి ఆరురెండ్లు 12 విగడియలగును ఇట్లే-గురువువరకు వేయగ 1 గడియ 22 విగడియల కాలమైనది గురువు 32 విగడియలలో అర్ధము అందులో చేర్చగ 1, 38 విగడియలగును. మేషలగ్నములో 1, 38 విగడియలు గడచిన తదుపరి గురువుయొక్క అంశ అర్ధముగా నుండుననుమాట, ఇది మేషలగ్నమునకు నవమాధిపతి అంశకాలమందురు. ప్రతిలగ్నమునకు ఇట్లే లగ్నమును భాగింపుచేసి పంచమ నవమాధిపతికాలమును తెలుసుకొనుము- లగ్నపంచమ నవమాధిపతులకాలము అమృతకాలమనెదరు. గమనించి చూడుము

శ్రీ:- కొందరికి వివాహము యౌవనకాలమునందుకాక ఏడు మీరిన తదుపరి కష్టముపైనగునే కారణమేమందురు.

గు:- వరునకు కుజుడు- కన్యకు శుక్రుడు యౌవనకాలాధిపతులు. వారుచెడి సప్తమమున పాపగ్రహముండుటో చూచుటో గలిగిన యౌవనకాలమునగాక దుఃఖింపచేతురు.

శ్రీ:- మంచికౌమారదశయందే భార్య గతించినవారు, భర్త గతించినవారు గలరే కారణమేమందురు.

గు:- పురుషులకు సూర్యుడు స్త్రీలకు చంద్రుడు కౌమారకాలాధిపతులు. వీరు బలహీనులగుట పాపులగుట పాపులతో చేరుట

నుండును. అట్లుగాక మాంగల్యస్థానము గట్టిగానుండిన కౌమారదశ దాటినంతవరకు కోపముతోనో రోగముతోనో అన్యోన్యతచెడి బ్రతికి యుందురు—

శ్రీ:- స్వామి-చాలామందికి వృద్ధత్వమున విదురుడౌటయో విధవయగుటయో తటస్థించును దీని నేమందురు

గు:- నాయనా- పురుషులకు వృద్ధత్వమున గురుడు స్త్రీలకు శని పాలింతురు- ఈగ్రహములు పాపత్వము చెందియుండిన వృద్ధాప్యమున విరధులగుట తప్పదు. కష్టములతో జీవితము నడుపవలసి వచ్చును. ఆహార విహార వ్యవహారములకు లోటు గలుగునని యెరుంగుము—

శ్రీ- స్వామి- జాతకములు మార్పు జనించును కుజపాలితము స్త్రీకి శుక్రపాలితము పురుషునికి వచ్చును. అప్పుడెట్లు చేయవలయునందురు

గు:- జాతకుని కాలపాలనాశక్తిని ఏఏగ్రహము నడపునో ఆయాగ్రహమును చూడవలయును- గురుపాలిత జాతకురాలికి కుజుడే యౌవనకాలమును పాలించును కుజుడు బలిష్టుడైయుండిన తగుసమయముననే వివాహమగును. శనిపాలితజాతకునకు శుక్రుడు బలిష్ఠుడైయుండిన సమయముననే వివాహమగును గాని సప్తమబలములేకున్న ఎందరెంతబలవంతులై యుండినను వివాహము చాలా కష్టముమీద కాగలుగునని యెరుంగుము—

శ్రీ:- స్వామి- కర్తరీదోషమన్నారు- లగ్నమునకు ఇరువాగుల పాపగ్రహములున్న మృత్యుప్రదమన్నారు. చంద్రుడు పాపుల మధ్యలో నుండినను పాపత్వమన్నారు. నిజమేనందుర.

గు:- నాయనా- శాస్త్రకారులు దేనికి మృత్యుప్రదము విధవత్వము తప్పదనుటలో మర్మము గలదు. ఏమందువా- అంతమాటనినగాని భయపడరు భయపడినగాని కట్టుకు నిలవరని అంత

మాటన్నారేగాని మరొకటిగాదు. ఒకలగ్నములో శుభాశుభులుండి పాపగ్రహము వెనుకపాదములో నుండిన, శుభగ్రహఫలము నశించును. వెనుకరాశిలో నుండిన అర్ధబలము నశింపగును–శుభుడు వెనుక నుండిన. పాపగ్రహబలము నశించును. గాని మృత్యుప్రదము లేదు- చంద్రునకూడ అంతేనని తెలుసుకొనుము గ్రహము పాపియో శుభుడోతెలియక ఇరువాగుల పాపులున్న అన్నారు ఆచంద్రుడే పాపియై యుండిన ఎట్లనువారులేరు గాన– వారు అట్లుచెప్పిరని యెరుంగుము. పాపులు చూచుటో కూడుటో వుండిన శుభగ్రహఫలము నశించును–

శ్రీ:– స్వామి–జన్మలగ్నమునకు జననకాల చంద్రరాశికి అష్టమము లగ్నమైన మృత్యుప్రదమన్నారు. నిజమేనందుర.

గు – నాయనా–లగ్నాష్టమములలో కొన్ని శుభమిచ్చులగ్నములు గలవు. మేష మిధున సింహ తుల కుంభరాసులకు అష్టమ స్థానాధిపతి శుభుడు స్థానము శుభస్థానమే యగును– శేషించినరాసులకు అష్టమస్థానదోషము తప్పక కలుగును– చంద్రలగ్నాత్ అష్టమము దోషమేనన్నాడు లగ్నముద్వారా ఫలాఫలముల తెలపజాలక అనేకమార్గముల గల్పించి తలతిక్కపట్టించినది చాలక చంద్ర లగ్నాత్ అన్నాడు. ఈవాక్యము అజాగళస్థము. శుభాశుభములు వెలుబడవు అని యెరుంగుము– గ్రహమునకు లగ్నము–నక్షత్రము ప్రాణవాయువు– లగ్నము నక్షత్రము–గ్రహము దేహిదేహన్యాయముగా ఉన్నవి. ఏగ్రహమైనను లగ్నము లగ్నముననున్న నక్షత్రము ఏఫలమియ్యగలవో ఆఫలము ఆగ్రహము ప్రసారము చేయును– తన కారకత్వఫలము నియ్యజాలడు– లగ్నమందుగల వస్తువులనిన గురు గృహములో గురుకారకత్వములు గలవు ఆచోట శుభుడైన శని యున్న గురుకారకత్వములతో జాతకుని సంతృప్తుని చేయును. తన నీచములగు కారకత్వములతో సంతృప్తుని చేయజాలడు గురువు శుభుడై శనిగృహములో నున్నయెడల శని కారకత్వములతో జాత

కుని సంతృప్తుని చేయును. వత్సా- జన్మలగ్నము ప్రశ్నలగ్నము దేనికైనను శుభమేనని తెలుసుకొనుము-శాస్త్రమును ఒకసాలున నడువనీక ఒకమాటపైన నిలువనీక చేసినారు. చూడుము-ఉదా- 4, 10 ఇంట గురుడుండ వధూవరులకు దుఃఖబాజనము. మృత్యుప్రదమన్నారు మరొకచోట కేంద్రములలో గురుడుండుట శ్రేయస్కరమన్నాడు సప్తమమున ఏగ్రహముండకూడదన్నారు. సప్తమములో శుభులుండవచ్చని మరియొకచోటన్నారు. ఇట్లే సంధిగ్ధావస్త కల్పించి శాస్త్రమునమ్మని తెరవుల గల్పించినారు, జన్మలగ్నము శుభస్కరమనినమ్ము.

శ్రీ:- స్వామి- అష్టమస్థానాధిపతి వివాహాది లగ్నముల నుండెనేని మృత్యుప్రదమన్నారు. నిజమేనంచుర.

గు:- నాయనా- మేష మిధున సింహ తుల కుంభరాసుల వారికి అష్టమస్థానాధిపతి చేరవచ్చు శేషించినరాసులకు పనికిరాదు అష్టమస్థానములలో శుభఫలమిచ్చు లగ్నములున్నవా? లేవా అను విమర్శచేయక అష్టమస్థానమే పనికిరాదన్నారు. లగ్నపంచమనవమ స్థానముల వారిగృహములే అష్టమమైన శుభస్కరమేయగును—

శ్రీ:- స్వామి- చంద్రుడు జన్మలగ్నమునకు అష్టమమందున్న దంపతులు నిత్యదారిద్ర్యప్రదులగుదురని శాస్త్రము తెలుపుచున్నది- తామేమందురు-

గు - వత్సా- మేషకటక తులావృశ్చిక మీనలగ్నములకు చంద్రుడు శుభుడు గాబట్టి చంద్రుడష్టమ మందున్న శతాయుర్దాయము గలిగి నిత్యయౌవనులై సుఖింతురు. చెదనిదేహముగ నుండును కుటుంబసౌఖ్యముండును దారిద్ర్యము వారిచెంతకురాదు. స్త్రీలవల్ల జాతకుడు లాభము గడించును- శేషించిన లగ్నములకు ఆయువు తగ్గును. యౌవనము నశించును. స్త్రీలతో పరాభవములు తటస్థించును కుటుంబము చెడునుగాని దారిద్ర్యమురాదు- ఉన్నధనము

పోదని యెరుగుము—

శ్రీ:- స్వామి- లగ్నద్వాదశము కూడ పనికిరాదన్నారే నిజమేనా?

గు:- నాయనా- పనికిరానిది నిజమేగాని మేషమిధున తుల ధనుస్సు కుంభములకు పనికివచ్చును లగ్నపంచమనవమస్థానముల వారిగృహములే అయినందున దోషములేదు. శేషించినరాసులవారికి అశుభప్రదముగా నుండును.

శ్రీ:- స్వామి- జన్మలగ్నమున వివాహలగ్నము పెట్టరాదన్నారు. నిజమేనందుర.

గు:- నాయనా- ఏలగ్నములో ముహూర్తముంచినను జన్మలగ్నఫలమే యొసగును గాని వేరువిధముగ జరుగదు. జన్మలగ్నము శ్రేయస్కరము- సప్తమాష్టమముల శుభగ్రహము లుండిన జాతకునకు ఏలగ్నముంచినా సప్తమాష్టమముల శుభగ్రహములు దానంతటవి వచ్చిపడును. జననలగ్నములో సప్తమాష్టమముల శుభులులేని వానికి వివాహలగ్నములో శుభులు సప్తమాష్టమములలో నుండుట కష్టము- అట్టి సమయమునకే వివాహము తటస్థించునని తెలుసుకొనుము—

శ్రీ:- స్వామి- లగ్నపంచమ నవమస్థానములు ప్రతిమానవునికి శుభము చేకూర్చు స్థానములని ఒకచోటవ్రాసి మరియొకచోట జన్మలగ్నము పనికిరాదని వ్రాసిరి. దీని నేమందురు.

గు:- ఏమందును- వ్యావహారికము చెడినదందును వత్సా- లగ్నపంచమనవమస్థానములు జన్మలగ్నమునగాని, ప్రశ్నలగ్నమునగాని ఉత్తమములు. ఈగృహముల వారిగృహములు షష్టాష్టద్వాదశస్థానములని తలపరాదు. దోషములేదు. సప్తమాష్టమములలో లగ్నపంచమ నవమాధిపతులు నిలుచునట్లు చూచుటే జోస్యులపనియని గ్రహించు.

సప్తమము- వధూవరుల అన్యోన్యత సంసారసుఖము ఎకతె గని బాంధవ్యము లనేకముగలది. ఇక్కడొక శుభగ్రహములేకున్న ఇందుకు వ్యతిరేకఫలము గలుగును. అష్టమములో నొకశుభగ్రహమున్న ఆయుర్వృద్ధి నొసంగును. మాంగల్యబల మొసగును. యౌవనసుఖమొసగును అక్కటొక పాపగ్రహమున్న ఇందుకు వ్యతిరేకముగ జరుగును. సప్తమాష్టమములలో నొకగృహములోనైన శుభగ్రహము లేనివారికి శాస్త్రజ్ఞులు ఎంతమంచి ముహూర్తముంచినను మాంగల్యము దక్కుట కష్టము, దక్కిన సుఖముగలుగుట కష్టము. ఇది సాధ్యముగాని పనియని తెలుసుకొనుము- జన్మలగ్నమున వివాహలగ్నముంచుట క్షేమమని యెరుంగుము—

శ్రీ:- స్వామి- చంద్రుడు 6, 8, 12 గృహముల వివాహలగ్నమునకు ఉండరాదన్నారే నిజమా

గు:- శ్రీవత్సా- శుభుడై చంద్రుడు అష్టమమున నుండుట శుభప్రదము. అశుభుడైయుండెనేని దుఃఖింపచేయును- 6-12 ఇంట నుండిన వివాహమున కేలాటి అశుభముల గలిగింపలేడు అన్నిగ్రహములెంతో అంతేనని యెరుంగుము—

శ్రీ;- స్వామి- చంద్రుడు పాపగ్రహముతోగాని శుభగ్రహముతోగాని కూడరాదన్నారు. నిజమేనందుర.

గు:- వత్సా- చంద్రుడు శుభుడై ఎక్కడున్నను శుభప్రదమే యగును పాపియైయున్న గురుపాలితులకు గురుకుజుల ప్రక్కచూపులలో అనగా— గురువు 5, 9 కుజుడు 4, 8 చూపులలో చంద్రుడుండునట్లు చేయవలయును. శనిపాలితలగ్నమైన శని 3, 10 చూపులో చంద్రునుంచవలయును- శుభుడై శుభులతో చేరుట శుభము. పాపులతోచేరిన సంతతికి హాని కలుగును. ఆదినము కొన్నిచిక్కులు తటస్థించును. చేరిన గ్రహముననుసరించి శుభాశుభములు గలుగును— కలిసిన స్థలము ననుసరించి మంచిచెడ్డలు గలుగుచుండును. ఒక

గ్రహమున కొకగ్రహమెదురైన శుభాశుభములు కలియబిసికినటయి చింతింపచేయును.

శ్రీ:- స్వామి-చంద్రుడు ఏగ్రహముతో చేరినను అశుభ ఫల మొనగునని యొకసిద్ధాంతము శుభులతో చేరవచ్చని మరొకరి యభి ప్రాయము ఇచ్చిరి. నిజమ.

గు:- చంద్రునకు లగ్నముల మార్పువల్ల పాపత్వశుభత్వము వచ్చునన్న అభిప్రాయము ఇరువరకు కలుగలేదు శుభుడై శుభులతో చేరుట శుభము. శుభుడై పాపులతో చేరుటవల్ల మిశ్రితఫలము. పాపి యై పాపులతోచేరుట మిగుల పాపత్వము. తప్పక అశుభముల చేకూర్చును

శ్రీ.- స్వామి-సజీవులై ఇద్దరుముగ్గురు భార్యలుందురే వారి జాతకము లెట్లుండును

గు:- నాయనా- లగ్నసప్తమమున ఒకటిరెండు శుభగ్రహ ములతో రాహుకేతువులుండి కొందరికి కళత్రకారకుడగు శుక్రునితో శుభులొకరిద్దరు చేరియుండుటచేత కొందరికి శుభులై చంద్రరవులు శుక్రునితోచేరి సప్తమాష్టమ లగ్నద్వితీయముల నుండుటచేత కొంద రికి ద్వికళత్ర త్రికళత్రములుండును సజీవులై యుందురు. శుభులు చేరియుండిన ఇందులో పాపులు కలసి యుండిన అగుటయు తెగు టయు తప్పదు. దశానుగూలతలో శుభగ్రహదశలు పోయి పాపగ్ర హదశలు మిగిలిన ఏకాకిని చేయును.

శ్రీ:- ఒకరికి ప్రథమకళత్రము గతించి ద్వితీయకళత్రము ద్వితీయము గతించి తృతీయము మిగిలి జీవితాంతముండునే వారి క్షేమందురు.

గు:- వత్సా-అట్టివారికి శుభాశుభగ్రహములుండి పాపగ్రహ దశాన్యభుక్తిలో కళత్రహీనునిగా చేయును. పాపదశాన్యభుక్తి పోగా శుభగ్రహభుక్తిలో మళ్లీ శుభగ్రహము పెండ్లిచేయును. పాపగ్రహ

దశపోయినది గాబట్టి శుభుడువచ్చి సభార్యను దీర్ఘకాలము బ్రతికించి సంసార సుఖము గలిగించును- దీనికితోడు అష్టమమున పాపగ్రహమున్నను వీక్షణ గలిగినను మాంగల్యహీనుల చేయును - లేదా యౌవనహీనునిగా చేయును. లేదా అధమాయుర్దాయునిగా చేయును- సప్తమాష్టమములలో పాపగ్రహ శుభగ్రహ సమ్మేళన గలిగి దశానుకూలముగా పాపగ్రహదశలుపోయి శుభగ్రహములు మిగులును వారిట్లనుభవింతురు. శుభగ్రహదశలుపోయి పాపులు మిగిలిన కడకు ఏకాకియై దుఃఖించును—

శ్రీ:- స్వామి-కొందరికి అత్తగారింటి ధనము దండిగా లభ్యపడును. కొందరికి క్వచిత్ ధనము లభ్యపడును. మరికొందరికి అత్తగారే తనధనము స్వాహాచేతురు. ఈజాతక మెట్లుండునందురు.

గు;- నాయనా- ప్రతిలగ్నము నక్షత్రముద్వారా తొమ్మిది భాగలుగా లగ్నమైయున్నదికదా- అనగ అశ్విని భరణి కృత్తికాప్పాదం అన్నారుగదా. అశ్విని ప్రథమపాదములో గ్రహమున్న సంపూర్ణముగా లగ్నము త్రొక్కియుండును. కృత్తికాప్రథమపాదములో గ్రహమున్ననేమగును. లగ్నాంతమై గ్రహమునకు దుర్బలత్వము గలుగును. గాబట్టి గ్రహబలము గమనించవలయును సప్తమమునందు శుభుడెంతబలముగా నుండిన అంత శ్వశృగృహ ఆదాయము నుండును- భార్య అంత అనురాగవతిగా నుండును- పాపగ్రహమెంత బలముగా నుండునో అంత అత్తగారు అల్లునిధనము స్వాహాచేతురు. భార్య రోగగ్రస్తగనో, కోపగ్రస్తగనో, శోకగ్రస్తగనో తయారై భావవిభేదములతో బాధించునని యెరుంగము— ముందు జన్మమున కన్యాదానములు చేసి త్రిదేవుల నర్చించి భార్య కష్టసుఖముల గమనించి పెండ్లినాటిప్రమాణములకు బద్ధుడై అత్తవారింటి ధనమాసించక ధర్మబద్ధుడై అత్తమామను తల్లిదండ్రిగా పరికించిన వానికి అత్తగారిల్లు భార్య మంచివిగా దొరుకును. వీటికి దూరమై

నటించినవానికి సప్తమాష్టమములలో పాపగ్రహములుండి ఈ జన్మలో బహుముఖముల బాధించునని యెరుంగుము—

శ్రీ:- స్వామి-కళత్రభావములో గ్రహము బలముగా వున్నదాలేదా అని తెలుసుకొనుటెట్లు.

గు:- వత్సా- సప్తమము కళత్రస్థానమందుముగదా. ఆకళత్రస్థానమును భాగలు చేయవలయును ఎట్లనగ- మేషలగ్నమునకు కళత్రస్థానము (సప్తమము) తులలగ్నము కాగలదు. తులాలగ్న ప్రమాణము 5, 21 విగడియలను కొందము. దీనిని 12 భాగలుచేసిన ఒకభాగమునకు 27 విగడియలు వచ్చును— ద్వాదశలగ్నము లెట్లు భావించుచున్నామో అట్లు ఈభాగలను లెక్కించవలయును— అనగా 1) తనువు 2) కుటుంబము 3) సోదర 4) మాతృ 5) విద్య 6) శత్రు 7) కళత్రస్థానమని యెంచుచున్నాముగదా. రాశిని భాగించినపుడు 27 విగడియలు ఒక్కొక్కభాగమునకు వచ్చినదిగదా అది ఏడవభాగవరకు కూడిన 3-9 విగడియలు వచ్చును అక్కడున్న గ్రహము ఇంతకులోపల ఉండవలయును. ఏడుదాటి ఎనిమిదవభాగలోగాని 9, 10, 11, 12 భాగలలోగానిఉండిన దుర్బలమని యెరుంగుము— ఇట్లే ప్రతిదీ గమనించవలయును. ఎట్లన భూమి నాలుగవఇల్లుగదా నాలుగవభాగకు లోపలనే గ్రహముండిన ఇల్లు భూమి పశువులు మొదలగునవి సమృద్ధిగానుండును. నాలుగోభాగ దాటినప్పటినుండి క్రమక్రమేణ తగ్గుచువచ్చును. మరియొకటివిద్య-అయిదవఇంటిలో అయిదవభాగకు లోపలనే శుభగ్రహమున్న విద్య ప్రబలముగాగానుండును-ఇట్లే అన్నిటను చూచుకొనవలయును-గ్రహము ఆరోహణలో వుండుటయేబలము-అవరోహణలో దుర్బలమని యెరుంగుము.

శ్రీ:- స్వామి- మావానికి లగ్నమెప్పుడగునని పృశ్నింతురు. దీనినెట్లు చెప్పవలయునందురు.

గు:- నవగ్రహములలో గురువు శుభకార్యకారకుడు శుభ

కార్యస్థానము నవమముగదా. ఆజాతకునికి లేదా ప్రశ్నలగ్నమునకు గురువు నవమము ఎప్పుడు చూచునది గమనించి ఆకాలమును తెలుపవలయును తొమ్మిదవయింటిని గురువుచూచిన వారిఇంటిలో శుభ కార్యములగును- అనగా- వివాహములు జరుగుట, తీర్థయాత్రలకు పోవుట షట్టువెంట్రుకలు తీయించుట, నామకరణములు, ఉపనయనములు రజస్వల వివాహములలో పాల్గొనుట జరుగును. నవమములో పాపగ్రహములున్న జాతకునికి శుభకార్యము లన్నియు ఆటంకములు విపత్తులు, కలహములు టయము మారుట జరుగుచుండును నవమము నందున్న పాపగ్రహము గురువు చూచినను ఆటంకము గల్పించుచునే యుండును. నవమస్థానాధిపతి దశలో భుక్తిలో శుభకార్యము లగుచుండును- అదవచ్చు కాలమెప్పుడో తెలుసుకొని తెలుపుము—

ఇదియుగాక జాతకునికి చంద్రుడు పాపియైన తల్లికోరికలతో భిన్నము చేయును సూర్యుడు పాపియైన తండ్రి భిన్నము చేయును. కుజుడు పాపియైన వివాహము కాతగ్గసోదరీలు ఆటంకము గలుగును. బుధుడు పాపియైన మాతులన్యాయముగల బావ మామ బావమరది మొదలగువారు- గురువు పాపియైన జ్యేష్ఠ సోదరసోదరీలు— శుక్రుడు పాపియైన అత్త అవ్వ- శని పాపియైన విధవలు- చావులు, సంప్రాప్తింపచేతురు. వీరి కోరికలవల్ల వివాహము ఆగిపోవుచువచ్చును యౌవనకారకులగు కుజశుక్రులు పాపులైన యౌవనకాలము దాటింతురని యెరుంగుము—

శ్రీ.- స్వామి శనిపాలితజాతకులకు గురువే వివాహాదిశుభ కార్యములకు నాయకుడందురా?

గు:- వత్సా- గురువు పాపియైన ప్రేరేపణచేసి చెడగొట్టుచుండును. శనిపాలితమైన నవమాధిపతి దశయో భుక్తియోవచ్చి ఆగ్రహము గురువును చూచిన శుభకార్యములగును శని నవమము

నకు వచ్చినప్పుడు తప్పకగును. శని మూడింట, పదింట గురువును చూచినప్పుడు శనిపాలితులకు అవును-శని గురువును చూచినప్పుడు శుభకార్యములన్నియు శనిపాలితులకు చేయించును—

శ్రీ:- స్వామి- కొందరికి వివాహములలో అనేకచిక్కులు గలుగును. కారణమేమందురు.

గు:- నాయనా- జాతకునికి నవమములో పాపియై రవి యున్న తండ్రికి, చంద్రుడున్న తల్లికి, గర్భవతులకు- సన్నపిల్లలకు పాడిపశువులకు- కుజుడున్న సోదరీసోదరులకు, ఎద్దులకు కుక్కలకు- బుధుడున్న మాతులన్యాయము గలవారికి సేవకులకు- గురువున్న అగ్రసోదరీసోదరులకు, పెండ్లిపెద్దలకు, పౌరోహితులకు-శుక్రుడున్న మేనత్తకు, అవ్వకు, పశువులకు, వాహనములకు- శనియున్న విధవలకు, సన్యాసులకు, ముసలివారికి, విధురులకు (ఆలులేనివాడు) విపత్తులు గలిగింతురు. కార్యభిన్నము చేతురు. చంపుదురు- రాహువున్న సర్పభయము, చోరభీతిని గలిగించును- కేతువు మాతామహులకు రోగబాధ గలిగించును—

శ్రీ - స్వామి- ఇవి కన్యకవల్ల కలుగునందుర. వరునివల్ల కలుగునందుర.

గు:- కన్యకవల్ల కలుగునవిలేవు వరుడే కారణభూతుడు అందువల్లనే ఋణానుబంధరూపేణ పశు పత్నీసుత ఆలయ అనిపెద్దలన్నది. దీనినెరుగక ఆడపిల్లల ఆడిపోసుకొందురు- కన్యలందుగల పాపగ్రహదుష్ఫలము తనవారికిజరుగును వరునిదెబ్బ ఇరువాగుల జరుగును. కర్తవరుడు గాబట్టి-కర్త నుండియే శుభాశుభములు గలుగును. వరుడు అదృష్టవంతుడైన అదృష్టవంతురాలు వధువు దొరుకును. దురదృష్టుడైన దురదృష్టురాలు దొరుకునేగాని అదృష్టవధువెట్లుదొరుకును. దొరుకదు- దీనిని తెలియచెప్పేడివారులేక కన్యకల ఆడిపోసుకొనుచున్నారని యెరుంగుము—

శ్రీ:- స్వామి- సప్తమాష్టమములలోనున్న గ్రహములు లెక్కింపనక్కరలేద?

గు:- నాయనా- లెక్కింపవలసినది సప్తమాష్టమములైనను పాపగ్రహములు ఏస్థానమున బలముగా నుండునో అచ్చట గలుగ వలసిన ఫలములేవో వాటివల్ల బాధించును- చంద్రుడు కటకము పాపత్వము చెందిన వర్షముతో బాధించును సప్తమము చెడిన వంటపదార్థములన్నీ చెడిపోవును పదార్థములు దొంగలింతురు. ఫలాహారములు, భోజనము అందవలసిన వారికందక అప్రయోజ కులకు అందును. దొంగతనమై పోవును. చతుర్థము చెడిన ఆత్మబం ధువులు కలియరు. వాహనగండములు, కలహములు జరుగును-ఇట్లే ద్వాదశస్థానముల గమనించి తెలుపవలయును తెలిసియుండిన కర్త జాగ్రత గలిగియుండునని తెలుసుకొనుము —

గు:- వత్సా- వివాహవిషయములు నీవడుగుచు నేను చెప్పుచుపో యిన ఒక్క వివాహబలములే వేలపేజీల గ్రంధమగును. ఇంతటితో చాలించు- కావలయుననిన తృతీయతరంగమున చెప్పెదను మరొక విషయమడుగుము —

శ్రీ:- స్వామి- అట్లయిన ఉపనయన మనగా ఏమి ఎందుకు చేయుచుండిరి. ఇందులో గలుగు ఫలమేమి ఈఉపనయనము బంధు మిత్రాదుల గూర్చుకొని సామాన్యవివాహ మంతఖర్చుపెట్టి చేయు దురే దీని విషయము తెలుపుడు

గు:- వత్సా- బ్రాహ్మణుడని చెప్పకనే తెలుసుకొనుటకొక చిహ్నము జందెము. వేదాధికారము పొందినవాడని వేదము చదు వుచున్నాడని అడుగకనే తెలిసికొనుటకుచిహ్నము- యజ్ఞయాగాది క్రతువులలో బ్రహ్మత్వము సంపాదించిన వృద్ధబ్రాహ్మణులలో శ్రౌతస్మార్తాదికర్మలలో పాల్గొను అధికారమున్నవాడని అడుగకనే తెలుపును- నేనీనాటినుండి ముప్పేళల దైవధ్యానము జీవితాంతము

చేయువాడను. బ్రాహ్మణనియమములకు బద్ధుడనై నిలువగలవాడను పాపదూరుడనై సంచరించువాడను, మాతృపితృగురుదేవ బ్రాహ్మణ వయోవృద్ధుల వచనముల పాటించువాడను, చతుర్వేదపారంగతుడనై మంత్రోపాసనచేసి బ్రహ్మతేజస్సును సంపాదింతునని ప్రతిజ్ఞ చేయించివేసిన దీక్షాబంధము జందెము- జందెమువేసి మంత్రోపదేశము చేసెదరు.

శ్రీ:- స్వామి ఆమంత్రము తారకమా? అమనస్కమా? అచలమా?

గు:- కాదు-వేదహితముగా మంత్రముపదేశించెదరు. దానిని బ్రహ్మోపదేశమనెదరు. ( గాయిత్రీమంత్రము )

శ్రీ:- స్వామి- ఉపనయనమన్నారే. దాని అర్థమేమి?

గు:- నాయనా- నారామజపమున కంతరాయము గల్పించుటకు విఘ్నపతివైనావే యీనాడు?

శ్రీ:- ఆవిఘ్నపతి మాయిలువేల్పుస్వామి- నేనొకరిచెంతకు చేరుటకు కారణము. ఏదోవక సందేహమే కారణము. వారిపని కంతరాయము గల్పించి నాపని నేను సవరించుకొనుచుందును. ఆ రామజపములో గలపుణ్యము ఒరులకు జ్ఞానోపదేశము చేయుటలో లేదందురా.

గు:- లేకేమి నాయనా- తానుకష్టపడి నేర్చుకొన్నది. గ్రంధరూపమున తయారుచేసికవులు ఒరుల కందిచ్చుచున్నారు. సైంటిష్టులు మానవుల కుపయుక్తమగు వస్తువుల తయారుచేసి లోకమున కందిచ్చుచున్నారు. గ్రంధశోధనచేసిన పండితులు ప్రజలకు జ్ఞానాభివృద్ధి దైవభక్తి, భూతదయ గలుగునట్లు పురాణములుచెప్పి జ్ఞానాభివృద్ధి చేయుచున్నారు. ఇదంతయు పుణ్యమేకద. వీరికి ఉపనయనమున్నది. ఉపనయనశక్తి (దృష్టి) లేనివారు కాయకష్టముతో జీవించువారు. ఈఉపనయనదృష్టిలో విద్య, వినయము, భూతదయ, దైవభక్తి, గ్రాహితజ్ఞాపకశక్తులు, అనంతమైన ఊహలు, త్రిశక్తిబలము

చేకూర్చుమార్గములు కననివి విననివి కన్పడుచుండును. వినబడు చుండును— ఆ ఉపనయనదృష్టి నొసంగునది. దైవశక్తి- ఆదైవశక్తిని నార్జింపచేయునది. మంత్రము- ఆ మంత్రబలమును బలకొనింప చేయుటకు జపము. (సాధన) అట్టి సాధనకు ప్రారంభదినమునకు ముహూర్తము కావలయుననుటయే ఉపనయనము ముహూర్తము.

శ్రీ:- స్వామి- మంత్రము జపించిన మంత్రాధిష్ఠానదేవత వానియందు ఎట్లుచేరును. జీవునికి దేవునికి మిశిత మెట్లగును.

గు:- నాయనా- నీవకశ్లోకము కంఠస్థముచేసి విడిచిన అది నీవెప్పడు దలచిన అప్పుడు వచ్చుచు పోవుచున్నది. వచ్చుటకు పోవుటకు దానికి నెలవెక్కడున్నదందువు ఆచోటనే నీమంత్ర అధిష్ఠానదేవతాశక్తి నీవెంత సంపాదింతువో అంతమాత్రము దాగియుండును. దాగియుండి మరుజన్మకు గ్రాహితజ్ఞాపకశక్తి, ఊహనాశక్తి. ధారణాశక్తిగా బయలుదేరి దానివల్ల విద్యాధనము, యశస్సు సౌఖ్యము నొసంగును ఒకటననేల సర్వము చేకూర్చును. ఈమంత్రశక్తి ఉపనయనమను జ్ఞానచక్షువునందు దాగియుండును. ఆజ్ఞానచక్షువుదృష్టిని ప్రసరింపచేయుటకు జీవునివల్లకాదు. దేవునివల్ల కావలయును. దేవుని అనుగ్రహము సంపాదించుటకు సంధి, మంత్రము, భక్తి కావలయును— బహిర్గతవస్తువులను చూచుటకు రెండునయనములుపకరించుచున్నవి అంతర్గతవస్తువులను చూచుటకు ఉపనయనమొకటున్నది. దానిని జ్ఞాన చక్షువందురు. దీనిదృష్టి అఖండమైనది. దాని దృష్టిబలము గలవారే గొప్పవారు. అట్టి మంత్రశక్తి ప్రబలముగా సంపాదించి మహిమల చూపుతున్నారు. బంగారురాగియందు మిశ్రితమైనట్లు దైవశక్తి జీవునియందు సాధనబలముతో మిశ్రమ పరుచుకొన్నవారే మహనీయులు. కొరత గలిగినవారే కవులు, గాయకులు, పండితులు, సైంటిష్టులు, ఇంజనీర్లు; ఉన్నతో

ద్యోగులు, రాజులు, చక్రవర్తులు, దైవజ్ఞులు. డాక్టర్లు, ధనికులు, బలవంతులు, రూపవంతులు మొదలగువారు దేహశక్తి, జ్ఞానశక్తి, ధనశక్తి, ప్రభుశక్తి ఆఉపనయనమందే దాగియున్నవి.

శ్రీ:- స్వామి- ఉపనయనశక్తి వీరియందున్నది వీరియందు లేదని గ్రహించు కొనుటెట్లు.

గు:- వత్సా- ఉపనయనశక్తి పంచమమందు పంచమాధిపతియందు గలదు. పంచమాధిపతి పంచమములో బలవంతుడై యుండుట, నవమాధిపతి పంచమములో నుండుట. లగ్నాధిపతి పంచమమందుండుటలో నవమాధిపతి పంచమములో పూర్తి బలవంతుడుగా గాని ఉచ్చలోగాని ఉండిన ఈఉపనయన దృష్టి ప్రబలముగా నుండును. దైవభక్తి దానంతటది గలిగి వికృతమగును– దైవము ప్రసన్నుడగును తాదలచినదేదో దానికి గమ్యస్థానము చేరుమార్గము- చక్కగా తనమనస్సుకే కానవచ్చును గమ్యస్థానము చేరగలరు. లగ్నాధిపతి పంచమాధిపతి పంచమములో నుండిన విద్య ప్రబలముగా నుండును. చంద్రుడు నవమాధిపతియై పంచమములో బలవంతుడైయుండి పంచమాధిపతి నవమములోనుండ ఏకసంతగ్రాహియౌను. దైవభక్తి సంపూర్ణస్థితి నొంది అణిమాద్యష్టసిద్ధి గలుగును. ఈగ్రహములు చతుర్ధశమములోనుండిన ధర్మసంస్థాపనలుచేసియు దానధర్మములు చేసియు పుణ్యమార్జింపచేయును. లగ్నపంచమనవమాధిపతులు చెడినవారు స్నానసంధ్యావందనములు దైవధ్యానము చేయరు. చేయుదమనుబుద్ధి పుట్టదు- ఈభక్తి కుదురుటకు మార్గములనేకములున్నవి ఎట్లన కళత్రరూపేణ పుత్రపుత్రికారూపేణ ధనరూపేణ. విద్యారూపేణ, శత్రురోగ, ఋణరూపేణ అసౌఖ్యరూపేణ ఇట్టివాటి యందు అనేకచిక్కులు గలిగి దుఃఖభాజనులై ఎటుపోవుటకు దారిగానక నాయనువారులేక దైవముతో చెప్పుకొనుచు దైవభక్తిని కుదుర్చు కొందురు. కుదురును. కొందరు యౌవనహీనులై

కళత్రదూరులై, సన్యాసము పుచ్చుకొని ఇంతో అంతో దైవశక్తిని సంపాదింతురు కొందరు- కొందరు డాంబికులై ధనార్జన చేయుచు కామితార్థముల తీర్చుకొనుచుందురు ఈ ఉపనయన దృష్టిలేనివారికి గ్రాహితశక్తి, జ్ఞాపకశక్తి ఉండదు. దైవభక్తి పూర్తి అంతరించును- మానవత్వమునుండి పశుత్వమునకు దిగజారుదురు- ఉపనయనశక్తి ఉన్నవారు దినదినాభివృద్ధిగా ముందుకు సాగిపోవుచుందురు- ప్రతి మానవుడు ఉపనయనశక్తిని సంపాదింప ప్రయత్నము చేయుట శ్రేయము.

శ్రీ:- స్వామి- ఆశక్తి జననమునలేనివానికి మధ్యలో కలిగింపవచ్చునందుర.

గు:- నాయనా- కలిగించుట కష్టమైనది నిజమేగాని మానవప్రయత్నము కొంతవరకు సాగింపచూచుట నైజముకదా విను_ పూర్వులు పిల్లవానికి ఏడు, ఎనిమిదియేడులువచ్చినదే ఉపనయనము చేసి గురుకులవాసము పిల్లవానిని చేర్చుచుండెడివారు- ఆగురుకులవాసములో నిత్యకృత్యముగా తప్పక ముప్పేళల సంధ్యావందనము చేయుచు, దేవతార్చన రెండువేళల చేయుచు వేదవేదాంగముల కంఠస్థము చేయుచు 12 సంవత్సరము లుండుటచేత ఉపాసనాబలము కుదిరెను- అక్కడ చేయకపోయిన గురువులదండన- పారిపోయిన రాజదండన, ఇంటికి పోయిన తలిదండ్రి దండన, మితిమీరిన సంఘబహిష్కరణ దండన- గలుగుచుండెడిది గాబట్టి- వైతొలగుటకు లేదు- 12 ఏడులు ఆమంత్రజపము సాగుటవల్ల గురువులు మంత్రములోగల మహిమను తెలియజెప్పుటవల్ల, పూర్వజన్మ సుకృతఫలమువల్ల మనఃపూర్వకముగా చేయువారు కొందరు దండనాభయముతో చేయువారు కొందరు అయినను 12 సంవత్సరములు దాటి ఇంటికివచ్చి సోమరియై చేయకపోయినను 12 ఏడులు చేసినశక్తి వానియందు దాగియుండి మరుజన్మకు సైదోడై కొంతనయముగా జన్మను

నడిపించును. తనకొరకు గాకపోయిన బ్రాహ్మణులు ఇతరులకొరకై ఉదరపోషణ కొరకై జీవితాంతము మంత్రపఠన చేయవలసివచ్చి నందున ఉపనయనశక్తి ముందుకు అడుగు వేయించును. సంధ్యావందనములో జగచ్చక్షువగు సూర్యభగవానుని ధ్యానము గలదు. గాబట్టి వీరి జ్ఞానచక్షువుకు సూర్యుడు బలమును చేకూర్చుచునేవచ్చు చుండెను. అదియుగాక విష్ణు నామోచ్చరణ నూర్లమార్లు దాటు చున్నది. మూడువేళల మూడువిష్ణు అష్టోత్తరములు చెప్పినట్లగు చున్నది ఈనామజపశక్తివల్ల జ్ఞానశక్తి, ధనశక్తి, దేహశక్తి సంపాదించుకొని సుఖపడుచూ పరోపకారమొనర్చి, ముందుకు పోవువారు కొందరు, మితిమీరి జపమొనర్చి ముక్తికి పోవువారుకొందరు. ఆ శక్తివల్లనే ప్రజల కపకారమొనర్చి దైవాపచారమొనర్చి దిగజారి పశుపక్ష్యాదులలో కలియువారు కొందరుగలరు. నాయనా. నీవడుగుచు నేనుచెప్పుచు పోయిన ఇదేవక గ్రంధమగును. నీవడుగతగిన వేవో అడుగుము.

శ్రీ:- స్వామి - ఉపనయనమునకు వివాహలగ్నమునకున్నట్లే సంవత్సర అయన ఋతు, మాస, పక్ష, తిథివారనక్షత్రములవరకు శుభాశుభముల తెలిపినారు. ఇవి అన్నీ కుదరవలెనన్న సాధ్యము గాదు. తమరేమందురు.

గు.- వత్సా- వివాహలగ్నములందే వీటిని గురించి చెప్పితినిగదా. నిష్ప్రయోజనమని- వీటిని పాటింపక గురుపాలిత శనిపాలితముల గమనించి ఎవరివారములవారికి ఎవరిలగ్నములవారికి తీసుకొని మంత్రాధిష్ఠానదేవత ప్రసన్నస్థానము, విద్యాస్థానము, సరస్వతిస్థానము. ఉపనయనస్థానమగు పంచమమునను, పూర్వపుణ్యస్థానము, ధనస్థానము, సకల శుభస్థానమగు నవమమున లగ్న పంచమనవమాధిపతులు గలుగుసమయము గనుకొని ఉపనయన ముహూర్తముంచవలయును-పంచమమును ఏపాపగ్రహము చూడక

పంచమాధిపతి పంచమములోగాని, నవమములోగాని, నవమాధిపతి లగ్నాధిపతి పంచమములోగాని, ఉన్న సమయములో ఉపనయనము ముహూర్తముంచవలయును- విద్య వచ్చుటకు అధిష్ఠానదేవత ప్రసన్నతజెంది ఆశీర్వదించుటకు జ్ఞానచక్షువు అభివృద్ధిచెందుటకు పంచమమే ఉపనయనస్థానముగాన చక్కగా గమనించి చూడుము—

శ్రీ:- స్వామి- పంచమమున అంతటిబలమున్నదందుర

గు:- వత్సా పంచమము బలముగానున్న వారిజాతకముల పరిశీలింపుము- వారి ఆచారవ్యవహారముల, వారిధర్మబద్ధతుల వారి దైవధ్యానమును పరికింపుము-ఉదా- గురుపాలితులలో గురువులగ్నము నగలజాతకుల శనిపాలితలగ్నములలో గురువులగ్నమునగల వారినడకను చూడుము-గురుపాలితులకు ఆచారవ్యవహారములు దైవభక్తి మంచినడక వుండును. శనిపాలితులకు ఆచారశూన్యమై, దారిద్ర్యమునకునెలవై, భక్తిజ్ఞానవైరాగ్యము లడుగంటివుండును. తల్లిదండ్రి గురుదేవ బ్రాహ్మణవయోవృద్ధ ఆశీస్సులకు బదులు దూషణలు తినుచుండును. గమనింపుము—

శ్రీ:- స్వామి- బ్రాహ్మణులకు గురుబలము కావలయునన్నది శాస్త్రము బ్రాహ్మణుల జాతకబలములలో శనిబలముగలిగిన వారులేరా? బ్రాహ్మణులందరికి గురువు మంచివాడనియేనా?

గు- నాయనా- లగ్నవిభజన, గ్రహవిభజన వారుచేయలేరు. గమనించలేదు. గాబట్టి వారట్లు చెప్పిరి. ఏపాలితమున కాపంచమాధిపతి పంచమము శుభస్కరముగా నుండవలెనని యెరుంగుము— బ్రహ్మక్షత్రియ వైశ్యులకెల్లరకు గురుశనిపాలితములనే గమనింపుము

శ్రీ:- సంవత్సరాధిపతిబలము, చంద్రతారాబలము ఆవశ్యకమన్నారు. మూలత్రికోణములందు, ఉచ్ఛస్థానములందు, స్వక్షేత్రమిత్రక్షేత్రములందు, వర్గోత్తమాదులు గలిగినప్పుడు ఉపనయనము చేయుట ముఖ్యమన్నారు. నిజమా?

గు;- వత్సా సంవత్సరము అప్రాణిచయము చూడనక్కర లేదు- లగ్నము పేరు చెప్పక చంద్రబలము కావలయుననుటకు కారణము- చంద్రుడుపాపికాదు చంద్రునకుశత్రువులులేరు అనిభావించు టేనని యెరుంగుము- ఇక తారాబలమందమూ కృత్రిమమని ఇది వరకే చెప్పితిని ఇక మూలత్రికోణములన్ననో వారెన్నుకొనని శని కుజరవులుగాక ఎన్నుకొనిన గురు శుక్ర బుధ చంద్రులుండవలయు ననుట ఉచ్చ శుభుడా పాపియా అన్నవిషయము లేదు- ఇవన్నియు గమ్యస్థానముగానని పలుకులని యెరుంగుము ఇక వర్ణేశాదులన్ననో వారికి గురుశనిపాలితములున్నవి గదా. ఇవి పుక్కిట పురాణములు గాభావించి విడువుము-

శ్రీ - స్వామి వేదాధిపతులచెప్పడములో నాకుసందేహము గలుగుచున్నది ఋగ్వేదమునకు గురువు యజుర్వేదమునకు శుక్రుడు సామవేదమునకు కుజుడు అధర్వణ వేదమునకు బుధుడు అన్నారు. అంతేనందుర.

గు:- వత్సా ఋగ్వేదమునకు గురుడు సామవేదమునకు శుక్రుడు యజుర్వేదమునకు బుధుడు అధర్వణ వేదమునకు కుజుడు గావిభజించిన సరిపోవును. ఋగ్వేద యజుర్వేదములనుండి మంత్రములు సామవేదమునుండి సంగీతము అధర్వణ వేదమునుండి విలువిద్య గలిగెననుట గలదు. సంగీతము శుక్రునిది విలువిద్య కుజునిది మంత్రము గురుపాలితులలో గురునిది శనిపాలితులలో బుధునిది అనుట నిస్సందేహము.

శ్రీ;- స్వామి చంద్రుడు ఉపనయన లగ్నమందున్నను ఉచ్చయందున్నను వటువుకు క్షయరోగము వచ్చును. లగ్నమునకు 12 ట నుండెడి సూర్యునికి అంగారక వీక్షణ గలిగినట్లయిన వటువుతండ్రి అంధుడగు నన్నాడు నిజమేనందుర.

గు;- వత్సా ఈ శాస్త్రమంతయు కల్లబొల్లి మాటలనుటకు

ఎంతకావలయునో అంత ఉన్నది చూడుము జన్మలగ్నముకూడదు లగ్నాధిపతి వాసరాధిపతిబలవంతులు గావలయునట-జన్మలగ్నము మకరమై వాసరము మంగళవారమైన శనికుజులు బలవంతులుగా వలసియుండును గదా శని కుజుల క్రూరులుగా ఎన్నుకొని ఇక్కడ బలవంతులు గావలయుననుట విపరీతము- చంద్రుడు క్షయరోగము గల్పించుననుట వింత. చంద్రుని శుభునిగా ఎన్నుకొని- ఇక్కడ పాపిగా చూచుట శోచనీయము- సూర్యుడు ద్వాదశముననుండ అంగారక వీక్షణగలిగిన తండ్రికి కన్నులుపోగొట్టుననుట మరింత విపరీతము- శాస్త్రదూష్యము తండ్రికి విపత్తుగలుగవలెనన్న తొమ్మి దింట నొకపాపగ్రహముండి రవి పాపియైగాని పాపులతో చూడబడి కూడబడిగాని యుండిన తప్పక కలుగును. 12 ఇంటనుండిన ఎట్లు గలుగును- వటువుకు 1, 2, 6, 7, 8, 12 ఇంట పాపులున్న ఏవో కొన్ని చిక్కులు గలుగును- వీరు చెప్పినట్లు కలుగవు. వట్టి బూటక ములనివదలి వివాహముహూర్తములో ద్వాదశ స్థానశుభాశుభముల తెలిపితిని గదా దానిని పరికించుము.

శ్రీ:- స్వామి వర్ణాధిపతులు- గురు శుక్రులు వేదాధిపతులు- నీచరాసుల యందుంటగాను శత్రుగ్రహములతో నుండగాను శత్రు క్షేత్రములందుండ గాను ఈ గ్రహములు అస్తమించి ఉండగాను ఉపనయనము చేసినవటువు చండాలునితో సమానుడని పిడుగువంటి దెబ్బకొట్టినారే తామేమందురు-

గు:- వత్సా వీరు వీరికి ముందున్న శాస్త్రములనమ్మియో ఊహాశక్తివల్లనో ఇట్లు రచించిరని తోచు చున్నది. ఉపనయనము నకు వీరుచెప్పిన దానికి సంబంధములేదు. ఆఖరున పిడుగులవంటి మాటలన్నారు. దీనినివిమర్శించి ప్రయోజనములేదని యెరుంగుము-

శ్రీ:- కేంద్రములందు పాపగ్రహములు లేకుండగాను శుభ గ్రహములుండగాను శుభలగ్నమున ఉపనయనము చేయవలయు

నన్నారు.

గు:- పాపగ్రహము లెవ్వియో శుభగ్రహము లెవ్వియో లగ్నమునకు శుభత్వమెట్లు వచ్చునో ప్రారంభముననే వీరు పోగొట్టినారు ఇక్కడెట్లు సరిగానుండును యోచింపుము. ఉపనయనమనగా నేమి ఎక్కడ శుభగ్రహము లుండవలయును అన్న విషయమునే ఎత్తుకొనక వారికి తోచినట్లంతా పరుగిడినారు. వీరిని విమర్శించి సుఖములేదు, గ్రంథవిస్తరము తప్ప మరొక్కటిగానము. వీరు స్థిర పాపుల స్థిరశుభుల నేర్పరచుకున్నారు. గ్రహములకు లగ్నాత్ పాపత్వ శుభత్వములు గలుగునేగాని స్థిరపాపులు లేరనువారు ఎవరు వీరికి ఎదురైనట్లులేదు- ముహూర్తము ఉండవలసినస్థానమెద్ది, జాతకునికి లగ్న పంచమ నవమ స్థానాదిపతు లెవ్వరను విషయమునే గమనించక పోవుటచే శాస్త్రము తికమకలైనది. ఉపనయనమునకు కేంద్రబలమునకు వినాకమయ్య పండుగకు పీర్లపండుగకున్న సంబంధమున్నదని యెరుంగుము

శ్రీ:- స్వామి 81 శ్లోకమున- కేంద్రములలో రవి, కుజ, శని రాహుకేతు గ్రహములుండిన ఇట్లొనట రవి యుండిన వటువుకు తండ్రికి- మారకమట కుజుడుండిన తల్లికి- శనియుండిన సగోత్రజులకు రాహువుండిన వటువుకు కేతువుండిన వటువు తండ్రికి మారకమని పూర్తి భయపెట్టినాడు దీనినేమందురు.

గు.- వర్ణా శుద్దపాపులుగా నియమించుకొన్న వారినేవాడుకొన్నారుచూడు వీరికి గృహములులేవా? నవగ్రహములలో నాయకులుగారా? శుద్ధపాపులెట్లయిరి అని ప్రశ్నించినవానికి బహిష్కరణ గలుగునట్లున్నది. లేకున్న సూర్యుడు శుద్దపాపి ఎట్లాయనని ఒక్కరైన అడిగివుండరా? దీనికేదో దండన భయము గలిగియుండినది లేకున్న ఈకాల వాహినిలో మహామేధావులు మహనీయులు వ్యావహారికులు తర్కము చదివిన మహాపండితులు దైవజ్ఞులు ఎందరో

పోయిరిగదా ఒక్కరైన అదేమి అనకుందురా? వత్సా వారితో మనకు పనిలేదు. పంచమనవమముల శుభగ్రహములతో భద్రపరచుకొన్న దే ముహూర్తమని యెరుంగుము. ఉపనయనమునకు కేంద్రములతో పనిలేదనియు పంచమ నవమములే ప్రదానమని తలంచుము— ఇదియుగాక గురుపాలితములకు గురువులగ్నమునుండ లగ్నపంచమ నవమముల చూచును. పంచమ నవమాధిపతులు ప్రక్కనుండినను సరిపోవునని తెలుసుకొనుము. ఇది 75 భాగల బలముండును- శని పాలితులకు లగ్న తృతీయమున శనియున్న నూటికి 50 భాగల బల ముండు వీలుగలుగినప్పుడు ఇట్లున్నను చేయవచ్చునని యెరుంగుము.

శ్రీ:- స్వామి కటక ధనుర్మీనరాసులయందు అంశలయందు వటువు జన్మరాశియందు 8 12 ట గురుడుండగా ముహూర్తముంచిన వటువుకు సంపూర్ణవిద్య ధనము గలుగునన్నాడు నిజమా.

గు:- వత్సా గురువుకు కటకము ఉచ్చ, ధనుర్మీనములు స్వగృహములు గాబట్టి గురువు బలవంతుడైన వటువుకు కలుగునను కొన్నాడు. గురువుకు లగ్నములద్వారా పాపత్వమురాదనుకొన్నాడు గ్రహమున్నచోటు చూచినచోటునే శుభమో అశుభమో గలుగును లేనిచోట యివ్వలేడని గ్రహించక పలికినపలుకు ప్రతి గ్రహమునకు లగ్నముద్వారా శుభాశుభములు గలుగుచుండునని తెలిపితినిగదా దాని ననుసరించుము.

శ్రీ:- స్వామి వృషభమిధున కన్యాతులమకర రాసులయందు వీరియంశలయందు ఏచ్చటనైనను గురువుండగా ఉపనయనమైన వాడు విద్యాచార సుఖాయుర్ధనములలో నొకటియైనను లేక నిర్భాగ్యుడగునన్నాడు. దీనినేమందురు.

గు:- ఏమందును ప్రపంచమునంతటిని గురువేపాలించునట్లు భావించినారందును గ్రహముల బలాబలములు తెలియక వ్రాసిన

వ్రాతలనియు ఏముహూర్తమున కెచ్చట స్థానమనియు తెలియక వక్కిట పురాణములందు కావిడినారందును విద్యకు స్థానమెచ్చట ఆచారం సుఖస్థానమేది ఆయుస్థానమేది ధనస్థానమేదియనక వీటి కన్నిటకు గురువే కారకుడని భావించి ఒకేదెబ్బ వేసినాడు దీనిని విమర్శించి ఫలములేదని యెరుంగుము. వీరన్నట్లు కాదని తెలుసు కొనుము.

శ్రీ:- స్వామి చంద్రుడు సింహరాశియందుండగా ఉపనయన మైనవాడు పాపియన్నాడు కటకమునందున్న దరిద్రుడట ఈ శ్లోక మంతా ఇట్లే వ్రాసి యున్నాడు దీనినేమందురు-

గు:- అనుటేమున్నది వివాహలగ్నమందు నక్షత్రములతో ఆటలాడి చాలయి ఉపనయనములో వాటినే తెచ్చుట భావ్యము కాదని గ్రహములతో ఆటలాడినాడు చంద్రుడు ఆరాసులందుండిన శేషించిన గ్రహములన్నియు ఏమగును కటక తులా వృశ్చిక మీన మేషలగ్నములకు కటకములో చంద్రుడున్న దరిద్రుడగునా- మేష వృశ్చిక లగ్నములకు సింహములో చంద్రుడున్న రాజగును గాని పాపి-దరిద్రుడగునా ఇట్లే వీరు చెప్పినదంతా సాలూమూలలేని శాస్త్రము. అధారములేని మాటలు- లగ్నాధిగా ఏగ్రహము ఎచ్చ టున్నదో ఆగ్రహము ఆపని తప్పకచేయును- జననములో పంచమ భాగ్యములు చక్కగానుండిన ముందుజన్మమందే ఉపనయనమున్న వాడతను ఏజాతియందు జననమైనను తిరిగిఉపనయనశక్తి ఆర్జించి యేతీరును- పంచమ నవమాధిపతులు చెడినవాడు ఏజాతియందు పుట్టిన దైవశక్తిని ఆర్జింపలేడు- మూడవనేత్రబలము కావలయునన్న పంచమనవమములు బాగుండవలయును. లేదా-లగ్నాధిపతిపంచమ నవమములలో నుండవలయును, గాని కేంద్రములందు గ్రహము లుండవలయుననుట శాస్త్రవిరుద్ధము-

శ్రీ:- స్వామి 67 శ్లోకములో జ్యోతిశ్శాస్త్రమంతా గుమ్మ

రించినాడు. దీనికి చక్కగా సమాధానమిండు.

గు:- వత్సా కేంద్రములలో వీరు శుభులుగా ఎన్నుకొన్న బుధ గురు శుక్ర చంద్రులుండిన లక్షలాది దోషముల పోగొట్టుదురనియు పాపులుగా ఎన్నుకొన్న శని కుజ రవి రాహుకేతువులుండిన చంపుదురనియు మరియు ఈ పాపులు 3, 6, 8, 11, 12 ఇండ్లలో నుండుట మంచిదనియు చెప్పుట చూడ శాస్త్రమంతయు కృత్రిమమని తేలుచున్నవి. ఉదా— ఆరింట నొక పాపగ్రహమున్న శత్రురోగ ఋణవిపత్తుల గలిగించును ఏనిమిదింట నున్న చావునే సిద్ధంప చేయును. మూడింటనున్న పితృధనము ఆస్తిని ధ్వంసముచేయును, సోదర పీడకలహము గల్పించును. పదునొకండవ యింటనున్న ఆస్తిని పాయలచేయును. పంద్రెండింట నున్నచో ధనము దుర్వ్యయము చేయించును. శుభులున్న ఉన్నచోట గలుగువిపత్తులు తొలగించి వాటివల్లనే లాభము నొసంగుదురు మూడింటనున్న పితృధనము తానొక్కడే తినునట్లు సోదర సోదరీల లేకుండజేయును. ఇట్లే పాపస్థానములు శుభగ్రహములున్న శుభస్థానములగును. మరొక ఉదాహరణ— లగ్న ద్వాదశమున నవమస్థానాధిపతి యుండిన అయ్యా నీధనమంతయు వ్యయమైపోవును గ్రహబలము నిష్ఫలమనిచెప్పు జ్యోతిషముగలదు ద్వాదశము వ్యయస్థానము ఇక్కడొక శుభుడుండిన వ్యయము సద్వ్యయముగా మార్చును. సత్కార్యముల చేయించును. ముక్తిసాధనకు కావలసిన హంగులన్నిటిని చేకూర్చును శత్రురోగ ఋణవిపత్తులచెంత చేరనియ్యక కాపాడును అనాయాస మరణముగలిగించును. ముక్తిద్వారముదరిచేర్చును. సత్ప్రవర్తనునిగా ఆచార నియమములుగల మనిషిగా అహింసాపరునిగా తయారు చేయునుగాని శుభగ్రహ ఫలము నిష్ప్రయోజనము గాదు.

వత్సా ఉపనయనమనగా జన్మతహాపుట్టిన జ్ఞానేంద్రియము మంత్రానుష్ఠానముచేత మరింత అభివృద్ధి చేయదలంచి మంత్రముప

దేశించుట బ్రహ్మోపదేశమందమా- బ్రహ్మతేజస్సును సంపాదించుటకు మంత్రమునుపదేశించుట యజ్ఞోపవీతమా? తప్పక బృహస్పతులవారి యాజ్ఞానుసారముగా మాతృ పితృ గురుదేవ బ్రాహ్మణ ఆశీర్వాద బలముతో బ్రహ్మతేజస్సును సంపాదింతును వేద వేదాంగములనెల్ల పఠింతును. మాతృపితృ గురు దేవ ఋష్యాదులఋణము తీర్తునని దీక్షాబంధము ధరించుట దీనికి శుభముహూర్తము కావలయుననుటయే ఉపనయన ముహూర్తమని నాకుతెలియుచున్నది. గాన వీరిననుసరింపక గురు శనిపాలితముల గమనించి పంచమ నవమములలో శుభగ్రహములుండు లగ్నమును నిశ్చయముచేయుము. అదియే ఉపనయన ముహూర్తమని యెరుంగుము.

వత్సా ఈయజ్ఞోపవీత బలము- గురుకులములు గలనాడు గురుకులముల రాజులు పోషించునాడు సంఘములపై సభాపతుల దండన గలనాడు రాజదండన బ్రాహ్మణులపై గలనాడు సంఘ బహిష్కరణలు గలనాడు ఈయజ్ఞోపవీతబలము దిగ్దంతము లావరించి శాపానుగ్రహశక్తిగల బ్రాహ్మణులుండినారు కాలాను గుణ్యముగ గ్రహపరిపాలన మారుటవల్ల సర్వశక్తులు దిగజారిపోతూ పోతూ ఇక్కడికి నిలచినవి. ఇకెక్కడికి పోవునో పోవును-

శ్రీ:- స్వామి కుజ శుక్రుల కలయికలో గురు శని సమసప్తకములో వివాహముహూర్తములు పెట్టవచ్చునందుర.

గు:- వత్సా గురు శని సమసప్తకములో శుక్ర కుజుల కలయికలో లగ్నాధిపతి అస్తమించినప్పుడు లగ్నాధిపతి పాపులమధ్యలోచిక్కినప్పుడు శనికి పదింట కుజుడు- కుజునికి నాలుగింట శనియున్నప్పుడు వివాహములు చేయరాదు- గురువు అయిదింట తొమ్మిదింట శనినిచూచినప్పుడు- శనిపాలితులును- శనిమూడింట పదింట గురువును చూచినప్పుడు గురుపాలితులు వివాహములు చేసుకొనరాదు- గురువు శనిని 5, 9 దింట చూచినప్పుడు గురుపాలితులకు

శుభము శని గురువును 3, 10 దింట చూచినప్పుడు శనిపాలితులకు శుభము విఘ్న సంబంధముగాచేయు ప్రతిష్ఠలకు గురువు శనినిచూచి నప్పుడు శుభము శివపర్యాయముగా శని గురువును చూచినప్పుడు శుభము- ఎందుకనగా గురు శని సమసప్తకము దేశారిష్టము ప్రజా రిష్టము గాన గురు శనిపాలితులకు ఇరువురకు అనిష్టలు అపశకున ములు ఆపదలుచిక్కులు చిద్రములు అపమృత్యువులు అనేకముగల్పిం తురు చేసుకొనరాదు- ఇకశుక్రకుజులకలయిక అన్ననో వధూవరులు కోపగ్రస్తులై రోగగ్రస్తులై శోకగ్రస్తులవుదురుగాన చేసుకొనరాదు. ఇక లగ్నాధిపతి అస్తంగతుడైన జాతకుడు రోగబాధననుభవించుచు దుఃఖభాజనుడౌను గనుక చేయరాదు. లగ్నాధిపతి పాపగ్రహముల మధ్యలోచిక్కిన రోగగ్రస్తుడౌటయేగాక సుఖమునకు అనేకచిక్కులు చిద్రములు తటస్థించును. ఆసమయము దాటించుకొనుటయే శ్రేయము.

శ్రీ:- స్వామి శనికుజులు చతుర్థదశమములలో నున్నప్పుడు చేయవచ్చునందుర.

గు:- వత్సా శని కుజులు ఒకరి నొకరు చూచినచో ప్రపంచ ములో కూనీలు కుట్రలు దొంగతనములు అకాల మరణములు వాహనగండములు కాల్పులు కయ్యములు పార్టీలు కలుగు సమయ ములు గాబట్టి ఆ సమయము తప్పించుట క్షేమము.

శ్రీ:- స్వామి కుజుడు ఎనిమిదింటిచూపుతో శని శుక్ర బుధుల చూచినప్పుడు చేసుకొనవచ్చు నందుర.

గు.- వత్సా గురుజాతకులకు క్షేమము శనిపాలితులకు కీడు గాబట్టి వరుడు ఏజాతకుడోచూచి శనిపాలితుడైన సమయము తప్పించుట శ్రేయము-

శ్రీ:- స్వామి వరుడు గురుపాలితుడు వధువు శనిపాలిత ముండును. వరుని పురోహితుడు గురుపాలితమునకు వధువు ప్రక్క

బ్రహస్పతి శనిపాలితమునకు మంచిదినముల చూతురు. ఇదికుదురుటెట్లు.

గు:- వత్సా కన్యవారు వరుని క్షేమమునే కోరవలయును. వరుడుకర్త వరుని జాతకరీత్యా వధువుకు జరుగవలసి యుండును గోత్రము సూత్రము వంశ పరంపర మొదలుకొని సర్వము మారవలసియుండును. వరుని కుటుంబ రక్షణకొరకయ్యే వధువునుతీసుకొనుచుండెను. యజమాని బాగుండిన యజమానురాలు బాగుండును యజమానురాలుకూడ యజమాని క్షేమము కోరుచుండును- వరుని జాతకము ననుసరించియే వధువుకు జరుగును గాన వరునిజాతకముపైననే ఆధారపడ వలయును. ఆ జాతకము ననుసరించియే లగ్న నిశ్చయము చేయవలయునని యెరుంగుము

శ్రీ:- స్వామి కుజ శుక్రులు- కుజ శనులు కుజ బుధులు కలిసినప్పుడు వివాహము చేయనేరాదందుర.

గు.- వత్సా జాతకుడు గురుశనిపాలితులలో ఎవడో తెలుసుకొని శుభగ్రహము వెనుకై పాపగ్రహము ముందైయుండిన చేసుకొనవచ్చును. లేదా, శుభగ్రహము వారినిచూచినను చేసుకొనవచ్చును. అన్నిటికన్నా కుజ శుక్రుల కలయికను జాగ్రత వహించవలయును జననకాల మందే అట్లుండిన వారియౌవనకాలమంతయు తప్పక వ్యర్థమగునని యెరుంగుము-

శ్రీ:- స్వామి ఇంకా అనేక ముహూర్తములున్నవి గదా వాటిని దయచేసి చెప్పగోరెదను-

గు:- వత్సా ముహూర్త బలమునకు కారకులు గ్రహములా నక్షత్రములా- చంద్రుడా- లగ్నములా ఏ ముహూర్తబలము వచ్చే టుండవలయునను విషయములు గమనింపక గమనించలేక జాతక ఫలము ముహూర్తబలము గ్రహమిత్ర శత్రుబలము ఏలగ్నమున కెవరుపాపులు శుభులు అన్నవిషయములు అన్నీతప్పుడు దారుల

పట్టించి ఒకచోట చెప్పినది మరొకచోట చెప్పక ఒకరు చెప్పినది మరొకరు ఒప్పక శాస్త్రబలమెల్లను పాడుచేసినారు తృతీయతరంగమున సర్వము నెరిగింతును ఇప్పటికి దీనిని దిట్టముచేసుకొని ప్రజలకు మేలుచేయుము.

వత్సా ఈశాస్త్రము నభ్యసించిన వానిని దైవజ్ఞుడందురు. ఆ బలమును సంపాదించుకొన వలయునన్న ఏదైవమునో ఒకదైవమును నమ్మి ఉపాసించ వలయును- దీనికి ముఖ్యాధిష్ఠాన దేవతలు బ్రాహ్మి, బ్రహ్మలు- కడకు నీయిష్టదైవమునైన ఉపాసించవలయును. ఉపాసనా బలములేకున్న సమయస్ఫూర్తి జ్ఞానము లభ్యపడదు. చెప్పినది ఫలించి కీర్తి గౌరవములు లభించవు గాన, ఏదో ఒకదైవమును నమ్మి ధ్యానించుము- ధ్యానించునపుడు ఆహారము పెట్టక ధ్యానించిన నీ ధ్యానఫలము నశింపగునని యెరుంగుము- అవధూతకు దిక్కులేని సన్యాసికి నైవేద్యము లేకున్నను పాపములేదు. నీకు మాత్రము పెట్టవలసిన విధియున్నదని యెరుంగుము.

మరొకటి చెప్పరానివి చెప్పతగినవి గమనించుకొని లౌకికముగా నడువ వలయును యుక్తియుక్తముగా సంచరించవలయును అట్లు ఉన్నది ఉన్నట్లు చెప్పిన తప్పక పాపము సంభవించును. ఎట్లన ఒకనికి ద్వికళత్రయోగ ముండును. వానిభార్య ఎదుటనే నీకు రెండవభార్య తప్పదని చెప్పిన ఏనాడో దుఃఖింపవలసినది ఈనాడే ప్రారంభమగును ఇట్లే అన్నిటియందు గలదు- ఆయుర్దాయము చెప్పుటలో మరింత జాగ్రతుండ వలయును-

శ్రీ వేంకటేశ్వర, హయగ్రీవ, శ్రీ మహావిష్ణు, గణేశ
ధన్వంతరీ ఆంజనేయార్పణమస్తు
శుభం భూయాత్.

శ్రీ రాఘవేంద్ర గురుభ్యో నమః

## — గురు ర్వాక్యములు —

కం॥ జ్యోతిష్యము కను జగతికి
జ్యోతిష్యుడు ప్రజలపాలి జ్యోతిర్మయుడౌ
జ్యోతిష్యము చెడినను ఖ
ద్యోతుండడుగంటినట్లు దోచునువత్సా.

కం॥ చింతావంతా దీర్చను
సంతాపంబార్పి హృదయ శాంతియొనర్పన్
యెంతో మేలగుజోస్యము
కొంతైనన్ లేక జగతికూర్కెదెవత్సా.

కం॥ వెలయిడిన ఫలము గలదన
కలవెల్లను కలుగునట్టి గ్రంధంబనగా
వెలియొక్కటి పోనీయక
తెలిపెద జోస్యంబు తేట తెనుగునవత్సా.

కం॥ కల్లనుమీ జోస్యంబని
యెల్లరువచియింప వ్రాసిరెందరొ యిపుడా
కల్లలెనిజమన మువ్వురి
తల్లులకృపతో వచింతు తధ్యమువత్సా.

కం॥ యోగంబులు పూర్వులనుడి
యోగంబులుగావు మిగుల యోచించిగనన్
యోగంబులనగ నానుడి
యోగంబులె యోగమౌను యోగాభ్యాసీ.

కం॥ గురుకుజ రవి శశి గ్రహములు
గురుపాలిత లగ్నములుగ గురు తిడిశినినే

యెరుగమె శాస్త్రములందని
గురుతును ఖండింపజ్యోతి కూర్కొనువత్సా.

కం॥ శనిపాలిత లగ్నములన
శనిబుధకవి గృహములనుచు శాసనమయ్యెన్
కని వినమని కడద్రోసిన
కనుగానని జోస్యమౌను కనుగొనువత్సా

కం॥ తను పంచమ భాగ్యాధిపు
లను వొందగనొకట కలియ నమృత ప్రదమై
కననివి విననివి తెలిసియు
ఘనుడయి సత్కీర్తిబొందు కనుకొనువత్సా.

కం॥ కలియుగ దేవేంద్రుండని
కలబంధు జనాళిపొగడ కలిమిన్ బలిమిన్
ఇలయేలు సార్థకంబుగ
కలిసిన దేవీత్రయంబు కనుగొనువత్సా.

కం॥ దేవీత్రితయము గలిసిన
కావలసిన సంపదాళి గలిగి సుఖించున్
దైవధ్యానము చేసియు
భావిని కైవల్యపదవి బడయును వత్సా.

కం॥ కనుగొనగా లగ్నంబున
ఘనముగ కోణాధిపతులు కలిసిన యెడలన్
జననుతమగు రూపముతో
ధనముండై సౌఖ్యపడును తప్పకవత్సా.

తే॥ పంచమంబున కోణాధిపతులు గలిగి
దశలు ననుకూలముగనున్న తప్పకతడు
వివిధ భాషలయందు ప్రవీణుడగుచు
ఖ్యాతి గడియించు సుఖయించు గనుము వత్సా.

తే॥ భాగ్యమందున కోణాధిపతులు గలిగి
దశలు ననుకూలముగనున్న ధాతయౌచు
భోగభాగ్యంబులన్ దులదూగ గలడు.
పుణ్యులకు పుట్టుకిట్లుండు భువిని వత్స.

తే॥ పదిలమైయుండె కోణాధిపతులయందు
శాస్త్రసారంబు భారంబు సత్యమరయ
దానినెరుగక పలికిన దానివలన
శాస్త్రమెల్లను పసచెడి సమసెవత్స.

ఆ॥ మీన వృశ్చికములు మేషధనస్సులు
సింహ కర్కటములు స్థిరతగురుని
పాలితమున మిగుల ప్రతిభను గాంచును
శనియుహితులగూడి దునుము వత్స,

ఆ॥ మకరకుంభములను మరికన్యతులలను
మిధున వృషభములను మిహిరసుతుడు
హితుల గూడినేలు సతతంబునధిపుడై
గురుడు సఖులగూడి చెరుచువత్స.

ఆ॥ వెనుకపాపులున్న పీడించు శుభులను
ఫలముచెరచు వానిబలము చెరచు
వెనుక శుభులుగలుగ వెలుగొందు శుభములు
దీని మర్మమెరిగి తెలుపువత్స.

సీ॥ శనిపాలితంబులచర్చింప శుక్రదశాంత్యంబునఁ ధరజననమైన
రవిచంద్ర కుజగురు రాహుదశల్ పోయి శనిమహర్దశనందు కొనును వరున
తన కనుకూలురౌ శనిబుధ శుక్రులు స్థలబలంబునుబట్టి తగిన కొలది

సర్వసంపత్తుల సమకూర్చి సుఖముగా జీవింపజేతు
రజేయముగను.

తే॥ పూర్వ పుణ్యంబునఁ నిట్లు పుట్టుచుంద్రు
మొదట పాపులదశలందు మునిగితేలి
తెప్పరిలుకొంచు మునుగుచు తేరుకొంచు
తుదకు లక్షాధికారు లయ్యెదరువత్స.

ఆ॥ పాపఫలములెల్ల పరమాణువులతోడ
ముందుపోవ పిదప పుణ్యఫలము
లందుకొనచు నరుడు యానందమున మున్గు
పుణ్యుడిట్లు భువిని పుట్టువత్స.

కం॥ పాదంబుల ప్రథమంబున
పొదిగ కూర్చున్న శుభులు బలమధికంబై
మోదంబును చేకూర్తురు
సాదక బాధకములేని స్వర్గమువత్సా

క॥ పాదంబుల ప్రథమంబున
పొదిగ కూర్చుండియుండ పాపగ్రహముల్
సాధింతురు పేధింతురు
మోదము ఖేదముగమార్చి ముంతురువత్సా.

క॥ కడపాదంబుల పాపులు
పడియుండిన కొంతమేలు బడయగనౌనా
కడపాదంబుల సౌమ్యులు
పడియుండిన బలముకొంత పనచెడువత్సా.

## — శుక్రకుజులకలయిక —

క॥ పచ్చని సంసారంబును
ఖచ్చితముగ పాడుజేసి కట కటచేయుఁ

తుచ్ఛపు పనిచేయించును
నచ్చము కుజకవుల మిళిత మరయుగ వత్సా.

ఆ॥ ఆలుమొగలనందు నన్యోన్యముంపరు
మనసు మనసు కలిసి మనగ నీరు
సుఖపడంగ నీరు శుక్రుండు భౌమ్యుండు
కలియనొక్కయింట గనుము వత్సా.

క॥ చెరుతురు సతిపతి కలయక
విరుతురు నిరుపురిమనస్సు వెల వెలబారన్
చరుతురు కోపానలమున
దురితులు కవికుజులు నొకట తోడ్పడవత్సా.

క॥ అనుమానమునకు త్రోవలు
దిన దినమును కలుగజేసి తెగతెంపులుగన్
కనికరము లేకచేతురు
కనుగొన కవికుజులు నొకట కలియగవత్సా,

ఉ॥ ఉంతురు నాలుగుపిల్లల కొనూపిరిముక్కున నాడుచుండగా
ద్రెంతురు ప్రేమబంధముల రేయిబవళ్లను శోకవారిధిన్
ముంతురు సర్వకోరికలు పూర్తినశించి కృశించి యుండ శా
సింతురు నొక్కయింట నివసించిన సత్యము భౌమభార్గవుల్.

ఉ॥ నాస్తికమన్ విషంబుదిగి నాలుగుమోముల వేల్పువ్రాతయే
వాస్తవమైన మాటయన ప్రాజ్ఞులపల్కు యధార్థమేయనన్
ఆస్తికమే సుఖంబనగనాపదలన్ సృజియించి పెంచుచున్
మస్తము వంపజెసెదరు మానకకూడిన భౌమభార్గవుల్.

చ॥ కలకలలాడు కాపురము కంటికిరెప్పగు నాలుపిల్లలన్
మలమలమాడజేసి యనుమానము ప్రాణము తీయుచుండగా

వలవల నేడ్చుచున్ తలను వ్రాసినధాతను దూరుచుండగన్
చలమును బూనిజేసెదరు సత్కవిభౌము లొకింటనుండగన్.

ఆ॥ ఒకరికారకత్వ మొకరు కాజేతురు
నొకరిచూచి మరొకరోర్వలేరు
కుజుడు శుక్రుడొకట కూడిన చూచిన
కీడుగోడు మూడు చూడవత్స.

సీ॥ భర్తతోభార్యకున్ భరణమిప్పింతురు తెగతెంపులుగజేసి తీరగలరు
అనుమానముల్ బెంచి నాలుతో పోట్లాడు చీవాట్ల బ్రతుకుగా చేయగలరు
ఆశపాశలత్రెంపి యసచాట్లపాల్జేసి దేశదిమ్మరిగాక దింపగలరు
ఒకరీర్ష్యతోచూడ నొకరసూయనుచూడ చేసి సంసారంబు చెరుపగలరు.

తే॥ పండనీయరు నొకచోట నుండనీరు
కుడవనీయరు నొకచోట కూడనీరు
నతికి బ్రతుకగనీయ రయ్యాలు మగల
చూడ నొకయింట నుండనా శుక్రకుజులు.

ఆ॥ కుజుడు శుక్రుడొకట కూడిన స్థలమెద్ది
స్థలఫలంబులెవ్వి తరచిచూచి
ముందు వెనుకలెవరొ పుణ్యాత్ములెవ్వరో
తెలిసి బలములరసి పలుకువత్స.

## — బుధకుజుల కలయిక —

ఆ॥ బుధుడు కుజుడుకూడ పుట్టును కలహాముల్
బుధుడు కుజుడు నొకట పొసగబోరు

బుధుడు కుజుడు కలియ షష్ఠ్యస్థలంబైన
పతితమౌనటంచు పలుకువత్స

ఆ॥ వ్యాజ్యములను ధనము పూజ్యమైపోవును
దుర్జనాళివల్ల దూలుయశము
పట్టుదలనొసంగి పదవులన్ చెరతురు
కుజుడు బుధుడు నొకటకూడవత్స.

చ॥ కలహములుంచుబెంచు కలకాలము గండములందు
ముంచు వా
క్కలహములన్ సృజించు శుభకార్యములన్ హరియించు
దాస్యమున్
నలుపవిధించు పౌరుషమునన్ మనసీయనిబుద్ధినుంచు దు
ష్ఫలములచే గలంచు నలభౌమబుధుల్ కలయంగ
నొక్కటన్.

ఆ॥ ఒకరి కారకత్వ మొకరుకాజేతురు
నొకరిచూచి యొకరు నోర్వలేరు
కుజుడు బుధుడు నొకట కూడిన చూచిన
కీడు మూడునిజము చూడువత్స.

సీ॥ వ్యాజ్యంబులన్బెంచు వ్యాధులన్పుట్టించు
వైద్యులకిప్పించు వైరముంచు
దాస్యంబు చేయించు తకరార్లకున్ దించు
దుర్గుణంబులముంచు దొనగుల్బుంచు
కుట్రలన్ బన్నించు కుమతులన్ కూడించు
సంధితో బ్రతికించు సఖులద్రుంచు
సన్యాసమిప్పించు చావిళ్ళబండించు
శవముల మోయించు చావబంచు.

తే॥ మాతులులచేత చేయించు ఘాతుకముల
నప్రమాణంబులకుదించి యగడుబరచు

కులటలను తోడుగాచేసి కులము చెరచు
సౌమ్యభౌమ్యులు కూడ నసౌమ్యమగుచు.

## — చంద్ర శుక్రుల కలయిక —

కం॥ జంకును గొంకును లేకను
రంకుతనంబులకు దింపి రగడలతెచ్చున్
కుంకల కధిపతి చేయును
వంకరమౌ చంద్రకవుల సఖ్యతవశాన్.

క॥ విటవర్గములో దింపును
నటనా చాతుర్యమిచ్చి నటకులచేర్చున్
కుటిల స్వభావమొనగును
కటకటనా చంద్రకవుల కలయికవశాన్.

క॥ ఆహార విహారములకు
స్వాహాచేసెదరు గలుగు సర్వస్వంబున్
బాహాటముతో చెరతురు
సాహసులా చంద్రకవులు సత్యమువశాన్.

క॥ ముండల జతచేయించును
వండక వడకకను తినెడి పనులొనగూర్చున్
రండల రాజొనరించును
గండమునా చంద్రకవుల కలయికవశాన్.

క॥ పడుగాసుల దినిపించును
కడుకాముకుచేసి స్త్రీలకాశ్లొత్తించున్
నడు వీధికి నెక్కించును
చెడు గౌనాచంద్ర కవులు చేరినవశాన్.

## — గురు శనుల కలయిక —

క॥ గురుశనులొకచో నుండిన
పరగును నొగయోగమంచు పలికిరి విభుదుల్

కరివరమని సాక్షిగనిది
పరమ దరిద్రములదెచ్చు వదలకవత్సా.

క॥ వ్రాయను తుడువంగనుసరి
పోయెను ననుసామెతగను పోవును ఫలముల్
నాయకులగు శనిగురువులు
బాయక నొకయింటనుండ వసుధనువత్సా.

క॥ శనిగురువులు నొకరాసిని
వెనువెనుకను జనుచునుండ వేధింతురు నా
శనిగురువుల కలయిక కడు
పెనుబాధల గూర్చునిజము వినుమోవత్సా.

క॥ వేధింత్రు ఋణము విడువక
సాధింతురు చచ్చుదనుక సౌఖ్యంబిడకన్
బాధింతురు దాస్యంబున
ఛేదింతురు గురుడుశనియు చేరినవత్సా.

క॥ మోయింతురు ప్రేతంబుల
జేయింతురు నపరకర్మ చేజేతులకా
జేయింతురు శుభఫలముల
మాయింతురు కలియ గురుడు మందుడువత్సా.

క॥ తలమాయ నొడలు మాయగ
వలపులు తలపులునుమాయ వలువలు మాయన్
కలకాలమెల్ల మాయగ
కలిగింతురు గురుడు శనియుకలియగ వత్సా.

క॥ గురుశనులొక గృహమందున
స్థిరముగ గూర్చున్న గృహము శిధిలంబగునా
సురవరుని గేహమైనను
పరమ దరిద్రములతోడ పొడగువత్సా.

క॥ స్పష్టముగను శనిగురువులు
తప్పగ గూర్చున్నఫలము దిగజారిచనున్
సృష్టించిన విధినైనను
భ్రష్టం బొనరింపకుండ వదలరు వత్సా.

క॥ నాయకులై పాలింతురు
బాయక గురుశనులు రెంతు పాయలుగాగన్
శ్రేయము నొకరొసగినకడ
జేయను చూచెదరునొకరు సిద్ధమువత్సా.

క॥ వంటల వానిగచేయును
కుంటెనకానిగను చేసికులటల చేర్చున్
తుంటరులను జతచేయును
జంటగ శనిగురువులున్న సత్యమువత్సా.

క॥ గుడిపూజల చేయించును
గుడితళియలుచేయు పెద్దకొలు విప్పించున్
బడిపంతులుగా చేయును
కడుకష్టము శనిగురుండు కలియగవత్సా.

క॥ చేతురు పరాన్నజీవిగ
చేతురు దినమొక్కయింట చేరిపరుండన్
చేతురు హాస్యాస్పదముగ
చేతురు సురగురుడు శనియజేయులువత్సా

క॥ ఇప్పింతురు సన్యాసము
తప్పింతురు మంగళప్రదంబగు త్రోవల్
ఒప్పింతురు దాస్యములకు
నొప్పింతురు శనిగురుండు నుడివినువత్సా.

ఆ॥ భుక్తశేషములను భుజియింప చేతురు
బ్రాహ్మణార్థములకు బంపుచుంద్రు

తిండిపోతుచేసి తిట్లనుతినిపింత్రు
శనిగురుండు కలియగనుమువత్స

## — శని కుజుల కలయిక —

ఆ॥ శనియు కుజుడు నొకట సఖ్యతనొందరు
నుండుటల్ల ప్రాణగండములకె
గండములను కడకు కంగారుచేతురు
కూడ చూడకీడు మూడుడువత్స.

ఆ॥ కుజుడు శనియుకలియ కూలును శుభములు
నొకరి నొకరుచూడ వికటమగును
చావబ్రతుకనీక సఖ్యంబు చెరతురు
వీరిపొత్తుకీడు వినుమువత్సా.

క॥ కారాగారము చేర్పను
వీరావేశమున బలికి విహితము చెరుపన్
నేరారోపణ గూర్పను
వీరాగ్రేసరులువీరు వినుమోవత్సా.

## — సప్తమాష్టమ ఫలము —

క॥ లగ్నమునకు సప్తమమున్
లగ్నంబున కష్టమంబులావు నశింపన్
లగ్నములేక తపించును
భగ్నము మానవునిబ్రతుకు వసుధనువత్సా.

క॥ సప్తమమే సంసారము
సప్తమమే సత్కళత్ర సంతోషంబున్
సప్తమమే మృష్టాన్నము
సప్తమమున్ చెడినచెడును సర్వమువత్సా.

క॥ కామము భోగము నిద్రయు
కామితముల దీర్చుకొను సకాలము వసతుల్
ప్రేమానోన్య సుఖంబుల
ధామంబే సప్తమంబు తలపగవత్సా

క॥ సయమనూర్తి వివాహము
క్రమబద్ధంబైన పెండ్లి ఘనవైభవముల్
భ్రమగలిగిన శ్వశ్రుగృహము
గమనింపగ సప్తమంబుగనుగొను వత్సా.

క॥ ఫలహార విహారంబులు
కలుముల జవరాలుబోలు కాంతామణియుణా
పలుకు మృదుత్వము వినయము
గలవన్నియు సప్తమంబె కనుగొనువత్సా.

క॥ అష్టమమున శుభులుండక
దుష్టులు నందుండిరేని తొలగును శుభముల్
కష్టంబులు ప్రాప్తించును
భ్రష్టమగుణా స్త్రీసుఖంబు వసుధణావత్సా.

ఆ॥ సప్తమమున శుభులు చక్కగాలేకున్న
సకల శుభములెల్ల సమసిపోవు
బ్రతికి ఫలములేదు బహుభాగ్యములతోడ
తేరిచూడు నిజముతెలియువత్స.

ఆ॥ పెద్దలంతగూడి ప్రేక్షించి భాగించి
కూటములనుగూర్చి కూడికూడి
బాగుబాగటన్న వైవాహికములెల్ల
మూడు ముళ్లతెగవె చూడువత్స.

శ్రీ మద్గురు రాఘవేంద్రార్పణమస్తు.